Approved for Class And Library use.
Fort St George Gazette 27--5--41 page 159 (1937) No 16.



ప్రొద్దుటూరు
శ్రీ జానకీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.
1934 ప్రథమ ముద్రణము 500 ప్రతులు.
1935 ద్వితీయ ముద్రణము 1000 ప్రతులు.
ప్రొద్దుటూరు
శ్రీ ప్రకాశ్ ముద్రాక్షరశాలయందు ముద్రితము.
1950 తృతీయ ముద్రణము 500 ప్రతులు.

శ్రీ

# రాణా ప్రతాపసింహ చరిత్ర

## రాజశేఖరకవి ప్రణీతము.

కవిత్వము = తన్మయత్వము

## శ్రీ శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి

## విపుల సమీక్ష.



ప్రస్తుత గ్రంథాన్ని ఆంగ్లభాషా నిష్ణాతులు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు మిక్కిలి మెచ్చుకొన్నారంటే నాబోట్ల లెక్కేమిటి? యీయన పేరు రాజశేఖరుడు. యీ పేరు పరమేశ్వరునిదే. కాని, ప్రస్తుత గ్రంథరచనా సందర్భంలోవున్న కొన్ని ఘట్టాలను బట్టిచూస్తే ప్రతాపసింహునికి పర్యాయమేమో అని ప్రతిసహృదయునికీ గోచరిస్తుందని నానిశ్చయం. కవులలో తన్మయత్వం కలవారు కొందఱే వుంటారు. ఆధునికులలో యీ రాజశేఖరకవి తన్మయత్వంకల కవి అని రచన వ్యాఖ్యానిస్తూవుంది. వుదాహరించ వలసి వస్తే గ్రంథంలో నూటికి 50 పద్యాలేనా వుదాహరించవలసి వస్తుంది. కనుక కొంచెం మాత్రమే వుదాహరిస్తాను.

మ॥ రవి యస్తాద్రిని మొల్వఁగా! కఖిల పా ♦ రావారముల్ క్రుంగఁగా!
కవనీ చక్రము వ్రీలు గాక! చెడుగా ♦ కాకాశ! మయ్యుగ్రభై
రవుఁడై లోకముఁ గాల్చుఁగాని లవముం ♦ తాఁ బ్రతాపుండు గౌ
రవముం గోల్పడి మర్త్యమాత్రునకు శీ ♦ ర్షం బొగ్గ జెప్పట్టునే!

యీ మాటలు ప్రతాపసిమంత్రిన్నీ కులవృద్ధున్నూ పరమ ప్రాజ్ఞుడున్నూ అయిన "సలుంబ్రా-కృష్ణసింహుడు" అక్బరుచక్రవర్తికి సర్వసేనాధి

పతిన్నీ భావమఅదిన్నీ అయిన మానసింహ రాజన్యున కిచ్చే జవాబులోనిది మానసింహుని తండ్రి భగవాన్దాసు తాత్కాలిక సుఖంకోసం తన కూతుర్ని (ధిగ్గిగిక్) అక్బరు చక్రవర్తికిచ్చి పెండ్లి చేసి - కులగౌరవాన్ని కాపాడు కొంటూ వనవాసం అనుభవిస్తూ వున్న ప్రతాపసింహుణ్ణికూడా తమతోపాటు చక్రవర్తికి లోబడవలసిందని రాయబారాన్ని తెచ్చిన సందర్భంలోనిది. ప్రతాపుని అభిప్రాయాన్ని వ్యాఖ్యానించే చిన్న పద్యంకూడా వొకటి వుటం కిస్తాను........................

ఈ రెండు చిన్న పద్యాలిస్తే యేం తెలుతుంది! అయా పద్యాలున్న ద్వితీయాశ్వాసం 330 పద్యాలున్నూ వుదాహరిస్తే బాగా తృప్తి కలుగు తుంది. ప్రతాపరుద్రుడికి ప్రతాపసింహుడు దీటు మాత్రమే కాదు- హెచ్చు. కవి ఆ కవికి లోచ్చైనను, తన్మయత్వంలో - హెచ్చు. లోగడమాటలు ప్రతాపరాణావారి మంత్రివి. ఈ మంత్రిని సర్వవిధాలా భీష్ముడే అని చెప్ప డంలో అతిశయోక్తి కనపడదు. ఆ ఈగ్రంథంలోవున్న పాత్రలన్నీ యొకళ కము లేనివిగా కవి చిత్రించి వున్నాడు. రాణాప్రతాపుణ్ణిన్నీ రాముణ్ణిన్నీ త్రాసులో పెట్టి తూస్తే ప్రతాపుడే అసిధారావ్రతంలో చాలా మొగ్గు తాడు. కుశలవులు రాముణ్ణి యెత్తి పొడిచారు. ప్రతాపుణ్నే అయితే యెత్తి పొడవలేరనే తోస్తుంది తగిన పదార్థానికి తగిన పాచకుడు లభిస్తే రుచి కలి గినట్లు ఈ రాజశేఖరకవివల్ల ప్రతాపుడి ప్రతాపం శోభించింది. యెక్కడ యెంతవఱకు వ్రాయడం అవసరమో అక్కడ అంతవఱకే వ్రాసి చదువరు లకు విసుగులేని పద్ధతిని గ్రంథరచన సాగించడము సుఖ సుఖాల కట్టు కాదు. ఆపద్ధతి ఈ రాజశేఖరకవికి లభించింది. ఈ గ్రంథంలో వచ నాలులేవు. అన్నీ ఛందోమయాలే. సుప్రసిద్ధమైన పద్యాలే. సుమారు యేడెనిమిది రకాలు వాడబడ్డాయి. వుదాహరించవలసివస్తే చాలా స్థలం ఆక్రమిస్తుంది సీసపద్యం.... .... .... .... .... .... .... ...

రాజశేఖర కవిగారి రచనలో, యెంతసేపు పరిశీలించినా పొల్లు మాటలు కనబడవు, కవిత్వం, మూడు వంతులలో వొక వంతు మాత్రమే

దరహాంమీాద, తెలుగు పదాలు కలదిగా వుంటుంది. తక్కిన రెండువంతులూ తత్సమ పదాలుగా వుంటాయి. కాని, ప్రసాదగుణ భూయిష్ఠంగా వుండే ధార కావడంచేత కదళీపాకంగా అందరికీ అందుబాటులో వుంటుంది.

ధారాళమైన ధారతో చదువరులకు చదివినకొద్దీ చదవాలనే కోర్కెని కలిగించే శైలిలో వున్నప్పటికీ అసలు కథ భారత - రామాయణాల మాదిరిగా సర్వే సర్వత్రి తెలిసింది కాకపోబట్టి వాట్లమాదిరిని ఈ కవిత్వం వ్యాప్తికి రాకపోయింది గాని, అలాగే కాకపోతే, ఈ రాణాప్రతాపచరిత్ర రామాయణంలాగ వ్యాపించ తగ్గది. ఈప్రతాపుడు రాముడికంటె ఏ సుగుణంలోనూ తీసిపోడు. ఈ రాజశేఖరకవి కవిత్వం రామాయణగాథ తెలుగులో రచించిన కవుల కవిత్వానికెన్నీ తీసిపోదు.

మ॥ అమరోద్యానముపోలె నెల్లెడ సమ ♦ గ్రానందముల్ బెంచి లో
కముఁ గల్యాణపు మండపంబటు వెలుం ♦ గన్ జేయు స్వాతంత్ర్య ధ
ర్మ మహాదేవత మొగ్గెఁ గిల్బిష సము ♦ ద్రంబందునన్! రక్త హ
స్తములన్ లేపిన లేచు! లేవ దణుమా ♦ త్రిన్ రిక్తహస్తంబులన్.

నాలుగో చరణంలో వున్న "రక్తహస్త — రిక్తహస్త" శబ్దకూడిక మిక్కిలి హృదయంగమం. యుద్ధభాగంలో ఈ కవి కవిత్వం తిక్కనసోమ యాజిని జ్ఞప్తికి తెస్తూ వుంటుంది.

ఉ॥ అత్తఱి విక్రమించి భయ ♦ దాహవశౌర్యుఁడు శ్యామసింహ భూ
భృత్తిలకుండు శీర్షకము ♦ ఛేదిల మోదుచు ఖాను ఖడ్గ ము
దృత్తి వియత్తలంబునను ♦ దెవ్వఁగఁ గొట్టి హయంబుఁ గూల్చ నో
రెత్తక వాఁడు మానము వ ♦ హించుచుఁ బాఱెను నేల దూఁకుచున్.

ఈలాటి పద్యాలు వరుసవెంబడిని వుదాహరించ వలసినవున్నాయి. కవి అధునాతనుడే అయినా కవిత్వం అధునాతనంగా వుండదు.

అయినా పుస్తకం వీరరస ప్రధానం. రాజపుత్రులకూ మహమ్మదీయులకూ సంబంధించిన యుద్ధపద్ధతిని తెల్పేది. కవి మన ఆంధ్రుడు. రాయలసీమ వాడు. ఇంటిపేరు దుర్భాకవారు. దుర్భాక వెంకటాచలశాస్త్రిల్లుగారిని

మేము అడిగేవారు ఆనేబిసంటు సభకు వెళ్ళినప్పుడు యిప్పటికి యేభై యేళ్ళ క్రిందట సందర్శించివున్నాం. బహుశః ఆదుబ్బాకవారున్నూ యీ దుబ్బాక వారున్నూ వొకరే యేమో! భవతు. మొత్తం కవి మహమ్మదీయులకు అనుకూలించేవాడు మాత్రం కాదు. అయితే మాత్రం, రెండూ రెండుకళ్లు గానే చూచుకొని రచన సాగించాడు గాని, పక్షపాతంగా కలం నడప లేదు. అక్బరు గుణాతిశయాన్ని శత్రువులచేత కూడా చక్కగా అనువదింప జేశాడు. సందేహంలేదు. కాని, యుద్ధవర్ణనలో మాత్రం రాజపుత్రుల యందు నలుసంత పక్షపాతంగా కలం (అవశంగానే-అనుకుందాం) నడిచిం దేమో! అని నాకు అనుమానం.... బాహుబలాఢ్యులున్నూ, పౌరుషప్రధా నులున్నూ అయిన రాజపుత్ర వీరులు - లక్షలకొలది మహమ్మదీయులతో వేలకొలదిగా మాత్రమేవున్న తాము సుమారు 25 యేండ్లు నిలిచి పోరాడి నిర్వహించ గలిగారన్నది పరమార్థం. రాజపుత్రులది తమ దేశంలో మట్టుకు తమ స్వాతంత్ర్యం నిల్పుకొనే ప్రయత్నమే కాని అక్బరు చక్రవర్తి ప్రభు త్వాన్ని యీ దేశాన్నుంచి ఆసేమాంతం చెపుదామనే ప్రయత్నం కాదు. చక్రవర్తికో? తన గొడుగుతప్ప యింకోగొడు గెక్కడా వుండనే!కూడదనే గౌరవాకాంక్ష. అవును. అతడు సార్వభౌముడు కదా! పాపం ఆబిరుదం అర్థ వంతం కావాలంటే యింకో శూరుడు తనకు మొక్కనివాడు వుండడం వల్ల కాదు. యీదోషం మహానుభావుడైన అక్బరుది కాదు. అది అతడు ధరిం చిన సార్వభౌమ బిరుదానిదనుకోవాలి. ఆయీ బిరుదే చాలా ఘోరాలు చేయించింది అక్బరుచేత. గ్రంథకర్త ప్రతాపుణ్ణెంత చక్కగా కాపాడి దిద్ది తీర్చాడో అక్బరు చక్రవర్తినికూడా అంత శ్రద్ధాభక్తులతో దిద్ది తీర్చి ధీరో దాత్త నాయకాగ్రేసరుణ్ణిగా ప్రకటించాడు. వాల్మీక్యాదులు రావణాదు లను యింత చక్కగా చిత్రించనే లేదన్నా తప్పు లేదనుకుంటాను.

ప్రతాపుని గుణగణానికి లొంగిపోయిన అబ్దుర్రహిమాను మొగలైన పాదుషా మంత్రుల న్యాయైకదృష్టిని యీ కవి బహుచక్కగా ప్రక టించాడు.

తే॥ మనుజపతిమౌళి మన్మథ ♦ మన్మథుండు
చైత్రకాశ్వముపైన సా ♦ క్షాత్కరించి
దివ్యదర్శన మిచ్చె! వా ♦ తేజమునకు
నంజలి ఘటించి యాత్మోప ♦ హార మిడుదు.

అబ్దూరహిమాను అనే పెద్దమంత్రి అక్బరు చక్రవర్తితో మహా సభలో మాట్లాడే మాటలను వివరించే పద్యాలు సుమారు 25టి దాకా వున్నాయి. ఆపద్యాలలో యిది వొకటి. పద్యంలోవున్న చైత్రకం రాణా ప్రతాప సింహునికి ప్రాణతుల్యమైన వాహనం. అబ్దూరహిమాను యెంతటి సహృదయుడూ కాకపోతే తన్ను యుద్ధంలో యెదుర్కోవడానికై సర్వసన్నాహంతో వచ్చిన (శత్రువు) ప్రతాపుణ్ణి అంత మెప్పుతో తన ప్రభువు సముఖంలో నిర్దేశించగలడా? యింకో పద్యంకూడా వుదాహరిస్తాను.

మ॥ అకటా! సనాతన ధర్మముల్ తెలిసి రా ♦ జ్యంబేలం గా లేడా! ను
చ్చికమై భూప్రజం బుత్రులంబలెం గృపా ♦ శ్రీం జూడగా లేడా! పా
యక సర్వాశ్రమ ధర్మపద్ధతి తిరం ♦ బై నిల్పం గా లేడా! యెం
దుకు వాతండు స్వతంత్రుండై నిలువం గా ♦ దో యావతిం గోరెదన్.

యింత నిర్భయంగా నిష్పక్షపాతంగా చక్రవర్తితో — (చాటునా మాటునా కాదు) మహాసభలో శత్రుగుణాలను వ్యాఖ్యానించే రాజకీయోద్యోగులు వుంటే వుంటారేమో కాని విని సహించడమే కాకుండా అభినందించడంకూడా వున్న సార్వభౌముడు ఒక్క అక్బరే కాని యింకొకడు లేడనే చెప్పొచ్చు. రాణా ప్రతాపసింహ చరిత్ర అనే పేరుతో కవి దీన్ని రచించినా 'అక్బరు చరిత్ర' అనే నామాంతరంతో దీన్ని పిలిస్తే పిలవవచ్చుననే నేననుకొంటాను. నిజానికి అక్బరు అట్టి మహానుభావుడో? కాడో? కాని గ్రంథకర్త రచన అతణ్ణి సమధయోగ్య-చక్రవర్తి శిరోభూషణంగా చిత్రించింది! బిల్హణు డేమన్నాడు? రావణాసురుణ్ణి దుర్మార్గుణ్ణి చేసినవాళ్లు కవులే. రాముణ్ణి మహామహుణ్ణి చేసినవాళ్లూ

కవు లేలన్నాడు. (విక్రమాంక చరిత్రమూ) దాదాపు రెండు వేల పద్యాలు యీ కవి యీ చరిత్రలో లిఖించాడు. చేద స్తంగా పెంచిన ఘట్టం వకటి లేదు. ఋతువర్ణనకు గాని సూర్యోదయ – సూర్యాస్తమయాలకు గాని వొక్కొక్క పద్యంకంటె ఖర్చు పెట్టి నట్లు లేదు.

... ... ... ... ... ...

ఈ మాదిరి పద్యాలు సర్వత్రా వున్నాయి. చదువరులు చూచు కోవలసిందేగాని వుదాహరించవలసివస్తే వ్యాసం తెములదు. సూత్ర ప్రాయంగా సుమారు పదేళ్ళకు పూర్వం యీ పుస్తకాన్ని నేను చదివి యిచ్చిన అభిప్రాయం మూడు నాల్గు పంక్తులు మాత్రమే-దానికి యీ విమర్శనం భాష్యం వంటిదే కాని అన్యం కాదు...

ప్రస్తుత గ్రంథకర్త తురుష్క భాషాపదాలు చాలా వాడవలసి వచ్చింది. ఆయా రాజుల నామధేయాలు దేశాల పేళ్లు పట్టణాల పేళ్లు స్త్రీల పేళ్లు సమస్తమూ ఆభాషలోనే వున్నాయి. వాట్లని మార్చడం యోగ్యం! కొన్ని సంస్కృతభాషా సంపర్కం కలిగివున్నా (తేజసింగు వగైరా) అవిన్నీ అపభ్రంశంగానే వున్నాయి. అట్టిశబ్దాల విషయంలో గ్రంథకర్త బాధ్యుడు కాడని విజ్ఞు లెరిగినదే. యెన్నో లోకోక్తులు సమయోచితంగా రసోచితంగా యీయన వాడివున్నాడు. అందులో కొన్ని గోదావరీమండలంవారికి అపరిచితాలు. అట్టిది ఒకటి చూపుతాను. యీ లోకోక్తి "పాండవ బీడు" ఈ ప్రాంతంలో "అయ్యవార్లంగారి నట్టిల్లు" పర్యాయం గా వుంటుందేమో అనుకుంటాను. ఇది వాడిన చోటు

గీ॥ వట్టి పాండవ బీడు మే • వాడ సీమ!

సందర్భాన్నిబట్టి చూస్తే శుద్ధదరిద్ర ప్రదేశమని య్యేవే తేల్తూ వుంది. యింకా కొన్ని యీలాంటివే వున్నాయి.

స్థాలీపులాకంగా ఈ రాజశేఖరకవి కవిత్వాన్ని గూర్చి కొన్ని మాటలు వ్రాశాను. ఈయన దేశభక్తి పరవశుడే కాని దురాచారాల యందు పట్టుదల కలవాడు. ఈవిషయం కవిత్వంలో సర్వత్రా గోచ రిస్తుంది. సంస్కృతభాషలోకూడా మంచిప్రవేశం కనపడుతుంది. తెలుగు

మెట్రిక్యులేషన్ వఱకూ చదివిన పాఠశాలలోనే అభ్యసించి వుండాలి. కీ॥ శే॥ గిడుగు రామమూర్తిపంతులుగారు వొక్కక్షణముకూడా వ్యర్థం చేయకుండా జీవితాన్ని భాషకోసం వ్యయించిన నిష్కల్మష హృదయుడు. ఆయీ రాణా చరిత్రం ఆయన చూచివుంటే చాలా సంతోషించేవాడు. యెంతేనా వ్రాశేవాడుకూడాను. నాకు తెలిసినంతలో విమర్శించాను. యీనాటి ధన్యకవులలో యీాయన చిటికెన వ్రేలి మీదికి వచ్చేవాడుగాని అల్లాటప్పావాడు కాడు.

శ్లో॥ కవిః కరోతి కావ్యాని । లాలయత్యుత్తమో జనః
తరుః ప్రసూతే పుష్పాణి । మరుద్వహతి సౌరభం॥

మ॥ భగవంతుండగు రాజశేఖరుఁడు నీ ♦ పట్లం గెల్లాంధ్రమం
దగణేయం బగు కీర్తి నీఁగల ప్రితా ♦ పానీను చారిత్రముల్
సొగసౌగీతి రచించి సత్కవుల మె ♦ చ్చుల్ హెచ్చుగాఁ గాంచితా!
తగ వర్ణింతును రాజశేఖర కవీ ♦ ధన్యుండ వీ వస్సట్టుల్.

# రాణా ప్రతాపసింహ చరిత్ర

## = విశ్వనాథ సత్యనారాయణ =

"భారతము" దేశభక్తిని పెంపొందించునని రష్యను దేశస్థులు తమ భాషలోనికి అనువర్తించుకొనుచున్నారట. భారతమున కాశక్తి యున్నచో "రాణాప్రతాపసింహ చరిత్ర"కును అశక్తి కలదు

రాణాప్రతాపుఁడు పేరునకు రాజపుత్రుఁడు. ఆంధ్రుఁడు కాడు. దర్మరా జాంధ్రుఁడా! కృష్ణు డాంధ్రుఁడా! రాముఁ డాంధ్రుఁడా! శంకరుఁ డాంధ్రుఁడా! వారందఱు భారతీయులు. అందుచేత ఆసేతుశీతనగము వారి కథలు పాడిరి. అట్లే ప్రతాపుఁడును.

భారతము పూర్వకాలము కథనే చెప్పును. అందులో నున్న ధర్మముమాత్రమే మనజాతిది. ఆ విషయము ద్వాపరయుగము నాటిది. మన పరిస్థితులతో సంబంధము లేనిది. ప్రతాపసింహ చరిత్ర మన ధర్మమునేగాక మన పరిస్థితులుగూడ చెప్పును. అక్బరు చక్రవర్తితో పాతిక యేండ్లు పోరాడి-స్వదేశమువదలి-కొండలలో గుట్టలలో నివసించి తిండిలేక గడ్డిరొట్టెలు తిని-దైవవశమున మరల స్వాతంత్ర్యము సంపాదించిన మహాపురుషుఁడు. రాణాప్రతాపుఁడు. ఆయనకన్న ధర్మరాజాదు లేమియు నెక్కువవారుకారు. వస్తురమ్యతకుఁగాని, కథా చమత్కారమునకుగాని, ఇందలి భిన్నపాత్రల భిన్నతా విశిష్టతకుఁగాని భారతమున కీగ్రంథము తీసిపోదు.

వస్తు విటువంటిది. కవి-యెటువంటివాఁడు? వ్యాసునకు తిక్కన్నకు నెంత వీరరసావేశ మున్నదో యంత వీరరసావేశము గలవాఁడు. వెనుకటికి బ॥ శ్రీ॥ చెళ్లపిళ్ల-వెంకటశాస్త్రిగారిని ఎవరో ప్రశ్నించిరట— "భాగవతము పోతన్నగారు వ్రాయనిచో, మఱి వ్రాయుటకు సమర్థులెవ"రని. కాసుల పురుషోత్తమకవియని వారే సమాధానము చెప్పిరట. నన్నవ్యరైన భారతము లోని యుద్ధపంచకము తిక్కన్నగారు వ్రాయకయుండుచో మఱియెవరు వ్రాయఁగలుగుదురని ప్రశ్నించినచో నేను "రాజశేఖర-శతావధానిగా"రని సమాధానము చెప్పెద. ఈగ్రంథములో చివరి నాల్గాశ్వాసములు యుద్ధము తప్ప వేఱే లేదు. యుద్ధవర్ణన మెంచ్చుటచూచినను తిక్కన్నగారి రచనతోఁ దులదూగుచున్నది.

✓✓ ఈ గ్రంథము అస్వతంత్ర జాతికొక స్మృతిగ్రంథము వంటిది. రాణాప్రతాపుని భద్రాకరణప్రతిజ్ఞ చూడుఁడు............ఈ ఘట్టము ద్వితీయాశ్వాసములో నున్నది· ఈ ఘట్టము చదివినచో పారతంత్ర్య జాతికి ఇది స్మృతిగ్రంథ మన్నమాట కర్థము తెలియును.

రాణాప్రతాపునకును, మహాత్మునకు గల సామ్యము - భారత జాతికిగల యస్వతంత్రత. మహాత్మునిది కత్తిలేని సాత్త్వికపుపోరు-ప్రతాపునిది కత్తిగల సాత్త్వికపుపోరు ప్రతాపసింహుఁడు అక్బరును జయింప

వలెనని యుద్ధము చేయలేదు. పౌరుషశక్తితో గెలువలేనని యాయనకు తెలియును. కాని వట్టి ధర్మము కోసము యుద్ధము చేసెను. భారత జాతి యధర్మము వరులకు లొంగిపోదు—చచ్చిపోదు—అని రుజువు చేయుటకే యుద్ధము చేసెను.

"కాన విజయంబు ముఖ్యంబు • గాదు మనకు!
ధర్మ సర్వస్వంబు క • ర్తవ్య మిపుడు."

ఇది ప్రతాపుని యూహ. ఈ ఘట్టము చదువవలెను. నేటి సత్యాగ్రహమునకు అనాటి ప్రతాపుని యుద్ధధర్మమునకు భేదమే లేదు.

ప్రతాపీయులు — అన్నము తినలేదు - నీరు త్రావలేదు - నిదుర పోలేదు. ఇది బలవంతము చేతగాదు - వ్రతము చేత.

ఈ కథకు మన కథకు వేయి పోలికలు! అన్నిటి కన్న గొప్ప పోలిక అబ్దుర్రహిమాన్ - ఈయన అక్బరు చక్రవర్తి సర్వ సేనాని. వీర రసారాధకుడు. ప్రతాపునకు పృథ్వీ సింహుడు వ్రాసిన యుత్తరము కవియైన యీ మునసల్మాను సేనాని వ్రాసిపెట్టినది. ఆయన యెంత వీరుడో యంత కవి. రవిధ్వజము—గరుడధ్వజముగా, కృపాణము—నందకముగా, కవచము—పట్టుబట్టగా, హల్దిఘాటు యుద్ధమున తనకు "ప్రతాపరాజ నారాయణుఁడు దర్శన మొసంగె" నట. అతఁడక్బరుతో ననుచున్నాఁడు. ఆ ప్రతాపుడు.........

మ॥ "అకటా! నీవలె ధర్మముల్ తెలిసి రా • జ్యంబేలఁగా లేఁడా! మ
చ్చికతో భూప్రజ బుత్రులట్ల కరుణా • ర్ద్రిం జూడఁగా లేఁడా! పా
యక వర్ణాశ్రమ ధర్మపద్ధతి తిరం • బై నిల్పఁగా లేఁడా! యొ
రుకు వాఁడందు స్వతంత్రతన్ నిలువఁ గా • డో! యానవతీఁగౌరవా."

ఈ రహిమానుఁడు మఱియు ననెను. ఆ ప్రతాపునకు తాము సహకారులగుటయే గొప్పతనమట. ఇట్టి రహిమానులు నేటి పాశ్చాత్యులలో నెంతమంది లేరు! ఆ పాశ్చాత్యులలో నక్బరు చక్రవర్తి లేరు. అక్బరు చక్రవర్తి ప్రతాపుని గురించి యిట్లనెను:—

"ఆ మహానాయక వతంస ♦ మా ప్రతాపుఁ
డెన్నిగతుల యోజించిన ♦ నన్నుఁబోలు
కోటి సార్వభౌములు చేరి ♦ కొలువఁ దగిన
క్షాత్రనిధి యనుమాట వ ♦ జ్రాల మూట".
"నాదు జీవితశేష మం ♦ తయుఁ ప్రతాపు
సేవ గడిపినఁగాని దు ♦ ష్కీర్తి పోదు."
"మన బ్రతుకులు పోరులనె తెల్ల ♦ వారిన వకటా!
ఇది అక్బరుయొక్క సౌశీల్యము......

ఈకవి యఖండమైన క్రొత్త పలుకుఁబడులు గలవాఁడు
"ఇతడు బాడబానలము పారమిృంగు మ ♦ హా బలుండు"
"పిడుగుల్ వేృళ్ళ నలుకు భయద శౌర్యులు"
"మొదలఁ నెత్తురు వంచుకొం చనుజుఁడై ♦ పుట్టెనో'
"ఒకకాడఁ జనియించు రెండుపువ్వుల ♦ ట్లొప్పారి"
"దురదృష్టం బది యెల్ల నాపయుని గం ♦ తుల్ పెట్టె"
"అక్బరు విజయరథము కాడిమోసిరి స్వాతంత్ర్య ♦ ఘనతమలుచి"
"పుడిసెం చూపిరి మేన నుండు వలుకుఁ ♦ బోగాడి'
"మాటలను గట్టె యాయువు ♦ బుట్టకెత్తి
శాశ్వత బ్రహ్మకల్ప మీ ♦ జగతి నుందువో!"

ఈమొదలైన వనేకములు-ఇంక సందర్భానుసారముగ లోకో క్తులు మొదలైనవి కుప్ప తెప్పలుగానుండి గ్రంథము ఆంధ్రసరస్వతీదేవికి క్రొత్త భూషణముగా నున్నది.

ఈకవి రాజపుత్రయోధుల శౌర్యాదుల నెంత వర్ణించునో ముస ల్మానుల శౌర్యాదుల నంతే వర్ణించును. హుమయూనుని వర్ణించుటయు, తేబరుపడ్డ కష్టములు వ్రాయుటయు నొక ముసల్మానకవి యెంత యభి మానముతో వ్రాయునో యీయనయు నట్లే వ్రాసెను. ఈరచన భాగవ తమును దలపించుచున్నది. ఉదయసింహునకు 25 మంది కొడుకులు - రెం డవవాఁడు సూర్తుఁడు — మూడవవాఁడు సాగరుఁడు — పెద్దవాఁడు ప్రతాప

సింహుఁడు-జగమల్లుఁడు మఱియొకఁడు. ఇతడు శౌర్యహీనుఁడు. ఇతనికి రాజ్య మీయవలయునని రాజు తన సరదారులతో చెప్పిపోయెను.

మ॥ 'కమలాప్తాన్వయమా! భవత్కృత మహా ♦ ఘంబేమొ! రాముండుపూ
ర్వము కొన్నేఁడులు మానియుండవలసెన్ ♦ బట్టాభిషేకంబు! చం
ద్రమహీనాథుఁడు లేకయే చనియె! నీ ♦ నాఁడీప్రతాపుండు స
ర్వము గోల్పోయెను! దుర్బలుల్ జనకులౌ ♦ రా! యెంతకున్ గర్తలో"

అని బంధుజనులు విషాద మొందిరి. సలుంబ్రాకృష్ణుఁడు అచ్చటి తీర్పరి రాజుతో 'సరే' యనెను. కాని చివరకు ప్రతాపునే రాణాచేసెను. జగమల్లుఁ డభ్యంతర పెట్టెను. ఈకవి చాలచోట్ల నన్నయగారిని పోలి నట్లు వ్రాయును. రాజసూయమున సహదేవుఁడన్న మాటలకు, ఇచ్చటి సలుంబ్రాకృష్ణుని మాటలకు పోలిక చూడుఁడు.

'రాణాలన్ బొనరించు బాధ్యత సలుం ♦ బ్రావారిదౌ మాట యీ
క్షోణిన్ గల్గిన వారెఱుంగుదురు! ఇ ♦ చ్చోనేఁ బ్రతాపున్ మహా
రాణాగా నొనరింతుఁ! గూడదను ధీ ♦ రగ్రామణుల్ గల్గినన్
బాణిన్ బైకొనఁగనత్తుఁ! డిప్పుడె యెదు ♦ ర్పన్ వత్తు నత్యుద్ధతిన్."

జగమల్లుని త్రోసిరాజని కృష్ణుఁడు ప్రతాపునే సింహాసన మెక్కించెను.

'పరిపుల్ల రుచిర సరసిజ కరంబరలు నెరపినటు స ♦ భాభవనం బ
ప్పురజనముల నెమ్మోములఁ బరమామోదమున నపుడు ♦ భాసిలుచుండెన్'

ఇది మఱల నన్నయ్యగారి రచన. ఈపట్టాభిషేకోత్సవ మంతయు ప్రబంధ సరణి నడచెను.

గొండవకొండ్లైన సూర్యుఁడు సలుంబ్రాకృష్ణునివద్ద పెంపఁబడెను. ప్రతాపుఁ డతనిని దనవద్దకు రాఁపుమనెను. శ్రీకృష్ణుఁడు పంపెను.

"నాస్వామి స్నేహముప్రేమాంకురమ్ములు ప్రసిద్ధీవ సామ్రాజ్యముల్"

వసంతకాలము వచ్చెను. ఎల్లరాజులు ప్రతాపునకు కానుకలు పంపిరి. మఱల నన్నయ్యగారివలె వ్రాయుచున్నాఁడు,

మ॥ "తలపైనన్ మకుటా తురాయి వెలుగొం ♦ దన్ ధాళధళ్యంబు రం
జిలు ఖడ్గంబులు వ్రేల, వాద్యనుమతే ♦ జీలెక్క యోధాళి చెం

తల నే తేరఁ, బ్రతాపసింహుఁ గొలువక • నానానుహీమండ లే
ద్రులు వేంచేసి రుగాదికానుకలు దాం • తుల్ దాంతరల్ తెచ్చుచుఁ'

అప్పు డందఱు వేఁటకుఁబోయిరి. ఈవేఁటకు బోయినపుడు రాజ పురోహితుఁడైన హారభట్టు కూడ వెళ్లెను. ఈపురోహితులుకూడ పేరు కే. రాజులకు ప్రాణములు ధారవోసినవారు. ఐహికాముష్మికములకు చేయూత యైనవారు...

వేఁటయైన తరువాత కూర్చుండి మాటలాడు కొనుచుండఁగా నొక వరాహము వారి నడిమికి వచ్చెను. దానిని అన్నదమ్ము లిద్దఱు — సూక్తుడును - ప్రతాప సింహుఁడు—తమ బాణములతో గొట్టిరి. నేను చంపితి నన నేను చంపితినని తగవులాడిరి. సూక్తుఁడు ప్రభువుతో నన్నగారితో - వివాదము పెంచెను. సలుంబ్రా కృష్ణునిగూడ లెక్క సేయలేదు. హార భట్టు సూక్తునకు నీతి నుపదేశించెను. ఆ పురోహితునితో సూక్తుఁడెట్టు పొగరు పోతు తనము ప్రకటించెను.

"తనదా శక్తికిమీఱు కార్యములకుఁ • దార్కొన్న చో ముప్పు న
చ్చును! మాయిర్వుర లోన నొక్కఁడు రణ • క్షోణిఁ మృతిఁగన్న మీ
రును రావచ్చును! నేడ్వవచ్చు! మఱి పౌ • రోహిత్యముఁ జేయ న
చ్చును! లబ్ధిఁ గొనవచ్చు! నిప్డు చనవ • చ్చుఁ దాఁటి దూరంబుగన్.

అంత హారభట్టు వారి యుద్ధ మాపలేక వారి నడుమ తాను కత్తి పెట్టుకొని పొడుచుకొని చచ్చెను.

"నాటి కష్టదశ దీ • ర్ఘఁ బూని యాత్మార్పణం
బు నొనర్చెఁ హారభట్టు త్యాగనిధియై • ముల్లోకముల్ మెచ్చఁగన్."

అంత యుద్ధము సమసి పోయెను. "గురు రుధిరంబు దాఁటగను కూడదు" అని ప్రతాపుఁడు యుద్ధమును మానివేసెను. సూక్తుఁడు దేశ మును వదలి పోయెను. ఎచ్చటికి బోయెను?

"తా. నరిగెను ఢిల్లితో ప్రవరు! కు • లాంతకు లందఱు పోవు తావుకున్'

ఇచ్చటినుండి ప్రతాపుని శౌర్యాగ్ని రాజి మండి, యత్యుగ్రజ్వాలికయేండ్లు తగులబెట్టిన ఘట్టము. ఆశౌర్యము, ఆయుద్ధములు, అప్రతి

ఇంత రాజనీతి అక్బరు ప్రకటించెను. ఇట్టి రచన సామాన్య కవి చేయునది కాదు. ఇది తిక్కనాదులు చేయఁదగ్గది. మానసింహుఁడు ప్రతాపుని యొద్దకుఁబోయి అక్బరును గుఱించి యెంతయో పొగడెను. మానసింహుని వంశమునకు ప్రతాపుని వంశీయులు గురువులు. ప్రతాపుఁడు మానసింహుని పొగడిక విని అక్బరు రాజనీతి మానసింహునికి వివరించి చెప్పెను.

“నిగూఢ మాతని మనోవ్యాపార లీలాగతుల్.”

“అల్లుడై - బావయై - మామ ♦ యైన తన్ను
వెలితి గననీక శ్రీ మహా ♦ విష్ణు పట్లు
భారతీయులు కొలుతురట ♦ భావమెఱిఁగి
అక్బరటు చేసె! హేతువ ♦ న్యంబు గలదె!”

అని చెప్పెను. అంత చల్లగాఁ బాలించు నక్బరు రాజ్యములో ఘూర్జర దేశమున క్షామము. అక్బరొకవంక దిగ్విజయమును చేయుచున్నాడు. ధనేశ్వరమ్మున సన్న్యాసులలో- సన్న్యాసులకుఁ బోట్లాటపెట్టి తానొక పక్షము చేరి వారందఱిని నాశనము చేసినాఁడు. యిందు ప్రతాపుని యొక్క ధర్మమనేమో: నిజమైన రాజెట్లుండ వలయునో, ఆ ప్రతాపుఁడెట్లు నిజమైన రాజో, ఈఘట్టమంతయు చదివినచోఁ దెలియును. ప్రతాపుడు ప్రకృతి బిడ్డ. భోగవిముఖుఁడైన రాజు. భోగాభిముఖుఁడైన రాజు వలన లోకములో, గొంత భాగము తిండి లేకుండఁ బోవును.

“ఆశాపట్యము లాదరస్మితము లా ♦ యౌదార్య మావియ్య మా
మోకాల్ మ్రొక్కులు నాచమూవిభవ మా ♦ ముప్పొద్దు సేవించుటల్
నాశత్రుల్ దలనొప్పి పట్టణము ల ♦ న్నట్! మీకు నెట్లుండునో!
నాకీ కొండలువోలె సౌఖ్య మిడు శాం ♦ తస్థానముల్ లేవుపో!

ఇది ప్రతాపమూర్తి అనిన, మానసింహుఁడు,

ఈ యేరీతుఁ బ్రాణఁ జొచ్చె నెదు ♦ రీద నెవండు సమర్థుఁడో! వృథా
పౌరుష [illegible]దంచు బడ ♦ బాజ్వలనంబును బాఱమిగ్రీఁ గదే!”

అన, ప్రతాపుఁడు ఒక చిన్నకథ (Parable) చెప్పెను. ప్రతాపుఁడు గాంధి వంటివాఁడు- యేసుక్రీస్తు వంటివాడు- మహర్షుల వంటివాఁడు

చివరకిట్లనెను. "నా రాజ్యమరణ్యము- మేము సన్న్యాసులము మీ యక్బరు నకు మమ్ము గెలువనలెనని పట్టుదల ఏమి!

"అప్రతిహతముగా ♦ నక్బరొక్కఁడె యేల క్షితిని దేవుఁడు సృష్టి ♦ చేయలేదు. ప్రజ లతనిచేఁ జంపబడుటకుఁ బుట్టలేదు- రాజకన్యక లతని భోగపరత నుద్దేశింపఁ బడలేదు - అతని రాజ్యతృష్ణముఁను సర్వజగత్తు "పారతంత్ర్యమున మునుఁగుటెల్ల పాడిగాదనుచు నక్బరెంత యొత్తిఁగిన జగమున కంతమేలు"

చివరకు భోజనవేళ మానసింహునకు గోపము వచ్చెను. సిస్సు గోష్ఠి లాడెను. మిమ్ము నాశనము చేసెదనని చెప్పి లేచి పోయెను.

ఇది యవనసేనతోఁ జేయు ♦ కదనమో స్వ
జనముతోఁ జేయు కదనమో ♦ శంకగలిగె"

ఈశంక ఆనాటినుండి ఈనాటివరకు అట్లే యున్నది. ఈ యుద్ధములో ప్రతాపుని సైన్యములు చెదిరిపోయినవి. ప్రతాపుని తమ్ముఁడు శక్తుఁడు ప్రతాపుడు అవతార పురుషుడని గ్రహించెను. మజాల నన్న గారి వైపే చేరెను.

చివరకు తనబిడ్డ మొలకగడ్డితో జేసిన రొట్టె తినుచుండగా నడవి పిల్లి వచ్చి దానిని గిరి రొట్టె నెత్తుకొని పోయెను. ప్రతాపుఁడు చక్రవర్తి నాలు నెలలు గడు వడిగెను. ఉత్తరమిచ్చి భిల్లుని పంపెను. ఆయుత్తరమును చూచి యక్బరు పొందిన సంతోషమునకు మితిలేదు. అక్బరు సభలో పృథ్వీసింహుఁడు ఆయుత్తరమును ప్రతాపుఁడు వ్రాయనే లేదనెను. నాడును వీడును వివాదపడిరి. ఆయుత్తరము తెచ్చిన భిల్లునితో పృథ్వీసింహుఁడును భార్యయు సిట్లనిరి.

"చెప్పుము చిత్తమిచ్చి యిదె ♦ శ్రీనృపలోక జగద్గురుండు మా
యప్ప ప్రతాపదేవుని ము ♦ ఖాంబుజమందున జంద్రబింబ మం.
దొప్పెడి వెన్నెల ట్లెఁగు ♦ నుత్తమహా దరహాస రేఖ తా
నెప్పటియట్ల పాయక ర ♦ హించుచు నున్నదె భిల్లశేఖరా!

ఈపద్యము భాగవత పద్యమువలె నున్నది. కృష్ణుఁడు సుఖముగా

నుండెనా యని ధర్మరాజు అర్జును నడిగిన ఘట్టములోని పద్యమువలె నున్నది.

"శ్రీనృపలోక జగద్గురుండు-మాయప్ప-ప్రతాపదేవుడు"

ఇందు రసధ్వని వేయిమూర్తుల రూపు గట్టుచున్నది. హృదయము నుండి వచ్చిన భాష యనగా నిది. పట్టి యక్షరములుగా మాటలుగా గనిపించునుగాని ప్రతాపుడుగా మూర్తిగట్టిన పృథ్వీసింహుని స్వాతంత్ర్యాభిలాష యంతయు ధర్మ వీర రసమంతయు ఆమాటలలో నున్నది. ఇట్టి రచన మహాకవులే చేయగలరు.

అబ్దూరహీమాను వ్రాసిన యుత్తరము ఆతడు పృథ్వీసింహునితో జేసిన సంభాషణ—ఆయుత్తరమును చదివి తీరవలయును — అందులో కొన్ని భాగములు

"భరత ఖండంబు నుద్ధరిం ♦ పంగ జనించు
ధూర్జటివి నీవు! రాజమా ♦ త్రుడవు గావు!"
"తనదు నేర్పడి సంత హైం ♦ దవ మహాత్వ
మక్బ రంతయుగొను దొడ్డ ♦ యడిబికాడు!"
"స్త్రీలఁ బురుషుల రాజ్యంబు ♦ దేశమెల్ల
విలుచు నీయక్బరను గొప్ప ♦ విలువకాడు!

ప్రతాపుఁ డిట్టివాఁడు——ఇంక అక్బరు ఇట్టివాఁడు.

"ఈవు విశ్వప్రపంచమం ♦ దీశ్వరని య
నంతలీలాగతులు గొని ♦ యాడె దెపుడు!"
"విలువఁ గట్టుచు రాజ్యంబుఁ ♦ గొలుచు నక్బ!
రెవరి గొప్పతనం బెంతో ♦ యెఱుఁగు జగము."

ప్రతాపుడు మాటల యుద్ధమును ప్రారంభించెను. కొండలలో దాగి పొంచుచు పైబడుచు చీల్చుచు కలచుచు విటతాటనము చేయుచును తుప్పలలో చాటగుచు నిట్టి యుద్ధము చేసెను. (Guerilla warfare). అయినను గెలువలేక పోయెను. ప్రతాపుని దారిద్ర్యమున కంతు లేక పోయెను.

చివరకు ప్రతాపుఁడు దేశమే వదలిపెట్టి పోఁదలఁచెను - భామా సాహి వచ్చెను. ధన మిచ్చెను - ప్రతాపుడు మరల సైన్యము సమకూర్చెను-మరల తన రాజ్య మంతయు గెలుచుకొనెను.

అంతయు నైనది... కాని, ఓయి ప్రతాపా! శ్రీనృపలోక జగద్గురూ! మాయప్పా!

సీ॥ అక్బరు విశ్వంభ ♦ రాధీశ మాళిది
ధనసేవ! నీయది ♦ దైవసేవ!
లాతని దెల్లప్పు ♦ డాత్మవైభవము! నీ
యది నిరంతరము నా ♦ త్మావ బోధ!
మతని కుండిన దెల్ల ♦ నైహిక బలము! ని
న్నాశ్రయించిన దెల్ల ♦ నాత్మబలము!
నతని దండఱ కన్ను ♦ లలరించు భోగంబు!
నీది జగము మెచ్చు ♦ నింపు త్యాగ!
మతఁడు జగము గెలిచె! ♦ నాత్మ గెల్చితివి నీ।
వాతఁ డితర జనుల ♦ నాశ్రయించు।
నీవు స్వాశ్రయుఁడవు। నీకు నాతని కెన
లేదు జగము క్రిందు ♦ మీఁదునైన.

ఇంక నొకమాట. ఈరసప్రవాహములో ప్రవాహము వెంటనే పోయి విమర్శించితిని. వేరొక గతి లేదు. కాని ప్రవాహము నడుమను, తీరము వెంటను, నంగుళ మంగుళమును, గల తామరపూలు, కలువ పూలు, నీటి బెగ్గురులు మొదలైన శోభలు పాఠకులే చూచుకొనుచు చదువు కొనవలయును. ఇది పరమోత్తమ గ్రంథములలో నొకటి.

# అభినందనము.

మ॥ అలఁతిం బోని స్వతంత్రతాగరిమముం ♦ ద్యాగంబు ధర్మంబు ను
జ్జ్వలమౌ వర్తన మెంతకాలమొ యను ♦ స్థానంబుఁ గావించి త
త్ఫలపాకంబున వ్రాసినాఁడవు ప్రతా ♦ పఖ్యాపు కావ్యంబు! స
ట్టులె కాకుండినఁ దన్మయత్వమది యె ♦ ట్లుం గల్గుఁ గొంతంతఁగన్

గీ॥ ఈవె చారిత్రిక కవుల ♦ కెల్ల మూల
పురుషుఁడవు! మార్గదర్శివి! ♦ బుధవరేణ్యు
లరసి "కవిసార్వభౌమ" స ♦ ద్బిరుద మిడిరి!
నీ సుకృత విశేషంబు వ ♦ ర్ణింపఁ దరమె!

ఉ॥ తెనుఁగుం దల్లి శిరః కిరీట మణి కీ ♦ ర్తిం గన్న యా భాగతం
బున నందందును గొన్ని తావుల రసం ♦ బుం దక్కువైయుండె న
చ్చును! బందొమ్మిది నూర్లు పద్యములు మ ♦ చ్చుం జల్లి [illegible]
టిని సాగించితి! ప్రాత-క్రొత్త కవికో ♦ టిం బాటి లేకుండఁగన్

చ॥ తెలుఁగని దేశభక్తియును ♦ ద్యాగము సత్యము ధర్మనిష్ఠయున్
గరుడుగఁ గట్ట వ్రాసితి జ ♦ గన్నుత కావ్యము! [illegible]
దెరఁ దొలఁగించి చూచినను ♦ దిక్కునకుం "సరిచేయి" రాజశే
ఖర కవిసార్వభౌముఁ డనఁ ♦ గాఁదగు [illegible].

ఇట్లు,

శ్రీ. శ్రీ. శ్రీ. కళాప్రపూర్ణ-కావ్యస్మృతితీర్థ-అభినవవ్యాస-
ఆంధ్రవాల్మీకి జనమంచి-శేషాద్రిశర్మ,

My dear Raja Sekhara!

I must have already told you that I am an admirer of your book. If I have not done so, it is an unconscious and unintended omission. You are one of those few poets who have been able to treat an episode taken from real 'History' and present it to the world as excellent literature of which the Telugu language has every reason to be proud. Your Rana Pratap Singh Charitra is one of the most memorable of modern productions. I congratulate you on your closeness to facts and a style that never flags.

With best regards,
Yours sincerely,
C. R. REDDI, M. A. (Cantab)

28-1-38.

క॥ చదివిన భాగవతమేకద
చదువంగా వలె నటన్న ♦ సామెత వ్యర్థమై
పోదలుఁ బ్రతాప చరిత్రము
చదివిన వారలకు నెందు ♦ సత్కవి తిలకా!

చ॥ పలుకులఁ దేనె లుట్టిపడు! ♦ భావములందు స్వతంత్ర దీప్తి శో
భిలు! విను వారి వీనులకు ♦ విందు లొసంగుఁ గథావిధాన! మి
య్యిలఁ దుల లేదు నీకవిత ♦ యెంతయు దిక్కున భారతంబె! యూఁ
దలఁ గదల్పఁ జేయు విబు ♦ ధప్రకరంబున కంచుఁ జెప్పెదన్.

కావ్య పురాణతీర్థ, విద్వాన్,
కడప. జనమంచి వెంకటసుబ్రహ్మణ్య శర్మ,
23-12-1933. ఆంధ్రోపాధ్యాయుఁడు.

పరిశ్కృత ప్రమాణములు

తమ రచన చాల గొప్పది. ఒకానొక కాలమున నేనును ప్రతాపరాణా చరిత్రమును పద్య కావ్యముగ వ్రాయ నుత్సాహపడి యుపక్రమించి యుండిన వాఁడను. సుమారు 300 పద్యములు వ్రాసి నడుమంత్రమున వదలితిని. వ్రాఁత గ్రంథముగూడ నావద్ద లేక నశించినది. తమ గ్రంథముఁ జదువ మొదలిడఁగానే నా ప్రయత్నము నిరవశేషముగా నశించుట యెంతో మేలే యాయె ననిపించినది. ఇంత గొప్ప గ్రంథమును ఒకటే ధారతో అందదుకులు తొందుకులు లేక రచించి ముగింపఁ గల్గిన తమశక్తి సామర్థ్యముల కాశ్చర్యపడి యభినందించుచున్నాను. తమది ప్రబంధముల పక్వతతోఁ గూడిన పురాణశయ్య. ఈశైలిలో నిశ్చయముగాఁ దామొక పురాణమునే వ్రాసియుండిన నెట్లుండెడిదో యని యాశపడుచున్నాను. ఈ స్థితిలో నీ కావ్యము నింత రసవంతముగాఁ బఠనీయముగాఁ జేయ శక్తులు చాలమంది లేరనుట నిస్సందేహమైన విషయము. ఎక్కువ విన్నవింపలేను. యథావకాశముగా గ్రంథమును బూర్తిగాఁ బఠింతును.

మైసూరు.
30-8-34 రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

చ| తలఁచిన భారతంబొకఁడు ♦ తక్క నిజానకు వీరకావ్య మీ
వల కుదయింపలేదు మన ♦ వాఙ్మయమం దొకఁడైనఁ; జాతికిన్
బరువము మాతృదేశమున ♦ భక్తి మదిన్ బురికొల్పి నేఁటి కా
తెలుఁగు భవత్ప్రతాపు చరి ♦ తంబునఁ దీర్చిన దోయి! మిత్రమా!

సీ॥ అలచిత్రకారు రం ♦ గులమాటి రాణా ప్ర
తాపసింహాత్మూపు ♦ రూప పటము
ననరాదుకాని; నీ ♦ యమృతాక్షర న్యాస
మూర్తిముం దది వెల ♦ బొమ్మ మాత్ర!
బ్రహ్మకల్పము దాఁక ♦ వన్నె మాయని యట్టు
లాత్మయన్ కొలిమి నీ ♦ రాగ్ని బలిమి
కవనంపు మూసలోఁ ♦ గఱఁగి మెల్సి పోన జా
తీయతా ముద్ర ♦ పోత పోసి

గీ॥ వీరరాణా ప్రతాపరా ♦ డ్విగ్రహమును
తెలుఁగుఁగోవెలఁ బ్రాణప్ర ♦ తిష్ఠ చేసి
నిలిపితివి! చేరి మనసారఁ ♦ గొలుచు నాంధ్ర
వీరసంతతి వాంఛ లీ ♦ డేరుఁగాక.

కవితా కళానిధి: బలిజేపల్లి లక్ష్మీకాంతకవి.

---

✓✓ ఆధునికులగు తెలుఁగు కవులకు దేశభక్తి—దేశాభిమానములు శూన్యములు. వారి గ్రంథములలో దేశ ప్రబోధకములగు రచనములు తక్కువ. చరిత్రాత్మకములు కడుంగడుఁ దక్కువ. చరిత్రాత్మకములై దేశభక్తి నుద్దీపింపఁ జేయు పద్యకావ్యములు లేనే లేవు. వేలసంఖ్యను మించు తెలుఁగు కవులలో దేశమును దలఁచు కొనువా రరుదు. భావకవులు కీ గొడవ పట్టనే లేదు. ✓✓

నిడుదవోలు.

మంగిపూడి వెంకటశర్మ.

గీ॥ "తెలిసె! తెలిసె! నిప్పుడు తేట ♦ తెల్ల మయ్యె!
నేల రాఁడో మా యన్నయ్య ♦ యిల్లు గదలి
యేల పల్కాఁడో ప్రజా ♦ హితము లైన
పనులయం"దని నా మనం ♦ బునఁ దపింతు!
నా తపసు పండె! హేతు వీ ♦ నాఁడు తెలిసె!
నే ననుకొను రీతిగ గుడి ♦ లోన దేవుఁ
డున్నటుల మిన్న కింటఁ గూ ♦ ర్చుండ లేదు!
మేలు! మేలు! చిత్తోడ్గడు ♦ నేలు చుండెఁ!
దివిరి స్వాతంత్ర్యరక్షణా ♦ దీక్షతోడ!
డుర్నిరీక్ష తేజమున శ ♦ త్రువు నెదిర్చి
ప్రబల శత్రువర్యగు ఢిల్లి ♦ పాదుసాహి
యెత్తివచ్చినఁ దొణఁకక ♦ కత్తి గట్టి
ధైర్యలక్ష్మితోడ కాలంది ♦ దండుతోడ
లావు పోరాసి యసంఖ్య బ ♦ లంబు గలుగు
శత్రువీరుల గుండియల్ ♦ జలదరింపఁ
జైత్రకాశ్వముఁ వైరి న ♦ డుములపైన
గొరిజ మోవఁగ దుమికించి ♦ యురవడించి
యొరదిగిచి కత్తి కుత్తుకల్ ♦ నఱికి నఱికి
నెత్తురు వసంత మాడి లో ♦ కోత్తరముగ
హల్దిఘాటాదిగా సమ ♦ రాంగణముల
నిలిచి వీర విహారముల్ ♦ సలిపి మేనఁ
దొరగు రక్తముల్ జడివాన ♦ గురిసి రాజ
పుత్రకాయము లోఁగి గాయ ♦ ములుగ మాఱఁ
జెట్టునీడ సౌధము ♦ గడ్డి-రొట్టె తిండి
పట్టుపాన్పు శిలాతతి! ♦ యిట్టి పండి
పట్టుపుండేసి బిడ్డలు ♦ చుట్టుఁ గొలువ

సబ్బురంబుగఁ దాను సిం ♦ హంబు వలెను
యడ్డులేని యరణ్యరా ♦ జ్యము వరించి
యక్బ రీఁజూచు సీవుల ♦ కాస పడక
యేకణమ్మును స్వాతంత్ర్య ♦ దీక్ష విడక
చాలునని పాదుసాహా వే ♦ సారువఱకు
"అన్న యక్బరు తోడఁ బో ♦ రాడుచుండె!"
ఏల రాఁడో మా అన్నయ్య ♦ యిల్లు గదలి!
ఇందుకే సుమి రాఁడని ♦ యిపుడు తెలిసెఁ!
దప్పని సరిగ రాణాప్ర ♦ తాపసింహుఁ
డిచటఁ గవిసింహమై పుట్టె! ♦ నిది నిజంబు!
సిద్ధముగ దొడ్డ యీరాజ ♦ శేఖరుండె!
యిపుడు డీ. రాజశేఖర ♦ మే సుమండి!
కత్తి కలమయ్యె! విశ్రాంతి ♦ గాంచి శ్రమముఁ
బాసి స్వీయచరిత్రము ♦ వ్రాసె నమఁడు!
భావపుష్టి, వచోచితి, ♦ పద్యగతుల
నితరు లేగుణముల మెత్తు ♦ రేని-నేను
మని శతవధాని పూర్వజ ♦ న్మంబులోని
చర్య మఱువని జ్ఞాపక ♦ శక్తి మెత్తు!

ప్రొద్దుటూరు.
17—12—33

ఇట్లు, మెచ్చుకొను
ఏ. కె. మునిని,

చ॥ తెనుఁగున భారతంబు మఱి ♦ దిక్కన దాఁటినమీఁద వీ ప్రతా
పుని చరితంబుఁ బోల్ రచన ♦ ముక్క నినుఁబోలిన సత్కృతీంద్రుని
గని విన దాంధ్రభూమిసుమి! ♦ గ్రంథము రెండవ భారతంబె! నీ
వు నవరతిక్క యజ్వవని ♦ పూజ్యులు వల్కుట తథ్యమే యగుఁ.

సి. సుబ్రహ్మణ్యశర్మ.

ప్రతాపునివలెనే యీకవియు వీరవ్రతుఁడేమో యనిపించునట్లు. ఎంతకాలమునుండియో అంతర్హితమైయున్న ప్రతాపవహ్ని ఒక్కమారుగాఁ బైకుబికి వచ్చినదా యన్నట్లు నడిచినది కావ్యము. ప్రతాపుని అతని ప్రతిస్పర్ధులనుగూడ సమదృష్టితోఁ గాపాడఁగలిగినది కవి మనీష. పిడికెడు మట్టిని జేకొని మేవాడవీరులు మాతృభూమిని శిరసావహించునట్లు చిత్రించిన యీకవి చాతుర్యము వర్ణనాతీతము.

18-8-34 "కృష్ణాపత్రిక"

## శ్రీ జె. టి. కృష్ణశాస్త్రిగారు,

కాంపు — బెనారసు.

సమగ్రగుణపోషణము బలముగఁ బ్రతాపసింహుని పాత్రము శ్రీరామచంద్రుని పాత్రము నన్నివిధముల మీఱుచున్నది!

పాటేశ్వరి మాటలు విను నపుడు — పాటేశ్వరీ ప్రతాపులలో నెవ్వరు వీరరసము నెక్కుడుగఁ బంచుకొనిరాయని ప్రతిసహృదయునకు శంక గలుగక మానదు. ఆమె సకల విధముల భర్తకుఁదీసి పోవునది కాదు. సాక్షాన్మహిషాసుర మర్దని. ప్రత్యక్ష రణదుర్గ. 'భార్య యెక్కుడా? భారతదేశ మెక్కుడా' యని యడిగిన ధీరహృదయ. ఈ వాక్యములో బ్రహ్మాండమంత యర్థ మిమిడి యున్నది.

భామాసాహి-శతవృద్ధ-విక్రమానలజ్వాలఁ. చలముపట్టిన—శేషాహిమూర్తి. తప్పక ప్రతాపరాణాకు గురువుగ నుండఁదగిన పోఁడ-అంతర్జ్ఞ-బ్రహ్మవేత్త.

వీరక్షాత్రముల పట్టునఁ దేజస్సింహుఁ డభిమన్యునకుఁ బైచేయి. శత్రువులపాలిటి యుగ్రనరసింహమూర్తి. యవనసేనలఁ గాఱుమ్రింగిన యమమృత్యువు.

సలుంబ్రా కృష్ణసింహుఁ డందఱిలోఁ బూర్వాభి గణ్యుఁడు. ఇట్టి సర్వోత్కృష్ట మహాపురుషమూర్తి పూర్వాధునిక కృతులలో లభించుట దుర్లభము.

ప్రతి పక్షనాయకుల గుణము లోకించుక యుపేక్షించుట మన గ్రంథకర్తల కలవాటు-అభిమానపక్ష శత్రుపక్షములందలి పాత్రముల గుణములఁ గుప్తపఱుప లేదు. లోపములఁ జూపక మానలేదు. మానసిం

పుని ధైర్యస్థైర్యములు గాంభీర్యము మాటబలమి లోనగు గుణములను న్యాయముగ నిరూపించి కవి యీపాత్రమునకు వన్నె చేకూర్చెను.

ప్రశస్తములగు జాతీయములు నసదృశములగు నలంకారములు నడుగడుగునకుఁ గానఁబడుచున్నవి - వానిలోఁ బెక్కులు క్రొత్తలు, ఈ గ్రంథమున నాశ్వాసమున కాశ్వాసమున రస మారోహణమున నున్నది. గ్రంథముఁ జదివిన నెంతటి దేశద్రోహియైనను దేశభక్తుఁడుగ మాఱకపోఁడు.

కవిలోకపూజ్యులు— చెళ్లపిళ్ల—వెంకటశాస్త్రిగారీచరిత్రమునకు విపుల సమీక్షవ్రాసి ప్రశంసించుట నిక్కముగ మహాభాగ్యము.

వీరులు దైవోపహతులై దేశత్యాగము గావింపవలసి వచ్చి నపుడు మాతృవందనముచేసి చేరెడు మట్టిని దీసికొని కనుల నద్దుకొని రుమాలునఁగట్టి శిరసావహించిన దేశభక్తుఁడొకఁడైన నింతవఱకుఁ గన బడలేదు. ఈ సంఘటనము ప్రతాపుని పాత్రమున కనన్యసాధారణ గుణగౌరవము గలిగించినది,

కవి యపారప్రతిభ యెంతవఱకైనఁగొనిపోఁజాలెను విశ్వవీరగ చూడామణియగు శ్రీరాముఁడు ప్రతాపుని మోలను రామాయణ భారతంబులీకావ్యము మ్రోలను వెనుకబడు నవవలసియున్నది. పురాణ కవితకు భారత గ్రంథముపగె నవీన దేశ చరిత్రాత్మక పద్యకవితకీ ప్రతాపచరిత్ర మార్గదర్శక మగుచున్నది. అన్నిగ్రంథము లొకెత్తు-ప్రతాపచరిత్ర మొకెత్తు—

కవిబ్రహ్మ చతుర్వేదుల అమరేశ్వరశాస్త్రిగారు

నవరసములలో శృంగార కరుణములు రెండును సమప్రాధాన్య ములని యాలంకారికు లుద్ఘోషించినను-శృంగారమే ముఖ్యతమమని కాళి దాసాదులును—కరుణమే ముఖ్యతమ మని భవభూత్యాదులు నెంత వాట కములాడినను వీరమేసర్వాతిశాయి రసమని మన రాజశేఖరులు తమ ప్రబంధమున జాటి నిర్ధరించిరి.

ఈగ్రంథముఁ జదువునపుడు మూలనున్న ముసలమ్మయు-మూఁడు కాళ్ల ముసలయ్యయుఁ బ్రళయ కాళీకాల భైరవ ప్రతాపోజ్జృంభితులు

కాకపోరు. ముఖ్యముగఁ జానే ప్రతాపదేవుఁడె కవి కావ్యము ప్రపంచించెను.

ఈగ్రంథమును బట్టిచూడ — ఋణము దీర్చుకొన నవతరించిన హరభట్టారకుఁడో - మొగలు సార్వభౌములకడ మంత్రిత్వమవలంబించిన యంకమును బరిహరించుకొన నవతరించిన పృథ్వీరాజో - తనకును దనకవితకు నమృతత్వమావహింపఁజేసికొన నాలుగు శతాబ్దములు తపస్సు చేసి సిద్ధింగని యవతరించిన యబ్దారహీమానుఁడో యైయుండవలెఁగాని కానిచో మన రాజశేఖరుల కీర్తి సర్వవిషయ సాక్షాత్కార మలవడి యుండదు

'నభవిష్యతి' యనఁబోను. కాని 'నభూతః ప్రతాప చరిత్ర ప్రతిమః ప్రబంధ'మనుటకు మాత్ర మించుకయు శంకింపను.

కవి స్సధన్యః కవిరాజశేఖరః
ప్రభు స్తతో ధన్యతరః ప్రతాపవాన్
తతోపి తద్వాగ్మయ వీర్యగర్వితో
జన శ్చిరాద్ధన్యతమో ఽయ మాంధ్రః

శా॥ రాణా స్తైతినో నేనటంచును వితర్కంబేల! కావ్యాండ ని
ర్మాణోద్దీప్తత నక్బరిందుఁడు నలుం ♦ బ్రాక్ప్రష్టుఁ డబ్దారహీ
మానుండున్ మఱి మానసింపఁ దల భా ♦ మాసాహియున్ నీవయై
రాణా మీఱితివె! యెట్లు మాఱినను మా ♦ యీ లోక బ్రహ్మస్థితిన్.

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు

రాజశేఖరముగారు తొలుత కవిగాను తరువాత శతావధానిగాను - పిమ్మట మహాకవిగాను దేశమున యశస్సు నార్జించినారు. శ్రీ కవిగారి కాంధ్రభూమి వింశత్యధిక బిరుదములనిచ్చి బ్రహ్మాండమైన గౌరవము చేసియున్నది. బహిరంగ సన్మానములే కాక ప్రతి రసిక హృదయమును రాజశేఖరముగారిని నిరంతరము గౌరవించుచున్నది. ఇతోధికాధికముగ సన్మానింపఁదగిన యోగ్యత వారి కవితలో నున్నది. ఈ గ్రంథము తరువాత నిట్టి కబ్బములు కొన్ని బయలు దేరినవి. రాజశేఖరకవిగారు మార్గదర్శకులుగాని యొకరిదారిఁబడి నడిచినవారు కారు. గ్రంథముఁ గడముట్ట

జదువుదాక నీకావ్యములో నాయకుఁడు ప్రతాపుఁడో - యక్బరో పాఠకులకుఁ దెలియదు. ఏసందర్భమునను అక్బరును దీసి కట్టుగా వర్ణింప నిచ్ఛగింపని కవిగారి యుదారహృదయమునకు మహమ్మదీయులుగూడఁ గృతజ్ఞులై యుండవలెను.

ఈనవయుగమునఁ బ్రత్యక్షప్రతాపుఁడు మనకుఁ గవిగారే! కవిగారి చరిత్రమే ప్రతాపుని చరిత్రము. అంత తాదాత్మ్యమున రచింపఁబడిన కృతి యిది. నిజముగా తానే ప్రతాపుఁడై యాయా ఘట్టములు చదివి వినిపించుచు నానందాశ్రువులు రాల్చుచుందురని కవిగారిని గూర్చి చూచినవారు చెప్పఁగా విన్నాను.

సీసములలో నొకతూరి శ్రీనాథుఁడు మఱొకసారి తిక్కన-తెలుచుగా నన్నయ ప్రత్యక్షమగుచుందురు.

చారిత్రిక కావ్యనిర్మాతలలో నీయన మొదటి వాఁడనుటలో నాక్షేప ముండఁగూడదు!

---

## శేషాద్రి రమణకవులు.

కథానాయకునకు మహోన్నత గుణములన్నియు నాపాదించుట-ప్రతినాయకునకుఁ బ్రపంచమున లేని యవగుణము లారోపించుట గ్రంథకర్తల కలవాటు. రాజశేఖరకవి తన్మయత్వమునొంది తానే ప్రతాపుఁడై-ప్రతాపుఁడే తానై కృతిక్రియ నిర్వహించెను.

రాణాప్రతాపచరిత్రమును గవి మిక్కిలి ప్రేమించును-కావుననే,

"కామేశ్వరీ మమ సుతా-ప్రతాపో మమ పుత్రకః"

యని సగర్వముగ మీసమ్ము విఱుచుకొని చెప్పినాఁడు. రాజశేఖర కవి సుప్రసిద్ధుడు. శైలి కేవలము ద్రాక్షాపాకము.

ఈకవి టాడ్ మహాశయుని చరిత్రాంశముల కమృతభిక్ష పెట్టినాఁడు. రాజశేఖరుఁడే రాణాప్రతాపుఁడు. రాణాప్రతాపుఁడే రాజశేఖరుఁడు. ఈకవి మానసింహ పాత్రము లోకోత్తరముగఁ జిత్రించినాఁడు. మానసింహుని రాయబారము భారతములోని కృష్ణ రాయబారమునకంటె విలువ గలదిగఁ జేసినాఁడు!...... కవి యీఘట్టమున తిక్కన సోమ

యాజి రచనా నైపుణ్యమునకు మెఱుగు పెట్టినాడు. మూడవ యాశ్వాసమునఁ గవి వీరరస ప్రధాన కావ్యము రచించుటలోఁ దిక్కన సోమయాజికి దీటను కీర్తిదక్కినది. మాతలంపు తిక్కన సోమయాజికిఁ బైచేయియనికూడ ననవచ్చునని యే........తన ధనమంతయు నొడ్డి మేవాడ రాజ్యము నిలుపవలెనని భామాసాహి పట్టుదల వహించెను. ఈఘట్టమున గవి చూపిన ప్రతిభకు విలువ గట్టుట సాధ్యముఁగాదు. ఇక్కడినుండి కవితకొక విధముగ మెఱుగు వచ్చినది-శాంతి పర్వములో తిక్కన సోమయాజికవిత ధార నిగ్గు దేరినది.

ప్రతాపచరిత్రమున నీరసపద్య మొక్కటేని గానరాదు. సజీవముగ గథనుఁ జిత్రించుటలో నీకవి సిద్ధహస్తుడు. ఇట్టి శక్తి యాంధ్ర వాఙ్మయమున దిక్కన సోమయాజికి పింగళిసూరకవికి మాత్రమే కలదు. రాజశేఖరకవియెడ నీకవితాశక్తి పరిణతిఁ గాంచినది. రాజశేఖరకవిది మనోహర ద్రాక్షాపాక సమలంకృతమగు పురాణశైలి. రాణాప్రతాపుడు భారతవీరులందుత్తమోత్తముడు. ఈచరిత్ర ముత్తమలక్షణ లక్షితమగు మహోద్యానము.

ఒక్కమాటలో ముగింపవలెనన్న—ఆంధ్రభాషలో నిట్టి యుత్తమ కావ్యము ఇంతవఱకు "నభూతో-నభవిష్యతి" అనిన చాలును.

---

There is hardly any epic written in recent times that can compare with Pratap. You have approached Tikkana in the execution of the work.

D. Subramanya Sarma.

భగవత్సద్భక్తులును బ్రహ్మజ్ఞులు నగు వ్యాసాదుల నాటి కవితాబీజము లింకను పొల్లుపోక దేశమునందుండుట బ్రహ్మానందము. మీ కవితాధార కవి బ్రహ్మయగు తిక్కనామాత్యు భారతకవితను దలపించుచున్నది. మీ గ్రంథము పలుతావుల నన్ను గంటనీరు పెట్టఁ జేసినది.

28—7—44. రాజా. వి. విశ్వసుందరరావు బహద్దర్.

మీ రాణా ప్రతాపచరిత్ర దేశభక్తులకు శిరోభూషణము. భారత జాతికి సంజీవి. జాతీయ పునరుజ్జీవనమున కిట్టి చరిత్రలాధారములు. ఈ చరిత్ర వ్రాసి మీరు కృతకృత్యులైతిరి....దీనివ్యాప్తికి తోడ్పడుట మావంటి వారికి విధి. చిరంతనానందస్వామి

SREE

# Rayalaseema Kala Parishat, Hindupur.

(Inaugurated 1--1--43)

RAO SAHEB
**SRI. R. RAJARAO,** B.A., B.L.,
President

**SRI Y. V. ASWATHANARAYANA** B.A.
Secretary.

**SRI. D. KRISHNAYYA, C.L.S.,**
Asst Secretary.

## Reception Cdmmittee

(First Session)

PENUKONDA'

16--12--44 to 18--12--44

*President:-*

Sri Roddam Venkoba Rao,

*Vice Presidents:-*

Sri. P. T. Krishnamacharya, B. A.,
Sri. C. Ranga Rao, B. A. L. L. B.,
Rao Saheb Sri. D. Bheemiah Setty,
Sri. Paidi Lekshmiah, B. A., B. L.,
Sri. D. Sriramulu, B. A., B. L.,
Sri. Katta Venkataseshiah.

*Joint Secretaries:-*

Sri. G. Janakiram Sarma, B.A., B. L.,
Sri. K. Hanumantha Rao, M.A., B. L.
Sri. Roddam Hanumantha Rao' B. A., B, L.,
Sri. K. Krishna Rao, B. A., B. E. D.,
Sri. V. Prahlad Rao, B. A.,
Sri. K. N. Aswathanaraniah.

# శ్రీ రాయలసీమ కళా పరిషత్, హిందూపురము.

(స్థాపితము 1—1—43)

ప్రథమ వార్షికోత్సవము 16, 17, 18 డిశంబరు 44

పెనుకొండ.

సన్మాన పత్రము

“కవి సార్వభౌమ” శ్రీ శ్రీ శ్రీ. దుర్భాక
రాజశేఖర శతావధానిగారికి.

ప్రొద్దుటూరు. [కడప జిల్లా,]

ఆర్యా!

నమస్కృతులు. తమ దర్శనభాగ్య మిదివఱకు కలుగకున్నను తమ దివ్య కవిత మా మనస్సుల గాఢముగ నాకర్షించినది.

సుకవి శేఖరా! రాజశేఖరా!

తమ విశ్వవీర, "రాణాప్రతాప" చరిత్ర, చారిత్రక ప్రబంధము లలో ప్రప్రథమ స్థానము నాక్రమించినది. అందువలన తమరు 'చారిత్రక ప్రబంధ పరమేశ్వరు' లైతిరి. ఆంధ్రలోకమునకే మార్గదర్శకులు. విశ్వకళాపరిషత్తు తమ గ్రంథముల నాదరించినది. తమ కవితకు జోహారులు! బహు కావ్యములను రచించి సత్కీర్తులను దశదిశలను వ్యాపింప జేసితిరి—చేయుచున్నారు. వీరవనితల దివ్య చరిత్రములు లోకమునకు ఆదర్శముగా నుండుటకు తమ "పద్మావతి" "వీరమతు"లే ప్రబల నిదర్శనములు. భీష్మచరిత్రమును మించిన చండనృపాల చరిత్రమును తమ రాంధ్రలోకమున కాచంద్ర తారార్కముగ నర్పించితిరి. మీకు మాధన్యవాదములు. తమరు రసవత్కావ్య నిర్మాణ చాతురీధురీణులరు! సుకవి రాజశేఖరులరు!! శతావధాని శిరోమణులరు!!! సకల సుకవి సార్వభౌములరు!!!! తమ కవితా నైపుణ్యము రాయలసీమ యందంతటను వ్యాపించినది. మా సన్మాన పత్రము నందుకొని మమ్ముల నాశీర్వదింపుడు.

స్వర్ణమయ, రత్నఖచిత, కిరీటమును, 'కవి సార్వభౌము'లకు సద్భక్తితో సమర్పించు చున్నారము. స్వీకరించి మమ్ము దీవింపుడు. పరమేశ్వరుడు తమకు, తమ కుటుంబమునకు, వంశమునకు సర్వ సౌఖ్యముల నొసంగుగాత!.

ఇట్లు విన్నవించు.
రాయలసీమ కళా పరిషత్, హిందూపురము.

నటచక్రవర్తి నాట్యకళాప్రపూర్ణ
రావుబహదూరు టి. రాఘవ, B. A., B. L.,
ప్రథమ వార్షికోత్సవాధ్యక్షులు
శ్రీ శ్రీ శ్రీ కళాప్రపూర్ణ జమంచి శేషాద్రిశర్మ,
కవి-పండిత సమావేశాధ్యక్షులు
అయ్యంకి వెంకటరమణయ్యగారు
మహాసభాధ్యక్షులు.

పెనుకొండ 17—2—44



— కవిసార్వభౌమ —

దు. రాజశేఖర శతావధాని

# వి జ్ఞ ప్తి.

రాణాప్రతాపసింహ కావ్యరచనా కాలమునందే "హృదయ దౌర్బల్యమువలన నేను జబ్బుపడి గ్రంథము ముద్రింపంగ గలుగుదునా యని సందేహించితిని. 1933 వ వత్సరాంతమున ప్రథమ ముద్రణము పూర్తి యయ్యెను. విశ్వవిద్యాలయాధికారులు ఆంధ్ర-అన్నామలై-మదరాసు-మైసూరులలో బి. ఏ. ఇంటర్ మీడియేటు పరీక్షలకుం బాఠ్యముగా నిర్ణయించి గ్రంథమును ప్రోత్సహించిరి.

1935 అంతమున ద్వితీయ ముద్రణ మయ్యెను. మావి చీకటి జిల్లాలు-గ్రంథవ్యాప్తి మందము. ఆస్థితికి నాయనారోగ్యము స్థూలకారణము.

ఈ నడుమంతరమునం గవి సమ్రాట్టులు శ్రీ చెళ్లపిళ్లవారు చిర వాత్సల్యమున నా కనుగ్రహించిన మిత్రి మందార మూర్తులు. కవిలోక కల్పకులు, శ్రీహృదయమయమూర్తులు, శ్రీ శ్రీ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి వాత్సల్యభాగ్యము నాకు లభించె. కొదువ తొలంగె. గ్రంథములు దేశదేశములకు బయలుచె.

ఆంధ్రదేశమున నుదార హృదయులు వందలు వేలుమంది గలరు. నేను స్వయముగా వెళ్లం జాలకున్నను నాయాప్తులు సభ లేర్పాటు చేసి గ్రంథముం జదివించి వారి వారికి దోంచిన బిరుదములు నాకు పాయనముగం బంపుకొనిరి. అట్టి మహనీయులలో శ్రీ జి. మాధవరావు శర్మగారు, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు, సీతారామ భట్టాచార్యులు గారు, శ్రీ శ్రీ శ్రీ కొండపల్లి గోపాలరావు బహద్దరుగారు జి. జోసఫు కవిశేఖరులును, కొందఱు.

మూఁడేండ్ల క్రితమే గ్రంథము తృతీయ ముద్రణము కావలసి యుండెను. ఎట్లో యించుక వోపిక చేసికొని మొన్న మొన్న మూఁడవ ముద్రణము నారంభించి పూర్తి చేయించితి.

ఈ ముద్రణము నెడ నాకు సాహాయ్యమొనరించిన శ్రీ. చి॥ శివారెడ్డికి—ప్రూఫులు సరిచూచి యుపకరించిన ఏ. వై. సీలయ్య, బి. ఎ., బి. టి. గారికి నా కృతజ్ఞత

నాకావ్యమున గుణమున్నదో లేదో కాని చదివి యానందించితిమని చెళ్లపిళ్లవారు 34 పుటలును, విశ్వనాథ మహాకవిచూడామణులు 16 కాలములును అవ్వారి సుబ్రహ్మణ్యకవులు 60 పుటలును శ్రీ శేషాద్రి రమణకవులు 70 పుటలును శ్రీ జె. టి. కృష్ణశాస్త్రిగారు [బెనారసు) 30 పుటలును విపులసమీక్షలు వ్రాసి ప్రకటించియు నాకుం బంపియుం బ్రోత్సహించిరి. వారి మృదు హృదయములం గొనియాడుచున్నాను.

నాయుపాస్యదేవుండు ప్రతాపసింహుని కుమారుం డమరసింహ రాణా చరిత్రము 1700 పద్యములు 11 ఆశ్వాసములు కావ్యముగా వ్రాసితినని విన్నవించుకొనుచు నింతటితో నుపరమించుచున్నాండను.

ఇట్లు,
కవిసార్వభౌమ డి. రాజశేఖర శతావధాని.



సీ॥ పుంజీభవించి యు • ప్పొంగి శైలములు శృం
గములెత్తి దివిని బా • రింగ జనిన,
రంగదుత్తుంగ త • రంగసంఘములతో
నీరధి కలఁగి ఘూ • ర్ణిల్లుచున్న,
హోమకుండముల న • హోరాత్రముల నూర్ధ్వ
శిఖల నగ్ని తపంబు • సేయుచున్నఁ,
గులశైలములు పెల్ల • గిలఁ బ్రభంజనుఁడు జృం
భించి భీకరధాటి • వీచుచున్న,
తే॥ శబ్దగుణమూర్తి నవ్యయ • సరణి నభము
విష్ణుపదమై తనర్చిన, • వీసమైన
నేజననిశక్తి మాహాత్మ్య • మెఱుఁగ; వట్టి
భవునికొమ్మను మాయమ్మఁ • బ్రస్తుతింతు!

సీ॥ ఏమహామహుఁడు సం • స్కృతపాండితిని గొప్ప
పర్వతంబని నుతుల్ • వడయఁగలిగె!
నేఘనుం డాంధ్రమం • దెల్లపండితులచే
దిగ్దంతియనుచుఁ గీ • ర్తింపఁబడెను!
నేసద్గుణార్ణవుం • డెల్లెడఁ దర్కసిం
హుఁడటంచుఁ బెనుకీర్తి • నొందఁగలిగె!
నేకళావిదుఁడు వై • యాకరణుల నిట్టి
ఘనుఁడు లేఁడనుచు వి • ఖ్యాతిఁగాంచె
తే॥ నట్టి కందాళ్లవంశ సు • ధాంబురాశి
చంద్రుఁడైన దాసాచార్య • సత్తముండు
గురుఁడు! దైవంబు! తత్పాద • సరసిజములు
స్వాంతమున నెంచువాఁడ న • పారభక్తి! 4

మ॥ తననాథుం డొనరించు సత్కృతుల కు • త్సాహమ్మునన్ దోడు సే
యనుగాంక్షించి సహస్రహస్తముల శి • ష్యశ్రేణిఁ బోషింప నే
ర్చిన మత్సద్గురుమానినీతిలక మూ • (శ్రీ) రంగనాయమ్మ మా
జననీరత్నముఁ గొల్తు నెల్లపుడు సా • ధ్వీ దిండిరాజేశిగన్. 5

ఉ॥ తన సౌజన్యము సజ్జనుల్ పొగడ ని • త్యంబుల్ సదాచారవ
ర్తన మొప్పారఁ గురుండు దైవముగు మర్ • బ్రహ్మోపదేశాది పా
వనకృత్యంబులు నాకొనర్చిన ఘనుల్ • ప్రఖ్యాతచారిత్రు మ
జ్జనకుల్ వెంకటరామయార్యు మదిలో • సద్భక్తి భావించెదన్.

తే॥ మాతృదేవోభవ యటన్న • మహితసూక్తి
మఱువరానిది! నిరతము • మజ్జననిని
దోష్ఠముత్తైదువను మన • స్తోయజమునఁ
గొలిచెదను సుబ్బమాంబ స • ద్గుణకదంబ! 7

మ॥ నను గారామునఁ జేర్చి యాంధ్రమున నో • నామాలు మెట్రిక్యులే
షనుపై నాంగ్లము నేరిపించి తనకా • సర్వస్వమర్పించి పెం
చిన కారుణ్యరసార్ద్రమానసుఁడు మా • చిన్నయ్య సంజీవరా
యని దుర్భాకకులాబ్ధిసోముని మదిన్ • ధ్యానింతు నెల్లప్పుడున్. 8

తే॥ గీ॥ భారతీనాథు నపరావ • తారములనఁ
గావ్యజగము సృష్టించి లో • కమ్ము మనుపు
నన్నయాది కవీంద్రుం • దారఁ దరుల
నాంధ్రభాషాగురుల నిత్య • మభినుతింతు! 9

తే॥ ప్రకృతితత్త్వరహస్య స • ర్వస్వ మెఱిఁగి
నవనవోన్మేషమైన ప్ర • జ్ఞదనరంగఁ
గృతులు విరచించి లోకోప • కృతులు పెంచు
నాంగ్లకవికోటి సత్యవి • ద్యార్థిగణము! 10

తే॥ నూతనోజ్జ్వలమిచ్చు ప్రా • భాత దక్షి
ణానిలము సోఁకఁగా మేడ • పైన "టాడ్డు"
ద్వార రచించు రాజస్థాన • చరిత మొత్తి
యొక్కనాఁ డేను జదువుచు • నున్నయపుడు, 11

తే॥ శతశతవధాన మహితా • స్థానదత్త
కనక జయఘంటికా సింహ • కంకణగణ
ముఖరితాశాంత సద్యశః • పూర్తి-సుకవి
సింహబిరుదుండు వెంకట • శేషశాస్త్రి. 12

క॥ చనుదెంచి నన్నుఁ గని వం
దనమని వచియించి నిలువఁ • "దమ్ముఁడ! రార"
మ్మని కౌఁగిటఁ జేరిచి చెం
తను నేఁ 'గూర్చుండు'మనన, న • తఁడు కూర్చొండెన్ 13

తే॥ స్వాంతమునఁ బొంగిపొరలెడు • హర్షభరము
వికసిత ముఖాబ్జములపైన • వెల్లివిరియ,
మాటలాడితి మలపును • మలపు లేని
కుశల సంప్రశ్నములఁ గూర్చి • కొంతసేపు! 14

చ॥ చిఱునగ వాస్యసీమ విక • సింపఁగ వెంకటశేషశాస్త్రి "సో
దర! మును నన్నయాదికవి • తల్లజు లెల్లపురాణ సంతతుల్
సరసపదార్థ భావరస • సంభృతమై తగు మంచి శైలిలో.
విరచనచేసియుండి రవి • విశ్వజగన్నుతమై తనర్చెడిన్ 15

క॥ పిదపఁ బురాణాంతర్గత
విదిత వివిధకథలఁ గొనుచుఁ • బెద్దన్నాదుల్
పదునెనిమిది వర్ణనములు
గదియించి రచించి రఖిల • కావ్యశ్రేణుల్. 16

ఉ॥ కాలము కొంత యిప్పగిదిఁ • గావ్యయుగంబుగ సాఁగెఁ; దానిలోఁ
బూలవనంబు, లధ్యమృత • పుక్సెలయేఱులు, సిగ్గుటాణిము
త్యాలబెడంగు, మేల్గొడుగు • లచ్చపు వెన్నెలసోగలో యనన్
జాలిన మేటికావ్యము ల • సంఖ్యముగా జనియించె క్రేల్మిడిన్. 17

ఉ॥ ఆవలఁ గొన్నినాళ్లరుగ • నంతటనంతట సారవంతమౌ
త్రోవలుతప్పి కాంతిచెడి • దుర్గమదుర్గములట్లు, భీకరా
శీవిషమున్న పేటికల • చెల్వునఁ, గాననరాజిమాడ్కిఁ గా
వ్యావళులున్ వికాసగుణ • మంతయుఁ గోల్పడి బీఱువోవుచున్. 18

క॥ పెక్కామడ కొక్కఁడుగా
నక్కడలిని వెలయు దీవు • లట్టులు కైతల్
చక్కఁగ లిఖించువార్గల
రిక్కాలంబునను నొక్క • రిరువురు పెద్దల్ 19

మ॥ ప్రతిభాపూజ్యులు వ్రాసిన మహా ♦ గ్రంథంబు లత్యంతపు
ణ్యాతమంబుల్ గద! వానినట్లునిచి య ♦ న్యగ్రంథముల్ చూచినన్
మితియో మేరయొ యేమనన్ వలయు! స్వా ♦ మీ! వద్దు చాల్ చాల్ సర
స్వతికిన్ వాఁతలు పెట్టినట్లలరెఁ బా ♦ పం శాంత మిప్పట్టునన్ 20

చ॥ యతులు వనాళి, ప్రాసములు ♦ నాయుధశాలల, లక్షణంబు ల
శ్వశతి, రసంబు వైద్యుకడ, ♦ పాకము వంటలలోన, నయ్యలం
కృతులు వసంతులందు, మఱి ♦ రీతులు రోఁతల, శయ్య మేడ, ని
ట్లతికిన కావ్యముల్ గనిన ♦ నయ్యొ! మొదల్ దహించినట్లగున్. 21

శా॥ ఉపన్యాసము లెన్నియేని గలవా ♦ యీయంశముల్ గొంతమే
ల్తైవర్తించు! ముసళ్లపండువది ముం ♦ దైయున్నదన్నాడికిన్ జె
ప్ప్వ విశ్వం బగలించుచున్నయది యా ♦ హా! గ్రాంథికగ్రామ్య భా
షావాదంబు క్షణక్షణంబునకు హె ♦ చ్చన్ జొచ్చె నీవేళలో! 22

తే॥ దేశమంతటఁ బ్రాఁకిన ♦ దీమతల్లి
నంటినట్టి వ్యావహారిక ♦ భాష! దాని
నచ్చటచ్చట దేశంబు ♦ నలముకొనిన
మంచియును జెడ్డయును నా ♦ శ్రయించి యుండు! 23

ఉ॥ ఊరక భాష కేమిటికి ♦ నుత్తమయోగ్యత గల్గు? దానసం
స్కారబలంబుగల్గి యది ♦ సారముగల్గిన ప్రాజ్ఞకోటి భా
షారచనంబుఁ బూసి కృషి ♦ సల్పినఁ గల్గెడి! రిక్తుఁ బూసినన్
భాసము ముట్టునే! గజము ♦ పైఁ జనురోలు ఖరంబు మోచునే! 24

తే॥ గ్రామ్యతెనుఁగను భాస లోనయి
యునుముని బుధకోటులెల్ల ♦ 'సేవనికి వారే
యమునాస్తి నే' యను నీతి
భ్రమగొని వెసలకును విఱిగి ♦ పాఱుదు రోకటన్. 25

ఉ॥ భావకవిత్వవైఖరి కిఁ ♦ భంగముగుఁ! భావము లేని కత మాం
ధ్రావని గాది కేయువని ♦ నైనను గల్గదు! కల్గనేని యా
ప్రోవు కవిత్వమంచు బుధ ♦ పుంగవు లెంతురె! యేటిమాటలో!
భావ మభావమౌ కవిత ♦ ప్రాణముపోయిన బొందిగాదొకో! 26

ఉ॥ పేరెదియైననేమి! మఱి ♦ పేరున యోగ్యతవచ్చునే! రసం
బూరెడునట్టి కైతమది ♦ యుత్తము! మన్య మయోగ్య! మెల్లెడన్
సౌరభపూరముల్ దెసలఁ ♦ జల్లుచునుండెడు మల్లెపూవు నే
పేరునఁ బిల్చినన్ గుణము ♦ వీసము హెచ్చునో! లేక తగ్గునో! 27

తే॥ అలరుఁదేనెల మఱపించు ♦ పలుకుఁబొందు—
పలుకుఁబొందున కుచితమౌ ♦ భావపుష్టి—
భావపుష్టికిఁ దగు రస ♦ వైభవంబుఁ—
గూర్చు ధన్యుండెపో కవి ♦ కుంజరుండు! 27

చ॥ పరువడిఁ బద్యకావ్యములు ♦ వ్రాయుట మోటదనంబటంట! నా
గరకత కెంతొ లోపమట! ♦ గద్యము గేయము సద్రసోత్తర
స్ఫురణముఁ జూపునంట! మఱిఁ ♦ బాత్రము పెద్దదిగాఁగ నుండినన్
బరువట! చిన్నపాత్రములు ♦ నాణెముఁ గూర్చునటంట! వింటిరే! 26

సీ॥ భాషామహాదేవి ♦ వాహ్యాళి సంచరించు
మానితనందనో ♦ ద్యానచయము!
సాహిత్యలక్ష్మి వి ♦ శ్రాంతి కేర్పరచిన
నాటకవివిధసౌ ♦ ధాగ్రతతులు!
బహుళవిద్యాధన ♦ ప్రకరంబునింప దీ
పించు భాండాగార ♦ సంచయములు!
బాగోగు బోధించి ♦ ప్రజ నుద్ధరించెడు
విజ్ఞాన సర్వస్వ ♦ వేశ్మవితతి!
తే॥ పద్యకావ్యసమూహసౌ ♦ భాగ్యగరిమ
మిట్టిదని వివరింపఁగా ♦ నెవరి తరము!
లోకకల్యాణవిజయ సు ♦ శ్రీక దివ్య
పారిజాత ప్రసూనైక ♦ హారసమితి! 30

తే॥ నేఁటిసారస్వత స్థితి ♦ నెగడు నిట్లు!
మాటవరుస కంటినిగాక! ♦ మనకు నేల
దానిఁ జర్చింప"ననుచు మం ♦ దస్మితంబుఁ
గొలుపు నాతనివదన మేఁ ♦ గలయఁజూచి, 31

క॥ ఇదియెంతగఁ జెప్పిన సు
న్నది! ప్రకృతము ననుసరింత! ♦ మన్మన్మనముం
దుదయించినట్టి కోరిక
నిదె తెలిపెద! నాలకింపు ♦ మీ శ్రద్ధమెయిన్. 39

తే॥ సప్తసంతానములఁ బ్రశ ♦ స్తమాయి ఖిలము
గాని దొకకృతియన్న స ♦ త్కవులమాట!
కలికి పదియారువన్నె బం ♦ గారుమాట!
రమ్యతరమైన రతనాల ♦ రాచబాట! 40

సీ॥ జ్ఞానంబునకు మూల ♦ సారమౌ నాత్మకా
వ్యకవిత్వమని వర్డ్సు ♦ వర్త నుడివె!
సత్యంబునకు సౌఖ్య ♦ సంగంబు చేకూర్పఁ
జాలిన కళయంచు ♦ 'జాన్స'నడివె!
నతులసంగీత ర ♦ సాత్మకంబయిన భా
వాలాపమనుచుఁ 'గా ♦ ర్లైలు' తెలిపెఁ!
బ్రతిభావిలాసంబు ♦ వాక్యదేహమ్ముఁ దా
ల్చిన రూపమనుచు 'షె ♦ ల్లీ'వచించె!
తే॥ హడ్సనాదిగ నెందఱో ♦ యాంగ్లకవులు
పద్యకవితకుఁగల గౌర ♦ వప్రశస్తి
యట్టి దిట్టి దనంగ రా ♦ దని సహస్ర
ముఖముల నుతింప విననొకో ♦ పూర్వమందు! 41

తే॥ దేశభక్తియుతంబు నీ ♦ తిప్రబోధ
కంబు లోకోత్తరము పద్య ♦ కావ్యమొకఁడు
సరసజనములు మెచ్చ, ర ♦ సంబు హెచ్చ
సృష్టిసేయంగ నిపుడు యో ♦ జించుచుంటి! 42

క॥ విరచించు నెడలఁ గల్పన
బెరయిక యును నతిశయోక్తి ♦ పెంపొందక యున్
జరిగినది జరిగినట్టులు
మెఱయుటచే దేశచరిత ♦ మెప్పు వహించున్. 43

పాశ్చాత్యుఁడైన నె • వ్వటికి టాడ్దొర రాజ
పుత్రుఁడే యనుచు స • మ్మోదమంది!
రతఁడును రాజపు • త్రావనికొఱకుఁ బ్రా
ణములైన నిచ్చు చం • దమున మెలఁగె!
తే॥ నామహాత్ముండు వ్రాయు గ్రం • థంబునందు
వీరరస తరంగములతో • క్షీరజలధి
కరణి మాధుర్యములు పెంచు • చరిత లెన్నొ
కలవు! కలవారి యిండ్ల బం • గారమట్లు! 48

శా॥ ఆకర్ణద్వయ పావనంబగు చరి • త్రాంశంబులం దెల్లఁ గ
న్నాకై. దివ్యరసాల వాలమయి వి • శ్వాతీత తేజోయుతం
బై కన్పట్టెడి నా ప్రతాపుచరితం! • బద్దాని నే గోస్తని
పాకంబొప్పఁగ నొక్కదొడ్డ కృతిగా • వ్రాయన్ బ్రయత్నించెదన్" 49

మ॥ అన, "మీమాటలు వేదవాక్యము లవ • శ్యం బిప్డు రాణాప్రతా
పుని కీర్తింపఁడతండు ఏ రజనతా • పూర్వాభిగణ్యుండు! క
మ్మని మీ కైతకు నమ్మహాప్రభుని ధ • ర్మశ్రీ రతుల్ హాటకం
బునకున్ సౌరభపూరముల్ గలుపు సొం • పున్ గాంచి వాసిం గనున్" 50

క॥ అని, ప్రోత్సహించు మతి నని
యెను వెంకటశేషశాస్త్రి! • యేనంత బ్రతా
పుని చరిత కావ్యరూపము
గను వెలయింపంగ వ్రాయఁ • గా నొడబడితిన్. 51

క॥ ఉత్తమ మితివృత్తము! సము
దాత్తము చిత్తూరుపురి! ప్ర • తాపుఁడు ధీరో
దాత్తుఁడు! కైతము మెత్తన!
దిత్తఱి మెత్తురని తలఁతు • నెల్ల బుధేంద్రుల్! 52

శా॥ నా ధారాళకవిత్వమందుఁ గల వి • న్నాణంబు లట్లుండ, నీ
గాథల్ కర్ణయుగంబుఁ బట్టుకొని యా • కర్షించు లోకంబు! వి
ద్యాధుర్యుల్ విని చిట్టిబుస్సనక యా • హ్లాదింత్రు! విశ్వైక కీ
ర్త్యాధారంబులు రాజపుత్రనృపశౌ • ర్యావార్య హేలాకళల్. 53

శా॥ ఈపొత్తంబున పించుకేనియు గుణం ◆ బెందేని పెంపొంద శ్లా
ఘాపీఠంబది 'జేమ్సు ప్రాష్టు'దని లో ◆ కంబెంచి హర్షించుఁగా!
కేవస్సైన వికాస మూఁడి రసమెం ◆ తేఁ దక్కువై యున్న నా
లోపం దప్పంతయు నాదిగా దలఁపఁ గే ◆ లున్ మోడ్చి ప్రార్థించెదన్ 54

మ॥ వినమే మున్ను ప్రతాపునంతటి మహా ◆ వీరుండు లోకమ్మునన్
గనుపింపం డసి పూజ్యులెల్లఁ బలుకం ◆ గా! నట్టి రాణాప్రతా
పుని గీర్తించెడుపట్ల నెట్లు కవనం ◆ బున్ సాఁగఁగాఁ జేతువో
నిను సేవింతు విరించిరాణి! సుమహా ◆ ణీ! వాణి! నన్నోమునీ! 55

సీ॥ రచియించియుంటి సా ◆ రమతీ చరిత్రంబుఁ
దిరుపతి వెంకటే ◆ శ్వరులు మెచ్చఁ!
గృతి మొనర్చితిఁ జంద ◆ నృపమాళికన్ దేశ
చరితముల్ శోధించి ◆ సరసు లలరఁ!
దగఁ గూర్చియుంటిఁ బ ◆ ద్మావతీ విజయంబు
వీరంబు హాస్యంబు ◆ వెల్లివిరియ!
వ్రాసియుంటి సమగ్ర ◆ రామాయణము నాట
కములుగా విబుధ లో ◆ కంబు పొగడ?
తే॥ ఇన్ని యొకయెత్తు! మఱి ప్రతా ◆ పేంద్రుచరిత
మొక్కయెత్తు! సుధారసం ◆ బొలుకుచుండు
నొక్కచూ పెక్కుడుగఁ జూచి ◆ యుద్ధరింపు
శైలరాజేంద్రకన్య! సా ◆ జన్య ధన్య! 56

మ॥ జననం బందినదాది నేఁడు నెలల ◆ స్వగ్గేహసీమన్ వినూ
తన కళ్యాణ దరస్మిత ప్రభలు ని ◆ త్యంబున్ బ్రసారించి దే
వని సాన్నిధ్యముఁ జేరఁగాఁ జనిన నా ◆ పుత్రుండు కామేశ్వర
య్యను సుప్రాణసమాను నేఁ దలఁతు లో ◆ కాస్త్రాది సద్విగ్రహున్ 57

చ॥ కుదురగు పేరిమ నొక్కలత ◆ కూనను గాంచితిఁ జైత్రవేళ! న
య్యది తొడిగెన్ హొయల్ గులుకు ◆ నర్మిలి మొగ్గను! దానిఁ గాంచి నా
మొద మొలిచెన్ మనోరథము ◆ లెన్నియొ! గాలికినూఁడి దేవి శ్రీ
పదములరాలె మొగ్గ! యది ◆ వంధ్యమొ! తజ్జని ధన్య మాటచే! 58

ఆ॥ పూర్ణచంద్రమూర్తి • పుత్రుఁ డుద్భవమొంద
నమరు లయిన వలవ • దనరు సరియె!
యిచ్చినట్టి దేవుఁ • డెత్తికొంపోయినఁ
బొగులనేల? వగపు • మిగులనేల! 59

తే॥ అవగుణంబులు మిగుల మా • యంగఁ జేసి
సుగుణములను వేయింత లె • చ్చగను జేసి
ప్రణయరతులైన నరుల దే • వతలఁ జేతు!
ప్రేవిమోగము! నీవృత్త • ముత్తమంబు! 60

మ॥ జననీ!నీవు దయాసముద్రమవు! యు • ష్మద్భక్తు నేవేళలం
దున నేరీతిని గష్టసౌఖ్యముల యం • దుఁ దేల్ప గానుందు!వా
పనులన్ నీవయి తీర్పఁగా ననుభవిం • పన్ వంతగున్ గాక! వ
ల్దన నేనెంతటివాఁడ! నా కెపుడు నీ • యాజ్ఞల్ శిరోధార్యముల్! 61

సీ॥ స్థిరమగువానిలో • స్థిరతమంబగు చోటఁ!
జిరపుణ్యరతులు వ • సించు చోట!
నాశ మెప్పుడును గ • నంగఁబోవని చోటఁ!
నానందనిలయమై • యలరు చోట!
వ్యాధులించుకయును • బాధ సేయని చోట!
సత్యంబు స్థాయిగా • జరుగు చోటఁ!
కైవల్యలక్ష్మికిఁ • గాపురంబగు చోటఁ!
జిత్తంబునకు శాంతి • చెడని చోట!

తే॥ ప్రేమ యమృతరూపమున వ • ర్షించుచోట
నామణిద్వీప రత్నసిం • హాసనమున
శ్రీభవానీ పదంబుఁ జే • రితివి! కాన
నేల నీకయి వగవఁ గా • మేశ్వరయ్య! 62

తే॥ జర నములుచున్న యస్థిపం • జరము నాది!
యింక సుఖమొందఁగల యాస • లెందు లేవు!
మధుర దరహాస వదన ప • ద్మంబు నీది!
మఱచి పోవుద మన్నను • మఱపు రాదు! 63

సీ॥ కలశపాథోరాశి • గర్భమందు జనించు
నలల బంగారు టు • య్యాలలందు!
నలచతుర్దశలోక • ములను బావనమాచుఁ
దనరు మణిద్వీప • తటములందు!
గొజుగులు వంచి న • ట్లడరు కదంబ వృ
క్షవితాన శీతల • చ్ఛాయలందు!
శ్రీలఁ జెన్నారెడు • చింతామణీ భద్ర
సింహాసనము పార్శ్వ • సీమలందుఁ!
ఆ॥ బాలకదలి చలువ • దేలు తెమ్మెరలందు!
నీడలేని పసిఁడి • మేడలందు!
గౌరి లోకజనని • కామేశ్వరస్వామిఁ
దిప్పి కూర్మి నాద • రించుఁ గాక! 64

క॥ ఈమహనీయ గ్రంథముఁ
గైమోడ్చుచు నంకితమ్ము • గానిచ్చెద నే
బ్రేమఁ జెనుపనోచని నా
కామేశ్వరు నెత్తి పెంచు • కామేశ్వరికిన్. 65





స్థిమితమై కుదల విచ్చి యుదాగ గంభీరకాంతు లీను వెడందకనులతోఁ
బగువంపు బుగ్గలపైన గిర్కొనుమీసల వెలుంగు మోము వాలకముతోఁ
వీరమహాలక్ష్మి విహరించు దుర్గమై విరిసిన బలితంపు టురముతోఁ
దలగొత్తు వాఁడికుంతముఁ గేలనాఁది ధీరత యుట్టిపడ నిల్చు రాణతోఁ
నొదలఁ దురాయి, వీర తేజోగురీత్య-వదనమునఁ గుంకుమాంకము, వజ్రవర్మ
మొసల వెలుఁగొంద నలరునీమూర్తిఁ గంటి! యెంత కళగలతండ్రివోయీ ప్రతాప!

శ్రీ

కామేశ్వర్యై నమః.

# రాణాప్రతాపసింహచరిత్ర.

## ప్రథమాశ్వాసము.

శ్రీమత్కందుకమట్లు గుండ్రమయి వా • రిన్ రెండువైపు లొక్కపా
ల్పాథిన్ జెందియు నూఱునర్వదియుఁ గో • ట్లున్ మర్త్యు లొప్పారఁగా
వ్యోమంబంటు నగాధిరాజ నివహం • బుల్ మీఱఁ విశ్వంబు శో
భామూల్యస్థితినొప్పు నీశ్వరు ననం • తైశ్వర్యముల్ చాటుచున్! 1

సీ॥ కాంచన శృంగభా • గము కిరీటము గాఁగ!
గాశ్మీర మూర్ధస్థపం • కజముగాఁగ!
సింధు గంగానదుల్ • చేఁదోయి గాఁగ! నా
ర్యావర్త దేశంబు • రంబుగాఁగ!
వింధ్యాచలేంద్రంబు • బెడఁగు మధ్యము గాఁగ!
గౌతమి కనక మే • ఖలయుఁగాఁగ!
మలయ సహ్యాద్రు ల • [illegible]లు గాఁగ! సింహళ
ద్వీప మంభోరుహ • పీఠి గాఁగ!

గీ॥ లవణ రత్నాకరము సరః • ప్రవర మగుచుఁ
జెలఁగు భారత దేశ ల • క్ష్మీ సమగ్ర
భాగ్య సౌభాగ్య వైభవ • ప్రాభవమ్ము
లెట్టివని వివరింపఁగా • నెవరి తరము!

శా॥ జానొందన్ బహుళాంబు పూరము వనా • శాశంబళల్ నింప స
స్యానీకంబు సమృద్ధమై యెదిగి భా • గ్యస్ఫూర్తి హెచ్చింప, ల
క్ష్మీనిత్యోత్సవ మందిరంబయి తన • ర్చెన్ విశ్వసర్వోన్నత
స్థానంబంది సమస్త వైఖరుల రా • జస్థాన మవ్వేళలో!

సీ॥ ఇట్టిరాజస్థాన • మెపుడు స్వతంత్రులౌ
జనపాలమణుల పా • లనమునొందు
దేశంబు లిరువది • దీపింప వెలుగొందు!
వానిలో నెల్ల మే • వాడదేశ
మగ్రగణ్యము; దాని • యధిపతియగు వాని
'రాణా'యని జనులు • ప్రస్తుతింతు!
గతఁడు మతాధిప • త్యమున నెల్లరకు జ
గద్గురుండగుచు వి • ఖ్యాతిఁగాంచు!

గీ॥ నగరములలోనఁ గాశికా • నగరమట్లు
చిరయశముఁగాంచుఁ జిత్తూరు • పురవరంబు;
నచటి రాణాయు నందఱ • నగ్రపూజ్యుఁ
డెల్ల సురలందుఁగాశి వి • శ్వేశుమాడ్కి!

సీ॥ హారావళీ పర్వ • తావళి విరివిగా
నింద్రనీల శిలలు • నిచ్చుచుండు!
సాంబారు లూనీ వి • శాల ప్రదేశముల్
సహజమౌ లవణంబు • సంగుచుండు!
గను లెల్లెడల మర • కతములు రత్నముల్
సౌవీరమును మంచి • స్ఫటికములును
జంద్రకాంత శిలల • స్వర్ణరౌప్యంబులు
నెడతెగకయె యెప్పు • డిచ్చుచుండు?

గీ॥ భాగ్యము లొసంగి యేలిన • వారియుండ్లు
బంగరుంగొండలట్లు చే • యంగఁగలిగి
'రత్నగర్భ' యటన్న సా • ర్థకపదంబుఁ
బడసి మేవాడ దేశంబు • పరిఢవిల్లె!

# ప్రథమాశ్వాసము.

శా॥ ఆవిర్భూతోన్నత పుణ్యవైభవ యశో • హారాళి హారావళీ
గ్రామోత్తంసము తూర్పునన్ సరసిజా • రామంబునన్ బోల్చు ల
క్ష్మీవామర్ణ బలె రాజధానియగుచున్ • జిత్తూర్పురం బొప్పఁగా
మేవాడ్దేశము వీరఖండ మగుచున్ • మించున్ ధరాస్వర్గమై!

సీ॥ సచరాచరపవిత్రం • సత్ప్రాణమగు సూర్య
భగవానుఁడాదిమ • వంశకర్త!
త్రిజగధానుష్క • దీపకుండైనరా
ముని సుతుఁడు లవుండు • మూలపురుషుఁ!
ఫలయగస్వాశ్రిమ • ఖ్యాత మాంబూగిరి
నేకలింగేశ్వరుం • డిష్టదైవ!
నతి పావనము లయో • ధ్యా వల్లభీపుర
లాదికాలము నాఁటి • యాటపట్లు!

గీ॥ లా శిలాదిత్య కనకసే • నాది రాజ
రాజపరమేశ రణ విహా • రప్రతిష్ఠ
ఖండఖండాంత నగర వి • ఖ్యాతి హేతు!
వట్టి మేవాడ్నృపుల నెన్న • నలవి యగునె!

మ॥ సమమై యొప్పు విశాలశైల శిఖర • స్థానంబునన్ రాజపు
త్రమహీకాంతకు వజ్రభూషణమటుల్ • రాణించు చిత్తూరుసం
ద్రము మధ్యంబునఁ గోటలేడు కొమరొం • దన్ బైకిఁ గన్పట్టు దు
ర్గము లంకాపుర పూర్వవైభవము జో • కల్ జిత్రికిన్ దెచ్చుచున్

గీ॥ ప్రక్కప్రక్కనఁ బదిబండ్లు • వరుసగాఁగ
నరుగ ననువైన వైశాల్య • మతిశయిలఁగ
సహితత్నదుర్భేదమగు గోడ • లలరు కోట
లేడుచుట్లు చిత్తూర్పురి • కెనఁగియుండు!

సీ॥ విపణిమార్గములతో • వీథుల తుదినొప్పు
శివకేశవాలయ • శ్రేణితోడ!
నారామముల తోడ • నపరంజి తాఁపిన
సముదారభవనాంగ • ణముల తోడఁ!

చతురంగముల తోడ • నతి విశాలంబైన
వివిధాయుధాగార • వితతి తోడ!
మణివితర్దికలతో • మధుర నానాజాతి
ఫలమహీరుహ కదం • బకము తోడ!
గీ॥ సౌధములతోడ, బహుసర • స్సమితి తోడ!
రచ్చగమితోడ వారి యం • త్రముల తోడ!
భరత ఖండైక లక్ష్మీని • వాస భూమి!
నగరమాత్రింబె చిత్తూరు • నగర వరము!

మ॥ వనితాశీలము నిల్ప శత్రువుల ద్రుం • పన్ నేఁడు చిత్తూరు ద
ప్పిన నీలోకము శూన్యమంచుఁ గరముల్ • వేయెత్తి ఘోషించెనో
యన సూర్య ధ్వజకోటు లెల్లెడ సహ • స్రాంశుల్ పిసాళించి న
ర్తన మాడున్ మృదులానిలంబు తమ మీఁ • దన్ సోఁక హేలాగతిన్. 11

సీ॥ నవ్వనేర్చక మున్నె • క్రొవ్విన రిపుకోటిఁ
బాఱంగఁదోలి న • వ్వంగ నేర్చిరి!
కూర్చుండుటకు మున్నె • క్రోధోగ్రశత్రు వ
క్షోదేశ మెక్కి కూ • ర్చుండ నేర్చిరి!
నడువక మున్నె చం • డ విపక్షమకుట సం
తతులఁ బాదము లుంచి • నడువ నేర్చిరి!
పరువులెత్తక మున్నె • పరిపంథి తతి నొంచి
తఱుముచు వెనువెంటఁ • బరువ నేర్చు!
గీ॥ ఆడుటకు మున్నె ఘోర ర • ణాంగణముల
నరశిరంబులతోఁ బంతు • లాడ నేర్చు!
ఔర! చిత్తూర్పురి జనించి • నట్టి వారు
శైశవము దాఁటుటకు మున్నె • శౌర్య మహిమ! 12

శా॥ ఇంద్రప్రస్థముగాదు! ద్వారకయుఁ గా • దే కాశియున్ గాదు! ని
స్తంద్ర ప్రాభవ కీర్తి శోభిత మయో • ధ్యా పట్టణంబేని గా!
దింద్రోపేంద్ర సమానులౌ నృపులు తా • మేలంగఁ జిత్తూర్మహా
సాంద్రశ్రీలను గత్తమున్ గొనిన యా • చందంబు దీపించెడున్. 13

సీ॥ హారితమునీంద్రు పా • దాబ్జాత యుగళికి
శిష్యుఁడై శుశ్రూష • చేయఁగలిగె!
వ్యాఘ్రశైలంబు తా • పసు కూర్మిఁగని దివ్యధా
రా ఖడ్గమును బొంది • రాణ మెఱసెఁ?
అరివరుల గెలిచి 'భా • రత సూర్యుఁ'డని 'విశ్వ
పతి'యని బిరుదముల్ • వడయఁగలిగె!
ఖాండహా రిస్పహాన్ • కాఫరి స్థానాది
యవనసీమలు గెల్చి • యశముఁ గాంచె!
గీ॥ వందలకుఁ బైనఁ బుత్రులఁ • బడసి సూర్య
వంశమును నిల్పి సౌపర్వ • పర్వతమునఁ
దపముఁ గావించి ముక్తి కాం • తను వరించె!
బప్పరావు మేవాడ్భూప • వంశకర్త! 14

— ॥ భరతఖండముపై యవనుల దండయాత్రలు. ॥ —

సీ॥ తమ యుపనదుల సం • తతులెల్ల వెండి రే
కులువోలె నెల్లెడ • నలముకొనఁగ
జహ్నుకన్యాసింధు • సలిలపూరమ్ములు
సారతఁ గూర్పఁ బం • గారు పండు
రసఖండమై పచ్చ • రా బయలులమాడ్కి
లలిత సస్యశ్యామ • లంబునగుచుఁ
బిడికెడు చోటైన • వెలిఁబోవనట్టి యా
ర్యావర్త బహుళభా • గ్యాంక కథలఁ
గీ॥ చెవులు చిల్లువోఁ బార • సీక యవన
ఖాండహా రిస్పహాను బా • గ్దాదు మొగలు
గజ్నిపతులు మిడుతదండు • క్రమ్మినట్లు
దాడి వెడలిరి తండోప • తండములుగ! 15

గీ॥ ఎనిమిదవ శతాబ్దారంభ • మునఁ గలీఫు
'వాలిదు' తొలుత ఖాసిముఁ • బంపెఁ; నతఁడు
సింధుదేశమ్ము దాటి కా • శీపురంబు
వఱకుఁ గలసీమ లన్నియుఁ • బాడుచేసె! 16

మ॥ ఒక బాగ్దాదు నరేంద్రచంద్రుఁడు కలీఫ్ ♦ 'ఓమా'రబుల్ హాసు సే
నకధీశుఁ బొనరించి హైందవముపై ♦ నఁ బంపఁగా దూరమెం
చక యే యామడయడ్డుగా నడిచి రా ♦ జస్థానముఁ జేరి భూ
ప కులారణ్యములఁ దహించె నతఁడుఁ ♦ వైశ్వానర ప్రాయుఁడై. 17

మ॥ ప్రళయాంభోధరపంక్తి చందమున గ ♦ ర్జల్ సేసి తత్సైన్యముల్
దళమై యాయజమీరుపై నడిచె; దూ ♦ లారావు తౌరుష్కయో
ధులు మూన్నాళ్లు బడల్ పడఁ మెలఁగి శ్రాం ♦ తుండై యబుల్ హాసు ను
జ్జ్వలహేతి ప్రహతిఁ దెగఁ రిపుజనో ♦ త్సాహంబు రెట్టింపఁగఁ. 18

సీ॥ తత్పరిసర సైక ♦ తస్థలిపైఁ బోడి
బాలురతో నంత ♦ వఱకు నాడు
కొనెడు దూలారావు ♦ కొమరుఁ డేడేండ్లలా
టుఁడు తండ్రియు శిరంబు ♦ ద్రుల్లి ధాత్రిఁ
బడుటఁ గన్గొని రక్త ♦ ముడుకెత్తి చేరువ
భటుచేతఁ గల పెద్ద ♦ బారుటీటె
గొంజుకొం చరిగి చెం ♦ గున దాట్లిడుచు నబుల్
హాసు గుండియ లవి ♦ యంగఁ దాఁకె!
గీ॥ నిరువురును బోరి రొండొరు ♦ నిచ్చమెచ్చ!
కంత లాటుఁ డరిఁ గూల్చి ♦ యతని వెంట
నరిగె దివికి హితాహితు ♦ లంద "శ్రీశఁ
డౌర! యభిమన్యుపై ♦ చేయి" యని నుతింప! 19

సీ॥ లాటుఁ డుత్తమ గుణా ♦ లయుఁ డమానుష వీర
పురుషమూర్తి యని యా ♦ దఱకుఁ దోఁచెఁ!
జోహాను లాబాల ♦ శూరుని విగ్రహం
బులు రచింపించి దే ♦ వుని విధానఁ
బ్రతివత్సరము భక్తి ♦ వఱల జ్యేష్ఠబాహ్వద
శీ దినమందుఁ బూ ♦ జించుచుందు!
రాలాటు డనిచేయు ♦ నపుడున్న కాలి గ
జ్జెల నెల్ల జనులు ద ♦ ర్శించి పోదు!

—॥ గజినీ మహమ్మదు దండయాత్ర. ॥—

ఆ॥ వె॥ రాదినంబు నుండి ♦ యీదినంబునకుఁ జో
హాణ కులంబు వార ♦ లాత్మజులకుఁ
గాలి గజ్జియలను ♦ గట్టరు! లాటుసి
యెడల వారి భక్తి ♦ యెట్టి దొక్కొ!

సీ॥ భాగ్య సౌభాగ్య సం ♦ భావ్యముల్ సింధు ఘూ
ర్జర దేశములను వ ♦ ర్తకముఁబెంప
'టైగ్రిస్' నదీ కృపీ ♦ ట పవిత్రమైన య
రాబియా పాలించు ♦ రాజలోక
మణి, కలీఫ్ ఉస్మాను, ♦ మతి కలీఫ్, అలి; యే
జీదు ఖొరాసా ను ♦ క్షితిపవాళి,
యబ్దుల్ మలీకు సై ♦ న్య సముద్రములను బొం
గించి హైందవమును ♦ ముంచి తేల్చె!

గీ॥ రటుపయిసి హారూన్ ఆల్రాశ్చి ♦ దను కలీఫ్ అ
రాబియా మొదల్ కాశి ప ♦ ర్యంత మేలె!
నవ్వల సెబాక్టజీన్ వచ్చె! ♦ నతఁడు ప్రళయ
భైరవుని మహమ్మదుఁ దెచ్చె ♦ వానికొడుకు! 21

మ॥ తడ వింతేనియు లేక వీరభట సం ♦ తానంబు తన్గొల్చి వెం
బడిరా సింధునదిన్ దరించుచు మహ ♦ మ్మద్ గజ్ని గజ్నీవిభుం
డడవుల్ గాల్చుచు భస్మముల్ సలుపుచా ♦ హాగ్నిన్ బలెన్ బొంగుచున్
దఁడిచెన్ భారత దేశ పట్టణము లం ♦ దున్ గల్గు సర్వస్వముల్! 22

మ॥ కడుసౌభాగ్యము గల్గు రాష్ట్రముల వం ♦ కన్ గుంత కన్నెత్తిచూ
డఁడు! బంగారము పండు నేలలను జూ ♦ డం! డట్టె వేర్వాసిఁ గాం
చెడు దేవాలయ లింగముల్ పెటికి గ ♦ జ్నీ సౌధ సుదోహ మె
క్కెడు సోపాన చయంబుఁ జేసె విహితుల్ ♦ కీర్తింప వేభంగులన్. 23

మ॥ అనయోత్సాహముతో మహమ్మదు చలం ♦ బారంగ సౌరాష్ట్రమం
దున విచ్ఛేయుచు సోమనాథపుర మం ♦ దున్ సోమనాథేశ్వరా

ది నిలింప ప్రకర ప్రపూజ్యమగు ♦ జ్యోతిర్లింగ సంఘాతముల్
దునియల్ చేయుచు ద్రవ్యరాసులను దొం ♦ తుల్ దొంతులుల్ జేకొనెన్. 24

సీ॥ భువన వీరసమూహ ♦ మున మేటి యితఁడంచు
యశ మొందఁగనిన మ ♦ హాభుజుండు!
కొండపల్లెను మార్చి ♦ గొప్ప సామ్రాజ్య సం
స్థగఁ జేయు రాజతం ♦ త్రజ్ఞమౌళి!
కన్న కొడుకునైనఁ ♦ గడికండలుగఁ జీల్చి
ధర్మంబు నిలుపు ను ♦ దారబుద్ధి!
విశ్వకళాశాల ♦ వెలయించి దేశదే
శముల విద్యను నించు ♦ జ్ఞానమూర్తి!
గీ॥ కవుల పాలిటి ముంగిటి ♦ కల్పకంబు
విగ్రహారాధనము పైన ♦ వెగటు వలన
గజిని మహమదు దండెత్తెఁ ♦ గాక యున్న
నంతవాఁడెట్లు జనహింస ♦ కనుమతించు! 25

గీ॥ ఇటులు పండ్రెండు మార్లు దం ♦ డెత్తి వచ్చి
ధన కనక వస్తుతతిఁ గొని ♦ చనుట కాని
భరతఖండంబు శాశ్వత ♦ వాసముగను
జేయఁదలఁపక నిజసీమఁ ♦ జేరుకొనియె! 26

—॥ ఘోరీ మహమ్మదు యాత్రలు. ॥—

ఉ॥ ఆకడగండ్లు వాసి, భర ♦ తావని కొంతకుఁ గొంత కోల్కొనన్
బోకయమున్నె వేఁబూర్క రి ♦ పుండు మహమ్మదు పేరివాఁడు ఘో
రీకులుఁ డాత్మవాహినులు ♦ క్రిక్కిరియంగను గోరుచుట్టుపై
రోఁకటిపోటునా బ్రళయ ♦ రుద్రుని కైవడి వచ్చె నుద్ధతిన్. 27
శా॥ ఆకాలమ్మున సార్వభౌముఁడయి యా ♦ ర్యావర్తముల్ బృథ్విరా
జేకచ్ఛత్రముగాఁగ నేలె! నతఁడ ♦ య్యింద్రాత్మజున్ బోలె సు
శ్రీ కల్యాణ పరాక్రమోన్నతుఁడు ఘో ♦ రీవంశజుల్ దాఁకి చీ
కాకై పాఱఁగజేయు సైన్యముల నా ♦ యత్తంబు చేసెన్ వడిన్. 28

గీ॥ చేరి హమ్మీరగంభీర • సింహనృపులు
కాకసస్ పర్వతమునుండి • కాశిదాఁక
నూఁటయెనమండ్రు క్షితిపుల • మాటమాత్రఁ
బిలుచుకొని వచ్చి పృథ్వీశుఁ • గొలుతు రెపుడు! 29

మ॥ అతితేజోబలధాముఁ డాసమరసిం • హక్ష్మాతలేంద్రుండు వం
దిత నానాజనపాలలోకుఁడగు పృ • థ్వీభర్తకుఁ సోదరీ
పతి! వజ్రాయుధకోటి మ్రింగఁగల మే • వాడేశ రాహుత్తులుఁ
గృతహస్తుల్ తనుఁగొల్వ వచ్చె నని కే • కీభూత చేతస్కుఁడై! 30

గీ॥ భరతఖండంబు నాక్రమిం • పంగఁ దలఁచి
యేఁడుమాఱులు ఘోరిదం • డెత్తి వచ్చె!
మఱఁదియును బావయును దాఱు • మాఱు చేసి
యతని వెనుకకు నంపించి • రాఱు మార్లు! 31

సీ॥ తొవర్వంశ భవులైన • ధరణీతలేశ్వరుల్
పూర్వ మింద్రప్రస్థ • పురిని సార్వ
భౌములై యేలి! ర • వ్వారిలోన 'ననంగ
పాలుండు' కడపటి • వాఁ డతండు
పుత్రసంతతి లేక • పుత్రికలను నిర్వ
రను గాంచె! మొదటిదా • నిని గనూజ
బీజపాలునకును • బిదపటిదాని సో
మేశున కజమీరు • దేశ పతికి

గీ॥ నిచ్చె! వారికి జయచంద్ర • పృథ్వివిభులు
గలిగి! రయ్యనఁగుఁడు కొంత • కాలమునకు
వ్యాధి పీడితుఁ డగుచు ని • జాత్మజలను
మనుమలను బిల్చుకొని చెంత • నునిచి కొనియె! 32

గీ॥ ఒక్కనాఁడు పట్టాభిషే • కోత్సవంబు
జరుప సామంత నృపుల నం • దఱను జేర్చి
యయ్యనంగుఁడు 'ఢిల్లిసిం • హాసనంబు
నెక్కు' మన నెక్కి కూర్చుండె • బృథ్వివిభుఁడు. 33

సీ॥ "ఇరువుర మేము దా • హీతుర్రులమైయుండు!
మప్పసెల్లెండ్రకు • నాత్మజులము!
పదియునెన్మిదియేండ్ల • ప్రాయ మందున్న నక
వదలి యెనిమిదేండ్ల • వానిఁ బృథ్వి
సింహాసనాసీనుఁ • జేయు టధర్మ! మీా
తని యధికార మే • ననుమతింప!
నాక్షేపణ మొనర్తు" • నని ధిక్కరించి యా
జయచంద్రుఁ డేగె నా • సభను వీడి!
గీ॥ యతనివెంట నాబూపర్వ • తాధికారి
వ్యాఘ్రరాజేంద్రుఁడును బట్ట ణాధినాథుఁ
డసమబలుఁడు భోలాభీముఁ • డాక్షణంబ
కదలిపోయి రాస్థాన రం • గంబు వదలి! 34

సీ॥ తుహినాద్రినుండి సే • తువుదాఁకఁ దనరు న
ఖండ భారతఖండ • మండలంబు
సకల మేకచ్ఛత్ర • సామ్రాజ్యముగ ధరి
త్రీ రాజ్యమేలెఁ బృథ్వీనృపాలుఁ!
డావీరవరు సహ • స్రాధిక యుద్ధముల్
ధర్మసంస్థాపన • తత్పరతయు
నతని సామంత ధ • రాధీశ్వరుల భూరి
పౌరుష విక్రమ • ప్రాభవములు
గీ॥ చంద్రభట్టారక సుకవి • చక్రవర్తి
వ్రాయ శతసహస్రాధిక • గ్రంథమందు
రససమృద్ధిని బర్వప • ర్వంబునకును
జీవకళ లుట్టిపడఁగ రం • జిల్లు చుండు! 35

—॥ సంయుక్తా స్వయం వరము. ॥—

॥ అమిత విశాలమై సిరుల • నంతముగాఁగల కాన్యకుబ్జరా
జ్యము మును దక్షిణాపథము • నందును వ్యాపన మొందె; రాజసూ

యము నల ధర్మనందనుని ♦ యవ్వల విజయచంద్రుఁ డొక్కఁడు
క్కుమిగిలి చేయనేర్చె నృప ♦ కోటి యొనర్చు సమస్త కార్యముల్. 36

గీ॥ అవలఁ దనవెంచు సంయుక్త ♦ యనెడు కన్య
పరిణయ మొనర్పఁగా స్వయం ♦ వరముఁ జాటి
సకల దిగ్దేశవర్తి రా ♦ జన్యులకును
బంపె వైవాహి కాహ్వాన ♦ పత్రములను. 37

సీ॥ తనకెక్కా డింక భూ ♦ స్థలి రాజులకు నెల్లఁ
బెద్దయౌ రారాజు ♦ పృథ్వీరాజ
మహాళి కాహ్వాన మం ♦ పమి యట్టులుండ నా
స్యమున నై యొక పెద్ద ♦ యట్లుచేత
నామహాప్రభు విగ్ర ♦ హము రచింపించి సే
వకు దుస్తు లిడుచు ను ♦ ద్వాహమంట
పము మహాద్వారంబు ♦ పరగడ మోడ్పుచే
తులతోడఁ దలవాల్చి ♦ నిలువఁ జేసె!

గీ॥ నల స్వయంవరాహూతులై ♦ యచటఁ జేరు
భూమిపతులెల్లఁ దుచ్ఛనా ♦ బొమ్మఁ జూచి
సంభ్రమాశ్చర్య చకితులై ♦ చాలఁ దడవు
నిలిచి రనిమేషులగుచు బొ ♦ మ్మల విధానః! 38

సీ॥ "నృపమకుటములు త ♦ న్ని జనించె నామహా
భాగు సేనకుఁ జేయఁ ♦ బాడి గాదు!
భువనోన్నత ప్రాభ ♦ వుండైన మేటి యూ
తని కెగ్గుచేయుట ♦ తగవు గాదు!
రణరంగ ఫల్గున ♦ ప్రఖ్యాతి గల వీర
మహాళి నొప్పరికింప ♦ మేలు గాదు!
శ్రీరమాగమ ణావ ♦ శారద జగద్వంద్యు
నవమాన మొనరింప ♦ ననువు గాదు!

గీ॥ యతఁ డిది యెఱుఁగునేని ద ♦ క్షాధ్వరంబు
రూపుమాయింప వెడలు రు ♦ ద్రుఁడయి దూఁకి
జగము సర్వసంహారము ♦ సలుపుఁ గాని
యోర్వఁ డవమాన లేశ మీ ♦ యోధమౌళి!' 39

క॥ అని వగచుచుఁ దమతమ యా
సనములఁ గూర్చుండె! రవల ♦ సభ యెల్ల మహా
జన నివహముచేఁ గ్రిక్కిరి
సెను! బిదప ముహూర్త వేళ ♦ చేరఁగ వచ్చెన్. 40

మ॥ అతిలావణ్య విలాస విభ్రమ సురా ♦ పాయత్త దివ్యాంగనా
తతులన్ మెచ్చని లోకమోహినులు కాం ♦ తారత్నముల్ నల్వురన్
జతురస్వాంతలు కొల్చి వెంట నడువన్ ♦ సంయుక్త తారాగణాం
చిత జైవాతృక బింబమో యనఁ బ్రవే ♦ శించెన్ సభావేదికన్. 41

చ॥ కలకలలాడె నెల్లసభ! ♦ కప్పునముండియు వింతయాత్రముల్
జలజల రాల్చెఁ బూలు! నృప ♦ సత్తములన్ జెలి గారవించి రాఁ
దలలను వాల్చుచున్! మృగమ ♦ దంబు పునుంగు జవాది గంధముల్
వలపులఁ జల్లె నెల్లెడ స ♦ భాసదు లెల్లరు నుల్లసిల్లఁగన్! 42

సీ॥ జయచంద్రనృపమౌళి ♦ సంయుక్తతోడ ముం
దునకురాఁ జాకోహి ♦ తుండు నృపుల
వేఱువేఱుగఁ జూపి ♦ వారివారి సమగ్ర
పౌరుష ప్రాభవ ♦ వైభవములు
విపులంబుగా నిరూ ♦ పించి వర్ణన చేసెఁ!
గన్నె యొక్కనినైనఁ ♦ గన్ను లెత్తి
కనుఁగొనక యె ముందు ♦ కై సాగి నృపపీఠ
ములు దాఁటి నడిచె! వి ♦ ప్రిందు నవలఁ
గీ॥ గల మహామాత్యులను బ్రభు ♦ వులను సైన్య
పతుల నుద్యోగులను జూపెఁ ♦ బడఁతి ముందు
కరిగె! జయచంద్రుఁ డతికు్రద్ధుఁ ♦ డగుచు మండి
కొమ మహాద్వారమున కీడ్చు ♦ కొనుచుఁ బోయి! 43

మ॥ "ననుఁ దప్పించి మహేంద్రయోగ్యమగు నిం • ద్రప్రస్థ సామ్రాజ్య మొం
దిన తుచ్ఛుండు గులామునశ్ శహాఁడు పృ • థ్వీనాముఁ డవ్వాని బా
ప్పను బెంట్లాడు"మటంచుఁ దోసెఁ! జెలికం • పంబొంది తద్ధాటి భో
రన నేలన్ బడె సన్యలందఱు మహా • గ్రక్రోధమున్ జెందఁగన్. 44

గీ॥ అవిర ళాత్మీయ పూర్వ పు • ణ్యముల రాశి
మొడ తెగక తానువలచు వే • యొండ్ల పైరు
ముందుఁగని లేచి సంయుక్త • బొమ్మకు సుమ
దామమును వైచె! సిగ్గునఁ • దలను వాల్చె! 45

సీ॥ పుష్పహారము సోఁక • బొమ్మ తద్దయుఁ బెద్ద
ధ్వనిఁ జేసెఁ బైన మ • స్తకమునుండి
పాదాగ్రమున దాఁక • బరియలై యందుండి
క్షణమున భువన వి • స్మయముగాఁగఁ
దలపైన వింత విం • తల రంగుటెకల
కాంతార మబ్ధి భం • గములు వోలె
నటునిటు తూగాడ • నసమాన శతకోటి
మన్మథ సౌందర్య • మహిమ వెలయ

గీ॥ ముందడుగు వైచుచును మహా • పురుషమూర్తి
విమత సమవర్తి శ్రీమహా • విష్ణు వట్లు
చారుమూర్తి పృథ్వీసింహ • చక్రవర్తి
జగము లానందమొంద సా • క్షాత్కరించె! 46

మ॥ అమృతాంశున్ గని పొంగు సంద్రముక్రియన్ • జ్ఞానేశు లానంద సం
భ్రము లౌచున్ జయనాదముల్ సలుప వి • శ్వత్రాత పృథ్వీంద్రుఁ డ
క్కొమఁ జేతన్ గొని 'యశ్వమెక్కి 'యిదిగో • గొంపోవుచున్నాఁడ! ధై
ర్యము మీకుండిన నన్నుఁ 'దాఁకుఁ' డని డా • యన్ బోయె ఢిల్లీ దెసన్. 47

మ॥ సమరోర్వీతల ఫల్గును డితఁడనన్ • సత్కీర్తి దిగ్దేశ భా
గములన్ నిండిన యామహాప్రభువుఁ దాఁ • కన్ ధైర్యముల్ లేక స

ర్వమహీనాథులు వాని సాహసములన్ ♦ వర్ణించి తత్సన్నివా
సములన్ జేరఁ బ్రయాణమైరి తుటిలో ♦ సంరంభ శూన్యస్థితిన్. 48

మ॥ 'అకటా! గర్వవిరోధి దుష్టుఁడు శకుం ♦ డా పృథ్విసింహుండు క
న్యకఁగొంచుఁ జనె మోసగించి! పెను వం ♦ తన్ సైపఁగాఁజాలఁ! ద
ప్పక వానిన్ దెగటార్చి నాయుసురు ని ♦ ల్పన్ బెట్టరే' యంచు నో
పిక జాలన్ జయచంద్ర భూవిభుఁడు త ♦ బ్బిబ్బొంది వాపోయినన్; 49

సీ॥ ఆబూధరాధీశు ♦ డగు జయత్సమరుండు,
ప్రబలుండు మండూరు ♦ వ్యాఘ్రరాయ,
కాన్యకుబ్జంబు ల ♦ క్ష్మణసింగు, విశ్వేశ
సింహావిభుండు కా ♦ శీధరాధి
పుడు, మహోబానేత ♦ పూర్ణమల్లుండు, ధా
రామహీపాలుండు ♦ రామసింహుఁ
డాలాయు నుదిలుండు, ♦ నాజయచంద్రుండు
వసుదినమ్ము వాఁ డీఁటి ♦ మాఁదుఖానుఁ

గీ॥ డొక్కకరుఁ డైదువేల్ మంది ♦ యోధులఁగొని
త్వరితగతి బయల్ దేఱి! ర ♦ వ్వారి కెల్ల
సర్వసేనాధిపతి యనాఁచు ♦ జగ మదుర్వఁగ
ముందుఁ గదలె భోళాభీము ♦ భూవిభుండు! 50

సీ॥ మూఁడునాళ్ల ప్రయాణ ♦ మున డస్సియుండెఁ జో
హాణసేన! దాని సం ♦ ఖ్యయుఁ గొలంది!
పైఁ జిచ్చుబెండ! లో ♦ పల మండుకొను క్షుధ!
పీని మించుచుఁ గొత్త ♦ పెండ్లికొమరి
తను సున్నితముగాఁగఁ ♦ గొనిపోవవలయు భా
రము! కాన్యకుబ్జ సై ♦ న్యము లపార!
మవ్వాని నడపు నా ♦ యకులు పెక్కుఁగు! భీముఁ
డుద్దండతర విక్ర ♦ మోగ్రమూర్తి!

గీ॥ గడియ ప్రొద్దుండు వేళకే ♦ కాన్యకుబ్జ
దళము డిల్లిసైన్యము డాసె! ♦ దానిఁ దాఁక
వేగురు భటుల నిలిపి పృ ♦ థ్వీ విభుండు
ముందు నడిచె! యుద్ధము ఘోర ♦ ముగను రేఁగె!

గీ॥ అహితులను నూర్గు వేలుగా ♦ నణఁచి ఢిల్లి
భటులు కడతేఱి రంద! ఆ ♦ వ్వలి దినంబు
వెడలి రాఠోడు లలమిరి! ♦ పృథ్వీసింగు
భట సహస్రద్వయము నిల్పి ♦ పఱచె నవల! 52

క॥ అరివీరభటు లనేకులఁ
బొరిగొని వారెల్లఁ దెగిరి ♦ మూఁడవనాఁడా
యిరువాఁగులు మఱలఁగ డా
సిరి కాళిందీతటంబు ♦ చేరువ సీమన్. 53

మ॥ అరుగన్ డెంచెను యోగినీపురవరం ♦ బందుండి పృథ్వీంద్రు సో
దరుఁడున్ వీరుఁడు చంద్రరావు చమువుల్ ♦ తన్గొల్వ, రాఠోడ్భటో
త్కరమున్ దాఁకె నతండు! యుద్ధము మహో♦గ్రంబై విజృంభించె! దాం
తరగా మ్రగ్గెను రెండుపక్షముల యో ♦ ధశ్రేణి నిశ్శేషమై! 54

ఉ॥ ఐదవనాడు పృథ్వీవసు ♦ ధాధిపుఁ డాత్మపురంబుఁ జేరి సి
తోదయ భాగ్యశోభన ము ♦ హూర్తమునందున విశ్వవైభవ
శ్రీ దయివాఱఁ దన్నభిల ♦ షించిన కన్యను బెండ్లియాడె! స
మ్మోదములో ధరావలయ ♦ మున్ బరిపాలనఁ జేసె దక్షతన్. 55

సీ॥ అభిచార హోమంబు ♦ లాచరించెడువారిఁ
బిలిపించి నూర్గును ♦ వేలు నొసఁగి,
హంతకులను గూడి ♦ మంతనంబు లొనర్చి
లక్షలు లక్షలు ♦ లంచ మిచ్చి,
పరిసర నృపకోటిఁ ♦ బురికొల్పి కోటానఁ
గోట్లిచ్చి పయికుసి ♦ కొలిపి పంపి,
రాజోత్సవముల మా ♦ రణ యంత్రములు పన్ని
పొంచి పేల్పించి చం ♦ పించ నెంచి

గీ॥ మొదలనో యాశ్రయించి యె • న్నెన్నొ గతులఁ
గుట్రలు కుతంత్రములు చేసి • కోర్కెలెల్లఁ
జెడుచు జయచంద్రుఁ డిటుల కృ • శించుచుండె!
నీర్ష్య తనుజేర్చువాని ద • హింపకున్నె! 56

సీ॥ ఇంకొక్కమాఱు దం • డెత్తిరమ్మని యతం
డర్థించె ఘోరీమ • హమ్మదు విభు!
నావార్త విని యసం • ఖ్య చమూతతులు కొల్వ
నరుదెంచె సమరసం • హా ప్రచండు!
మూఁడుకోసుల దూర • మునకేగి పృథ్వీంద్రుఁ
డడుగులకును మ్రొక్కి • యతనిఁ దెచ్చెఁ!
'గగ్గా'ర్నదీ తట • క్ష్మాసీమ యవన సై
న్యం బుండె! డిల్లి సై • న్యములు వచ్చె!
గీ॥ నాప్తులును దాను జయచంద్రుఁ • డాయవనులఁ
గదిసె! నుదయ మయ్యెదిచూచి • కదలి వె[illegible]
తండ్రి మృదుపాదములకు వం • దన మొనర్చి
యుదిలకొని మహారాజ్ఞి సం • యుక్త యప్పుడు! 57

సీ॥ భరత మహామహీ • స్వాతంత్ర్య మునుమాప శ
త్రులు వచ్చె! రదినిల్పఁ • దొరసర వచ్చె
నాప్రాణవిభుఁ డఖం • డ ప్రభావుండు! నే
నుండ వేర్వేఱ దిగా • కుండఁదగునె!
ధర్మపక్షము మాంది • దయచేయుమయ్య! పృ
థ్వీవిభు నర్ధాంగిఁ • బిలుచుచుంటిఁ!
జెడుగు లేదీవు వ • చ్చిన! సత్కరించు నా
భర్త! నీ వైరము • వదల జేని
గీ॥ నేగుము కనూజ! కటులు పో • వేసి భార
తావనిని దాస్యమునఁ ద్రోయు • నపయశంబు
ననుభవింతు వ చంద్రతా • రార్క మనుచు
మ్రొక్కి -జయచంద్రుఁడును గనుఁ • గుఱ్ఱఁ బగుచు, 58

సీ॥ కమనీయ భారత ♦ ఖండ సామ్రాజ్య సౌ
భాగ్యలక్ష్మి విధానఁ ♦ బరగు మంగ
ళోదారమూర్తి సం ♦ యుక్త సాగిలపడి
యుండ భూదేవ మం ♦ త్రోక్తి పూత
కంథిజలాభిషే ♦ క పవిత్ర మామె మూ
ర్ధము నట్టె వామపా ♦ దమునఁ దన్ని
'కదలి పో! నాసము ♦ ఖమున నుండకు' మంచుఁ
ద్రోసిన, లేచి యా ♦ దొడ్డతల్లి

గీ॥ 'తెలిసినది విన్నవించితి! ♦ దీన నీదు
హృదయము కలంగకున్న నే ♦ నేమి సేతు'
నని కదలి వచ్చె! నుభయ సై ♦ న్యములకును ర
ణంబు ఘోరంబుగా మూఁడు ♦ నాళ్లు జరిగె! 50

గీ॥ సమరసింహుండు పడియె! సై ♦ న్యములు చెడియె!
రాజపరమేశ్వరుండు వీ ♦ రప్రభుండు
పృథ్వీరాజేంద్రుఁడును ఢిల్లి ♦ రిపుల కారిఁ
బడిరి భారతదేశ దౌ ♦ ర్భాగ్యకలన! 60

సీ॥ 'నుత రమాఖండ భా ♦ రతఖండ గగనాగ్ర
రంగ మధ్యాహ్న మా ♦ ర్తాండమూర్తి!
బప్పరాయాన్వ యా ♦ భరణ షట్త్రింశన్మ(హీ)
పాలక కుల భూరి ♦ వజ్రమకుట!
యరిగితే ననుఁ బాసి ♦ చెఱవడె నాపృథ్వి!
మఱిఁద లెందరిగెనో ♦ మొఱుఁగరాదు!
పదమూఁడు వేల్నంది ♦ భటులతోఁ గల్యాణ
సింగు నా పుత్రుఁడా ♦ ర్జిత పరాక్ర

గీ॥ మూఁడు స్వయంవరమునకట్లు ♦ నడిచె దివికి
నిచటఁ బనిగేమి మీరాద ♦ తేగు పిదప'
నని పృథాదేవి వగచి ని ♦ న్ననుగమింప
సమసితే శత్రుగజసింహా! ♦ సమరసింహా! 61

మ॥ తొలుతన్ సాయము చేసినట్టి జయచం ♦ ద్రున్ జాఁకె ఘోరీయు; దు
ర్బలుఁడై రాజ్యము వాఁడు వీడిచనెఁ; దా ♦ ర్తార్ వీరులన్ వెంబడిన్
గలయన్ దూఁకిరి; దిక్కులే కతఁడు గం ♦ గావాహినిన్ దూఁకి య
వ్వలి కేగెన్;దలఁ ద్రుంచి చంపిరి రిపుల్ ♦ వైవస్వతప్రాయులై! 62

సీ॥ “పార్థింతు వలవ దీ ♦ పని” యంచు సంయుక్త
కొనకాళ్లఁబడి వేఁడు ♦ కొనిన వినక
ఘోరీని బిలిపించి ♦ కొంప కగ్గి ఘటించి
నృపచంద్రు సమరసిం ♦ హేంద్రుఁ ద్రుంచి
పృథ్వీశు నట్టేట ♦ నిడి కుంకుమార్చి సం
యుక్త వైధవ్య సం ♦ యుక్తఁ జేసి
యుర్వి యున్నంతకు ♦ నుగ్రాపకీర్తిమై
రాజ్యంబు పారతం ♦ త్ర్యమున నిడితె!

గీ॥ కటకటా! కోటి యుగములు ♦ గడచుఁగాక
పృథ్విభువంటి రాజరా ♦ జెటులఁ గలుగు!
భరతభూమి స్వాతంత్ర్యమె ♦ బ్భంగిఁ బొలుచుఁ!
జెనఁటి జయచంద్ర! నిబిడ దు ♦ ష్కీర్తి రంధ్ర! 63

గీ॥ “చెట్టుపైఁ బక్షిశిరమును ♦ జెండు”మనినఁ
బృథ్విరాజు మూఁడుశరంబు ♦ లెత్తి పులుఁగు
గళము దానివెంటనె ఘోరి ♦ గళము ద్రుంచి
యాత్మహృదయమ్ము భేదించి ♦ యరిగె దివికి! 65

గీ॥ పృథ్వినృపమాళి గృహము-ఘో ♦ రీ గృహంబు-
సమరసింహు గృహము-జయ ♦ చంద్రు గృహము-
నాల్గు గృహములు మొదలంట ♦ నాశ మయ్యె
దుష్టుఁడగు నొక్క దేశ వి ♦ ద్రోహి కతన! 65

క॥ కుతుబుద్దీన్ సేవక సం
తతివాఁడు సమర్థుఁడగుటఁ ♦ దగునని ఘోరీ
పతి భారతసామ్రాజ్యం
బతని వసము చేసి పోయె ♦ నాత్మనగరికిన్. 66

ఉ॥ జంభవిరోధి వైభవ వి ♦ శాలత భూప్రజ నేలి శాశ్వతో
జ్జృంభిత కీర్తిచంద్రికలఁ ♦ జిమ్ముచు వాఁడు 'కుటుబ్ మినార్' శిలా
స్తంభము నొక్కఁడాసి జయ ♦ సంభృతమై పొలుపొంద నిల్పె! వి
శ్వంభరఁ బోల్చు నయ్యదియు ♦ సప్తవిచిత్రము లందు నొక్కఁడై. 67

మ॥ పరిపాలించిరి వానివెన్కఁ ధరణీ ♦ భాగంబుఁ బెక్కుర్ నృపా
లురు! ఖిల్జీకులుఁ డొక్కఁ డాదట జలా ♦ లుద్దీను దుస్తంత్ర మా
ర్గుఁ డప్పుండిన ఢిల్లిరాజు శిరముఁ ♦ ఖండించి యేతెత్తురీ
పరముఁ జేకొని రాజ్య మేలఁ దొడఁగెఁ ♦ బట్టాభిషిక్తుండునై! 68

క॥ అవల నలాయుద్దీనను
యవనుండు పరాక్రమాక్ర ♦ మాంతోగ్రుఁడు పా
ర్థివుఁ డయ్యె! దేశ మంతయుఁ
దవిలి వసము చేసికొనన ♦ తలఁచు గాంక్షించెఁ. 69

సీ॥ సమరకోవిదుఁ డతఁడు మా ♦ ళ్వమును జేన
గృహమును విహారదేశమ్ము ♦ గెలిచి తృప్తి
పడక లయకాలరుద్రుని ♦ పగిది వెడలి
యల రణస్తంభపుర దుర్గ ♦ మాక్రమించె! 70

మ॥ కమలాదేవి రతిస్వరూప యసి యా ♦ కర్ణించి యాతండు సై
న్యముతో ఘూర్జర దేశ మేగి యానితో ♦ నఁ దన్మహీనాథు జీ
వములన్ బాపి లతాంగిఁ జేకొనియె! యా ♦ పై నాసియా మధ్యభా
గమునందుండియు వచ్చి ఢిల్లిపురి ల ♦ గ్నల్ పట్టి రా మొగలుల్. 72

మ॥ ఉరుశౌర్యంబునఁ బెక్కుమారులు నలా ♦ యుద్దీను మొగల్ రిపు
త్కరముఁ యుద్ధములందు మార్కొనుచు ప్ర ♦ క్కన్ జేసి మోదించెఁ బా
ఱిరి స్వస్థానముఁ జేర వారు భరతో ♦ ర్విన్ వీసి! ఢిల్లీశుఁడున్
ధరణీరాజ్యము వృద్ధి చేసికొను చం ♦ దం బెంచుచుండెన్ మదిన్. 72

సీ॥ మేవాడరాజ్య ల ♦ క్ష్మీనాథుఁడయిన ల
క్ష్మణసింగు బాలుఁడౌ ♦ కారణమున
భీమసిం గాతని ♦ పినతండ్రి ప్రతినిధి
యగుచు రాజ్యము నేలె! ♦ నతఁ డశేష

బలశౌర్యయుతుండు! సిం • హాళరాజ్య మేలు హా
మీరశంకరుని య • ర్మిలి తనూజ
చతురబ్ధి వలిత వి • శ్వధరిత్రిం గల తలో
దరులందు మేటి సౌం • దర్యరాశి

గీ॥ యైన పద్మినిం బెండ్లాడె! • నామె యశము
దేశమెల్ల నిండెను! రాజ్య • తృష్ణకన్న
నంగనా తృష్ణ యెక్కుడౌ • యవనవిభుండు
తరుణిం గోరి చిత్తూరిపై • దాడు విడిసె! 73

మ॥ ఒకసంవత్సర మాఱుమాసము లలా • యుద్దీను దుర్గంబు సై
న్య కదంబంబులతోడం జుట్టుకొనుచున్ • సంగ్రామమున్ జేసి యిం
చుక గెల్పొందంగ లేక తీరని వ్యథన్ • క్షోభిల్ల సాగెన్! లయాం
తకులై పోరిరి రాజపుత్రు లసమా • న క్షాత్ర దీక్షారతిన్. 74

సీ॥ కడకుం 'బద్మినింజూప • విడుతుముట్టడి' నని
యవనేంద్రుం! 'డద్దంబు • నందుంజూడు'
మని రాజపుత్రకు • లని! రలాయుద్దీను
వచ్చేసి సతింజూచి • వెనుక కరుగు
నప్పుడు భీమసిం • గరిగె వీడ్కొల్పుచుం!
గోటదాంటగం దురు • ష్కులతనిం జెఱం
బట్టి 'పద్మిని నీయ • వదలెద'మని! రేడు
వంద లాందోళికల్ • బయలుదేఱె!

గీ॥ వెలందిం గడసారి దర్శింప • భీమసింగు
పంపంబడె! నాతం డశ్వంబు • పైనం గోట
దూఱె! యవనుల్ విజృంభించి • దూంకిరపుడు!
రాజపుత్రులు పోరి ర • ణ్యంబుగాంగ! 75

మ॥ స్థిరమా పత్ప్రభుభక్తియుక్తి నిజరా • జ్ఞీ మాన సంత్రాణ ధ
ర్మరసావేశము పొంగి పైంబొరల గో • రాసింగు బాదూలు సిం
గు రణాగ్రంబున వైరి వీరుల తలల్ • గోటానం గొట్టున్ వసుం
ధరరాలన్ విహరించి రమ్యేడం గృతాం • త ప్రాయులై యుర్వరున్. 76

క॥ వీరావేశము పొంగఁగఁ
దారుష్క భటాళిఁ దగిలి ♦ తలలు నఱకుచున్
గోరాసిం గసిఁ జడియెను
వారిధిఁబడి యస్తమించు ♦ వనజాప్తు క్రియన్. 77

క॥ బాదూలుసింగు బాలుఁడు
ద్వాదశ వర్షములవాఁడు ♦ పౌరుష్కుల శౌ
ర్యోదయుఁడై దునుమాడుచు
నాదిన మొక్కఁడుఁడె యింటి ♦ కరుగఁగఁ గలిగెన్. 78

మ॥ అమితోత్సాహముతోడఁ బోరెసఁగఁగా ♦ నానాఁడు మేవాడ రా
జ్య మహాసౌధమునందు స్తంభముల యో ♦ జన్ బొల్చు లోకైక వి
క్రమ ధౌరేయుల నొక్కఁడేని మిగులం ♦ గాఁబోక సంగ్రామ రం
గమునన్ వీరవిహారముల్ నెఱపి స్వ ♦ ర్గంబేగి రొక్కుమ్మడిన్. 79

చ॥ పడతులు వేవురున్ గొలువఁ ♦ బద్మిని వహ్నిని జొచ్చె; వైరులున్
గుడులును రాజసౌధములు ♦ గోపురముల్ కొలువుల్ గృహంబులున్
బుడమిఁ బడంగఁ జేయఁ బుర ♦ మున్ సిరి దప్పె గజంబులున్ జొరం
బడి కలఁపన్ గలంతపడు ♦ పద్మసరః ప్రవరంబు చాడ్పునన్. 80

మ॥ అనహుల్వారయు బూంది దేవగిరి ధా ♦ రావంతులున్ మారువా
రును మండూపుర మాజసల్మియరు గో ♦ గ్రీన్ దేశముల్ పెక్కు లో
య్యన నొక్కొక్కఁడుగాఁ దురుష్క నరపా ♦ లాంఘ్రీశ్వరున్ గొల్చి యా
తని రారాజుగ సమ్మతించెఁ బరతం ♦ త్రత్వంబునొంది గ్రుంగుచున్. 81

—॥ అజేయ సింహుని పాలనము ॥—

సీ॥ బహుకాలమునకుఁ బూ ♦ ర్వమున రాజస్థాన
వసుధయంతయు భిల్ల ♦ వంశజులది!
వారి దూరముతోలి ♦ బప్పరాయ నృపాలుఁ
డధికుఁడై మేవాడ ♦ నాక్రమించె!
నదిమొదల్ భిల్లుల ♦ కాఁ రాజపుత్రుల
కణఁగని వైరాగ్ని ♦ యతిశయిల్లె!

నొకరి దేశము స్తన ♦ నొకరుఁడు దండెత్తి
పలుమాఱు పోరుట ♦ వాడుకయ్యెఁ!

గీ॥ గెలవారా మహాటవుల్ ♦ కదిసి వేట
సలుపుచో వారువీరను ♦ గలిసి రేసి
నిరు దెసల నాయకులను ని ♦ ర్వ్యరో కడకు నొ
కరుఁడొ పడియుట తప్పక ♦ జరగుచుండె! 82

సీ॥ చిత్తూరు రాజ్యను ♦ జేయసింహుం డేలు
చుండి యోలగముండి ♦ యొకదినమున
నాత్మజుల్ సుజన సిం ♦ హాజిత సింహులఁ
బదునేను బదునాల్గు ♦ వత్సరముల
వారలఁ గని" భిల్ల ♦ పతిముఞ్జుఁ డెనిమిదేం
డ్లకుముందు వనమున ♦ నన్నుఁ దాఁకె!
వానిఁ దప్పుకొన ను ♦ పాయము లేక య
య్యాడితి! విడక వాఁ ♦ డట్టె పొడివి

గీ॥ కుంతమునఁ గ్రుమ్మె! దలనాటి ♦ గొప్ప గాయ
మయ్యె! నా మాయువది గట్టి ♦ దగుట నెట్లొ
పురముఁ జేరితి! నేటికి ♦ శిరము నిమురు
చో నిదిగొఁ బెద్ద గుంట చే ♦ సోఁకుచుండు! 83

క॥ వాఁ డదరిన యీగుండియ
నేఁడును దిటవ్వూన! దతఁడు ♦ నిదురఁ గనఁబడుఁ!
వాడి పగమైతి! ముఞ్జుని
గూడిన వగఁ! బయికిఁ జెప్పు ♦ కొన లేకుంటిఁ! 84

మ॥ చతురంగ ధ్వజినీపతుల్ గొలువఁగా ♦ సన్నాహ సర్వాయుధాం
చితులై ముఞ్జుని గూడెముఁ దఱిసి త ♦ చ్ఛీర్షంబు ఖండించి యా
ప్తతతో నాభయ ముజ్జగింపు" డనుచుఁ ♦ దైన్యంబుతోఁ బల్కెఁ ద
త్సుతులుఁ లేనగ వాస్యబింబముల యం ♦ దుఁ బెల్లు తొల్కాడఁగఁ. 85

మ॥ "తనియఁ బిల్లలఁ బావలఁ గని ధరా ♦ ధ్యక్షుండవై భోగభా
గ్యనికాయంబులమాఁగి వృద్ధవగు నీ ♦ వానంద సంపత్తి సిం

టను గూర్చుండుచుఁ బెండ్లిసేరటము మా ♦ టల్ మాని దుర్వార మృ
త్యునిభంగైఁ జనుమూంజునిన్ దొడర బో ♦ యించు వేధింతువే! 86

ఉ॥ కాటికిఁ గాళ్లు చాఁచితివి! ♦ కావలెనన్నను మూంజుతోడి పో
రాటము నీవె మానుకొను! ♦ మూడకు కాలులు! నిన్నుఁ జూచినన్
గోటులు గూడ నవ్వెదరు! ♦ పొమ్మ''ని పల్కిరి! చెంతనొక్కచో
నాటలమున్న వైవిషయ ♦ మంతయు విన్న హమీరసింహుఁడున్, 87

ఆ॥ వె॥ జయజేయసింహు ♦ ననుజుని కొడుకు ప
దేండ్ల బాలుఁ డటకు ♦ వేగ వెంచి
చేతనున్న చిన్ని ♦ సింగాణితో బాణ
సమితితో ధరిత్రిఁ ♦ జాఁగి మ్రొక్కి, 88

క॥ ''ఒక యశ్వము నొక కుంతము
నొక ఖడ్గము నిచ్చి పంపు ♦ మో తండ్రి! త
ప్పక చని నే మూంజుని మ
స్తకముఁ దఱిగి తెచ్చి యుంతుఁ ♦ జరణాబ్జములన్''. 89

చ॥ అనుచు నుదాత్తవీరరస ♦ మచ్చుపడన్ వచియించు చిన్నినం
దనుని నజేయసింగు గని ♦ ''తండ్రి! భవద్వచనంబు కోటి సే
యును! చని నీవు వైరిశిర ♦ మూడిచి తెచ్చినయంత సంతసం
బానరెను! నీవుపోవలవ ♦ దుంకుము నాకడ'' నంచుఁ బల్కినన్, 90

మ॥ ''ఇదె తండ్రీ! పలుమాటలే నెఱుఁగ! రెం ♦ డేమార్గముల్ నాకు! నీ
మదవద్వైరిని భిల్లునిన్ దునిమి త ♦ న్మస్తంబునున్ దెచ్చి నీ
పదముల్ చేర్చెద! లేనిచో మఱల మే ♦ వాడ్దేశమం దెందు నా
పదమున్ మోపక! దూరసీమల వసిం ♦ పన్ బోదు'' నంచాడుచున్. 91

గీ॥ అంతనొక ఖడ్గమొకకుంత ♦ మశ్వముఁగొని
గాలికన్న హమీరు శీ ♦ ఘ్రముగఁ బోయెఁ
జనె దినములు పక్షములు మా ♦ సములు గడచె!
నతఁడు చనుటెఱిఁగిని జాడ ♦ యింతలేదు! 92

సీ॥ కొన్నాళ్లకవ్వలఁ ♦ గొండలోయను గద
యట్టి యాయుధ మూని ♦ యాశ్వికుండు
చేరరాఁగ నజేయ ♦ సింహుండు నాతని
కొలువువారును జూడ్కిఁ ♦ గొలిపి! రంత
నాహమీరుఁడు బల్లె ♦ మవనిపై నిడి తండ్రి
శ్రీపాదముల నమ ♦ స్కృతి యొనర్చి
"గుఱుతింపు నీమూంజు ♦ శిర"మని! ఱేఁడు పు
త్రికుని ముద్దాడి యె ♦ త్తుకొని సింహ
గీ॥ పీఠ మెక్కించి తిలకంబు ♦ పెట్టి రాజు
సలిపి నిజపుత్రియుగము దే ♦ శమ్మునుండి
తఱుమఁగొట్టె! ద్వితీయ పు ♦ త్రికుఁడు మడిసెఁ!
గైలవారా గిరీంద్ర శృం ♦ గాటకమున! 93
గీ॥ చుక్క తెగిపడ్డ కైవడి ♦ సుజనసింగు
వారిలోఁ బెద్దవాఁడు స ♦ త్పదము తప్పి
దక్కనున భారతాంబ పా ♦ దములఁ బడియె
వాఁడెసో! శివాజీరాజు ♦ వంశకర్త! 94
గీ॥ సింగపుం గొదమ విధాన ♦ సింహపీఠిఁ
జేరి కూర్చుండిన హమీర ♦ సింహభూమి
పాలక ప్రవరుండు సం ♦ వర్త సమయ
ఘన ఘనాఘన గంభీర ♦ నినద మలర, 95
సీ॥ "భిల్లులు తఱచుగా ♦ వేఁటల కరుదెంతు
రని సాద్రి విపినమం ♦ దణఁగి యుంటిఁ!
బందిఁ దఱుముకొంచుఁ ♦ బరివారములు లేక
మూంజుఁ డొక్కఁడె వనం ♦ బునఁ గనఁబడె!
నడిగె "నీవెవ్వఁడ" ♦ వని నన్ను! "నీవెవ్వఁ"
డని యంటి! 'మూంజుఁడ' ♦ ననెడు నంతఁ
దల నాదు ఖడ్గధా ♦ రల నూడి యిలరాలెఁ!
గుంతంబు కొనఁ దలఁ ♦ గ్రుచ్చి యెత్తి

గీ॥ శీఘ్రముగ నీపదంబులు ♦ చేర వచ్చి
నాఁడ" నన నెల్లరప్పుడు సం ♦ తసము నొందె!
రీతిఁ దిఱువదియును నాలు ♦ గేండ్ల దాఁకఁ
బాలన మొనర్చె నవల మే ♦ వాడసీమ! 96

చ॥ అతని కుమారుఁడున్ మనుమఁ ♦ డౌలఘుఁ, డవ్వల రాజులౌచు శా
శ్వత బలాభివృద్ధి కొన ♦ సాఁగఁగ నేలిరి దేశమున్; లఘు
క్షితిపతి 'జావురా' ఖనుల ♦ సీసము వెండియు లోనుగాఁగ ధా
తుశతములఁ ద్రవ్వఁ జేసి తత్తి ♦ తో ధనరాసులఁ జేర్చె మెండుగన్. 97

మ॥ జనకుం డాడిన యొక్కమాటకయి త ♦ త్సామ్రాజ్యమున్ దాని ప
జ్జను లావణ్యనిధానమై వెలయు హం ♦ సాదేవినిన్ వీడి త
మ్ముని రారాజు నొనర్చి భీష్మచరితం ♦ బున్ దాఁ బ్రదర్శించెఁ జం
డనృపుం డీలఘురాజు పుత్రుఁడు ప్రచం ♦ డ ప్రాభవోద్ధండుఁడున్. 98

క॥ ముకుళుఁడు లఘురాజు కుమా
రకుఁ డాతని వెనుక నేలె ♦ రాజ్యము! తత్పు
త్రకుఁడగు విదళిత రిపుహ
స్తి కుంభుఁడా కుంభసరవ ♦ తి శ్రేష్ఠుండున్. 99

—॥ మహా రాణా కుంభుని పరిపాలనము. ॥—

మ॥ జనముల్ మెచ్చఁగ నేఁబదేండ్లితఁడు రా ♦ జ్యంబేలె; మేవాడ్ధరి
త్రిని నయ్యెన్బదినాల్గు కోటలను ద్వా ♦ త్రింశన్మహాసంఖ్య యీ
తనిచే నిర్మిత మయ్యె; నన్నిఁటఁగనన్ ♦ దార్ఢ్యంబు వైశాల్యమున్
గొని యవ్వీర వతంసు పేర నిలుచున్ ♦ కుంభల్ మియర్ దుర్గమున్. 100

సీ॥ మాళవపతి మహ ♦ మ్మద్ ఖిల్జి వాగ్ధత
రంగముల్ వఱలఁ జతు ♦ రంగ బలము
గొలువ ఘూర్జర రాజుఁ ♦ గూడి దండెత్తి రా
నొక లక్షయుత్తమా ♦ శ్వీక దళంబు
పదునాల్గు వేలుకా ♦ ల్బలముతో నరుదెంచి
యెదిరించి వారిజ ♦ యించి మాళ్వ
ధరణీశుఁ దన రక్ష ♦ స్తంభంబునకుఁ గట్టి
కొనుచుఁ జిత్తూర్పురం ♦ బునకు దెచ్చి

గీ॥ కాపుగా సైన్యముల నిచ్చి • కాన్క లిచ్చి
తగిన గౌరవ మిచ్చి సా • తంత్ర్య మిచ్చి
యెడఁదఁ గరుణకుఁ జోటిచ్చి • విడిచి పుచ్చెఁ
గుంభరాణా సమాను లీ • క్షోణిఁగలరె? 101

మ॥ తన సంపూర్ణజయంబుఁ దెల్పఁగ జయ • స్తంభమ్ములన్ భక్తి పెం
పును సూచింపఁగఁ గోవెలల్ నిలిపె • నాబూశృంగ శృంగాటకం
బున; వ్యాఖ్యాన మొకండు వ్రాసి యనయం • బున్ గీత గోవిందమున్
జను లాబాలము నేర్వఁజేసెఁ గవితా • నందైక సంఘాతమై. 102

గీ॥ కత్తి కలములచే రెండు • గతులఁ గీర్తి
కాంతఁ గొలిచిన మేటి భూ • కాంతులందు
నింత దొడ్డవాఁడున్న వా • డే యటంచు
క్షోణి జనులెన్న మనినాడు నా • కుంభ నృపతి! 103

సీ॥ సాధ్వి మీరాబాయి • సౌజన్య ధన్య కుం
భవసుంధరాధీశు • పట్టమహిషి!
జగదేక పావిత్ర్య • సంపద కీ లేమ
పర్యాయపదము! గో • పాలకృష్ణు
నడుగులు తలఁచి భ • క్త్యావేశమునఁ బొంగి
యమృత గీతములు పె • క్కాలపించెఁ!
దన్నాథురికిఁజొక్కి • తలలూఁచి యాతల్లి
స్మరియింప నట్టి యా • న్నరులు లేరు!
గీ॥ ద్వారకాపురి మొదలుగా • వారణాసి
వఱకు దేవాలయముల గో • పాలదేవు!
గూర్చి కీర్తించి యాయమ్మ • కూరుచున్న
చోటులను నేఁటికిని గూడఁ • జూపుచుండ్రు! 104

—: రాణా సంగ్రామసింహుని పాలనము :—

మ॥ చరితార్థుండగు కుంభుపౌత్త్రుఁ డవలన్ • సంగ్రామసింహుండు భూ
వరుఁడయ్యెన్ రణమన్నఁ బండుగు వలెన్ • భావించు శౌర్యాఢ్యుఁ! డీ
పురుషశ్రేష్ఠుఁడు పెక్కు ఘోరసమరం • బుల్ చేసి వైరి క్షితీ
శ్వరులన్ గెల్చుచు దేశమందు నినిచెన్ • సౌభాగ్య భాగ్యోన్నతిన్. 105

సీ॥ ఐదువందలు కరు • లశ్వంబు లెనుఁబది
వేలు సామంతులు • పెక్కు మంది
యనుసరింపఁగ జయ • యాత్ర సాగించె! నం
బరు మారువారు లోఁ • బడియె! గ్వాలి
యరు లోఁగె! నజమేరు • చరణముల్ గొలిచె! శి
క్రియుఁ గాల్చి తలలొగ్గి • ప్రియము నెఱపె!
నారాము పురము చాం • దేరియుఁ బులుమేసె!
గోగ్రోను దలవంచు • కొనుచు నిలిచె!
గీ॥ సద్యో నంకితుఁ డాబూ ధ • రాధి నేత!
బూంది దిగులొంది తత్కృప • నొందె ముందె!
చుట్టు గలదేశములను జే • పట్టుకొనుచు
వసుధ సంగ్రాముఁ డేలె సై • భవము తనర! 106

మ॥ ముజఫర్షా యను మాళ్వభూపతి బలం • బుల్ గొల్వ పైకెత్తి రా
గజముల్ దాఁకెడు సింహమట్లు తఱుమం • గా వాఁడునుల్ రాజధా
నిఁ జొఱంబాఱె! విడంగఁబో కచట వా • నిల్ బట్టి చిత్తూరుఁ జే
ర్చె జగంబుల్ జయపెట్ట! నమ్రుఁడయి య • ర్థింపంగ వీడెన్ వడిన్, 107

మ॥ స్థిరశౌర్యుండును డిల్లివిశ్వపతికిన్ • సేనాని బాహాబలో
ద్ధురుఁడౌ 'ఆలి' సమస్త సైన్యములతో • దుర్గంబు రక్షించు చుం
డ 'రణస్తంభ పురంబు' పై నడచి కో • టల్ గెల్చి పేరొందె నీ
భరతోర్విన్ దనరున్ సముండొరుఁడు గ • న్పట్టం'డటం చెల్లెడల్. 108

క॥ అమితబలులు యవనులు తం
డములయి జాక్సారిటీస్ త • టంబులఁ గలదే
శమునుండియు భారత ఖం
డముపై దండెత్తి రాఁదొ • డఁగిరవ్వేళన్. 109

—: బేబరు దండయాత్ర. :—

శా॥ ఛెంగిస్ఖానునకుమార్త సంతతి జనిం • చెన్ ముందు తైమూరు, స
ర్వాంగీణ స్ఫుటశక్తితో సమర ఖం • డా ఖేలనుం డై, దానఁ ద్రు

ప్తిం గాంచంగను బోక భారత మహా ♦ దేశంబునున్ గెల్చె, స
త్సంగుం డీతని రాజ్య మింతని వచిం ♦ చన్ జాల రెవ్వారలున్. 110

శా॥ "తైమూర్లేము" ప్రపౌత్రు పుత్రుఁ డతిశౌ ♦ ర్యప్రస్తుత్య సౌజన్య లీ
లామందారము ద్వాదశాబ్దముల కా ♦ లంబందె "బేబర్" నృపుం
డై మోగల్ క్షితినేలఁ బూని రిపుగో ♦ త్రాధీశులన్ దాఁకి యు
ద్ధామ ప్రాభిని వారిఁ బోదఱిమి సం ♦ స్థాపించెఁ దద్రాజ్యమున్. 111

సీ॥ "జాక్సారిటీసు" శ్రే ♦ ష్ఠతమంబె కాని జా
హ్నవియె లోకైక పూ ♦ జ్యతకు త్రావు!
'టర్కి' ప్రశస్త మం ♦ డలమౌనుగాని, యా
ర్యావర్త మమృత ర ♦ సాత్మకంబు!
'సమరఖండ' మతిరమ్యా ♦ గ్యము కాని, ఢిల్లీ పు
రము స్వర్గమునకు స్వ ♦ ర్గముగు త్రావు!
తురకలు స్వజను లౌ ♦ దురు కాని, భారత
ప్రజలు లోకోత్తర ♦ ప్రాభవాంకు!
గీ॥ లింటనుండిన విశ్రాంతి ♦ యెసఁగుఁగాని
రామమాంధాత లేలిన ♦ భూమి గెలువ
ఘనత కైశ్వర్యములు గల్గి ♦ గణన గలుగు"
ననుచు బేబరు దండెత్తి ♦ యరుగుదెంచె. 112

శా॥ ఆ కాలమ్మున ఢిల్లి పట్టణ నృపుం ♦ డౌ యిబ్రహీంలోడి తా
నాకర్ణించుచు వీనిరాక దశల ♦ క్షానీకినుల్ త్వాస్థలం
బాకంపింపఁగఁ జేరవచ్చి యని సే ♦ యన్ జొచ్చె! బేబర్ విభుం
డా కాలాంతకుడట్లు శాత్రవులఁ జెం ♦ డాడెన్ మహోదగ్రుఁడై. 113

మ॥ గడియల్ మూఁడగు నంతలో రణము తె ♦ గ్గన్ సాగె! నాయిబ్రహీం
పడిపోయెన్! సేనలు భిన్నభాండగతులన్ ♦ బారిపించె! బేబర్ మహీం
ద్రుండు ఢిల్లీపురి నాక్రమించుకొనె! పిం ♦ దూదేశ సర్వస్వ మ
ప్పుడు దాసోహ మటంచుఁ దత్పద యుగం ♦ బున్ గొల్చె సర్వోర్వరన్ 114

—॥ సంగ్రామసింహునితో—బేబరు యుద్ధము. ॥—

మ॥ అరులన్ గెల్చుచు సార్వభౌముఁడయి రా • జ్యంబేలి సంగ్రామ భూ
వరు సంగ్రామ తలంబునన్ గెలిచి మే • వాడ్దేశమున్ జేకొనన్
ద్వరన్నై నుగ్రమృగేంద్ర వీర్యులగు యో • ధశ్రేష్ఠులన్ గొల్వఁగా
నరిగెన్ బేబరు! సూర్యవంశమణి యు • ద్ధాయత్తుఁ డయ్యెన్ వడిన్. 115

సీ॥ డోంగరీశుఁడు బలో • త్తుంగుం డుదయసింగు,
రత్నసింహుఁడు సలుం • బ్రావిభుండు
గణమల్ల నృపుఁడు మా • ర్వారు నాయకమాల్ది,
మేత్రావిభుఁడగు • క్షేత్రిసింగు,
ఝాలాన్నృపాలుఁ డు • జ్జయసింగు, సోనెగు
ఱ్ఱ మహీంద్రుఁడైన యా • రామదాసుఁ,
డల ప్రమరుండు గో • కులదాసు, చంద్రభా
నుండు, మాణిక్య చం • ద్రుఁడు శిలాదుఁ
గీ॥ డును, హసేనిబ్రహీం సాహి • తనయుఁ డొకఁడు
స్వామి సంగ్రామసింహు వెం • బడిని బోగి
చచ్చుటకో గెల్చుటకో వేఱు • జాడలేద
టంచు సేనలతో వచ్చి • రని మొనగ్న! 116

సీ॥ రెండు వాహినులు కా • ర్తికశుద్ధ పంచమి
నాఁ బయానా ప్రాంత • మందుఁ గలిసె!
రాజపుత్రస్థాన • రాజు లందఱు వెంట
నడువ సంగ్రాముఁ డు • న్నత పరాక్ర
మము మీఱ యవనసై • న్య ముఖాగ్రభాగంబు
చించి చెండాడి శో • భిల్లఁ జేసె!
బేబరు తనసేన • వెనుకకుఁ ద్రిప్పి ద
న్యశ్రేణి పోటు కా • చుకొని నిలిచెఁ!
గీ॥ గోత్రసేనలఁ దెప్పించు • కొనియె! నవియుఁ
జెడవిఱిగి పాఱె! గడకొక్క • మొగ దుపాయ

లను బిరంగుల ముంచిడి ♦ కొనుచు మహాన
నియతిఁ బదునేను దినములు ♦ నిలిచియుండె! 117

శా॥ వీరావేశముపొంగి రక్తముదుకన్, ♦ వేమాఱు తత్తచ్ఛమూ
వారంబుల్ దరిఁజేరి జేబరు రణో ♦ పన్యాసముల్ చేసినన్
గారాకైనను డుల్లకుండె! జయముల్ ♦ గాంక్షించి యెన్నెన్నొ వ్యా
పారంబుల్ బొనరించి నిస్పృహా జనిం ♦ పన్ డీల్పడెన్ బెల్లుగన్. 118

గీ॥ తన బలముఁ దూఁచు! గెలుపుకై ♦ కనులు వాఁచు!
నా ప్రతతి నేచు! దిగ్గన ♦ నట్టిలేచు!
విసివి తలరాచుఁ! జేతులు ♦ వెలికిఁజాఁచు!
నకట! జేబ రెవ్వఁడు గాచు ♦ ననుచుఁ జూచు! 119

సీ॥ తన ప్రయత్నము లన్ని ♦ యును నిష్ఫలంబైన
దైవంబు స్మరియించి ♦ త్యాగ మెంచి
తా ననుదినమును ♦ దాక్షారసముఁ ద్రావు
రజత సౌవర్ణపా ♦ త్రముల నేల
విసరి తున్కలుచేసి ♦ పెంకులు బైరాగు
లకు బీదలకు యోగు ♦ లకును బంచె!
నా క్షణంబుననుండి ♦ పూసవ మనుచరుల్
దాను ద్రావక యుండ ♦ మాని వేసె!

గీ॥ నవలఁ దనయేలు బడినున్న ♦ యవనరాజ్య
ములప్రజల పన్నులొక కొన్ని ♦ తొలఁగఁజేసె!
దైన్యమును భయము నె కాని ♦ ధైర్య మొసఁగు
పలు కొక్కండేని వినరాక ♦ పలవరించె! 120

మ॥ నెలలెన్నో గమియించె! జేబరు మదిన్ ♦ భీతిల్లుచున్ ఢిల్లి మం
డలమున్ దాటకయుండునట్లును బయా ♦ నాసీమయున్ గొన్ని ల
తలు కప్పంబు నొసంగు నట్లు నిక సం ♦ గ్రామేంద్రుతో యుద్ధముల్
నిలుపన్ బోమెదునట్లు సంధికిఁ బ్రయ ♦ త్నించెన్ మనస్ఫూర్తిగన్ 121

క॥ ఈయత్నము విఫలంబై
పోయెఁ! దుదకు సామదాన ♦ ములఁ గాని పనిన్

జేయఁ దలఁచె యవన మహీ
నాయకుఁడును ద్రోహబలము • నణఁచి పిదుచున్. 122

గీ॥ స్వామి పదసీమఁ దెగి నిజ • ప్రాణమైన
ధారపోయు పవిత్ర హైం • దవులయందు
నకటకట! శిలాదుఁడు గాక • యన్నముఁ దిను
నాతఁ డెవఁడు స్వామి ద్రోహ • మాచరించు! 123

గీ॥ కడవటి దినంబు నిరు మొనల్ • గలిసి నపుడు
బలముతో శిలాదుండు జే • బరును గలిసె!
నని తుముల మయ్యెఁ! బెక్కుఁగా • యములు తగిలి
యవల సంగ్రామముఁ జరిగె! సై • న్యములు విఱిగె! 124

మ॥ కమదీక్షింపుఁ బిరంగి గుండొకఁడు మో • కాలన్ బ్రవేశించె; మం
డెడు నుగ్రంపు దుపాకిపోఁకి కనులూ • టిన్ జెందె! నమ్మోనిపైఁ
బొడమెన్ గాయము లెన్ని! దిట్టు రుధిర • మ్మున్ జిమ్మ పుష్పించియుం
డెడు బంధూక మహీజమున్ దెగడె నీ • తీనేత సంగ్రాముఁడున్. 125

మ॥ "చనఁ జీత్తూరికి గెల్పు లేక" యని బు • స్సాంప్రాంత మందుండెఁ; న
ప్పెను గాయంబులఁ జేసి శక్తిచెడి ని • ర్వీర్యంబునై దేహ ము
జ్జన నాథేశ్వరుఁ డొక్క వత్సరమునన్ • స్వర్గస్థుఁడయ్యెన్ వికృ
ర్తనుఁ డస్తంగతుఁ డైన నైవడిఁ బ్రజల్ • దైన్యంబునన్ గ్రుంగఁగన్ 126

క॥ అరి రాజాంతకుఁడై తా
బరు సంగర జయము నొంది • భారత ధరణీ
శ్వరులకును రాజరాజై
పరిపాలింపఁగఁ దొడంగె • వసుధాతలమున్. 127

చ॥ ఒకసమయంబు నందు హుము • యూనును వ్యాధియు సోకి యంతకం
తకుఁ జెలరేఁగె! బేబరును • "సన్గొని నాసుతుఁగావు దేవ" యం
చకుటిల బుద్ధి వేఁడుకొనె! • నట్టులె వ్యాధియు వాని సోఁకి పు
త్రకుఁడును వ్యాధిఁ బాసె! నొక • రాతిరి ప్రాణము వాసె బేబరున్. 128

క॥ ఘనశౌర్యుఁడు సంగ్రాముని
వెనుక నతని సుతులు రత్న • విక్రము సింహుల్
మను జేంద్రులై మహీతల
మును బరిపాలించి రధిక • మోదము తోడన్. 129

మ॥ అనలాస్త్రంబులు వాడినన్ జయము త • థ్యంబంచు నావిక్రముం
డును గొన్నింటిని దెచ్చె! వీరభటు లెం • తో మూర్ఖులై ‘వీనిఁ జే
కొన! మర్త్యంబులనుండియున్ దిగము! నీ • కున్ గూర్చు నెవ్వానినై
న నియోగింపుము వీనిఁ బూన్ప!’ నని మం • దప్రజ్ఞులై యాడు చున్. 130

—॥ చిత్తూరు – రెండవ ముట్టడి ॥—

చ॥ పెడమొగమైన సన్యులను • విక్రముఁడున్ నియమించె; సేనలున్
జెడ నిరుపాయులై యొకరి • నిన్ మతి యొక్కరు మెచ్చకుండ! నిం
దుడుకుఁదనం బెఱింగి బహ • దూ రను ఘూర్జర దేశ భర్తయున్
వెడలె మహాచమూ తతులు • వెంటఁ జనంగను జిత్తురిన్ గొనన్ 131

మ॥ తనుశత్రుం డొకఁ డిప్డు చిత్తురుపయిన్ • దండెత్తినన్ మాటు క్షా
త్రములన్ సోఁకిన రాజపుత్ర నృపతుల్ • దాదవ్వు లందుండి సై
న్యములన్ దోడ్కొని వచ్చి గొండొరువు లం • తర్భేదముల్ వీడి! నిం
దములన్ జిత్తురనంగ నెంత యభిమా • నం బున్నదో వారికిన్! 132

సీ॥ రౌద్రకేసరి కేస • రముల నువ్యోల లూఁగు
నతిబలాఢ్యులు దేవ • నాధిపతులు!
కులపర్వతముల డీ • కొని పిండిగాఁ జేసి
యంబుధిఁ గలుపు ఝ్ఝా • లావనీంద్రు!
లుంకించి తాఁకిన • నుర్వీతలంబు పై
కెగిరించు సోనెగు • క్ష్మేశ్వరులును!
ఫాలాక్షుతో మెడ • పట్టులు వట్టి గె
ల్వంగఁ జాలిన హార • వంశ్యమణులు!
గీ॥ జగము సర్వసంహారంబు • సలుపఁ గలుగు
నసమశౌర్యులు చోండావ • దన్వయులును

నడచు సందర్భంబు లనఁగ సై • న్యములఁ గొనుచు
వచ్చిచేరిరి చిత్తూరు • పుర వరంబు! 133

గీ॥ పదము వెన్క- మఱల్చని • పటు పరాక్ర
మైకధన్యులు గొలువ సు • శేశ మల్లు
సుతుఁడు "భాన్జి" తరలి వచ్చె! • నితఁడు బాడ
బానలముఁ బాఱమిర్రింగు మ • హాభుజుండు! 134

గీ॥ అఖిల జగముల లోని శౌ • ర్యంబు ముద్ద
చేసి దుర్గంబునిండ నుం • చినను గాని
క్రూరులగు పరంగుల పిరం • గులకు ముందుఁ
దూఁచుకొన రాయి నిలుచుట • దుర్లభంబు! 135

సీ॥ లాంబ్రిఖాన్ బిరుద ము • లంకరించెను ప్రౌఢ
గోతులు త్రవ్వించి • కూరిమందు
వహ్నా రవుల్ కాల్చి • పగిలించె! నితండు
బహాదూరుసాహి సే • వలను దనుపు
బుడుతకీచు పరంగి! • ముందు 'వాస్కోడిగా
మా' వెంట నరుదెంచె! • మందుగుండు
పరగించి యగ్నిప • ర్వతముపొంగిన యట్లు
పొంగించి బహుదుర్గ • ములను గూల్చె

గీ॥ వైరి దుర్భేద మైన చి • త్తూరికోట
దక్షిణపు గోడ కుల్లి రం • ధ్రంబు వడియె!
నూర్జిత జగన్నుత పరాక్ర • మాఢ్యుఁడుం స
రాతులను దాఁకి యర్జున • రావు మడిసె! 136

గీ॥ ఐదు వందలు హార వంశ్యు • లతనితోఁ జ
బడిరి! మధ్యాహ్న మార్తాండు • పగిది మండి
యరులఁ దాఁకి దుర్గారాయఁ • డస్తమించె
నఖిల చోండావదన్వయు • లనుసరింప! 137

గీ॥ అవల దేవరభటులు ద్వా • లాన్వయులును
జీవము లొసంగి! రంత భా • గ్యము వచ్చె

ప్రళయ కాలాంతకుని బోలు ♦ భటులఁ గూడి
కదన మొనరించి పండె నా ♦ గండి దండ! 138

సీ॥ తరువాత రాజమా ♦ తయు జవాహిరిబాయి
రాణోదుసుత తను ♦ ప్రాణ ఖడ్గ
ముల నూని యాస్థలం ♦ బునఁ బోరియుడిసె! న
వ్వేలఁది కీర్తిని జరి ♦ త్రల సువర్ణ
పరమాక్షరముల వ్రా ♦ సిరి ప్రాజ్యులాదినం!
బంతలో దుర్గమా ♦ వంత యవల
విజిగె! లోపలి వీర ♦ వరుల సంఖ్యయుఁ దగ్గె!
నుదయసింహ కుమారుఁ ♦ డొకఁడు తప్ప

గీ॥ రాజ వంశమంతయు రణా ♦ గ్రమున మ్రగ్గె!
నతని సురధాని రాయల ♦ కప్పగించి
వెలికి దాఁటించి మిగిలిన ♦ వీరు లొక్క
స్థలము చేరిరి కార్యని ♦ శ్చయము కొఱకు! 139

సీ॥ గందంపునుంచి చె ♦ క్కల నొక్క పోగుగాఁ
గూర్చి తైలముపోసి ♦ కుప్పలుగను
గర్పూర రజము పై ♦ గప్పి యగ్నిరగల్చి
వెలఁదులు పదమూఁడు ♦ వేల మంది
జలకంబు లాడి దు ♦ వ్వలువలు సొమ్ములు
దాలిచి పూచిన ♦ తంగెడులటు
వెడలి పెండ్లికిఁ బోవు ♦ విధమున గుంపులై
చిఱునవ్వు మోముల ♦ సిరులు సింద

గీ॥ బంగరు సలాకలట్లు పా ♦ వకునిఁ జొచ్చి!
రీ వెలఁదులఁ గర్ణావతీ ♦ దేవి నడిపె!
నామె యుదయసింహ కుమారు ♦ ననుఁగుఁదల్లి
దుర్జయార్జునరాయని ♦ తోడఁ బుట్టు! 140

మ॥ తమ కాంతామణు లెల్ల వహ్నిఁబడి మ్రం ♦ దఁగ దేవరస్వామి దు
ర్గము నందుండిన యోధులన్ గొనుచు సూ ♦ ర్యద్వారముల్ దీసి సిం

హాము మాన్ష్కిల్ వెలిఁ దూఁకి శాత్రవులు చీ ♦ కాకొంద వర్తించి సై
న్యములన్ దానును సర్వశూన్యముగ నం ♦ తంబొందె నవ్వేళలో 141

—॥ కర్ణావతీదేవి తనకు సాయపడుమని హుమాయూను నర్థించుట ॥—

ఉ॥ దూరము భయంకరం బగుచు ♦ దుర్గము నిల్వదటంచుఁ దోఁచు ముం
దర నవరత్న సంతతులు ♦ దాఁపిన తోరము రాజ్ఞి ఢిల్లి భూ
వరుకడ కంపె; గష్టములు ♦ వచ్చిన యప్పుడు రాజపత్నులీ
కరణి నొనర్చి సాయమును ♦ గాంచుట వాడుకయై తనర్చెడున్ 142

సీ॥ పరిసర గ్రామ సం ♦ వాసినులగు వెలం
దులు వేయిమంది యా ♦ తోరము నొక
కనకపుం బళ్లెరం ♦ బున నుంచి పూవు ల
క్షతలను బెట్టి పూ ♦ జల నొనర్చి
నడచుచు వెళ్లి యం ♦ దఱు ఢిల్లిఁ జేరిరి!
హుమయూను వంగదే ♦ శమున నుండె!
నటకేగి దర్శించి ♦ రతఁడు హర్షించి హ
స్తమున రక్షాబంధ ♦ నము నొనర్చి,

గీ॥ "సారసదళాక్షు లార! యీ ♦ తోర మంది
నపుడె కర్ణావతీదేవి ♦ కన్ననైతి!
నామె నాచెల్లె! యుదయసిం ♦ గల్లుఁ డయ్యె!
వారి సేమమె నాసేమ ♦ మై రహించు 143

గీ॥ భువన వంద్యుండు సంగ్రామ ♦ భూప మణికి
ముందు మాతండ్రి కూర్చిన ♦ కూఁదు దీఱ
నతని దేవేరినిఁ గుమారు ♦ నాదరించి
నా మొగల్ వంశమును బావ ♦ నం బొనర్తు! 144

గీ॥ అఖిల నృపులకుఁ బాదుసా ♦ యనుట కన్న
రాజపుత్ర మహాదేశ ♦ రాజ మాత
కన్న యనుటయె! కడుగౌర ♦ వాస్పదంబు!
పయనమై వత్తు! బహాదూరు ♦ పంచి పుత్తు! 145

మ॥ స్ఫురదిందీవర నేత్రిలార! యింతె నా • పుణ్యంబు వర్ణింపఁగాఁ
దరమే! నేఁటి విపత్తు దీర్చుటకు నిం • ద్రప్రస్థమేమైన బా
గ్య రమాకాంతము నాదు రాజ్యమయినన్ • గాదేని నాప్రాణ మా
పరమోత్కృష్టగుణాఢ్య పాదము కడన్ • భక్తిన్ సమర్పించెదన్. 146

మ॥ ధర పుట్టొందిన దాది నిందనుక నే • తౌరుష్క భూపాలుఁడీ
భరతోర్విన్ బడయంగఁ జాలని కడున్ • బ్రత్యేక మర్యాద కా
కరమైతిన్! భువన ప్రపూజ్యయగు నా • కర్ణావతీదేవి స
చ్చరణాబ్జంబులు జన్మజన్మమును నే • సద్భక్తి సేవించెదన్" 147

మ॥ అని యత్యుత్తమ భక్తి భావ రతితో • నవ్వారి పాదంబులన్
దన శీర్షంబిడి మ్రొక్కి వీడ్కొలిపి యా • ధన్యాత్ముఁడున్ జైత్రయా
త్రను జాలించి యపార సైన్యసముద • గ్రఘాతి విస్ఫూర్తి బో
రన బ్రహ్మాండము వ్రక్కలై పడఁగఁ జే • రన్ బాద్షా ఢిల్లీ దెసన్. 148

మ॥ చని వైనంబు నెఱింగి "యక్కటకటా! • సర్వంబునున్ మించి పో
యెను!దుర్గం బరిచేతఁ జిక్కెను! బలం • బెల్లన్ నశించెన్! గృపా
ఖని నన్నోరిన దొడ్డతల్లియగు నా • కర్ణావతీదేవి యే
మని చింతించెనొ! మందభాగ్యునకు నే • లా దక్కు తత్సేవనల్. 149

మ॥ అకటా! సూర్యుఁడు వంశకర్తయట! క్షి • త్యబ్ధివలెన్ బూజ్యమై
యకలంకంబగు గొప్ప వంశమట! ధ • న్యాత్ముండు సంగ్రాము సిం
హు కుటుంబంబట! సుంత సాయపడఁగా • నొక్కింత తావున్నఁ బా
యక మత్కీర్తి వెలింగియుండుఁ గద బ్ర • హ్మాండైక సుస్థాయిగన్. 150

సీ॥ ఆతల్లి బదులు త • దాత్మజుఁ గొలిచి దే
హము ధన్యమొనరింతు • నని తలంచి
'చిత్తూరు పురి విస • ర్జించి ఘూర్జర మేగు'
మని బహదూరున • కాజ్ఞఁ బంపె!
నామూర్ఖుఁడు తదాజ్ఞ • నౌఁదలఁ దాల్పక
సమర సన్నాహముల్ • జరుపఁ దొడఁగెఁ!
బాదుసా తుదిలేని • బలములతో దుర్గ
మును నాల్గు వైపుల • ముట్టడించె!

గీ॥ నా మహాసేనఁ జూచి, భ ♦ యంబు లేచి.
నీరు పోఁకు నుప్పువలెఁ గ ♦ ర్పింప కేగె
బలముతో బహదూరు! మా ♦ ళ్వమును ఘూర్జ
రము హుమాయూన్ జయించె! సై ♦ న్యముల నుంచె. 151

గీ॥ పూన్కి చెడి దేశములు పట్టి ♦ పోయి నట్టి
వెకలి విక్రమ సింహుని ♦ వెదకి తెచ్చి
సింహపీఠిఁ బునఃప్రతి ♦ ష్ఠితుని జేసి
దీవనలు పోసి ఢిల్లికిఁ ♦ దెరలిపోయె! 152

సీ॥ జననమో పటుతరు ♦ వంశ నృపాల కులమున!
భావమో రాజ్య సం ♦ పాదనంబు!
ప్రాయమో సకల ప్ర ♦ పంచంబు తనదని
పోరాడ వలసిన ♦ పూర్ణ వయసు!
అరిది రాజస్థాన ♦ మాకర్షకము! కానఁ
రాణి యర్థింప సౌ ♦ భాత్రి మూని
వంగభూమిని దన ♦ పసి మూని, యొకవేయి
మైళ్లగు దెంచి ధ ♦ ర్మము వరించి,
గీ॥ స్వకులు బహదూరు శిక్షించి ♦ పంచి దేశ
ముందఱ భయమును డించి, సౌ ♦ ఖ్యంబు నించి.
వట్టి చేతుల వెనుకకు ♦ వచ్చె! నెట్టి
సరళ హృదయుండో హుమయూను ♦ చక్రవర్తి! 153

— ॥ మేవాడకు వనవీరుఁడు పాలకుఁడగుట. ॥ —

మ॥ ఒకయేడాదిగ రాజ్యమేల్చెనో లే ♦ దో మల్లసేనాధి నా
యకులన్ బాధల ముంచె! నిక్కృతి సలుం ♦ బ్రాధీశుఁ డాత్మన్ సహిం
పక రాజ్యచ్యుతుఁ జేసి విక్రముని, మే ♦ వాడ్దేశమేలంగఁ బూ
నికమీరన్ వనవీరుఁ దెచ్చి నిలిపెన్ ♦ సింహాసనం బందునన్. 154

సీ॥ వనవీరుఁ డవని పా ♦ లన మహాత్రవము సే
యఁ నుదయసింహుఁ గూ ♦ ల్చను దలంచెఁ!

బున్నాయనెడి దాది ♦ ముందెట్లొ నడివట్టి
యొకపూల బుట్టలో ♦ నుదయసింహు
నుంచి భటులవెంట ♦ నూరివెల్పలి కంపి
తనపుత్రు నుంచెఁ ద ♦ త్థానమందు!
వనవీరుఁ డుదయసిం ♦ హుని జూపుమని వచ్చె!
సతి నిజాత్మజుఁ జూపె! ♦ నతఁడు పొడిచెఁ!

గీ॥ పుత్ర శోకంబు దిగమ్రింగి ♦ పున్న వెడలి
స్వామి నొడినుంచి దేశదే ♦ శములు తిరిగి
వర్తకుం 'ఉసాసా' కడ వానిఁ జేర్చి
సకల లోకైక విఖ్యాతి ♦ సంతరించె! 155

క॥ తను నెంత కాచి కుడిపినఁ
దనసుతుఁ బరసుతుని కొఱకు ♦ దారుణ ఖడ్గం
బునఁ జీల్పఁ గనిన వెలఁదుల
వినియుంటిమె పున్నదక్క ♦ వేఱొక దానిన్? 156

క॥ వనవీరుఁడు దాసీనం
దనుఁడును, హంతకుఁడు! సాహి ♦ దా స్వస్థంబౌ
జనపతి లేమి నుహీపా
లన మతఁ డొనరింప నెగ్గు ♦ లెన్ గనక్కుండెన్! 157

—॥ ఉదయసింహుఁడు రాణా యగుట. ॥—

సీ॥ పాలించె నతఁడు మే ♦ వాడ్దేశ మైదేఁడు!
లొక వత్సరము వసం ♦ తోత్సవములు
సకలవైభవముల ♦ సాగు పిదప వన
వీరుఁడు సామంత ♦ విభులఁ జేర్చి
"కొనుఁడు ప్రసాద" మం ♦ చని తొందరించె! స
లుంబ్రాధిపతి కోప ♦ లోహితుఁడయి
యఖిల ప్రజాగణం ♦ బభినుతుల్ సేయంగ
వాని సింహాసన ♦ భ్రష్టుఁ జేసి,

ఆ॥ వె॥ యుదయ సింహుఁ డెచ్చి • యుర్వీశ్వరుని జేసె!
సోసెగుజ్ఞ విభుఁడు • సుగుణరాశి
యఖిలసింహుఁడు సుత • నా కరుణాదేవి
విభవ యుక్తి నొసఁగి • పెండ్లి చేసె! 158

సీ॥ విలయ రణక్షేత్ర • ముల సర్వసేనాధి
నాథుఁడై యెవఁడు సై • న్యముల నడుపు!
నఖిల సామంత గో • త్రాధీశు లెవ్వాని
యాజ్ఞ తొదలఁ దాల్చి • యవధరింతు్ర!
స్వపనతాళి రాజధాని • నిసి దాఁట రాణివా
సము రాజ్య మెవని పో • షకత నిలుచు!
బరమ శిశోదియా • న్వయ భూపతుల నిల్వ
నడఁప నెవ్వఁడు స • ర్వాధికారి!
గీ॥ యెవని యనుమతి లేక ధా • త్రిసుఁ డష్ట
సచివు లుద్యోగులెల్ల మా • న్యప్రమాణ
మవని దానంబు చేయ యో • గ్యతయె కాంచ!
రతఁడు సామాన్యుఁడే సలుం • బ్రాధినేత? 159

మ॥ పదమూఁడేడుల చిన్ని లేవయసు! మే • వాడారాజ్య భారంబునన్
గుదురై మోచెదు వీరు లెందఱో నిజాం • ఘ్రిల్ నొల్తు్ర! ఢిల్లీశుఁడున్
సదయాంతః కరణుండు! నేర్పుమెయి రా • జ్యంబేలు నాసక్తి పెం
పొదవన్ బోక జడాత్ముఁడై యుదయసిం • హుండుండె భోగాప్తిమై. 160
మ॥ సమరోత్సాహము లేదు! విక్రమకళా • సంపత్తియున్ లేదు! దు
ర్దమ ధైర్యోన్నతి లేదు! చిత్తురు మహా • రాజ్యంబు పాలింపఁ బూ
జ్యమయా సద్గుణమొక్కఁడేనియు రపిం • చన్ బోదు! స్త్రైణాఘ్రి గ
ర్భమునన్ మేఁక విధంబునన్ బొడమె సం • గ్రామేంద్రు గర్భమ్మునన్ 161
మ॥ ఉదయాస్తాచల మధ్యగంబగు జగం • బుఱ్ఱాఁత లూఁగించె బె
ట్టిదుఁడా పుత్రుఁడు! ఘోర సంగర కిరి • టిప్రాయుఁడై కీర్తిసం
పద నార్జించెను తండ్రి! యెట్లితఁడు మే • వాడారాజ్య మందార శా
ఖిఁ దిస్నఁ జొచ్చిన పుప్పియట్లు వొడమెన్ • కీర్తిన్ గళంకించుచున్. 162

చ॥ వరుసగ ముప్పదేండ్లితఁడు • పాలనముఁ బొనరించె! నందులో
నిరువదియైదు శాంతముగ • నెట్టులొ సాఁగె! ననంతరమ్మునన్
దరతరముల్ తపింపఁగను • దారుణ ఘోర విపత్తు దేశమున్
బొరిగొని గౌరవంబు నుడి • పోవఁగఁ జేసె నరుంతుదమ్ముగన్. 163

మ॥ అనఘున్ విక్రమసింహు భూరమణుఁ జే • యన్ గల్గి ఢిల్లీపురం
బునకేగెన్ హుమయూను! వంగమున రా • ణ్ముఖ్యుండు సామంతుఁడై
చను షేర్ఖాను స్వతంత్రరాజ్యమును సం • స్థాపింప యత్నించి నా
డను వార్తల్ విని పాదుసా వెసలె సై • న్యాయత్తుఁడై వానిపై! 164

—॥ రాజ్యచ్యుతుఁడై హుమాయూను కడగండ్లు పడుట. ॥—

ఉ॥ అంతములేని సైన్యముల • నంబుధిచాడ్పున నిల్పియున్న సా
మంతుని దాఁకి పోరుట ప్ర • మాదకరం బని సంధిఁ గోరి వృ
త్తాంతము నంపె; షేర్ఖలుఁడు • తానును సమ్మతిఁ జూపెఁ; గ్రుంకెఁ బొ
ద్దంతట; రెండు సైన్యములు • నచ్చట నిల్చెను నిద్రనొందఁగన్. 165

చ॥ కొసరి కసాయి మేకలను • గొంతులు గోయు విధాన మారియున్
మసఁగినయట్లు మృత్యువును • నాలుక సాఁచిన భంగి, ఢిల్లిసై
న్యసమితి పైనవ్రాలి తును • మాడఁగఁ జొచ్చిరి నిద్రవోవు చుం
డు సమయమందె వంగసుభ • టుల్ తమనాథుని యాజ్ఞనెంపునన్. 166

మ॥ హుమయూ నంతటఁ బాఱె ఢిల్లిదెసఁ; క • త్యుగ్రుండు షేర్ఖాన్ ససై
న్యముగా వెంటనుఁ దాఁకెఁ; నేమియును జే • యన్ లేక యుండందు మా
ర్గమునన్ జిక్కిన వారిఁ జేర్చుకొని పా • ఱన్ జొచ్చెఁ; బాంచాలదే
శము దాయంగని రెండుసైన్యములనున్ • సంగ్రామ మయ్యెన్ వడిన్ 167

సీ॥ రణమంచు వినిన మ • రణమంచు బెదరి ది
గ్వర్గంబులకుఁ గొంత • మంది నడువ!
సమదశాత్రవ పరా • గము దృష్టిగతమైన
మది కలంగియుఁ గొంత • మంది పాఱ!
విమతసైన్యము దర్శ • నము దండధరదర్శ
నంబని యడలి కొం • దఱు తొలంగ!

మొదటి పిరంగి చ ♦ ప్పుడయి నంతనె గుండె
లవిసి నీరయి క్రొంద ♦ ఱావలి కుఱుక

గీ॥ నాహుమాయూను త్రోవఁగో ♦ నష్టమైన
జనులఁ జేర్చి చేకూర్చిన ♦ సైన్యమెల్లఁ
జేయి జారిన కడవన్నై ♦ ఛిన్న మయ్యె!
షేరుఖాన్ ఢిల్లి పట్టాభి ♦ షిక్తుఁ డయ్యె! 168

మ॥ చమువుల్ లేక మహామహీవలయ రా ♦ జ్యం బూడిపోవంగ నా
హుమయూనున్ వెనువెంటనే తగిలి లా ♦ హోర్ దాఁకఁ బోనీక సై
న్యములన్ దోడ్కొని షేరుఖాను దఱిమెన్! ♦ వాఁ డంతటన్ దేశ దే
శములన్ గ్రుమ్మరె నెచ్చటేనిఁ దలఁదా ♦ చన్ వచ్చునం చాసతో. 169

మ॥ స్తిమితత్వంబు వహింపకేగి యొకచో ♦ 'షేకల్లి' యన్ బారసీ
కమహాయోగిని గాంచి యాతఁ డడుగం ♦ గాఁ జెప్పె నాత్మీయవృ
త్తముఁ; దత్సన్నిధి నున్నవానిసుత 'యు ♦ ద్వాహమ్ము గావించుకొం
దు మహాభాగుని వీని నే' నన నతం ♦ డున్ వాని కిచ్చెన్ సుతన్. 170

సీ॥ ఏలుటకు మహాను ♦ హీవలయము లేదు!
కొలువు సేయఁగ భట ♦ కోటి లేదు!
కాంచనాదిక ధన ♦ గ్రామంబులును లేవు!
సముదార దివ్యభో ♦ గములు లేవు!
వసియింపఁగా దొడ్డ ♦ భవనంబులును లేవు!
తాల్ప నవరత్న ♦ వస్త్రములు లేవు!
వాహ్యాళి నొనరింప ♦ వాహనంబులు లేవు!
శ్రమ దీఱ గంటవి ♦ శ్రాంతి లేదు!

గీ॥ కేవలము హుమాయూన్ పడు ♦ క్లేశ మొంది
మనసు గరగించు సౌజన్య ♦ మహిమ నెంచి
కోరి యర్ధాంగమును బంచు ♦ కొనియె! నట్టి
పావనాత్మిక యో హమీదా ♦ డా సఖాటి! 171

మ॥ వనితన్ దోడ్కొని గాంచు యోధపురికిన్ ♦ వచ్చెన్ దలన్దాప! వ
ద్దనెఁ దన్నేత! జసల్మియర్ ప్రభువు పొ ♦ మ్మంచాడె! మార్వార్ నృపుం

డును బంధింపఁగఁ జూచెఁ! గొన్ని నెల లి • ట్లున్ జెల్ల రారాజు దూ
ఱెను దూరమ్మున సింధుదేశపు టెడా • రిన్ దైవమున్ దూఱుచున్. 172

సీ॥ వైశ్వానర జ్వల • జ్జ్వాలా సమూహంబు
చిమ్మి సూర్యుఁడు ప్రకా • శించు చుండ!
నుర్వీతలంబెల్ల • నుఱ్ఱూఁతలూఁగ జృం
భించి వాయువు పెల్లు • వీచు చుండ!
సుడికట్టి మండుటి • సుక లేచి మిన్నంది
వ్రాలి పాంథుల ముంచి • వైచు చుండఁ!
పెక్కు యోజనములు • వెడలిన నాల్కపైఁ
జేర్పఁ జుక్కయు నీరు • చిక్క కుండ!

గీ॥ నరులు దఱుమంగ! ననుచరు • లంత మొంద!
స్వర్గసౌధంబుల వసించి • పరమ సుఖము
మీఱఁదగు నిందుమాలా లె • డారి యందు
నా హమీఁడాలతాంగి యె • ట్లురుగ నేర్చె! 173

గీ॥ రాచఱికె మది బరువయ్యె • రాజమౌళి!
కనుచరత్వంబు బరువయ్యె • ననుచరులకు!
నున్న వారెల్ల బరువైరి • గొంటియలకు!
నొక హమీఁడ మాత్రము చలిం • పక యె నిలిచె! 174

మ॥ హుమయూ నెక్కిన యొంటెయున్ మడిసె న • త్యుగ్రాతపవ్యాప్తిఁ; గూ
రిమి భృత్యుం డని యొంటె నిమ్మనుచు 'టా • ర్డీబేగు'! నర్థించెఁ; గ్రూ
రమతిన్ వాఁడు తిరస్కరించి చనె! నిం • ద్ర ప్రస్థరాజ్యంబుఁ బూ
ర్ణముగా నేలిన మేటి నీరమున క • న్నన్ బల్చనయ్యెన్ గటా! 175

గీ॥ తురకఱేనికిఁ గష్టముల్ • పెఱిగెఁ గాని,
పెక్కు విశ్వయత్నములు స • ల్పినను గాని
కానరాదయ్యె వట్టి వె • క్కసము తక్క
నిందుదప్పి నార్పఁగ నొక్క • నీటి చుక్క! 176

గీ॥ చాలుపండిన యా హమీ • డాలతాంగిఁ
జిచ్చుటెండ కెడారిలోఁ • దెచ్చు టెల్లఁ

బూఁపపిందెల గ్రొమ్మావి ♦ మొక్క నకట!
తీవ్ర దావాగ్నిలో నీడ్చి ♦ తెచ్చుటయ్యె! 177

సీ॥ తడిలేక యెండి కొ ♦ ఱడుగట్టి నాల్క నా
భిని జేర దిగగుంజు ♦ కొనుచుఁ బోవ!
నెంతేనిఁ జలియించి ♦ హృదయకోశం బట్టె
కుత్తుక కెకతొట్టు ♦ కొనుచు రాఁగ!
మెదడు నీరసమయి ♦ ప్రిదిలి పైత్యోద్రేక
మునను బ్రలాప సం ♦ ధిని వెలార్ప!
క్షితితలంబెల్ల మిం ♦ గినఁగాని తీరఁబో
దనిపించు మరణ వే ♦ దన కలంప!

గీ॥ నున్న కష్టంబు లట్టులే ♦ యుండ యవన
భటులు దాహమార్పఁగ నీరు ♦ పడయలేక
పిచ్చియెత్తుచుఁ గేకలు ♦ వేసి కొనుచుఁ
బాఱి రెల్లెడ నిసుక నా ♦ డారి నడుమ! 178

చ॥ కని రొక బావి వేఁకువను ♦ గన్నులపండువు గాఁ గఁదాన మో
ట నిడి జలంబు దోడెదు నె ♦ ర్దఁ వడి నెడ్లను దోలుకొంచుఁ బో
వు నతని కొక్కచోఁబయికి ♦ బొక్కన వచ్చెనటన్న మాటలుఁ
వినఁబడఁబోమిఁ బెద్ద రణ ♦ భేరిని గొట్టు టవశ్యమై తగెఁ! 179

సీ॥ అతిదాహమున నోరు ♦ లట్టె తెఱచియున్న
జనులు బొక్కిన నూతి ♦ కొనను నిల్చి
నిలువకమున్నె దా ♦ నిపయిఁ బడి జలంబుఁ
ద్రావఁబోయిన యంతఁ ♦ ద్రాడు తెగుట
బావిలో బొక్కన ♦ పడె! దానివెంటఁ గొం
దఱు నూతఁబడిరి! కొం ♦ దఱు మహోగ్ర
తాప మోర్వక నైక ♦ తస్థలిఁ బడి మ్రగ్గి!
రిక గొంద ఱానూతి ♦ నెక్కి దూఁకి!

గీ॥ రంతఁ గొందఱు చేదితో ♦ యమ్ముఁ ద్రావి
గుండె బరువెక్కి కూలిరి! ♦ కొంద ఱెట్లొ

'యమరకోట'కు నాఁటి సా ♦ యంతనంబు
నడచి కన్గొని రచటి రా ♦ ణా ప్రహరు! 180

— ॥ అక్బరు జననము. ॥ —

మ॥ మనుజాధీశుఁడు వారినందఱను స ♦ న్మానించె సౌఖ్యం బెల
ర్పను; నైదున్ బది వందలున్ నలువ దా ♦ పై నింక రెండైన యే
టను నా కార్తికజీవవారము హమీదా ♦ బానూ బేగంబు పు
త్రుని నీళ్లాడె నుదాత్తలక్షణయుతున్ ♦ దుర్వార తేజోన్నతున్! 181

శా॥ పెద్దల్ గోత్రిజు లక్కుమారకునకున్ ♦ బ్రీతిన్ మహమ్మజ్జలా
లుద్దీ నక్బరు నామముంచిరి; హుమా ♦ యూన్ పాదుసా చూచి యా
నుద్దుంగుజ్జ్వని కీర్తివల్లి దెసలన్ ♦ బుష్పింపఁ గాక్షించుచున్
ముద్దల్ ముద్దులు పంచె నాప్తులకు స ♦ మ్మోదంబుమైఁ గస్తురిన్. 182

చ॥ తను గడుఁ జేరఁదీసి తల ♦ దాఁచుకొనన్ నెల విచ్చి పేర్మి ని
క్కొనఁగ నెలంగు నయ్యమర ♦ కోట నృపాలుని నొద్ద నాత్మమో
హానసతియౌ హమీదాను ని ♦ జాత్మజు నక్బరు నిల్పి వెంట న
య్యనుచరు లేగుదేరఁగఁ బ్ర ♦ యాణ మొనర్చె నతండు వెండియున్ 183

మ॥ త్వరమై నాతఁడు పారశీకమును గాం ♦ ధారంబు కాబూల్ నను
ధరలన్ జేకొనెఁ! గాని రాజ్యము స్థిర ♦ త్వం బందకే సాఁగె; ని
కరణిన్ దాఁ బదునాలుగేడులు కడున్ ♦ గష్టంబులం బొంది నం
దురె; నీలోపలఁ గొన్ని మార్పు లచటన్ ♦ దోతెంచె ఢిల్లీపురిన్. 184

మ॥ అలషేర్షా బలశౌర్యశోభితుఁడు రా ♦ జ్యం బెల్లఁ గౌశల్యముల్
వెలయన్ బాలనచేసె; వాని పిదపన్ ♦ బృథ్వీపతుల్ చాల దు
ర్బలులున్ గ్రూరులు నౌట రాజ్యమది స్థై ♦ ర్యంబూడెఁ గొన్నేండ్ల క
వ్వల రాజయ్యె సికందర్‌కీతఁడు సురా ♦ పాన క్రియాలోలుఁడౌ! 185

మ॥ స్థితి యిట్లుండు టెఱింగి దండుఁగొని డా ♦ సెన్ దా హుమాయూను! భా
రతముం డుగ్రపరాక్రమక్రియుఁడు బై ♦ రాంఖాను వచ్చెన్ జమూ
పతి! పంద్రెండవయేటనున్న సుతుఁ డ ♦ క్బర్ గూడ నేతెంచె! ను
ద్ధతిమై యుద్ధము సాఁగె ఢిల్లిని సికం ♦ దర్‌సా చమూపాళితో. 186

మ॥ కడు లేఁబ్రాయపుఁ జిన్నికుఱ్ఱఁడగు న • క్బర్ ముందు నిల్చుండి మొ
క్కుఁడు శౌర్యం బుసికొల్పి పూన్ప సుభటుల్ • ఘోరంబుగాఁ దాఁకి ర
య్యెడ ఢిల్లీపతి యోడిపాఱె! విజయం • బింపారఁ బట్టాభి షి
క్తుఁడునయ్యెన్ హుమాయూన్ నిజాప్తులు నుసం•తోషించియుప్పొంగఁగన్

—॥ అక్బరు సింహాసన మెక్కుట. ॥—

సీ॥ పేర్మండలంబను • స్నిగ్ధసౌధంబున
హుమయూను కూర్చుండి • యొక్కనాఁడు
పొత్తముల్ చదువు న • ప్పుడు ప్రార్థనము చేయు
కాలంబుఁ దెలుపుచు • గంట మ్రోగె!
వడివడి దిగరాఁగఁ • దొడఁగె నాతఁడు! నును
పై యున్న మెట్లపై • పదుగు జాఱెఁ!
బైనుండి క్రిందికిఁ • బడుట గాజు విధానఁ
దలయును వేయుప్ర • క్కలుగఁ బగిలె!
గీ॥ నవలఁ బంజాబునందున్న • యక్బరటకు
వచ్చెఁ! బదు నైదువంద లేఁ • బదియు నాఱు
నగు శరత్తున నతనిఁ గ • ల్యాణపురిని
ఢిల్లిపతిఁ జేసి రుద్యోగు • లెల్లఁ గలిసి. 188

మ॥ ప్రవిశేష ప్రకట ప్రభావుఁడగు బై • రాంఖాను తూత్రైక ధ
ర్మవిదుం!డాహుమయూను కోడలు సలీ • మాదేవిఁ బెండ్లాడి బాం
ధవుఁడై యక్బరు బాల్యమూడి తరుణ • త్వంబొందు నందాఁక రా
జ్యవిధానంబును నిర్వహింపఁదొడఁగెన్ • సంరక్షకుండైతగన్ 189

—॥ బైరాంఖాన్ విజయములు. ॥—

సీ॥ కాశ్మీరమందు సి • కందరుసాహి సై
న్యము ప్రోవుచేసి • రణంబుఁ గోర,
నచటఁ గాబూలులో • నక్బరు ప్రతినిధి
తరుణంబు వీక్షించి • తిరుగఁ బడఁగ,
మాళ్వదేశాధీశ • మణి ఢిల్లిపైఁ బడు
టెప్పు డెప్పుడటంచు • నెగురుచుండఁ.

బలివంటి పోరిడ హే ♦ముఁడు క్షణక్షణమును
దంష్ట్రి రాఁగాలు ♦ ద్రవ్వ్యచండ,

గీ॥ నల్ల కాబూలుకొఱకేగ ♦ ఢిల్లి పోవు;
ఢిల్లికై చూడఁ గాబూలు ♦ చెల్లి పోవు;
వెనుక నూయి ముందర గోయి ♦ యనుట యన్యో
శౌర్యధనుఁడు బైరాంఖాను ♦ సైన్యపతికి. 190

క॥ తోలుత సికందరుసాహిని
గలియుచు బైరాముఖాను ♦ కల్యాణకర
స్థలమున నోడింపఁగ నతఁ
డలఘుగతి శివాల కద్రు ♦ లందున డాగెన్. 191

సీ॥ లక్ష పదాతి ద ♦ళంబు కరుల్ వేయుఁ
దనవెంట నేతేర ♦ దండు వెడలి
హేముఁ డాగ్రాపురి ♦ కేగి చేకొనిదాని;
నవల ఢిల్లీపురం ♦ బాక్రమించె;
బైరాముఖానుఁ డ ♦ క్బరు ససైన్యముగ సి
ద్ధంబైరి పానివ ♦ ట్టంబు నొద్ద!
నుభయ సైన్యములకు ♦ యుద్ధం బొసఁగెఁ; దురు
ష్కులు శత్రుసేన వ్ర ♦ య్యలుగఁ జేసి

గీ॥ హేము బంధించికొనుచు బై ♦ రాముఁ జేర్చి;
రతఁడు కారుణ్యమును మాని ♦ యక్బరుఁ గని
'శత్రుశేష ముపద్రవ ♦ సమితిఁ దెచ్చు;
శీఘ్రముగ వీనిమస్తంబుఁ ♦ జెందు'' మనియె! 192

శా॥ "నామేల్వార్చి వచించు నీనుడిఁ దలన్ ♦ దాల్పంగనేఁ గాని, యీ
హేముం డోడినవాఁడు; పట్టువడినాఁ; ♦ డీనాఁ డవధ్యుండు; నా
కై మన్నింపు'' మటంచు నక్బరనె; ఖ ♦ డ్గం బెత్తి ఖండించె బై
రాముం డత్తఱి హేము మస్తమిలపై ♦ రాలన్ భటుల్ భీతిలన్. 193

సీ॥ క్షాత్రప్రధాన ని ♦ శాత వర్తనుఁడాట
నావేళ మది కొంత ♦ యులరుఁ గాని

బైరాముఖానుఁ డ ♦ క్బరుఁ బెక్కుగురువుల
వేర్వేఱ నియమించి ♦ వివిధ విద్య
లభ్యసింపఁగఁ జేసె; ♦ నాతని వేయిఁ క
న్నులఁ జూచి వేయి చే ♦ తులను గాచి
ధరణి రాజ్యం బూర్జి ♦ తము చేసెఁ; గాబూలు
చేకొనె; గాంధార ♦ సీమ గెలిచె;
గీ॥ జాన్ పురం బజమీర్ ప్రదే ♦ శములు గొనియెఁ;
గ్వాలియరు పట్టుకొనియె; మా ♦ ర్వారు నొంచెఁ;
క్షణము విశ్రాంతిఁ గొనక రా ♦ జ్యములు గెలిచె
నక్బరున్నతి పరమ ల ♦ క్ష్యముగ నుంచి; 194

—॥ అక్బరు సమగ్ర రాజ్యాధికారము నొందుట ॥—

మ॥ అరువెంచెన్ బదునెన్మిదేడులగు ప్రా ♦ యంబు; బప్పు డక్బర్ వసుం
ధరఁ దానేలఁ దలంచె; సేవకతతిన్ ♦ ద్రవ్యంబు నర్పించి సం
బర మొప్పారఁగ నాత్మరక్షకుని నా ♦ మక్కాకుఁ బంపించె ద
గ్గర నబ్దూరహిమాను దత్సుతుని వే ♦ డ్కన్ నిల్పి పోషించుచున్. 195

సీ॥ ఆజాను దీర్ఘ బా ♦ హార్గళయుగళుఁ! డు
ద్యత్పద్మ పత్ర నే ♦ త్రముల వాఁడు!
ఘనసార్వభౌమ ల ♦ క్షణ లక్షితుండు! ప్ర
సన్నమనోహరా ♦ స్యంబు వాఁడు!
బలశోభితా రోగ్య ♦ వచ్ఛరీరుండు! నీ
రద సామ్యగంభీర ♦ రవము వాఁడు!
శాంతిప్రధాన వ ♦ ర్చశ్శోభితుండు! ద
యాపూర్ణ మృదు హృద ♦ యంబు వాఁడు!
గీ॥ కష్టము సహింపఁగల ధైర్య ♦ గరిమ వాఁడు!
వితరణ వికాసముల వాఁడు! ♦ వేయు నేల!
భరతఖండ మేలిన సార్వ ♦ భౌము లందు
నింతవాఁ డింక లేఁడను ♦ నంత వాఁడు! 196

సీ॥ అంచెలమార్చుచు ♦ నశ్వంబులను, స్వారి
యిరువదైదా మడల్ ♦ పఱచియుండె!
ఘూర్జరమ్మునఁ ద్రోవ ♦ గొప్ప బెబ్బులిరాఁగ
నడ్డానిఁ జేతఁ జో ♦ ప్పడఁచియుండె!
విడక 'ఖండీరా' వ ♦ నెడి మత్తకరి నెక్కి
మైధామడలదూర ♦ మరిగియుండె!
నాడు సింగము పిల్ల ♦ లైదు మందులెడారి
యందుఁ బైఁబడఁ బీచ ♦ మణఁచియుండె!
గీ॥ నిరువురను దనసందిట ♦ నిఱికి కొనుచుఁ
గోట గోడలపై నెక్కి ♦ దాఁటియుండె!
నప్రతీప ప్రతాప ధై ♦ ర్యములు దేహ
బల మితని సొమ్మనుచు మెచ్చ ♦ మెలఁగియుండె! 197

మ॥ భగవాన్దాసుఁ డొసంగె నాత్మసుత న ♦ క్బర్ నేత కుద్వాహమున్!
దగరాడ్ధీరుఁడు వాని సోదరు సుతుం ♦ డౌ మానసింహుండు వీ
ర గరిష్ఠుండయి ఢిల్లిఁ జేరి పరరా ♦ ష్ట్ర శ్రేణులన్ గెల్చి కీ
ర్తి గురుత్వంబు వహించి యక్బరుకడన్ ♦ దీపించె సేనాన్యుఁడై.

సీ॥ ముప్పాలుప్రజ హైంద ♦ వులుగాన వారిసే 198
మము తనకెప్డు సే ♦ మమని తలఁచె!
నని జయించుచుఁ బట్టు ♦ కొనినవారిని బాని
సలఁ జేయు చట్టంబు ♦ నిలిపివైచె!
యాత్రికులకేగు భ ♦ క్తావళితోఁ బన్ను
గొనరాదనుచు దానిఁ ♦ గొట్టివైచెఁ!
జిరకాలముగను వే ♦ సెడు జట్టుపన్ను న్యా
యవిరుద్ధమని దాని ♦ నవలఁ ద్రోసె!
గీ॥ హైందవంబున యవనరా ♦ జ్యంబు నిలుప
నెన్నియత్నముల్ వలయుఁ దా ♦ నన్ని చేసె!
మంచుమలనుండి కన్యాకు ♦ మారి దాఁక
వసుధ నెల్లఁ బాలింప న ♦ క్బరు దలంచె! 199

—॥ అక్బరు - దిగ్విజయములు. ॥—

క॥ కొనె మేతాద్రిదుర్గము! చే
కొనె గోగ్రోకోట! యింక • గోవిందవనం
బను దేశము గెలిచెను! గో
టను నాగాద్రిపురమునన్ దృ • ఢమ్ముగఁ గట్టెన్. 200

క॥ శరణని మాళవపతి దరి
కరుదేరఁగఁ గూర్మిఁగని స • హాస్రిహాయాధీ
శ్వర సేనాధిపుగ నా
దరమున నాస్థానమున న • తనిఁ జేర్చుకొనెన్. 201

క॥ తపతీనదిపైఁ గల బ్రి
హ్మాపురంబును విజయగృహము • నతిరయమారన్
నృపకులదీపకుఁ డక్బరు
కృపకును లోనగుదు మనుచుఁ • గ్రిల్లురికె వడెన్. 202

క॥ రావలపిండి సమీపము
లో విలయాంతకునకైన • లొంగని గక్కా—
రావీరుల కావర ముడి
వోవఁగఁ బంజాబుదేశ • మును గెల్చుకొనెన్. 203

క॥ తూరుపుసీమల దృష్టిని
సారింప నడేల్ కుఁఖండు • చానార్ దుర్గ
ద్వారములు దీసి యక్బరు
భూరమణుని పాదకమల • ములు పూజించెన్. 204

క॥ నరసింగపూరు చౌరా
ఘరు మజీహాసంగబాదు • క్రమ మొప్పఁగ న
క్బరు పాదుసాహి చరణాం
బురుహంబులు శరణమనుచుఁ • బొగడుచు నిలిచెన్. 205

క॥ 'రండో వీరోత్తమ!' యని
ఖాండేషునృపుండు కాళ్లఁ • గడిగి తనూజన్

మండల రాజ్యంబు నృపా
ఖండలునకు నప్పగించెఁ • గడు భక్తిమెయిన్. 206

గీ॥ చతు రనంత బలంబులు • సందడింప
సింధు గంగానదుల మధ్య • సీమలందుఁ
జైత్రయాత్రా పరంపరల్ • సలిపి దిగ్వి
జయము సాగించె నక్బరు • చక్రవర్తి! 207

—॥ చిత్తూరు - మూడవ ముట్టడి. ॥—

గీ॥ 'భరతఖండైక భాగ్యమై • పరగు రాజ
పుత్ర రాజ్య మేలని వాని • పొడవు వృథయె'
యని నడిపె సేన! తద్భార • మాఁగలేక
యురగనాయకు ఫణము లు • ఊఁతలూఁగె! 208

గీ॥ మహిత స్థైర్యంబు తోడర • మల్లు, మేరు
శిఖరమట్టి ఖాసింఖాను; • సింహ మట్టి
బిరుదుఁ 'ఖాన్ ఖానను' పిడుగుల్ • వ్రేళ్ల నలుపు
భయద శౌర్యాలు నడిచి ర • క్బరును గొలిచి! 209

మ॥ అలఘుప్రాభవ కీర్తివిక్రమ యుతుం • డౌ మానసింహుండు, కొం
డలఁ బిండిన్ బడఁగొట్టు మేటి భగవాన్ • దా, సిందు నందున్న యో
ధులకున్ వృద్ధపితామహుం, డిరువురున్ • దోతెంచి; రీతండ్రి కొ
డ్కులు దర్పించిన నడ్డుపాటు గలదే • క్షోణీతలం బందునన్! 210

క॥ ఈమెయి నక్బరు నడుపు చ
మూమానం బింతయనఁగ • బుద్ధిఁ జొరదు; బు
స్సా మొదలుగఁ బాంగోళ్
సీమ వఱకుఁ బదియుమైళ్లు • సేనలు నిండెన్. 211

సీ॥ జలధులంతటి సర • స్సులు పెక్కు లుండెఁ! గ్రిం
దట వనాశానది • నడచు చుండెఁ!
దరగని బహువిధ • ధనధాన్య తతు లుండెఁ;
బైరు క్రొత్తఁగ నెక్కి • వచ్చు చుండెఁ;
గోటలేదును జుట్టు • కొని దృఢమ్ముగ నుండెఁ;
సప్తమహాద్వార • సమితి యుండెఁ;

గురుతరాయుధ పరం ♦ పర చింత నుండె; యో
ధతతి చిత్తములందు ♦ ధైర్య ముండె;
గీ॥ నశ్వరున కై కా దవ్వాని ♦ యబ్బకైనఁ
దగ్గక రణంబు సాగింపఁ ♦ దగ్గ యున్న
సాధనము లుండెఁ; లేమి యె ♦ చ్చటను గలుగ
దుదయసింహ రాణా లేమి ♦ యొకఁడు తక్క; 212

ఉ॥ అంగడి నున్నవన్ని శని ♦ యల్లుని నోరనటన్న మాట వా
సింగనఁ జేసి యయ్యుదయ ♦ సింహుఁడు యుద్ధమటన్న భీతిచేఁ
గ్రుంగుచు "రాజపిప్పలి"ని ♦ గోహిలువంశ్యులయొద్ద డాఁగె; నై
నం గనరాదు లోపము ర ♦ ణం బొనరించెడు యోధకోటికిన్. 204

సీ॥ అల సలుంబ్రాధీశుఁ ♦ డగు సాహిదాసు, శౌ
ర్యాన్వితుండగు దేవ ♦ రాధిపతియు
ఝెలావ్రభువు శుద్ధ ♦ కీర్తి పుత్తన్న పుండు,
బేడ్లా కొఠేగియా ♦ పృథ్వివరులు,
నింక మడేరియా ♦ నృపతి దూడాసింగు
పావనాత్ముండు ఝూ ♦ లా విభుండు,
ఝూలూరినేత యీ ♦ శ్వరదాసు, సోనెగు
క్షేంద్రుఁడైన కరుణా ♦ సాంద్రిరాజు,
గీ॥ గ్వాలియరు దేశపతి లోను ♦ గా మహీపులు
పగిలెడు పిరంగి గుండుకు ♦ వక్ష మిచ్చు
ధైర్యహేమాద్రులు విశేష ♦ దళము లలరఁ
బోయి నిల్చిరి గెలుపొ చా ♦ వో యటంచు! 215

క॥ అల్లి యమభటుల నేరెడు
బల్లిదులగు భటులు గొలువ ♦ వైరుల మానముల్
తల్లడిలఁగ వచ్చెను జయ
మల్లుఁడు రణరంగపార్థ ♦ మహిత యశుండై. 216

సీ॥ ఇతఁడు మార్వాడ్మహీ ♦ పతి మాళదేవుని
సుతుఁడు; బాల్యమునందె ♦ శూరలోక

చూడామణియన వి ♦ శుద్ధకీర్తి గడించెఁ;
దండ్రి కీతనికి భే ♦ దంబు వచ్చి
చిననాఁడు తనదేశ ♦ మును వీడి వెడలెఁ; నీ
తని భుజాటోప దు ♦ ర్దాంతత విని
చిత్తూరిరాణాయుఁ ♦ జేయిచ్చి మన్నించి
బదనూరు సంస్థాన ♦ పతిగఁ జేసె;
గీ॥ మహితధైర్యంబు వజ్రప ♦ ర్వంబు గాఁగఁ
దనమ రాత్రోన్మహా వీర ♦ తతులఁ బొన్చి
తగిలి బ్రహ్మాండమైనఁ బిం ♦ డిగ నొనర్చు
రౌద్రతరఘాటిఁ గాలాగ్ని ♦ రుద్రుఁ డితఁడు. 216

క॥ కృప నాదరించు చిత్తూర్
నృపచంద్రుని పనులు మేని ♦ నెత్తురు కండల్
విపులముగ దారవోసి జ
యపు స్వామిస్నేహ బంధు ♦ రుల్ వీరెల్లన్. 217

సీ॥ సమర మనేకమా ♦ సము లయ్యె; నక్బరు
పెక్కూరు పనివాండ్రఁ ♦ బిలువ నంపి
దుర్గంబుక్రింద గో ♦ తులను ద్రవ్వించి నా
ప్పించి యగ్నిరజంబు ♦ ప్రేలిపించెఁ;
జిత్తూరిసేన కా ♦ చిన నూనియలు శిలల్
గుప్పుచు వైరులఁ ♦ గూల్చుచుండె!
యవనుల తలలపై ♦ శవకోటిఁ గప్పి దు
ర్గము క్రిందఁ దోవ్రంగఁ ♦ గడఁగుచుండి;
గీ॥ రెప్పమును గాని యాగోడ ♦ లెచట గాని
పగులుటయుఁగాని సేన లోఁ ♦ బడుట గాని
కానరాదయ్యె; నక్బరు ♦ గడియ గడియ
కెట్టు లెటు లటంచు వినుగు నొం ♦ దుటయె కాని! 2 8

సీ॥ ఉన్నమం దంతయు ♦ నొకమాటె పెక్కతా
వులఁబోసి కూరి ని ♦ ప్పును ఘటింప

నొకగని ప్రేలెఁ; ముం • దుండిన మొగలుల్
కూలిరి; గోడయుఁ • గొంత యురలె;
దానితోఁ గొంద ఱం • తమునొంది; రీవలా
వలివారు ముందుకుఁ • గలయ దూఁకి;
రంత బ్రహ్మాండంబు • నగలించు నొక పెద్ద
ధ్వనితోడ నొండొక • గనియుఁ బ్రేలె;
సీ॥ దాన యవన హైందవుల గా • త్రములు గాలిఁ
గలిసె శతశ స్సహస్రశః • ఖండము లయి;
విఱిగె నొకగోడ; యచటఁ బె • క్కురు యవనులు
హైందవులు చేరి; రయ్యె ఘో • రాహవంబు! 219

క॥ రణరంగ మృగేంద్రులు చో
హాణవీరులతోఁ గొశేరి • యా బేడ్గా రా
ణ్మణు లాసమ్మర్ద రణాం
గణమునఁ దెగి స్వర్గసీమఁ • గట్టిరి గృహముల్. 220

క॥ హారవంశ్యుల నడుపుచు నీ
శ్వరదాసును దేవరాధి • పతియును రఘులే
శ్వరుఁడును బెండ్లికి నడిచిన
కరణిని నని కేగి మడిసి • కసిరి యశంబుల్. 221

క॥ దురమున దూడాసింగును
గరుణాసాంద్రుండు వైరి • గణ మస్త్రముల౯
దఱుగుచు రాసులు వోసిరి
పరలోక ద్వారసీము • వఱ కవ్వేళ౯. 222

క॥ భండనశతఘ్నులనఁ దగు
చొండాప ద్భటులతో వి • శుద్ధ యశస్సాం
ద్రిందైన సాహిదాసుఁడు
ఖండితుఁడై యొరగె భటులు • కళవళ మంద౯. 223

క॥ చండనృపాఖండలు కుల
మండనుఁ డరిదండధరుఁ డ • మాత్యుఁ డితండు౯

బాడినమొడ నీనాటి క
ఖాడ స్తంభం బొకండు • గనన్నై యుండుగ్. 224

—॥ పుత్త - యుద్ధము ॥—

ఉ॥ ఆవిధి సాహిదా సరుగ • నాతని స్థానమునందు నెప్డు చోం
డావతుఁడెక్కుఁగావలయు • నట్ విధి చొప్పున భారమెల్ల ఖే
ల్వావిభుఁడైన పుత్తపయి • వ్రాలె! వధూయుతుఁడై వివాహ తం
త్రావృతుఁడై సహస్ర వని • తావృతుఁడై యతఁడుండె వేడుకన్. 225

మ॥ అకలంకంబుగ సాగె నాకబలి! పు • ణ్యస్త్రీలు కల్యాణ దీ
పకముల్ ద్రిప్పిరి! పుత్త వరుఁడై • పద్మావతిన్ గూడి వే
దికపై నుండెను! వారి ఫాలముల దీ • ప్తిన్ బెంచె ముత్యాల బా
సికముల్! మంగళ వేదమంత్రములు ఘో • షించెన్ శ్రవఃప్రీతిగన్. 226

సీ॥ అపు డొక్కసైన్యనా • యకుఁ డరుదెంచి 'దే
వా! సాహిఁదానుగా' • ననుచు మొ్రక్కెఁ!
గని చివాలునఁ బీఠ • మున నిల్చి కర్తవ్య
మెఱుఁగుదు! క్షణములో • నరుగుదెంతు'!
నని యందుఁగలుగు స్త్రీ • లందఱకును మొ్రక్కి
తల్లి దీవన లంది • తరలి, సేన
కధిపతియౌచు సూ • ర్యద్వారమున విజృం
భించుచు నాక్రొత్త • పెండ్లికొడుకు
గీ॥ గొఱ్ఱియల మందఁజొచ్చి గ • గ్గోలు పఱచు
బెబ్బులి విధానఁ దురకల • పిండు నఱికె!
నామహాబాహు బాహు శౌ • ర్యంబుఁ గాంచి
యుభయసైన్యంబులును దల • లూఁచి నిలిచె! 227

మ॥ అనుఁగున్ గోడలిఁ బుత్త తల్లి గని "ప • ద్మా! పుత్త యుద్ధంబు సే
యను వేంచేసె! నతండులేని ధర శూ • న్యంబౌను నాపాలి! కిం
దున నేనుండను! వానినే యనుసరిం • తున్! నీవునున్ రమ్ము! క
ల్గును బేర్వాసియు! భర్తతోడిది గదా • లోకంబు పద్మాక్షికిన్. 228

సీ॥ అనఁ బద్మ "తల్లి! నే ♦ జనియించు ప్రియరాన్వ
యమున భీరులు పుట్టు ♦ వంద లేదు!
గర్భస్థ శిశువు సం ♦ గరమన్నఁ బులివోలె
వెలిదూకి రిపుల జృం ♦ భించి తాఁకు!
సంగీతమునకన్న ♦ సామగానముకన్న
రణగర్జ మధురత ♦ రమ్యునాకు!
సెలవైన వెంటవ ♦ చ్చెద నంచుఁ బలికి పు
ణ్యాంగనలను జేరి ♦ "యక్కలార!
గీ॥ యనుమతింపుడుఁ కదనక ♦ ల్యాణయాత్ర,
కనుచు మ్రొక్కిన వారెల్ల ♦ రతివిశాల
ధవళ నేత్రాబ్జముల బాష్ప ♦ ధార లొరసి
వెలఁదిఁ గౌఁగిటఁ దొరసి దీ ♦ వెనలఁ గురిసి; 229

మ॥ అల చిత్తూర్పుర వీధులందు నిబిడం ♦ బై మూఁగి వీడ్కొల్ప, వా
రల మోముల్ గని పద్మ 'యల్లదిగొ సూ ♦ ర్యద్వారముల్ దాటి శ
త్రుల వక్షంబులపై నిజాశ్వఖురముల్ ♦ ద్రొక్కించె! నానాథునిన్
గలయన్ బోవలె నిల్వుఁడీ'యని నమ ♦ స్కారంబులన్ జేయుచున్. 230

సీ॥ ముద్దుమోమున నాణి ♦ ముత్తెంపు బాసికం!
బద్దంపుఁ జెక్కిళ్ల ♦ యందు మెఱుఁగుఁ
గాటుక చుక్కయుఁ! ♦ గాళ్లఁ బారాణియుఁ!
బసపువన్నియ పెండ్లి ♦ వస్త్రములును
సకలకల్యాణ భూ ♦ షణరాజితోఁ దను
త్రాణంబుఁ దొడిగి హ ♦ స్తమున ఖడ్గ
మలరఁ బ్రాణేశ్వరు ♦ నంద నిల్చుచు సత్య
నరకు సేనల నట్లు ♦ నఱికె రిపుల!
గీ॥ వెన్నముద్ద పిరంగియై ♦ వెడలి వచ్చె!
హరిణశాబము బెబ్బులి ♦ యగుచు దూఁకె!
నబ్జినీలత బ్రహ్మాస్త్ర ♦ మగుచుఁ దాఁకె!
నన రణ మొనర్చె నాపుత్త ♦ ళ్ళనుఁగుఁ బడఁతి! 231

ఉ॥ గాలికి నెండుటాకు గమి ♦ క్రైవడి శాత్రవ వీర శీర్షముల్
వేలును నూఱులున్ గగన ♦ వీధులలో నెగురంగఁ జేసి ము
ప్పాలు తురుష్కయోధులఁ గృ ♦ పాణము పాలొనరించుచున్ మహా
కాళిక చూపునన్ రణ ము ♦ ఖమ్మునఁ ద్రిమ్మరెఁ బుత్త్రతల్లియున్ 232

గీ॥ పుత్త్రయు నవోఢ తల్లి యు ♦ ద్వృత్తిఁ బోరి
దస్యుగళరక్తముల వసం ♦ తమ్ము లాడి
తల్లి చిత్తూరులక్ష్మి పా ♦ దముల నొఱిగి
సమసి రుభయ సైన్యములు బా ♦ ష్పములు విడువ! 233

సీ॥ ధనధాన్య వసన వా ♦ హనము లియ్యఁగ వచ్చుఁ!
గోరిన తిండి చే ♦ కూర్ప వచ్చు!
గంధంబు మెయినిండఁ ♦ గా రాయఁగా వచ్చుఁ!
బెక్కు భూషణములు ♦ పెట్ట వచ్చుఁ!
దుది లేని విద్యలు ♦ చదివింపఁగా వచ్చు!
విభవంబు లెన్నేనిఁ ♦ బెంపవచ్చుఁ!
గ్రింద మన్నని శిర ♦ ముందుఁ జేర్పఁగ వచ్చు!
నమరాద్రి తెచ్చి యి ♦ య్యంగ వచ్చుఁ!
గీ॥ గాని రణదుర్గ కర్పింపఁ ♦ గన్న కొడుకుఁ
గోడలిని బంపి దీవించి ♦ తోడు వచ్చి
శత్రుశవ కోటిపై వీర ♦ శయన మందె!
బుత్త! నీతల్లి యెంతటి ♦ పుణ్యవతియొ! 234

సీ॥ పృథులప్రపంచ చ ♦ రిత్రముల్ శోధింప
నం దెంద ఱెందఱో ♦ త్యాగనిరతు
లసమప్రతాప గు ♦ ణైక శోభితులు దే
శారాధకులు నుండ్రు! ♦ వారిలోన
నగ్రతాంబూల మ ♦ ర్యాదార్హులగుచుఁ బ
ద్మయుఁ బుత్త్రయును వాని ♦ తల్లి పొల్తు్రి!
మేవాడ నేకాక, ♦ యీవిశ్వభరతఖం
డప్రజాగణ రక్త ♦ నాళములను

గీ॥ గట్టు కడపటి బిందు వొ ♦ క్కండును గాని
పాఱుచుండ, నీముప్పూర ♦ పరమ భువన
మహిత పావన నామముల్ ♦ మఱపు లేక
తల ధరించుచుఁ బూజించి ♦ కొలుచు టొప్పు! 235

—॥ జయమల్లుని యుద్ధము. ॥—

సీ॥ క్షాత్రధర్మైక ని ♦ ష్ఠుఁడు రాఠోడ్వంశ
జులకెల్ల ఘనయశో ♦ జ్యోతి యైన
జయమల్లుఁ డవ్వలి ♦ క్షణమె సూర్యద్వార
సీమకు నడచుచుఁ ♦ జిచ్చువోలెఁ
బరసేనఁ దాఁకి కొ ♦ బ్బెరకాయల విధానఁ
దలలు కుప్పలుగాఁగ ♦ నిలను రాల్చి
దక్షాధ్వర ధ్వంస ♦ దారుణ కృతిఁ బెంచు
వీరభద్రుఁడు వోలె ♦ వెలుఁగఁ జొచ్చె!

గీ॥ "నకట! నాభాగ్యమున సూర్యుఁ ♦ డస్తమించి
యూఁగె రణ;మీతనికి గంట ♦ వ్యవధి యున్న
సేన సర్వ సంహారంబు ♦ చేసి యుండు"
ననుచు నక్బరు వెఱగొందె ♦ నతని కృతికి! 236

మ॥ ప్రళయారంభమునాఁడు లోకములఁ గూ ♦ ల్చన్ వచ్చు నారుద్రునిన్
దలఁపన్ జేయుచు దుర్నివారబలవ ♦ ద్ధాటీ సమారంభమై
యలఘూద్యజ్జయమల్లుఁ డందర మమి ♦ త్రానీకినీ వారిధిన్
గలఁపన్ జొచ్చెను! బ్రొద్దు క్రుంకి రణమం ♦ తం బాపె నానాటికిన్ 237

ఉ॥ పలుచని పాల వెన్నెలలు ♦ పైనొలయన్ జయమల్లుఁ డాత్మ యో
ధులఁ గొనుచున్ బరాహ్ణమున ♦ దుర్గము గూలినచోట రాలు సం
దులనిడి బాగుసేయుటను ♦ దూరమునన్ గని యక్బరయ్యెడన్
గొలిపెను గుండు; "సంగ్రి"మను ♦ గొప్ప తుపాకిని బట్టి పేల్చుచున్ 238

మ॥ విదితాగ్నిప్రభలొప్పు మండుచుఁ గడున్ ♦ వేగంబ వ్యాత్తోక్రోశమం
దది దూఱన్ జయమల్లసూర్యుఁ డకటా! ♦ యస్తంగతుండై భయా

స్వద దుఃఖాంధతమంబునన్ విడిచె మే ♦ వాడ్భ్యాప్రపంచంబు; నె
ల్లదళంబుల్ స్పృహ తప్పి బెండువడి నే ♦ లల్ వ్రాలె దైన్యంబునన్ 239

మ॥ అకటా! సింధుకు బ్రహ్మపుత్రికును మ ♦ ధ్యన్ గల్గు నీసర్వధా
త్రికి రారాజవు! యుద్ధమాపు తజీ! రా ♦ త్రిన్! గార్యనిర్మగ్నుఁ! జా
ర్ధక్యతిన్ జంపితి వెచ్చరింపకయె వీ ♦ రవ్రాతశార్దూలు నే
టికి నీగొప్పతనంబు ధర్మమును బా ♦ టింపంగ లేకున్న చో! 240

చ॥ విలయకృశానుమూర్తు లిటు ♦ పెక్కుగు నాథులు గూల ధైర్యముల్
నిలువక యోధు లందఱును ♦ నిల్చిరి జీవము లేని బొందులన్
వలెఁదరుణీజనుల్ పడిరి ♦ వహ్నిని! నెన్మిదివేలు రాజపు
త్రులపుడు తమ్ములమ్ముఁగొని ♦ తోడ వసంతము లాడి ముందటన్ 241

క॥ సూర్యద్వారము ధైర్యా
హార్యములై యపుడు దెఱచి ♦ యవనుల విజయా
వార్యుల నఱకుచుఁ దామును
శౌర్యము రాజిలఁగఁ బోరి ♦ సమసిరి వరుసన్. 242

—॥ చిత్తూరు పాడువడుట. ॥—

ఉ॥ కూలిరి వేవు రంగనలు ♦ కూలిరి నూర్వురు రాజబంధువుల్
కూలిరి వీరపుంగవులు ♦ గొబ్బున ముప్పదివేలమంది! య
వ్వేళను బెక్కువంశముల ♦ పెద్దలు గూలిరి! త్వారువంశ్యుఁడా
గ్వాలియరీశుఁ డొక్కరుఁడె ♦ ప్రాణముతో మనియుండె! నేమనన్ 243

సీ॥ సంవత్సరములు క ♦ ష్టము చేసి గెలిచిన
చిత్తూరిలోఁ బ్రవే ♦ శించి యచట
సౌధరాజములు ప్రా ♦ సాదంబులును గుళ్లు
గొప్పకట్టడములు ♦ కూలఁద్రోసి
పెదపెద్దవగు రణ ♦ భేరులు డంకాలు
గొని భవానీదేవి ♦ కోవెలఁ గల
స్వర్ణదీపస్తంభ ♦ సమితియుఁ జిత్తూరు
నగరమ్ము ద్వారబం ♦ ధములు గొనుచుఁ

గీ॥ గుంభవిశ్వంభరాధీశ ♦ జంభవైరి
దగు జయస్తంభ మాదిగా ♦ నచట నున్న
పూర్వరాజ విక్రమచిహ్న ♦ ములు నఖిలము
వీడ కక్బరు బగ్గము ♦ పాడు చేసె! 244

గీ॥ తనకు లొంగక తవిలి మా ♦ ర్కొనిన రిపుల
కన్నివిధముల సాయమై ♦ రనుచు దుర్గ
వాసు లందఱ నఱికి ము ♦ ప్పదియు వేలు
పండువంటి సంసారముల్ ♦ పాడు చేసె! 245

మ॥ తనచుట్టుం గల రాతిగోడ హిమవం ♦ తంబట్లు దుర్భేదమా
నని శత్రుల్ భయమంది పాఱ నొకవే ♦ యబ్దంబులుం గీర్తిమో
సిన విశ్వోన్నత పట్టణప్రవర మా ♦ చిత్తూర్ కటా! కాంతు తె
ల్లను గోల్పోవుచుం గాడుగా నిలిచెఁ! గా ♦ లం బింక నెట్లుంగిదో! 246

సీ॥ చిగురైనఁ జిదుమ నో ♦ చ్చెడు చోటు! ముప్పది
వేలమందినిఁ గూల్పఁ ♦ జాలి తెట్లు!
కఱవె భోగులు నీకుఁ! ♦ గడుపు నిండెనె! ప్రాఁత
తోల్బొక్కలే! కాని ♦ దొరక గలదె!
దివ్యకంబముఁ గొంటె! ♦ తీఱెనే నీదరి
ద్రత! కటా! భూరి సా ♦ మ్రాజ్య పతివి!
కోట గెల్చితి గాక! ♦ కుంభు జయస్తంభ
మేల కూల్చితి! లాభ ♦ మేమి నీకు!

గీ॥ గుడుల దివ్వెలార్చెడు పచ్చి ♦ కూళ వైనఁ
జేకొనరె! మొట్లు చేయరాదొఁ ♦ జిత్తూరుపురి
ద్వారబాధముల్ గొనఁ! జల్ల ♦ పడెని కనులు!
సరస గుణధామ! యక్బరు ♦ సార్వభౌమ! 247

సీ॥ చిత్తూరు నగర ల ♦ క్ష్మి భాగ్య సౌభాగ్య
మానాఁటితోడనె ♦ యంత మొందె!
నవల మేవాడ రా ♦ జ్యమున కయ్యది రాజ
ధానియై విభవ మం ♦ దంగ లేదు!

కోటల నెవరు బా ♦ గుపఱచఁ జేయఁగ లేదు!
భేరీ ధ్వనులు విని ♦ పింప లేదు!
పుడమి తేం జెప్పు డం ♦ దడు గిడినదియు లే!
దోకయింట దీపంబు ♦ నుండ లేదు!

గీ॥ యవనపతి చేసి చనిన మ ♦ హాపకార
మనుదినము చాటు చిప్పటి ♦ కల్లి భయద
మృగములకుఁ గంటకావృత ♦ వృక్షములకు
వాసమై యున్న! దెంతటి ♦ పాతకంబో! 248

గీ॥ మహిత చిత్తూరు నగర సా ♦ మ్రాజ్య భవ్య
నాట కాభ్యంతరమున నీ ♦ నాఁటి కకట!
కట్ట కడతేర వ్రాల మం ♦ గళము వాడె
ననఁగ ధ్వని లేపుచుండు వి ♦ హంగ తతులు! 249

క॥ పదునైదు వందలును న
ర్వదియెనిమిది నాఁగ సకల ♦ పరిభవముల కా
స్పదమని మేవాడ్ ప్రజ లా
పదమును నేఁటికిని వినఁగఁ ♦ గాల్పడ రకటా! 250

సీ॥ అఖిలలోకముల దే ♦ వాసురాదుల నోమి
యజ్ఞాన బహుళ గా ♦ ఢాంధకార
మణఁచి కృతఘ్నఘ్నుఁ ♦ డను పేరు నెఱపు స
ర్వారాధ్యుఁడవు లోక ♦ సాక్షి వైన
యో సర్వదేవాత్మ ♦ కా! సూర్యభగవానుఁ
డా! నీకులంబు ధ ♦ న్యముగఁ జేయ
వితత ప్రతాప శో ♦ భితులు శిశోదియా
వంశసంభవులు నీ ♦ భక్తవరులు

గీ॥ విష్ణుపద మధ్యమున నీవు ♦ వెలుగుచుండఁ
బట్టపగలు నీ పేరిఁటి ♦ వాసరమున
నరితతుల కోడఁ జిత్తూరు ♦ పురము వాడు
పడఁగ నెట్లోర్చితో రూక్ష ♦ పరత మాని! 251

సీ॥ ఆరణంబున నక్బ ♦ రజరామర ఖ్యాతిఁ
గను శౌర్యధను లిద్ద ♦ ఱనుచు మెచ్చి
జయమల్లు పుత్తల ♦ సత్కీర్తికై వారి
విగ్రహంబులు రచిం ♦ పించి ఢిల్లి
లో మహాద్వారంబు ♦ సీమ నిర్వంకల
వాని రెండేన్గుల ♦ పైన నునిచి
హితులును బంధులు ♦ నేతేరఁ జూపి వా
రల శౌర్యకథనముల్ ♦ దెలుపుచుండుఁ!

గీ॥ గొండ లట్లుండు నమ్మేటి ♦ కుంజరములు
వానిపై నున్న యవ్వీర ♦ వరులు నేఁటి
కట కరిగి చూచువారల ♦ స్వాంతసమితి
నెంత వెఱపు గూర్తురో దేవు ♦ డే యెఱుంగు! 252

చ॥ కదనము నిల్చిపోయెననఁ ♦ గ్రమ్మఱివచ్చి తటాకముల్ ముదా
స్పదముగఁ గట్టి పే రుదయ ♦ సాగరమం చిడి చెంతనే వసిం
చెదనని కట్టెని ల్లుదయ ♦ సింహుఁడు! పెక్కురు కట్టి చేరి రం
దుదయపు రాభిధానమున ♦ నొప్పెఁ బురం బది వానిపేరిటన్! 253

క॥ చిత్తూరురాజ్య మంతయు
ముత్తునియలుగాఁగ నుదయ ♦ పురరాజము స
ర్వోత్తమము చాలు నంచని
యిత్తఱి నయ్యుదయసింహుఁ ♦ డేలఁ దొడంగెన్ 254

క॥ సుతు లిరువదియైదుగురై
సతతము బహుపుత్రకులకు ♦ జనకుండని సం
స్తుతికెక్కఁ గాని రాజ్యో
న్నతి కేమియుఁ జేయ డితఁడ ♦ నామకుఁ డగుచున్ 255

సీ॥ ఉదయసింహుఁడు పూర్వ ♦ మొకనాఁడు కొలువుండ
నొకకత్తి లోహకా ♦ రకుఁడు తెచ్చె!
నది పదనైనదో ♦ యని చూడ నొకపుల్లఁ
గొంచెము చివ్వి యుం ♦ చుంచెఁ గత్తి

యచటనుండిన సూక్ష్మ ♦ దైదేండ్ల బాలుండు
కత్తు లోరుల నడు ♦ కనగనె కాని
పుడకలు చివ్వ నే ♦ ర్పుకవంచుఁ దనదు హ
స్తముఁ జిల్పె! దాన నొ ♦ ట్టమునఁ జిమ్మి
సీ॥ నట్లు వేడినెత్తురు గాజి ♦ యచటి రత్న
కంబళం బంత రక్తసి ♦ క్తముగ నయ్యె!
నంద ఆశ్చర్యమగ్నులై! ♦ రక్కుమారుఁ
డచలుఁడై చూపు తండ్రియా ♦ స్యమున నిలిపె. 256

మ॥ కడు లేఁ బ్రాయమునందె యిట్టులు కడుం ♦ గ్రౌర్యమ్మునన్ మందు మూ
ర్ఖుఁడు ప్రాయంబునునొందఁ దంద్రినగు నన్ ♦ గోధించి కంఠంబుఁదీ
సెదు నేమో యను భీతి "నీతని శిర ♦ చ్ఛేదంబు గావింపుఁడీ
ప్పు"డటం చాజ్ఞ యొసంగె జూపఱ మనం ♦ బుల్ తల్లడం బందఁగన్ 257

సీ॥ అధిపునాజ్ఞను శిరం ♦ బొందుఁ దాల్చి మెలంగ
పలసిన సుభటు లా ♦ బాలుఁ గొనుచు
దక్షిణ దిశ నున్న ♦ దారుణాటవిఁ జేరి
వధ్య శిలాస్థలి ♦ వాని నుంచి
తలఁదీయ యత్నించు ♦ తఱిని నూటిగ సలుం
బ్రాకృష్ణసింహ భూ ♦ వరుఁ డచటికి
రాఁ దటస్థించి వా ♦ రలను వారించి బా
లుని దన మందిరం ♦ బునకుఁ బనిచె!
గీ॥ రాజధానినిఁ జేరి కా ♦ ర్యములు నడిపి
యుదయసింహుని గద్దించి ♦ యోర్పు నేర్పి!
నాఁడు మొదలుగ నాత్మ నం ♦ దనుని కరణి
సూక్ష్మ నెనలేని ప్రేమతోఁ ♦ జూచుచుండె! 258

—॥ ఉదయసింహుఁడు జగమల్లుని రాజు చేయఁగోరుట ॥—

సీ॥ చిత్తూరి దుర్గంబు ♦ చెడిన నాగ్లేండ్లకు
వసుధేశునకుఁ బెద్ద ♦ వ్యాధి గలిగె!

మఱఁదులు సచివ సా ♦ మంత బాంధవ జనుల్
గనుఁగొన వచ్చి రొ ♦ క్కదినమందు!
నుదయసింహుఁడు వారి ♦ నొద్దకుఁ బిలిచి "నే
మనఁబోను! నానోట ♦ మాటయున్న
యపుడె నా వెన్క మీ ♦ రాచరింపఁగఁ దగ్గ
పనులఁ దెల్పినను మే ♦ లనుచుఁ దోఁచెఁ!
గీ॥ గొడుగు లిర్వురెదుగురు నా ♦ కును గలిగిరి!
సూర్యుఁడు ద్వితీయుఁ! డైదేండ్లు ♦ చొచ్చినపుడె
చేరఁగొనిపోయి యాకృష్ణ ♦ సింగు పెంచుఁ
బరమవాత్సల్యమున సలుం ♦ బ్రా పురమున!
సీ॥ చందురునినిండ జోత్స్న యిం ♦ పొంది నట్లు
నగవు మొగమునఁ గులుక సుం ♦ తయుఁ గలఁగక
తన గళంబున వేఁడిర ♦ క్తంబు నైన
నేలు పాలింపఁగల కడుఁ ♦ క్రూరుఁ డతఁడు. 260

క॥ అదయుం డతఁ డిలు వెడలుట
పది కోట్లని యుంటి! వానిఁ ♦ బార్థివుగాఁ జే
యఁదగునె! దేశము సర్వం
బు దహించు నొకింత యనల ♦ మును లేకుండన్ 261

॥ మూఁడవవాఁడు ♦ సాగరుఁడు! ♦ మూర్ఖులలోఁ బ్రథముండు! నిర్వహా
నేఁపులు వచ్చె! ముందుఁ దెప్ప ♦ దేనియు నాకడ! నాల్క వేఁడి! యే
నాఁడును ద్రవ్య మిచ్చియును ♦ నన్ రణమున్ గొనితెచ్చి పెట్టు! మే
వాడధరిత్రి నాకొఱవి ♦ పాలన చేసిన మీఁకు నచ్చునే? 262

॥ నరహరి! వీఁడు నా సుతుల ♦ నాల్గవ వాఁడగు! మింటఁ బెట్టినన్
గురియదు వాన! నేల నిడ ♦ గోల్కొనఁబోవదు పైరు! పిల్చినన్
దరియఁడు! చెంత కేగిన తృ ♦ ణంబునఁ బర్విడు! పట్టి యగ్గిమా!
నరహరి గాఁడు! ప్రాణహరి ♦ నా కతఁ డియ్యెల నేల నర్హుఁడే!

సీ॥ సకలమేవాణ్మహీ ♦ చక్రభారముఁ దాల్చి
పాలింప వలసిన ♦ ప్రథమపుత్రుఁ

డాప్రతాపుం డెప్పు ♦ డతి సాహసికుఁడు! యు
ద్ధంబున్న విందని ♦ తలఁచు చుండు!
నొరులతోఁ బలుకఁడు! ♦ పరులను బిలువఁడు!
నవ్వఁడు నొవ్వఁ జే ♦ నాఁడు గాని!
యనుకొన్న పనిని జే ♦ సిన దాఁక వదలఁడు!
నామాట యనిన సుం ♦ తయును జెల్ల!
గీ॥ ఢిల్లనక వాకిలనక రే ♦ యెల్లఁ దిరుగు!
మన రిపులు భిల్లపతులతో ♦ మైత్రి సేయు!
నిది పెదనిదాటు పల్లని ♦ వదలినాఁడ!
నేమి చేయుదు! నాభాగ్య ♦ మిట్టు లుండె! 264

చ॥ ఇరువదియైదు మందికిని ♦ నిర్వది నల్వురు పుత్రు లిట్టు లుం
డిరి! జగమల్లుఁ డొక్కఁ డిది ♦ నీదని నాదని కొంత కాపురం
బెఱిఁగిన బుద్ధిశాలి! యెపు ♦ డింటనె యుండి సమస్త కార్యముల్
జరుపుచు నుండు! నందఱును ♦ జక్కఁగఁ బిల్చియు మాటలాడెడున్ 265

చ॥ అదియును వాఁడవారసి య ♦ నారద మానక యమ్మ యప్ప యం
చెద గరఁగన్ జరించు! నెపు ♦ డేనియు శౌర్యము గీర్యమంచు నున్
వదరఁడు! బైటఁ బోఁడు! భయ ♦ భక్తులు గల్గిన ప్రోడ! సద్గుణా
స్పదుఁడని మీ రెఱుంగుదురు ♦ వాని నొకించుక సేపు చూచినన్, 266

చ॥ కొడుకుల శ్రేయముం దలఁచి ♦ గొప్పగఁ దండ్రులు చెప్పఁగూడ! దా
తఁడె సకలావనీభరముఁ ♦ దాల్పఁగ యోగ్యుఁడు! నాదు మాటలన్
బెడచెవిఁ జొప్ప కాదరముఁ ♦ బెంచుచు నాదు ననంతరమ్ము మీ
రుడుగక సింహపీఠమును ♦ నుంచుచు వానిని రాజుఁ జేయుఁడీ! 267

మ॥ మఱిమొక్కం! డధికారమంతయుఁ సలుం ♦ బ్రానాథుడున్ నాయనం
తరమందున్ వహియించి యేర్పఱచు రా ♦ ణానొక్కఁడున్! గాన ని
త్తఱి నాతో 'జయమల్లు భూపతిగ సం ♦ స్థాపింతు'నం చాతఁ డిం
దఱిలోఁ జెప్పుచుఁ జేతఁ జేయిడిన చో ♦ నాయాత్మ శాంతిన్ గనున్ 268

మ॥ అనుచున్ బల్కినఁ గృష్ణసింగు దయసిం ♦ హాధీశ్వరున్ 'నీయను
జ్ఞను బాలించిన మేటి భాగ్యమగు! రా ♦ జస్థాన సింహాసనం

బునఁ జూతుర్ జగమెల్లు! నేకొఱ మనం ♦ బున్ జేరఁగా నీకు! దే
వుని ధ్యానించుము శాంతినొందు"మని సం ♦ బోధించె నయ్యందఱున్ 269

చ॥ త్వరపడి కృష్ణసింగు వసు ♦ ధాపతి మాటలఁ నొప్పినంచు నం
దఱును నతృప్తిఁగాంచి వగఁ ♦ దార్కొని కుందిరి! కాని, క్షత్రివా
దర కరణిన్ బ్రతాపగుణ ♦ తన్నయుఁ డాపులిరాజు ప్రోల నె
న్నఁ రిడియుఁగాదు కూడదని ♦ పల్కఁగ నేర్తురు ధైర్యమూనుచున్! 270

మ॥ శిరముల్ వాల్చుచుఁ బ్రక్కప్రక్కలకు వి ♦ చ్చేసెన్ మహామండలే
శ్వర సంఘంబు! ప్రతాపు మామ యగు నా ♦ ఝాలారిరా 'వల్లఁడ
ద్రిర! రాజౌనను నాస లూఁడె' నని చిం ♦ తించెన్! మహారాజ్ఞియున్
గిరమున్ శోషిలె! బంధు లందఱును బో ♦ క్కన్ జొచ్చి రవ్వార్తకున్ 271

మ॥ "అప్పురా! పుత్రులలోన జ్యేష్ఠుఁడు ప్రతా ♦ పాలంకృతుం డాప్రతా
పు వృథా చేసెనె రాజ్యహీనునిగ నీ ♦ భూమీశుఁ! డాకృష్ణసిం
గవలీలన్ దల మెట్టులూఁపె! నెటు చే ♦ యన్ వచ్చు! నెద్దీని న
న్న వెసన్ గొట్టమునందుఁగట్టుఁడను చం ♦ దంబయ్యె నేడెంతయున్ 272

మ "కమలాప్తాన్వయమా! భవత్కృత మహా ♦ ఘంబేమొ! రాముండు పూ
ర్వము కొన్నేడులు మానియుండ వలసెన్ ♦ బట్టాభిషేకంబు! చం
డ మహీనాథుఁడు లేకయే చనియె! నీ ♦ నాఁడీప్రతాపుండు స
ర్వముఁగోల్పోయెను! దుర్బలుల్ జనకు తా ♦ రా! యెంతకున్ గర్తలో"!

చ॥ అని వగనొంది బంధుజను ♦ లంద అనంతుదమౌ విషాద వే
దనలను బొంది కుందిరి! ప ♦ దంపడి సజ్జననాథు జబ్బు హె
చ్చెను! మఱునాఁటికా యుదయ ♦ సింహుఁడు శాంబగలోక యాత్ర కే
గెను సుతులున్ సతీజనము ♦ కేవల దుఃఖపయోధి మున్గఁగన్. 274

చ॥ నియమ మొకండు పూర్వులు గ ♦ ణించిరి! దానినిబట్టి ధారిణీ
దయితుఁడు నంత మొందఁగనె ♦ తచ్ఛవమున్ గొనిపోవుచున్ నిజా
లయమునఁ జేర్చి వేదవిధు ♦ లన్ దలఁ దాల్చుచుఁ బార లౌకిక
క్రియలు పురోహితుండు పొన ♦ రించెను దండ్రి కొనర్చునట్టులన్. 275

క॥ వరసాధము నా చోకిన
గరులోఁ బట్టాభిషేక ♦ కార్యక్రమముల్

జరుగఁగఁ దొడఁగె! ముహూర్తము
త్వరపడి జగమెల్లఁ దలరఁ ♦ దరియఁగ వచ్చెన్. 276

— ॥ పట్టాభిషేకోత్సవము. ॥ —

సీ॥ పన్నీరు పునుఁగు జ ♦ వాది యత్తరు దెచ్చి
యెల్ల వీధులయందుఁ ♦ జల్లి నారు!
ప్రతిగృహాంగణము కం ♦ బముల రంభాస్తంభ
నివహంబులను దెచ్చి ♦ నిలిపి నారు!
సౌరభం బొలుకు మం ♦ దార మంజుల మాలి
కలు తోరణంబులు ♦ గట్టి నారు!
'భువనగురుం డొందుఁ ♦ బూర్ణ వైభవ'మంచు
స్వాగతాక్షరములు ♦ వ్రాసి నారు!
గీ॥ దివ్యముగ రంగవల్లులు ♦ దీర్చి నారు!
పెక్కెడలఁ జల్వపందిరుల్ ♦ వేసి నారు
బీదలకు నన్నమేర్పాటు ♦ పెట్టి నారు
సిరులఁ జిమ్మంగఁ బురమెల్ల ♦ జేసి నారు 277
సీ॥ సౌభాగ్యలక్ష్మి కా ♦ స్థానమొక్కటి యనఁ
బలు విధాలంకార ♦ ములను గూర్చి
నిత్యరమోత్సవ ♦ నిలయమై యలరార
నాస్థానమండపం ♦ బలవరించి
సమచతుష్కోణ వి ♦ శాల వితర్దిపై
నవరత్న దివ్య సం ♦ తతులు గలిగి
కనకమయంబు ను ♦ త్కటకాంతిమంతమా
నొక్క సింహాసనం ♦ బొనర నునిచి
గీ॥ దాని కవ్వల శోభాప్ర ♦ ధానమైన
పీఠపంక్తులు వరుసగాఁ ♦ బెక్కు నిలుప
నింద్రుని సుధర్మయో యన ♦ నెసఁగె సుప్ర
భాస్థలమ్మగు రాణా స ♦ భాస్థలమ్ము. 278

గీ॥ సమచతుష్కోణ వేదికాం ♦ తమునఁ దూర్పు
కోనను సింహాసనమునకు ♦ వెనుక నొక్క
వేయి యపరంజి కిరణముల్ ♦ వెలుఁగ నలరె
నతిత రానందదంబు సూ ♦ ర్యధ్వజంబు! 279

సీ॥ గ్వాలియర్ పతి మొదల్ ♦ గాఁ గలిగిన రాజ
పరమేశ్వరులు కుడి ♦ ప్రక్కఁ దనర!
జిత్తూరు రాణాల ♦ సేవించు సామంత
జనపతుల్ వామ పా ♦ ర్శ్వమున వెలయ!
నున్నతోద్యోగ సం ♦ పన్నులై శూరులౌ
రాజబంధులు వెన్క ♦ ప్రక్క వెలుఁగ!
కవులు దైవజ్ఞులు ♦ గాయకుల్ చారణుల్
సింహాసనము ముందుఁ ♦ జెలఁగు చుండ!

గీ॥ బహుళ సంఖ్యాకులగుచు భూ ♦ ప్రజలు వికసి
తాస్యములతోడ వచ్చి యం ♦ దందు నిలువ!
నిత్యకల్యాణ మందిర ♦ నియతి నొప్పి
యాసభామందిరం బప్పు ♦ డందగించె! 280

— ॥ జగమల్లు సింహాసనము నెక్కుట. ॥ —

మ॥ అరుదెంచెన్ జగమల్లుఁ డందమగు స్వ ♦ ర్ణాలంకృతుల్ మేన న
చ్చెరువుం గొల్పఁగ దాల్చి; యాక్షణమునన్ ♦ సింహాసనం బెక్కి భా
స్వర శోభాకర రాజదండమును హ ♦ స్తంబందుఁ గీలించి "యం
దఱు నన్గొల్వుఁడు! మీకు నెల్లరకు రా ♦ ణ్ణైతి నే నిక్కటిన్." 281

మ॥ అని యెంతో యధికారయుక్తవచనం ♦ బాసీనుఁడై వాని బో
రన దూరంబుననుండి చూచుచు నలుం ♦ శ్రీకృష్ణసింహప్రభుం
డనునా మాటలు 'సింహపీఠమిది వ ♦ త్సా! నీదిగా దాప్రతా
పుని! దర్పోద్ధురుఁడు వచ్చు! లేచి యిటు నీ ♦ వున్ రమ్ము దూరమ్ముగన్. 282

క॥ అదియు నృపుఁడు కాఁదగువాఁ
డుదయం బభిషేకమై ♦ ముహూర్తము దరియన్

గదియఁదగు సింహపీఠం
బిది తగునే ముందె వచ్చి ♦ యిటు కూర్చుండన్!'' 282

మ॥ అని పల్కన్ జగమల్లుఁ "జేసెనెద వా ♦ హా! నాఁడు మాతండ్రి చె
ప్పిన యాచొప్పున సమ్మతించియును నీ ♦ వేళన్ ననున్ లేచి పో
మ్మని యొప్పించెదు! ధర్మసూక్ష్మముల నా ♦ వంతైనఁ బాటింప! వె
వ్వని రాజ్యన్ బొనరించెఁ దండ్రి యతఁడే ♦ పాలింప నర్హుండగున్ 283

ఉ॥ ముప్పదియేడు లేలిచనె ♦ భూమిని! దండ్రి యనుజ్ఞ గాక నీ
విప్పుడు చెప్పినన్ వినెద ♦ నే! యివి యేటికి వెఱ్ఱి మాట! లే
నొప్పును! నన్నువీడి చను ♦ మూఱక! వద్దని గద్దరింప నీ
కెప్పుడు గల్గె బాధ్యత! యి ♦ సీ! జగమల్లుఁడు నీ కలంతియే!'' 294

మ॥ అని కోపమ్మునఁ బల్కు నాతని సలుం ♦ బ్రాధీశుఁడున్ జూచి "నీ
జనకుం డక్కట! ధర్మమున్ విడిచి రా ♦ జ్యంబందు నిన్నుంచుమీ"
యన నాఁడో మఱునాఁడో చచ్చు! నపుడే ♦ లా యామహీనాథు నా
జ్ఞ నిరోధింప నటంచు మంచిదని శీ ♦ క్షం బూఁచి దాఁటించితిన్. 285

మ॥ అటుగా నుండిన నాప్రతాపుఁ డఖిల ♦ క్ష్మాధీశ్వరుల్ గొల్వఁగాఁ
బటుదర్పంబున సార్వభౌముఁడగుచున్ ♦ బాలించు నన్ మాట నీ
కెటులన్ జ్ఞప్తికి లేదు! బంధువులు భూ ♦ మీశుల్ హితుల్ భూజనం
బెటు మాన్పన్ గల! రమ్మహాత్ముని బలం ♦ బేమంచు భావించితో! 286

మ॥ అతిపూజ్యంబని తండ్రియాజ్ఞకు శిరం ♦ బట్లొగ్గి కూర్చుండెఁ గా!
కతఁడే రేఁగిన దేవదైత్యులకు శ ♦ క్యం బౌనె వారింప! నీ
చతురంభోనిధి సంవృతాఖిల మహీ ♦ చక్రంబునున్ భస్మసా
త్కృతమున్ జేయఁడె! నమ్మెయ్యె మొఱ్ఱొ యనినన్ ♦ దిక్కుండునే పిమ్మటన్!

సీ॥ జననమాదిగ వేయి ♦ కనులతో నాతని
వీర వర్తనముఁ గ ♦ న్పెట్టి యుందు!
రవికులోద్భవ రాజ ♦ రాజ శిరోమణి
కాఁదగ్గ గుణకోటి ♦ గల దతనికి!
మేవాడఖనిని జ ♦ న్మించిన మణులలో
నింత తేజముగల ♦ దేది లేదు!

చిత్తూరు రాజ్యల ♦ క్ష్మీ భాగ్యవశమున
నేకలింగేశుఁడే ♦ యిట్లు పొడమె!
గీ॥ నుర్వి రవి చంద్ర తారక ♦ లుండుదాఁక
నవతరింపఁబోఁ డట్టి మ ♦ హామహుండు!
కోటిబ్రహ్మాండములనైన ♦ గోట మీటి
పట్టభద్రునిఁ జేతు నా ♦ ప్రాణ మాన! 288

మ॥ అనిశోత్సాహ పరాక్రమస్ఫురణ రా ♦ జ్యం బేలె! సంగ్రామసిం
హుసివెన్కన్ బలహీనుఁ డయ్యుదయసిం ♦ హుం డెక్కరాకుండఁ దీ
వ్ర సికాంతాప్రతిమప్రతాపుఁడు ప్రతా ♦ పస్వామి సింహాసనం
బునఁ గూర్చుండెయె యున్నఁ జిత్తురుపురిన్ ♦ బోఁగొట్టె యిల్లేద్దుమే! 289

ఉ॥ ఏమని రాజ్యభారము వ ♦ హించెనొ నాఁటనుగోలె ముప్పులే
సీమకుఁ దెచ్చె! యుద్ధమునఁ ♦ జేటెడు గుండెలుగాఁగఁ బాతె నూ
ఱామడ! కాల మొగ్లోచనె! ♦ నాతఁడు మేలనిపింతు వీవు! నీ
తో మహారాజ్యమా! కొఱవి ♦ తోఁ దలగోఁకిన యట్టు లుండదే! 290

ఉ॥ ఇప్పటి దేశకాలముల ♦ నెంచిన, నప్రతిమాన శౌర్యుఁ డా
మెప్పులకుప్ప సర్వసుగు ♦ ణోన్నతుఁ డింకఁ బ్రతాపుఁ డొక్కఁడే
తప్పక రాజుగాఁ దగిన ♦ దార్ఢ్యము గల్గిన బుద్ధిశాలి! ని
న్నిప్పుడు నిల్పినన్ జెఱుతు ♦ వేమియుఁ జేతికి జిక్కకుండఁగన్ 291

ఉ॥ కాన మదీయబోధనముఁ ♦ గైకొని ప్రక్కకు రమ్ము! మూర్ఖ్యముల్
మాను''మటన్న లోకమున ♦ మంచియుఁ జెడ్డ యెఱుంగనట్టి య
జ్ఞాని యతండు'' ''నీనుడులు ♦ సాఁగవు! పొమ్మిక నన్ను వీడి! యే
మైనను సింహపీఠ విడి ♦ యవ్వలికేగ నొకించు కేనియున్. 292

మ॥ జనకుం డాజ్ఞ గొనుసంగె! నక్కటన రా ♦ జస్థానసింహాసనం
బునఁ గూర్చుండఁగ నేనె యర్హుఁడ! ననున్ ♦ బోనాడుచున్ బ్రక్కకం
పిన సామంతులు భూజనుల్ కినిసి యు ♦ ద్దే నిన్ను శిక్షింతు! రొ
క్కని వీ! విందఱ నేమి చేసెదవొ! చ ♦ క్కన్ జూతుఁగా కిద్యోషన్'' 293

క॥ అని పెదవిప్పైన వ్రేలిడు
కొని యాశ్చర్యంబు ముసురు ♦ కొన సభ్యుల వం

కను దృష్టిని సారించుచుఁ
దన రాచఱికంపు ఠీవి ♦ దళము కొనంగన్, 294

శా॥ ఏమయ్యా! యిటు చూచుచుండెద! రిదే ♦ మీ చోద్య! మూడంగు లెం
తో మేలే! యొక యక్రమంబు తమక ♦ న్నిల్ చూడఁగా సాఁగ నీ!
రేమో యీయన బ్రేల భీతిఁగొనఁ గా ♦ నేలా! యదల్పుండు! మీ
కేమేఁ బ్రాణభయంబు గల్గినను నే ♦ నిందుండి కాపాడెదన్. 295

ఉ॥ ఈనిన సింహమట్లు పయి ♦ కీతఁడు దూఁకెడి నమ్మ! చెల్ల! వృ
ద్ధైన యొకండు తానె బల ♦ మంతగఁ జూపిన, మీరు పల్వు రెం
తేనియుఁ బట్టు పట్టినను ♦ నెంతలు పుట్టునో! ప్రేలు వాఁచి రో
తైనను రోలు వాఁచినఁ గ ♦ టా! మితియున్ మఱి మేరయుండునే''! 296

—॥ కృష్ణసింహ ప్రభువు కోపోద్దీపితుం డగుట. ॥—

మ॥ అని పీఠమ్మున వెన్క నానుకొని సా ♦ ఖ్యాసీనుఁడై యాతనిన్
గని కృష్ణుం డను ''మేలు! తాతకును ద ♦ గ్గన్ నేర్పు ధీశాలివై
మనుమం డైతివి! వీర లందఱు నిన్నున్ ♦ బట్టాభిషిక్తున్ బొన
ర్చి నన్నున్ దాఁకెడువారె! సింహబలె వా ♦ రిన్ వెళ్ళియున్ సోఁకెనే! 297

శా॥ ''రాణాలన్ బొనరించు శాధ్యత సలుం ♦ బ్రాప్రివారిదన్ మాట యు
ర్వీణిన్ గల్గిన వారెఱుంగఁగల! రి ♦ చ్చోఁ నేఁ బ్రతాపున్ మహా
రాణాగా నొనరింతుఁ! గూడదను ధీ ♦ ర గ్రామణుల్ గల్గినన్
బాణిన్ బై కెగనెత్తు! డిప్పుడె మదు ♦ ర్భన్ వత్తు సత్యుద్ధతిన్. 298

మ॥ ఇది నాయింటికి నాదు వాకిలికి నై ♦ యేఁజేయు కార్యంబె! యి
య్యదనన్ యోగ్య సమర్థు భూధవుని జే ♦ యన్ నిత్యకల్యాణముల్
పొదలన్ రాజ్యము సౌఖ్యమున్ గనడె! న ♦ ట్లున్ గాని చోఁ జెందు నా
పద! లప్పాపము పెద్దపే రలరుటన్ ♦ వ్యాపించు మాబోంట్లకున్. 299

మ॥ పనియే మొక్కరితోడ నాకిఁక! సలుం ♦ బ్రాక్రృష్ణుఁ డన్యాయముల్
తనమోప్రిలన్ జరుగంగ నోర్వఁడసి పె ♦ ద్దల్ చేయు నాశీస్సు కే
వినయం బూనెద! నిన్నుఁ గాని మఱియున్ ♦ వేఱెవ్వరిన్ గాని మ
న్ననలన్ జేయఁ! బ్రతాపునిన్ బతిగ సం ♦ స్థాపింతు మేవాడకున్ 300

ఉ॥ మెత్తని మంచి మాటలివి! • మేలని వైళను లేచి రమ్మి తే
దిత్తతి లేవనన్న నిను • నెత్తుచు దూరము చేర్తు" నన్న నా
యుత్తముఁ డింతయున్ గదల • కుండినఁ గృష్ణవిభుండు చేతితో
నెత్తి మృగేంద్రపీఠి విడి • యేగఁగ జేసెను బట్టి త్రోయుచున్, 299

ఉ॥ త్రోసిన నేమిచేయుటకుఁ • దోఁపక యాజగమల్లుఁ డీసునన్
రోసము తన్నలంప, వడి • రోఁజుచుఁ గేసరిరాజు చేతిలో
గాసిలి దానిఁ దప్పుకొను • క్రైవడిఁ గానని గొజ్జెమాడ్కి నా
లో సభవీడి యగ్రసుతత • లోచనుఁడై చనె బీద మోముతో! 300

మ॥ అవురా! యెంతటి పూజ్యచిత్తుఁడు సలుం • బ్రాణీశుఁ డీవేళలో
నవకాశంబు లభించు మాత్రమున న • న్యాయంబు వారించి ని
క్కన మేపారఁగ సింహపీఠము పయిన్ • గూర్చుండ యోగ్యుండు భూ
వరవంద్యుండు ప్రతాపుఁడే' యనియె ని • ర్దాక్షిణ్య చిత్తంబునన్. 301

మ॥ అమృతంబున్ మలయాద్రి మందపవనం • బద్దంబులున్ స్వచ్ఛభా
వముఁ గోల్పోయినఁ బోవవచ్చును! సలుం • బ్రాకృష్ణు మాలిన్యలే
శమునన్ సోఁకదటం చెఱింగియు నజ • స్రస్వచ్ఛ మాధీరు చి
త్తమునన్ దప్పఁదలంచియుంటి! మపరా • ధం బయ్యె నెంతేనియున్. 302

చ॥ వనితలఁ జేరి వంటయిలు • వాయని యాజగమల్లు వీడి మా
మనసు హరించినట్టి యభి • మానధురంధరు విక్రమైకవ
ర్తను రవివంశవర్ధనుఁ బ్ర • తాపు ధరాధిపుఁ జేయ నుండెడిన్!
మసిమొదుఁగాత మీఁతఁ డతి • మానుషకీర్తి సహస్ర వర్షముల్" 303

-( కృష్ణసింహప్రభువు సింహాసన మధిష్ఠింపరమ్మని ప్రతాపసింహు నర్థించుట. )-

మ॥ అని సామంతులు భూప్రజాళులు సలుం • బ్రాణీశు వేనోళ్లఁ గీ
ర్తనముల్ చేయ' శుభాభిషేకము నోన • ర్పన్ బోద'మం చందఱున్
దనవెంటన్ గొని కృష్ణసింహ విభుఁ డా • స్థానంబునందుండి భూ
ప నివాసంబును జేరి యచ్చటఁ బ్రతా • పస్వామికిన్ మ్రొక్కుచున్ 304

సీ॥ కష్టసౌఖ్యము లొక్క • గతిఁ జూతు! యుద్ధం బు
గాదిపండుగ యట్లు • గాంచు చుందు!

సాహసికాగ్రిత ♦ స్సరుఁడవు! పరుల బా
ధలు సూచి యోర్వ నీ ♦ తరము గాదు!
వీరపూజ్యము నీయు ♦ దారత దేవ! నీ
తండ్రి మౌర్ఖ్యముగాఁగఁ ♦ దప్పఁ దలఁచి
జ్యేష్ఠపుత్రుఁడ నౌటఁ ♦ జెందఁగా వలయు మే
వాడ్దేశసామ్రాజ్య ♦ భరముఁ బాపి
గీ॥ మేరువును నెత్తి కెత్తు కు ♦ న్నారఁ డనుచు
నల్ల జగమల్లున కొసంగు ♦ మనియొ! నప్పు
డుఱక వాదేల యని తల ♦ యూఁచి యుంటి!
సమయ మైనప్పు చూచుకొం ♦ దమని తలఁచి! 305

శా॥ ఆరంభంబుననుండి నీవయిన నా ♦ యాశాభరం బెల్ల దై
వారన్ నాదగు విన్నపంబుఁ గొని రా ♦ జ్యశ్రీని దోస్తంభ కే
ళీరంగంబున నిల్పి ధర్మమున బా ♦ లింపన్ బ్రజయత్నింపు పు
ష్పారామంబటు సౌఖ్యసౌరభములన్ ♦ వ్యాపింప దేశంబునన్". 306

వ॥ అని వాక్రుచ్చిన నాప్రతాపుఁడు సలుం ♦ బాధీశు నీక్షించి "మ
జ్జనకాభీష్టముఁ దీర్చకుండినను నా ♦ చంద్రార్కముగా పకీ
ర్తిని నేనొందనె! ధర్మదూరగుఁడనై ♦ దేవేంద్ర భోగంబులన్
గనుకంటెన్ నిరుపేదనై మనుట యో ♦ గ్యంబంచు భావించెదన్ 307

ఉ॥ ధారిణి రాజ్యమున్ స్థిరమె! ♦ ధర్మము దేవునియట్లు సుస్థిరం
బై రహియించు! ధర్మమును ♦ నాదట మీఱఁగనోపఁ! దండ్రికిన్
మారట తండ్రి! వందఱకు ♦ మాన్యుఁడ! నీ వొనరించు నాజ్ఞలన్
దూరముసేయ నోప! నెటు ♦ తోఁపక చిత్తము తత్తరించెడున్. 308

చ॥ మృదుహృదయుండు నాజనకుఁ ♦ డెప్పుడు నీదు మహాభుజంబె యా
స్పదముగ రాజ్య మేలెను! భ ♦ వత్కృప నుంత తొలంగియున్న నీ
యుదయపురంబునన్ నిలిచి ♦ యుండదు! మేమును నిల్చియుండ! మో
పదయ! భవ న్మహోపకృతి ♦ సర్వ జగన్నుతి పాత్రమై తగున్.'' 309

చ॥ అని యెటుచేయఁదోఁప కిటు ♦ లాడు ప్రతాపునిఁ జూచి "దేవుఁడే
నిను సృజియించె సర్వధర ♦ ణీస్థలికిన్ బతిగాఁగ జ్యేష్ఠ సం

దనునిగ! నీవు రాజగుట ♦ ధర్మము! భూప్రజ యే యుదాత్తవ
ర్తను వరియించునో యతఁడె ♦ రాజుగనిల్చుట ధర్మమేకదా!" 310

మ॥ అని కృష్ణప్రభుఁ డాడుచుండఁ గని య ♦ ప్డందున్న సామంతులున్.
జను లొక్కుమ్మడి నైకకంఠ్యముగ "రా ♦ జస్థాన సింహాసనం
బునఁ గూర్చుండి ప్రతాపుఁడే నృపతియై ♦ పూర్ణప్రజామోదమున్
గని పాలించెడుఁగాక నిర్మల యశః ♦ కల్యాణముల్ చేకురన్. 311

శా॥ మేమై కోరిన యీతనిన్ విడుచుచున్ ♦ మేలంచు నీవల్ల సు
త్రామున్ దెచ్చిన శౌరిఁదెచ్చిన సమా ♦ ధానంబు మాకుండ! దే
మో మమ్ముందఱ నుద్ధరించు ననుచున్ ♦ ముం దెంతకాలంబుగా
నో మాకున్నవి కోర్కు!లి ప్డితని నో ♦ హా!వీడఁగా నేర్తుమే! 312

ఉ॥ ఎప్పు డితండు రాజగునొ! ♦ యెప్పుడు కన్నుల విందుగాఁగఁ మా
యప్పను జూతుమో యనెడి ♦ యాసలు కొండలువోలె నుండు! నీ
యొప్పమి నేమియున్ బలుక ♦ నోడితి! యింతకు నీప్రతాపుఁడే
తప్పక రాజు గావలయుఁ! ♦ దప్పదు! తప్ప"దటంచుఁ బల్కనన్. 313

చ॥ 'కనుఁగొనియుంటివే ప్రజల ♦ కౌతుక!మిందఱ కోర్కె త్రోసివే
య వగునె!సన్మహూర్తము ర ♦ యంబున డాసె!శుభాభిషేకమున్
బొనరుతు!సమ్మతింపు'మని ♦ మొక్కి వచించెడు కృష్ణసింహు ప్రా
ర్థనమును ద్రోయఁజాలక ప్ర ♦ తాపుఁడు సమ్మతిఁ జూపె నయ్యెడన్ 314

—॥ పట్టాభిషేకము. ॥—

క॥ కొంగులముడి యలరాఁరగ
బంగరుపీటల విభుండు ♦ పాటేశ్వరియున్
జెంగట నె యమరసింహుఁ డ
నంగనిభుఁడు గూరుచుండి ♦ రతిహర్షమునన్. 315

మ॥ హరభట్టారక ముఖ్య భూసురులు మం ♦ త్రానీకముల్ పల్కి బం
గరు కుంభంబుల నుండు వార్థిజలమున్ ♦ గంగా పవిత్రాంబు ల
బ్బురమున్ గొల్చిఁ ప్రతాపసింహునకునై ♦ మూర్థాభిషేకంబు చే
సిరి సంపూర్ణవిశుద్ధచిత్తముల నా ♦ శీర్వాదముల్ చేయుచున్! 316

సీ॥ సౌరభ సురభిళ ♦ వారిపూరమ్ముల
జలకంబుఁ దీర్చి ♦ జిలుగుఁ బట్టు
వలువలు ధరియించి ♦ తలను ముత్తెపుసరుల్
కలకల లాడు పా ♦ గా ధరించి
విలువ వజ్రాల సొ ♦ మ్ములు మేన నిడి సుగం
ధ ద్రవ్యములను గా ♦ త్రమున నలఁది
మందార కుసుమ దా ♦ మము వక్షమునఁ దాల్చి
సూర్యదేవుని మ్రొక్కి ♦ స్తుతు లొనర్చి

గీ॥ యేకలింగేశ్వరు పదంబు ♦ లెదఁ దలంచి
భక్తి మెయి భవానీదేవిఁ ♦ బ్రస్తుతించి
గురుల హరచంద్రభట్టార ♦ కులను గొలిచి
యాప్రతాపుఁ డాస్థానము ♦ నందుఁ జేరె! 317

క॥ పరిఫుల్ల రుచిర సరసిజ
పరంపరలు నెఱపి నలు స ♦ భాభవనం బ
ప్పురజనముల నెమ్మోములఁ
బరమామోదమున నపుడు ♦ భాసిలు చుండెన్! 318

సీ॥ దైవజ్ఞమణులు త ♦ దేవ లగ్నంబంచు
సమయంబు జూచి హె ♦ చ్చరిక చేయ!
వేదభూసురులు దే ♦ వీంకాచ మను మంత్ర
ముచ్చైస్స్వనమున వా ♦ కుృచ్చుచుండఁ!
జారణుల్ పూర్వము ♦ హీరమణాభిషే
క ప్రసంగములు వే ♦ డ్కను బఠింప!
వందులు జయజయ ♦ ధ్వాన పూర్వముగఁ బ్రి
తాపశబ్దమ్ము సం ♦ దడిగఁ బొగడఁ!

గీ॥ జంద్రభట్టారకుండు ర ♦ సంబు గురియు
పెక్కు కల్యాణ వృత్తముల్ ♦ ప్రీతిఁ జదువ!
నెంత! సంతోష భరమొకో! ♦ యెవ రెఱుఁగుదు!
రందఱును మేను మఱచుచు ♦ నవశు లైరి! 321

క॥ కలనాదము లలరఁగ మం
గళ తూర్యము లెల్ల మ్రోఁగ ♦ గాయకులును బా
టలు పాడ, నాప్రతాపుఁడు
కొలువున సింహాసనమునఁ ♦ గూర్చుండెఁ దగన్. 322

గీ॥ ఆమహోన్నత శుభ సమ ♦ యమున హర్మ్య
సరభసమ్ము లైన బహుళ హ ♦ స్తములనుండి
యాసభాస్థలి నెల్లఁ బె ♦ ల్లాక్రమించి
కురిసె మెఱుఁగారు బంగారు ♦ విరుల వాన! 323

గీ॥ బంగరుం బళ్లెరమున జ♦ వాది పునుఁగు
పచ్చికస్తురి మెదిపియుఁ ♦ దెచ్చి యాయ
నాప్రతాపుని వికసి తా ♦ స్యంబు నందుఁ
దిలకమును సలుంబ్రాభర్త ♦ దిద్దె నపుడు. 324

మ॥ అమితోత్సాహముతో ఫణీశ్వరుని చా ♦ యన్ వెల్గు దుర్దాంత ఖ
డ్గము మధ్యంబునఁ గట్టి రత్ననివహా ♦ క్రాంతంబునౌ రాజదం
డము హస్తంబునఁ జేర్చి హాటక కిరీ ♦ టంబున్ దెసల్ నిండు తే
జముతోడన్ మిఱుమిట్లు గొల్పఁగను సం ♦ స్థాపించె మూర్ధమ్మునన్ 325

సీ॥ "అలఘు సలుంబ్రా మ ♦ హారాజ్య మేలు న
పార చోండావ ద ♦ న్వయమునకును
నేఁటి జీవత్స్మృతి ♦ నిధిని శ్రీ శ్రీ సలుం
బ్రాకృష్ణసింహ భూ ♦ వరుఁడ నేను
వంశక్రమాగతా ♦ వార్య సర్వాధికా
రోన్నతి నుదయసిం ♦ హుని కుమారుఁ
డతి విక్రమోదారు ♦ డగు ప్రతాపుని మహా
జనులైన మీమ్రోల ♦ జగము మ్రోల

గీ॥ నీదినం బీక్షణంబు ధా ♦ త్రీశుఁ జేతు!
ఇంద్ర రవి పంచభూత న ♦ క్షత్ర గణము
లెంత వఱకుండు నీప్రభుఁ ♦ డంత వఱకు
నాయురారోగ్యములు గల్గి ♦ యలరుఁ గాక! 326

మ॥ అరుణ ప్రాభవయుక్తితోఁ, గళలతో, ♦ వ్యాపార సంపత్తితో
సిరితోఁ, బంటలతోఁ, బదార్థములతో, ♦ సేనా సమూహమ్ముతోఁ,
బరమశ్రేయముతో, ననారతము మే ♦ వాడేశ సామ్రాజ్య మీ
పురుషశ్రేష్ఠుని యాజమాన్యమున నొ ♦ ప్పుఁ విశ్వసంస్తుత్యమై.'' 327

మ॥ అనుచున్ బాపులమాలలన్ గళమునం ♦ దర్పించి సౌవర్ణ నూ
తన భూషాళి నలంకరించి ''కడుశ్ర ♦ ద్ధాభక్తులన్ గొల్చి భూ
జను లీభూపవతంసుఁ గొల్వుఁ'' డని హా ♦ స్తద్వంద్వముల్ మోడ్చి సాఁ
గి నమస్కార మొనర్చి శీర్ష మిల ప్పెఁ ♦ గీలించి ముమ్మారులున్. 328

గీ॥ గొడుగు పట్టినట్లులు చల్వఁ ♦ గూర్పు నేర్పు!
రామరాజ్య మీతని దని ♦ ప్రచుర పఱుపఁ
బట్టిరి సితాతపత్రి! మ ♦ ప్పట్లఁ గదలెఁ
జామరగ్రాహిణుల హేమ ♦ చామరములు. 329

గీ॥ భూధరేంద్రాత్మజను బోలు ♦ పుణ్య సతులు
దొడ్డ ముత్తైదువలు హస్త ♦ తోయజముల
వరుస బంగారు దీపాల ♦ పళ్లెరముల
తో నివాళించి రపుడు భూ ♦ జాని నచట! 330

గీ॥ రత్నముల నొక్క కనకపా ♦ త్రమునఁ బోసి
హారతుల నెత్తి యంగన ♦ లవనిఁ బోసి!
రవి వెలిఁగె నాకసము నిండ ♦ నలము కొనిన
వివిధ తారకా కోరక ♦ వితతి మాడ్కి! 331

ఉ॥ అంతట నొక్క రొక్కరుగ ♦ నానృప శేఖరు పాద పంకజ
ప్రాంతముఁ జేరఁబోయి విన ♦ యమ్మలరార నమస్కరించి సా
మంతులు భోజనంబులు కొ ♦ మ్మున్న రత్నములున్ విభూషలున్
దొంతరలాడఁ గానుకలిడి ♦ తోరపు హర్షము లొంది రయ్యెడన్! 332

మ॥ హరభట్టారకుఁ జంద్రభట్టకవి వ ♦ స్త్రాలంకృతుల్ పెట్టుచున్
బరితోషింపఁగఁ జేసి యల్లన సలుం ♦ బ్రాస్వామికిన్ మ్రొక్కి ''యీ
చరణాబ్జంబులు నాకు సేవ్యములు మా ♦ చండతుమానాథు శ్రీ
చరణంబుల్ వలె'' నంచుఁ బీఠమున హ ♦ ర్షంబొప్ప నాసీనుఁడై. 333

శా॥ మందార ద్రుమ మంజరీ మధుఝరీ ♦ మాధుర్య సంపాది వా
క్సందోహం బలరన్ బ్రతాపవిభుఁ డా ♦ స్థానస్థ సామంత రా
ణ్ణందారుల్ ప్రజలున్ జమూపతులు నా ♦ నందాబ్ధి నోలాడుచున్.
మందస్మేర ముఖాంబుజ ప్రభలతో ♦ మన్నించి యాలింపఁగన్. 334

మ॥ 'పువులున్ బూచి సమస్తభూతలము న ♦ వ్వున్ గొల్పెనన్ మాడ్కి నూ
త్నవికాసస్ఫురణంబు వెంటఁగొని చై ♦ త్రంబున్ బ్రవేశించె! రా
జ్ఞివహాంబుల్ వ్రజ లేగుదేరఁగ భవా ♦ నీమాతకున్ బ్రీతిగాఁ
గ వరాహంబుల వేఁట లాడ నరుగం ♦ గా నెంచితిన్ గానకున్.'' 335

మ॥ అని తేఁడాడిన కృష్ణసింహుఁడును 'దే ♦ వా! చైత్రమాసోదయం
బున, నూత్నంబుగఁ బట్టభద్రు లయిన ♦ ప్డున్ వేఁటకై కానకున్
జను టాచారము తొల్తనుండియు! భవ ♦ చ్ఛాపంబునన్ నేఁడు గూ
లిన సత్వంబులఁ బట్టి భావిఫలమున్ ♦ లెక్కింత్రు క్షోణీజనుల్. 336

—॥ సాగరసింహుఁడు ప్రతాపసింహు నాక్షేపించుట. ॥—

చ॥ ఇది శుభసూచనం బిపుడె ♦ యేగుద''మంచన నెల్లవారు నొ
ప్పిద మను నంత గోడపయిఁ ♦ బిల్లి విధంబున దూఁకి సాగరుం
డెదురయి వచ్చి 'యేటి పని! ♦ యిచ్చటి కేగెదు! రాజ్యలాభముల్
కుదిరె నటంచు సంతసము ♦ గొప్పగఁ గల్గెనె! నీకు నిచ్చ్యెడన్. 337

మ॥ అరరే! యీ జగముల్లుఁ బోఁదరిమి య ♦ న్యాయంబుపై ధారుణీ
భరమున్ గొంటివి! మంచి చెడ్డ లవి దోఁ ♦ పన్ లేదె! యేచట్టపుం
బరిపాటిన్ వహియించి చేసితివి! వ ♦ హ్వా! నేటి నీచేత యె
వ్వరికిన్ శక్తి యొసంగు వారె నృపులన్ ♦ భంగిన్ నిరూపించెదున్. 338

చ॥ ఇది కొఱమాలినట్టి పని! ♦ యింతటి దుర్నయమున్ గనంగ నా
హృదయము నిల్వ లేదు! నిను ♦ సింధుల నూఁడియు నుంచి యవ్వలన్
గదలఁగ నీను! నన్నుఁ గడ ♦ గాఁ దొలగించి యభీష్ట కార్య మిం
పొదవఁగఁ దీర్పు! మేను మని ♦ యుండిన సాఁగవు నీ ప్రయత్నముల్' 339

మ॥ అని యాతండు సరోషదృష్టిని సలుపం ♦ బ్రాధీశ్వరున్ జూచి 'గ్యో
మనఁగా వచ్చును నిన్ను! నేఁ డిచట న ♦ న్యాయంబు నీవల్లనే

జనియించెన్ జుమి! యిప్పు డేమనుచు మె ♦ చ్చన్ జేతు! లోకం బిసీ!
యనదే నిన్గని! స్వామిభక్తియనఁ! గ ♦ ట్టా! యిట్టిదె యుండునే! 340

గీ॥ ప్రాసపూర్వాక్షరమునందు ♦ వలె సమస్త
గుణగణంబులు నీయందుఁ ♦ గొఱఁతలేక
యులర వలెఁగాక! యుఱక ని ♦ న్ననుసరించు
నతని ననవేటి కో సలుం ♦ బ్రాధినాథ! 341

-॥ కృష్ణసింహప్రభువు సాగరసింహునకు హితం బుపదేశించుట. ॥-

చ॥ అనుచుఁ బ్రతాపుఁ జేరఁజను ♦ నాతనిఁ గన్గొని కృష్ణసింహుఁ డీ
వనుజుఁడ వామహాప్రభున! ♦ కాయన నిందఱలోన ♦ నిప్పు డి
ట్లనుచు నిరోధముల్ సలుప ♦ న్యాయమె! శత్రువు లెవ్వ రిట్లు కా
దని యెదిరింప! నియ్యదియు ♦ నార్యులు మెచ్చు పవిత్ర కార్యమే! 342

చ॥ కలకలలాడుచున్న సభఁ ♦ గల్గిన లోకుల మోము లెల్ల మం
గలముల మాడ్కినైన వివె ♦ కన్గొను దారుణమైన నీదు మా
టలు వినినంత! కోపము వి ♦ డన్ జను నిత్తఱి! శాంత మూనఁగా
గలిగిన మేలు సుమ్మిపుడు! ♦ గడ్డము వట్టి వచింతు సాగరా! 343

మ॥ మనమందున్ గల క్రౌర్యముల్ విడుము! నా ♦ మాటల్ మదిన్నిల్పు! పా
వన గంగాఝర వారిపూరముల వి ♦ ప్రశ్రేణి మూర్ధాభిషే
చనముల్ జేసిన యీమహాత్ముని పదా ♦ బ్జంబుల్ తలన్ సోఁక నో
క్క నమస్కారము చేయు! మీతఁడు నమ ♦ స్కారార్హుఁ డెవ్వారికిన్ 344

క॥ సరళమతిన్ యోజింపుము!
పోర వడకుము! వినవె పితృ స ♦ మో జ్యేష్ఠ యనన్
గురుఁ డుదయసింహుతో ని
ప్పురుషవరుఁడు సముఁడు నీకుఁ ♦ బూర్వజుఁ డగుటన్. 345

చ॥ కలుగఁగ జేయఁబోకు సుమి ♦ గందర గోళము! విన్మి నీదు మా
ట లితని సద్గుణంబుఁ బొగ ♦ డన్ దగు! నిందకుఁ బన్కరావు! చే
తు లితని పాదముల్ నిలుపఁ ♦ దోరపుఁ బాదుకలైనఁ జెల్లుఁ! గ
త్తులుగొని తాఁక దోసమగుఁ! ♦ దోఁచిన యంతయు నీకుఁ జెప్పితిన్ 346

చ॥ అని వినయమ్మునన్ నయము ♦ నాదర మొప్పఁగఁ గృష్ణసింగు ప
ల్కిన విని సాగరుండును జ ♦ లింపక "ధర్మమొకండె నేను గో
రిన! దది వీడి వీను లల ♦ రించెదు నీతు లివేల! తెల్పు మే
మనెదొ! ప్రతాప! నీ విపుడు ♦ న్యాయము నిల్పెదొ! ప్రక్కకేగెదో! 347

చ॥ స్థిరగుణమాన్యుఁ డయ్యుదయ ♦ సింహ మహీరమణాగ్రగణ్యుఁ డం
దఱను సమంబుగాఁ గనిన ♦ తండ్రి! కుమారుల యోగ్యతాపరం
పరల నెఱింగి రాజు జగ ♦ మల్లుని జేయఁగ నాన తిచ్చె! నా
పరమపవిత్ర మానసుని ♦ పల్కును నిల్పుట పుత్ర ధర్మమా! 348

గీ॥ ఇరువదేడుగు రైన భ్రా ♦ తృవరు లందు
జ్యేష్ఠుఁడవు! ప్రపంచము త్రోవ ♦ తెలుఁగు ప్రోడ!
వనుచితంబని తోఁపక ♦ యనుజు సొమ్ము
నపహరించితి! వింత య ♦ త్యాశ తగునె! 349

సీ॥ కనుమూసి గుడ్డ క ♦ ట్టిన దేమి లేదు! స
మస్త భూపరిజయు సా ♦ మంత నృపులు
పరికించు నెడఁ బట్ట ♦ పగటివేళను దండ్రి
"జగమల్లు రారాజు ♦ సలుపుఁ" డనుచు
గొంతెత్తి యనె! నందుఁ ♦ గూడిన వారెల్లఁ
దలలూఁచి! రిపుడు నీ ♦ దండఁ జేరి
ప్రియభాష లాడు నీ ♦ కృష్ణసింహుఁడు నాఁడు
చిత్తంబని కరంబు ♦ శిరము వంచె!

గీ॥ నేఁడుగద రాజరాజుల ♦ నిర్ణయించు
ప్రోడ యధికార మితని చే ♦ తులకుఁ జిక్కెఁ!
మీర లిరువు రేకతమున ♦ మెదిపి మెదిపి
కార్య మిటు త్రిప్పియుంటిరి ♦ కట్టకడకు! 350

చ॥ ఇఁక నొకవేయుమాటలఁ బ ♦ నేమి! యిదే జగమల్లు రాజుఁ జే
యక జనకాజ్ఞ మీఱుచు దు ♦ రాశ ధరేశత సంగ్రహించు ని
వకట! మదీయ వాక్యముల ♦ నాదృతి నుంతువె! తల్లిఁ జంపు వా
నికిఁ బినతల్లి చేతులు గ ♦ ణింపఁ జివుళ్లను నొప్పెఱుంగవే. 351

ఉ॥ ముందొకఁడాడి వెన్కకును ♦ బోయి మఱొక్కగతిన్ జరించు నా
చందము తెప్పు నేనెఱుఁగ! ♦ స్వాంతము విప్పి వచింతుఁ! దండ్రియా
జ్ఞం దలఁదాల్చి ఘోరమను ♦ నల్పము మాజగమల్లు! లేనిచో
నిందలు గల్గుఁ! గష్టములు ♦ నీకును బెక్కులు వచ్చు నియ్యెడన్'' 352

చ॥ అని బిరుసెక్కు చూపులను ♦ నందఱఁ జూచెడు తమ్మునిన్ గనుం
గొనుచుఁ బ్రతాపుఁ 'డోకొమర! ♦ కూడునె తొందర! మంచిచెడ్డలన్
మనమున నిర్ణయించి జగ ♦ మల్లుని యోగ్యత నెంచి పౌరు లె
ల్ల నుడువు మాటలెంచి యిటు ♦ లన్ బొనరించితి సుమ్ము సాగరా! 353

సీ॥ ఎఱుఁగుదు నే మన ♦ మిరువ దైదుగురలో
జగమల్లునకుఁ దండ్రి ♦ మిగులఁ గూర్చు!
ఎఱుఁగు దాతని వసు ♦ ధేశుఁ జేయుఁడటంచు
మనతండ్రి నృపులతో ♦ ననిన తెఱఁగు!
నెఱుఁగుదు నెదురాడ ♦ రెల్లరు మంచిదం
చొకమాఱె యొందల ♦ నూఁచుటయును!
నెఱుఁగుదు జగమల్లుఁ ♦ డెట్టిన మేవాడ్ర
పూర్వ్ నేలెద నంచు ♦ నూఁగుటయును!
గీ॥ నిన్ని యెఱిఁగియు నాపైన ♦ నెసగు భార
మిదిగఁ జనె నంచు నాబా శి ♦ ఖాగ్రసీమ
నేకలింగేశు చరణ నా ♦ ళీకయుగము
నెడఁదఁ గొలుచు నుపాయంబు ♦ నెఱిఁగి యుంటి! 354

సీ॥ అతిపూజ్యుఁ డుదయసిం ♦ హక్ష్మావరోత్తంసు
కొడుకులలోఁ బెద్ద ♦ కొడుక నౌట!
మారటతండ్రి స ♦ న్మాన్యుఁ డీకృష్ణభూ
జాని యానతి మీఱ ♦ రాని దగుట!
సామంత మండలీ ♦ శముఖు లేకగ్రీవ
ముగను సింహాసనం ♦ బునకుఁ గోరఁ!
బ్రస్తుతస్థితిని నీ ♦ పాలన లేకున్నఁ
జెడుదు మంచని పౌరు ♦ లడలు చుండ!

గీ॥ నిన్ని కష్టసుఖంబుల ♦ నెంచి యెంచి
విముఖమై యున్న మనసును ♦ వెనుకఁ ద్రిప్పి
యన్న! నే బట్టభద్రుఁడ ♦ నైతిఁ గాని
కోరి భారంబుఁ దలను బై ♦ కొనఁగ లేదు! 353

చ॥ మన జనకుండు ధాత్రి జగ ♦ మల్లున కిచ్చె నటంచు విన్నయం
తనె "భ్రోలఁగెన్ దలన్ గలుగు ♦ తద్దయు భారము! నే స్వతంత్ర జీ
వనమును నెందుఁగాని జర ♦ పన్ గల! దేవుఁడు కూర్మిఁ జూచెఁ బో
మ్మని మది నెంతయేనియును ♦ హర్షముఁ గాంచితి సుమ్ము సాగరా! 354

శా॥ ఈమేవాడ నివాసముం దవిలి నే ♦ నుందున్న శ్రోణీజనం
బేమాడ్కిన్ దలపోయునో మది నటం ♦ చే పశ్చిమా కేగి యా
భామాసాహి పదాంబుజంబులకడన్ ♦ వర్తింపఁ గాంక్షించి యు
ద్దేమున్ముందు ప్రయాణమున్ సలుపనుం ♦ టిన్ గంటకుల్ ముందుగన్ 355

ఉ॥ అప్పుడు కృష్ణసింహుఁడు ప్ర ♦ జాలి నృపాలియు వెంటరాఁగ నే
నొప్పుఁగ వచ్చి "యూరకిటు ♦ లుండఁగ నేటికి! లేచి రమ్మ! నీ
విప్పృథివీతలంబుఁ గొని ♦ యేలవలెన్ జుమి! నీవు తప్ప మా
యప్ప! యొరుల్ మహీరమణు ♦ లైనను రాజ్యము నిల్వ దీయెడన్" 356

చ॥ అని యభిషేకమున్ సలిపి ♦ యర్హగతిన్ సమలంకరించి నన్
గొని యిటు తెచ్చె! బౌరులును ♦ "గూడదు కాదిఁక సింహపీఠముం
దున వసియింపుమీ" యనినఁ ♦ ద్రోయఁగఁజాలక నిజ్ఞ లాజ్ఞ చే
సిన యటు సింహపీఠిని వ ♦ సించితి దేశము నేను మెచ్చుచున్, 357

మ॥ పరమోత్కృష్ట మృదు స్వభావుఁడు సలుం ♦ బ్రాస్వామి! యాధన్య భా
స్వరకారుణ్య కళా విశేషమున మే ♦ వాల్లభ్య శోభావరం
పరలన్ గొల్పడకున్న దిప్పటికి! రా ♦ జ్ఞాందారుఁ డీపుణ్య సా
గరునిన్ దూఱుచు ప్రేళ్లఁజూపి యఱువం ♦ గాఁ బాడియే నీకిటన్ 358

చ॥ ఎఱుఁగక యుందు వాక్కు! పురు ♦ టింటిని బాయని దాఁడి పండ్రినిన్
మఱువఁగఁ జేసి యాభువన ♦ మాన్యుఁడు నన్నును నిన్ను దమ్ములం
దఱిఁ గొని యంత వారలను ♦ దద్దయుఁ బెద్దలఁ జేసి పెంచె! నో
క్కరుఁ డెదురైన నేఁటికిని ♦ గాఁగిటఁ జేరుచుఁ దండ్రి భంగిగన్. 359

గీ॥ దుర్గమారణ్యములఁ జేర్చి ♦ తుత్రింపు మనుచుఁ
దండ్రి పంపఁడె సూర్తు! నా ♦ తఁడు చిరాయు
వై సలుంబ్రాపురమున సౌ ♦ ఖ్యమున మనుట
యెవరి బలమూని? యీధన్య ♦ కృపను గాక. 362

క॥ పౌరుల సేమంబును క్షో
ణీ రాజ్యము సేమములును ♦ నీసేమం బా
ధీరుఁ డెఱుంగు! నెఱుంగఁగ
నేర! వతఁడె తల్లి దండ్రి ♦ నీకున్ నాకున్. 363

మ॥ మనముత్తాత యొకప్డు చండవిభుఁ డా ♦ త్మత్యాగమున్ జేసి త
మ్మునకై రాజ్యము వీడె! దజ్జనకుఁ డ ♦ ప్పూర్వజ్యున్ సలుంబ్రావిభున్
బొనరించెన్! దదుదార వంశము యశం ♦ బున్ బొంద జన్మించె! నీ
యనఘుండున్ మనతాత చందమునఁ బూ ♦ జార్హుండు ముమ్మాటికిన్ 364

చ॥ హిమకరునందుఁ గందు గల! ♦ దీశు గళంబున నల్పసంకుఁ! బం
కము కమలంబు నంటుకొనుఁ! ♦ గాని జగంబులు క్రుంగినన్ గిరీం
ద్రము లవి బెండు దేలినను ♦ ధన్యచరిత్రుఁడు కృష్ణసింహు స్వాం
తమునను గందొకించుకయుఁ ♦ దొక్కఁన నేరదు! కోటి చెప్పినన్! 365

గీ॥ నేను నృపుఁడనై యీతని ♦ నెత్తిఁ బెద్ద
మకుట మిడుటలే· దిఁక జగ ♦ మల్లుఁ డవని
నాథుఁడయి తీయుటయు లేదు! ♦ నడుమఁ జిక్కి
పరులచే నాఱు దూఱును ♦ బడుట తక్క! 366

చ॥ జనకుఁడు పెద్దకాలము రు ♦ జాపరిపీడితుఁ డౌట నెట్టులన్
మనమున నిర్ణయించెనొ! కు ♦ మారులలోఁ బ్రథముండు తండ్రిపో
యినపిదపన్ ధరావలయ ♦ మేలుట యెందును లేదె! వైపరీ
త్య నియతి నేఁడు పుట్టెనొ! క ♦ టా! యిది లోకము పాడియే కదా! 367

చ॥ ఇది జనకోటి కిష్టమని ♦ యెక్కటి నిత్తటి సింహపీఠ! ని
య్యదనను నీకు నొక్కనికి ♦ స్వాంతము సమ్మతిఁ గాంచకున్న నే
వదలుట యెట్లు సాధ్యమగు! ♦ బాలక! నే నిదె శక్తివంచనల్
గొదకొననీక కష్టపడి ♦ క్షోణిని నేల బ్రియత్నమూనెదన్! 368

—॥ ప్రతాపసింహుని సాగరుఁడు నిలువరించుట! ॥—

చ॥ అని మనసారఁగాఁగడు న ♦ యంబున వత్సలతానిరూఢి నె
క్కొనఁగఁ బ్రతాపసింహుఁ డనఁ ♦ గోపము పట్టఁగలేక సాగరుం
"డనుజుఁడ వంచు మే ల్దలఁచి ♦ యాడిన నీతల కెక్క దయ్యో! రా
జ్యనియతిముందు నీతులు వి ♦ సంబుగఁ దోఁచెనె నేఁడు నీకిఁకన్ 369

సీ॥ బహుకాలముగను మే ♦ వాడ్దేశమేలిన
జనకుండు దీక్షరు ♦ జాపరీతుఁ
డై యెట్టులో నిర్ణ ♦ య మొనర్చె నఁట! నతఁ
డన్యాయవర్తనుఁ ♦ డంట! యణువు
మొదలుగా బ్రహ్మాండ ♦ మును మ్రింగి గ్రేఁచెడి
యీకృష్ణసింహుఁ డ ♦ స్తోక ధర్మ
నిరతుఁడౌ నఁట! మీర ♦ లిరువు రేకంబయి
ధర్మదేవత భార ♦ తంబు నుండి

గీ॥ లేవఁ గొట్టంగఁ బుట్టు క ♦ లిస్వరూపు
లని తెలిసెఁ! బట్టపగలు ప్ర ♦ జాలి యెదుట
నింద్రజాలము నొనరించి ♦ యిట్టులు కనుఁ
బ్రామఁ గలిగితి! రేమన ♦ వచ్చు మిమ్ము! 370

మ॥ సదయుం డాజగమల్లునిన్ బిలిచి రా ♦ జ్యంబిమ్ము! కాదేని నేఁ
గదనంబందునఁ దాఁకి లోక మలరం ♦ గా ద్వంద్వయుద్ధంబుఁ జే
సెద నీతోఁడ! మదీయ మానసము కొం ♦ చెంబైన ధర్మంబు మీ
ఱదు! ప్రాణంబు లశాశ్వతంబు లగు! ధ ♦ ర్మంబే చిరస్థాయిరా! 371

మ॥ అవనీరాజ్యము నిత్తువో! వివిధ శ ♦ స్త్రాస్త్రంబులన్ దాల్చి యా
హవరంగంబున నన్నుఁ దాఁకెదవో! యీ ♦ యర్థద్వయంబందు నీ
వవలంబింపు మొకండు! లేనియెడ శౌ ♦ ర్యస్ఫూర్తి నిట్టట్టులన్
లవమైనన్ గదలంగనీ! నిపుడె తె ♦ ల్పన్ జాలు నీభావమున్." 372

క॥ అని బిట్టుబిగిసి తనమో
మునఁ జూడ్కులు నిలిపి యుద్ధ ♦ మును గోరెను త

మ్మునుఁ గనుఁగొనుచుఁ బ్రతాపుం
డనె గాంభీర్యప్రధానుఁ ♦ డై జనులు వినన్. 373

మ॥ "అడుగైనన్ గదలంగనీని శ్రమ మే ♦ లా! రాచపుట్టొందు నె
వ్వఁడుగానీ రణమన్నఁ బండుగనుచున్ ♦ భావించు! నీయందఱున్
గడువార్ధంబునఁ దెచ్చి నాపయినఁ జ ♦ క్కన్నిల్పి రీరాజ్యమున్!
గడఁద్రోయన్ జన! దట్టులోట రణమే ♦ కర్తవ్యమై కన్పడున్" 374

మ॥ అని యప్డప్పుడె మధ్యమందున సలుం ♦ బ్రాధీశుఁడున్ గట్టియుం
చిన నాగేంద్ర సమాన ఖడ్గమున కై ♦ చేసాఁచె! నాసాగరున్
గని సామంతులు భూపరాజనివహముల్ ♦ 'గట్టా! యితం డేడవ
చ్చెనో పిడ్గున్ బలె మామనోరథము శు ♦ ష్కీభూతమై పోవఁగన్ 375

చ॥ కనికర మన్నమాటను జ ♦ గంబున నీతఁడు విన్నయట్టులన్
గనఁబడ! దిందుఁజేరియు ర ♦ ణంబు రణం బనుచున్ క్షణక్షణం
బు నుడువు! స్థానమో సమయ ♦ మో గ్రహియింపఁడు! వాని కేమి! గె
ల్చిన సకలావనీభరము ♦ చేపడు నన్న దురాశ తక్కఁగన్! 376

మ॥ అమిత ప్రాభవ మొప్ప నిప్పుడు సలుం ♦ బ్రాధీశుఁ డాస్యంబు సం
దమునొందన్ నెలకొల్పు నాతిలకమున్ ♦ మట్టారదే! ద్వంద్వ యు
ద్ధము రానేల! ప్రతాపుఁ డేటికి సమా ♦ ధానంబు సూచింపఁ! గ
ష్టములన్ దెచ్చె నితండు! వల్దనుచు నా ♦ జ్ఞాపింపఁగా రాదొకో! 377

మ॥ కులశైలోపమ ధైర్యభూధవ శిరః ♦ కోటీర కోటీ మణి
జ్వల దారక్తరుచుల్ పదంబులు వహిం ♦ చన్ జూచియున్నట్టి క
న్నులతో దారుణ సంగరాంగణమునం ♦ దున్ ఖడ్గముల్ చీల్చఁగా
వెలికిన్ దూఁకెడు క్రొత్త రక్తములనున్ ♦ వీక్షింప నానేమొకో!" 378

మ॥ అని యిట్లంచు వచింపరాని కదుఁ జిం ♦ తావేశ దైన్యంబులన్
గని దుఃఖింపఁగఁ గృష్ణసింగు "రణమే ♦ కర్తవ్యమే! వేఱు త్రో
వ నిరూపింపఁగరాదె! యిప్పు డిపుడే ♦ పట్టాభిషేకంబు శో
భనమై సాఁగెను! యుద్ధ మెట్లయిన ని ♦ ల్పన్ భావ్యమా నియ్యెడన్" 379

చ॥ అనఁగఁ బ్రతాపసింహుఁడు "మ ♦ హాత్మ! భవద్వచనంబు మానసీ
యనియతి నొప్పు! నైన నోరుఁ ♦ డాహానమున్ బొనరింపఁగోరి పి

ల్చినను నిరాకరింపఁగల ♦ లేఁత మనం బది లేదు! కాని మీ
రనినటు లిట్టి సౌఖ్య సమ ♦ యంబున నెట్లని చింత కల్గెడున్. 380

క॥ దండించుట క్రౌర్యమ్మగు!
దండింపమి దుర్బలతకుఁ ♦ దావగు! నవసీ
శుండనగు నేఁటి నాస్థితి
యొండేటికి సున్నితముగ ♦ నున్నది తండ్రీ! 381

మ॥ సరి! యీమంగళవేళయందు రణమున్ ♦ సాగింప కొండొక్కఁడౌ
కరణిన్ గార్యముఁ ద్రిప్పి యీతనిఁ దోలం ♦ గన్ జేతుఁ బొమ్మంచు "సా
గర! చిత్తూర్పుర రాజ్యమెల్ల మ దుద ♦ గ్రస్ఫార బాహాబల
స్ఫురణన్ రక్షణసేయ నెంచితి శుభం ♦ బుల్ నేఁడు సంధిల్లఁగన్. 382

మ॥ అనిశ ప్రేమను వెలుఁగ నభ్యుదయసిం ♦ హాఖ్యావరుం డీమహీ
వనిఁ బాలించి యశంబు గాంచెను; సలుం ♦ బ్రాణనాథుఁ డానేఁత పో
యినవెన్కన్ దనకున్ లభింపఁగల ప్ర ♦ త్యేకాధికారంబు పే
ర్మిని నన్నీడకుఁ దోడితెచ్చుచు ధరి ♦ త్రీనాథుఁ జేసెన్ వడిన్. 383

మ॥ ఎవఁడో యొక్కఁడు రాజుగా నిలిచి యి ♦ పృథ్విస్థలిన్ వాని శ
క్తివిశేషమ్మున నేలు టొప్పు! బ్రజ భ ♦ క్తిన్ వాని యాజ్ఞాబలం
బవలంబించుట యొప్పు! లేనియెడఁ జే ♦ కాక్రై విపత్కోటిచే
నవరుద్ధంబగు రాజ్య మెవ్వనికి వాఁ ♦ డే యేలఁగాఁ బూనినన్! 384

ఉ॥ ఓసువరాని కార్యమిది! ♦ యూఱక కావరమూని నీతి వి
ద్యా రమణుండు కృష్ణవిభు ♦ నాడితి నోరికి వచ్చినట్లు! నా
తో "రణ మాచరింపు" మని ♦ త్రుళ్లుచు నాదు మహాధికార ధి
క్కారము చేయుచుంటి! విఁకఁ ♦ గాదు సహింప భవత్ప్రవర్తనల్. 385

—॥ ప్రతాపసింహుఁడు సాగరసింహుని దేశభ్రష్టుఁగావించుట. ॥—

మ॥ నిను వీక్షించుచు నాప్రజల్ సుగుణ ని ♦ ర్భిద్రుల భవద్దుష్టవ
ర్తనముల్ నేర్చిన నేత్రి! కావున నినున్ ♦ దండింపఁగా నొప్పు! వే
చను నాదేశము వీడి యిష్టై పరరా ♦ ష్ట్రశ్రేణులన్ జేర! నో
ర్వ నిమేషం! బిట నాలసించినను శి ♦ రచ్ఛేదమున్ జేసెదన్. 386

మ॥ ఇది నాయాజ్ఞ బహిష్కరించితిని ని ♦ న్నీదేశమ్మున్ వెడల్చుటన్
మొదలన్ బోకన సాగరుండు నగి "సా ♦ మీ! చాల సంతోషమో
నది! రాజ్యం బది యెంత తీపనుచు నెం ♦ దుం బందు భావించితో
విదితం బయ్యె సమస్త భూజనులకున్! ♦ వెక్కేల వాక్రువ్వఁగన్ 387

మ॥ ఇది నాయూరిది నాదురాష్ట్రమనుచున్ ♦ హీనుల్ మఱిన్ దుర్బలుల్
మది నూహింతురు! కాని విక్రమకళా ♦ లంకారులౌ వారి క
య్యుదయాస్తాచల మధ్యగం బయిన స ♦ ర్వోర్వీతలంబుల్ ముదా
స్పదమౌ కొంగుపసిండి వోలెఁ దమదై ♦ భాసిల్లు నెల్లప్పుడున్. 388

మ॥ పరమ ప్రాభవ సంపదల్ విడిచి మే ♦ వాడ్దేశ మందుండఁగా
నెరియున్ నామది! నీవు శత్రుఁడగుటన్ ♦ నీవారలున్ శత్రులౌ
దురు! నీకెప్పుడు గర్భశత్రువులు మి ♦ త్రుల్ నాకు! నక్లాట మ
చ్చరణంబుల్ క్షణకాలముంచుచుఁ జరి ♦ చన్ నీదు రాజ్యంబునన్! 389

సీ॥ పనియేమి పరభూమి ♦ పతుల సీమలకేగ!
మేవాడ నెప్పుడెప్డు ♦ క్రుంగుదునని
కనుసైచియుండు న ♦ క్బరు ధరామండలా
ఖండలుం! డాతని ♦ కడఁకు బోదుఁ!
ద్వద్వికట ప్రవ ♦ ర్తనమున నతనికి
మిత్రలాభము గల్గు ♦ మేర యొదవె!
నిప్పుడ పయనించి ♦ యే గద ఢిల్లీపు
రమునకుఁ గొన్నిది ♦ నముల లోన!
గీ॥ హెచ్చరిక గల్గి రాజ్యంబు ♦ నేలు చుండు!
మిదియె శాశ్వత మనియుండ ♦ కెప్పుడెవ్వ!
రెచట నేరీతి నిన్ను జ ♦ యించి దాని
నపహరించునో! తెలియఁబో ♦ దజున కైన!" 390

మ॥ అని గాంభీర్య మెలర్పఁగా బలికి య ♦ శ్వారూఢుఁడై పోయె! నా
తని వీక్షించుచుఁ గొంతసేపటికి యో ♦ ధశ్రేష్ఠులున్ వెన్కకున్
దనవెంటన్ జనుదేర నయ్యెడ నర ♦ ణ్య ప్రాంతముల్ జేరగాఁ
జనె వేటాడఁ బ్రతాపసింహుఁడు జనుల్ ♦ సంతోషముల్ బొందఁగన్ 391

ఉ॥ కొమ్ములు లేని యమ్మహిష ♦ కోటులు! తొండము లేని భద్రనా
గమ్ములు నాఁగ నొప్పు వనిఁ ♦ గల్గిన మత్తమహావరాహ పో
తమ్ముల నాప్రతాపుఁ డతి ♦ దారుణలీల నేటియర్ శరీ
రమ్ములు గాడఁగాఁ బొడిచి ♦ రాసులు రాసులు వోసె నేలపై! 392

మ॥ అరుణాంశుచ్ఛట లీన నేత్రములు, శౌ ♦ ర్యాటోప మేపార, ను
గ్రరసోద్రేకమునన్ బ్రతాపధరణీ ♦ కాంతుండు సత్త్వాత్ర సం
భరితుం డెత్తిన యీఁటె దీపక మ ♦ హానుంయా కిరాతుం డటుల్
సిరతోదగ్ర విహారముల్ నెరపి ఖం ♦ డించెన్ వరాహమ్ములన్. 393

మ॥ తగుసామంతులు వీరయోధమణులుం ♦ తన్ వాగి దోశ్శక్తిచే
దగుచందంబున నొక్కొక్కఁ గదిసి కాం ♦ తారంబునన్ గల్గు నా
మృగసంతానములన్ క్షణంబునను భూ ♦ మిన్ గూల్చి పెక్కింటిఁ గు
ప్పగఁ దా మొక్కెడఁ జేర్చి రారుధిరముల్ ♦ పాఱంగఁ బెన్వాల్వలై 394

చ॥ అరిదిముదంబు మీఱ మృగ ♦ యారతి సాఁగఁగఁ జేసి నిల్పి స
త్వరగతి లెక్కసేయఁగఁ బ్ర ♦ తాపుఁడు గూల్చు వరాహసంతతి యం
దలు సమయించు నమ్మృగవి ♦ తానము మీఱుటఁ జూచి హర్షముల్
వఱలఁగ "మంచి కాలమది ♦ వచ్చె" నటంచుఁ దలంచి రందఱున్! 395

మ॥ శివముత్తైదువ ప్రీతి కేకలములన్ ♦ జెండాడి సామంత భూ
ధవులున్ యోధులు నూతనోత్సవ సము ♦ ద్యత్స్వాంతులై భూమియున్
దివియున్ గ్రిక్కదలంగ నార్చుచుఁ గడున్ ♦ దేజంబు దీపింప ను
గ్రవనంబున్ విడి రాజధానిఁ జొరం ♦ గాఁబోయి రొక్కుమ్మడిన్. 396

సీ॥ చిరస్త్రార్పరము శత్రు ♦ చేఁబడి రాజ్య భా
గము తద్ద పెద్దది ♦ గాకయున్నఁ!
దమదేశ సామంత ♦ ధరణీశు లొక్కరొ
క్కరు పోయి యక్కరుఁ ♦ గలియుచున్నఁ!
కడలేని యుద్ధసం ♦ ఘర్షణంబులఁ దమ
దేశమంతయుఁ బిప్పి ♦ దేలి యున్నఁ!
బరిపంథియోధ నష్ట ♦ భాగ భూభాగముల్
తలకిందు చేసెడి ♦ బలియుఁ డైన

గీ॥ దమనుఁడి హరించు ఘనుఁడుదు • ర్దాంతతేజుఁ
డర్కకులవర్ధనుఁడు సుగు • ణాంబురాశి
యాప్రతాపుఁడు రాజౌట • హర్షపరత
మించి మిన్నందె ప్రజరమి • యించె నపుడు! 294

గద్య:—ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత రసవత్కావ్య నిర్మాణ చాతురీ ధురీణ, సుగుణ గణపారీణ, దుర్భాకవంశ దుగ్ధాంభోరాశి రాకా కైరవమిత్ర శాలంకాయన గోత్రపవిత్ర, సుజనజనానుగ్రహ పాత్ర, వెంకటరామార్య పుత్ర, కవిసార్వభౌమ — సాక్షాద్వీరప్రతాపాది—వింశత్యధిక బిరుద విఖ్యాత, సుకవి రాజశేఖర, రాజశేఖరకవి ప్రణీతంబైన రాణాప్రతాపసింహ చరిత్రంబను పద్యకావ్యంబు నందుఁ ప్రథమాశ్వాసము.



శ్రీ

కామేశ్వర్యై నమః

# రాణాప్రతాపసింహ చరిత్ర.

## ద్వితీయాశ్వాసము.

మ॥ వరసౌఖ్యంబులకున్ నిరోధకంబగు నే ♦ ర్పాటుల్ దొలంగించి సు
స్థిరతన్ బెంచు వ్యవస్థలన్ దిటముగాఁ ♦ జేకూర్చుచున్ సత్య ధ
ర్మరతుల్ మీఱఁగ రాజ్యమేలు కొనుచున్ ♦ రాణాప్రతాపావనీ
శ్వర మందార మొకానొకప్పుడు సలుం ♦ బ్రాధిభర్త న్వీక్షించుచున్ 1

—॥ { సూక్తసింహుని రాజధాని కంపుమని ప్రతాపసింహుఁడు కృష్ణసింహు నర్థించుట } ॥—

మ॥ "మొదలన్ నెత్తురు పంచుకొం చనుజుఁడై ♦ పుట్టొందె; నాపైన బా
ల్యదశన్ బైనను బ్రక్కనున్ బడుచుఁ దు ♦ ల్యప్రేమతో మైత్రికా
స్పదమై వర్తిలె; సూక్తుఁ డొక్కతుటి నన్ ♦ బాయం డొకప్డైనఁ ద
ల్లిదరిన్ జేరఁడు; ప్రాణ మొక్కఁడు నొడల్ ♦ రెండైనయట్లుండెడిన్! 2

తే॥ రాము నుపమ నా మీఁదఁ బల్క ♦ రాదు! గాని
ఱెప్పవాల్చక కనుపెట్టి ♦ రేయుఁ బవలు
ననుచరుండయి నన్గొల్చు ♦ నప్పుడతఁడు ని
జంబు మూఁడుమూర్తులకు ల ♦ క్ష్మణుఁడె సుమ్ము! 3

గీ॥ సూర్యవంశ ప్రదీపుఁడౌ ♦ సుతు విపత్తుఁ
బాపి కాపాడి తనుచు నీ ♦ భవ్య యశము
నలుదెసలఁ బ్రాకె! సూక్తుఁడ ♦ నంతకోటి
జన విజయ సూక్తుఁడగుచుఁ దే ♦ జమునఁ జెలఁగె. 4

సీ॥ అతఁ డడుగు మోపు సమయ భా ◆ గ్యమునఁ జేసి
యెంతకాలమొ సంతాన ◆ మెఱుఁగకుండి
కడుపు ఫలియించి కొమరులఁ ◆ గనియె నీదు
దొడ్డయిల్లాలు జగము సం ◆ తోష మంద. 5

చ॥ ఎఱుఁగుదు రెంతొ సామ్యముగ ◆ నేను వచించిన వాక్య మూని సా
గరుఁడు సభాముఖంబునను ◆ కాఱులు ప్రేలుటఁ; దానఁ గోప వి
స్ఫురణను దేశముల్ విడచి ◆ పొమ్మని పంపితిఁ! గాని కూర్మిసో
దరు నెడబాటుచే మది య ◆ థాయథమై చనె నేమి తెల్పుదున్! 6

గీ॥ సూక్తు సంపుము; చెంతనుం ◆ చుకొన నెంతు;
నెచట నున్న నీవాఁడు గాఁ ◆ డే యతండు!
నేను మొదలుగ నీరాజ్య ◆ మెల్ల యుష్మ
దమృత హస్తాభిరక్షితం ◆ బగును గాదె!'' 7

మ॥ అని యెంతేనిఁ బ్రతాపసింహుఁడును ద ◆ న్నర్థింపఁగాఁ గృష్ణసిం
గను మోముల్ వికసింప ''దేవ! నిను ని ◆ త్యంబుల్ మహాభక్తి నె
క్కొనఁగాఁ గొల్చుటకన్న నొందుపని నా ◆ కుల్ హర్షదం బౌనె! యెం
దును నీయానతి వేదతుల్యమని తా ◆ ల్తున్ నేను శీర్షమ్మునన్. 8

శా॥ నామాటొక్కఁడిదేల; నేను సుతులన్ ◆ నాబంధులన్ నాసలుం
బ్రామాన్యావని రాజ్యలక్ష్మియును స ◆ ర్వస్వంబు నీచేతిదే;
యీమే నియ్యెలలోన నుండువఱ కి ◆ ట్లే సాఁగినన్ జాలు; నా
స్వామిస్నేహము ప్రోలఁ దుచ్ఛములు స ◆ ప్తద్వీప సామ్రాజ్యముల్ 9

గీ॥ వత్సరమున నార్నెల్లు తా ◆ వక సమక్ష
మందు నేనుందు; నాసమ ◆ యంబునందు
దేవ! నీమృదు పాద రా ◆ జీవయుగము
సూక్తు వదనారవింద మే ◆ జూడఁ గందు.'' 10

చ॥ అనుచుఁ బ్రతాపసింహ వసు ◆ ధాధిపసింహు ననుజ్ఞ నొంది శో
భనతర లక్షణాన్వితము ◆ వార్వము నెక్కి నిజాప్త యోధులున్
దను గొలువంగ నాత్మసద ◆ నంబును జేరి లతాంగి సమ్మతిన్
గొని కొనివచ్చె సూక్తు రిపు ◆ కుంజరసింహుఁ బ్రతాపు జేరఁగన్. 11

గీ॥ తావియును బూవు కరణి సో ♦ దరు లిగురుపు
కలిసి రాగ రసాతి సం ♦ కలనఁ బెరసి
యేకమతు లేకవాక్యులై ♦ యెల్లరలక
నొండొరులు వాయ కొక్కఁడై ♦ యుండి రపుడు. 12

—॥ వసంతోదయము ॥—

గీ॥ పల్లవ వ్యాప్తి పుష్పవ ♦ ద్వైభవంబు
ఫల నవోదయ భూతి కొ ♦ మ్మలకుఁ గూర్చి
మాధవ గృహీతయగు మధు ♦ మాస లక్ష్మి
యఖిల జగము పూఁదోట య ♦ ట్లలరఁ జేసె. 13

—॥ సలుంద్రాకృష్ణసింహాదు లుగాదికానుకలు గొని వచ్చుట ॥—

మ॥ తలపైనన్ మగలాఁ దురాయి వెలుఁగొం ♦ దన్ ధాళధళ్యంబు రం
జిలు ఖడ్గంబులు ౘ్రేల, దొడ్డ నునుతే ♦ జీ లెక్క యోధాళి చెం
తల నేతేరఁ, బ్రతాపసింహుఁ గొలువన్, ♦ నానా మహీమండలేం
ద్రులు వేంచేసి రుగాదికానుకలు దాం ♦ తుల్ దొంతరల్ దెచ్చుచున్ 14

శా॥ లోకైక స్థిర విక్రమక్రముఁడు సు ♦ శ్లోకుండు చండేశ వం
శాకల్పుండు శిశోదియాభిజన దు ♦ గ్ధాంభోధి చంద్రుఁడు ని
ర్భీకస్వాంతుఁడు స్వామిభక్తమణి యన్ ♦ పేర్గన్న వాఁడాసలుం
ద్రాకృష్ణుం డరుదెంచె స్వామి చరణ ♦ ద్వంద్వంబు సేవింపఁగన్. 15

గీ॥ ధీరలోకైకమాళి ఝూ ♦ లూరి నృపతి
సోనెగుర్జ కులాంభోధి ♦ సోముఁడైన
భానుసింహుఁడు వేంచేసెఁ ♦ గానుకలుగఁ
జారు నవరత్న దివ్య భూ ♦ షలను గొనుచు. 16

గీ॥ ముందుఁ జిత్తూరి రణమున ♦ భూమి వడఁక
వెలుఁగు జయమల్ల సుతుఁడు దో ♦ ర్బల యుతుండు
తేజసింగు రాఠోడ్వంశ ♦ దీపకుండు
తరలె బదనూరి నుండి ప్ర ♦ తాపుఁ గొలువ! 17

సీ॥ అతఁ డడుగు మోపు సమయ భా ♦ గ్యమునఁ జేసి
యెంతకాలమొ సంతాన ♦ మెఱుఁగకుండి
కడుపు ఫలియించి కొమరులఁ ♦ గనియె నీదు
దొడ్డయిల్లాలు జగము సం ♦ తోష మంద. 5

చ॥ ఎఱుఁగుదు రెంతొ సౌమ్యముగ ♦ నేను వచించిన వాక్య మూని సా
గరుఁడు సభాముఖంబునను ♦ కాఱులు ప్రేలుటఁ దానఁ గోప వి
స్ఫురణను దేశమున్ విడచి ♦ పొమ్మని పంపితిఁ! గాని మూర్ఖసో
దరు నెడబాటుచే మది య ♦ థాయథలై చనె నేమి తెల్పుదున్! 6

గీ॥ సూక్తు నంపుము; చెంతనుం ♦ చుకొన నెంతు;
నెచట నున్న నీవాఁడు గాఁ ♦ డే యతండు!
నేను మొదలుగ నీరాజ్య ♦ మెల్ల యుష్మ
దమృత హస్తాభిరక్షితం ♦ బగును గాదె!'' 7

మ॥ అని యెంతేనిఁ బ్రతాపసింహుఁడును ద ♦ న్నర్థింపఁగాఁ గృష్ణసిం
గను మోమున్ వికసింప ''దేవ! నిను ని ♦ త్యంబున్ మహాభక్తి నె
క్కొనఁగాఁ గొల్చుటకన్న నొండుపసి నా ♦ కున్ హర్షదం బౌనె! యెం
దును నీయానతి వేదతుల్యమని తా ♦ ల్తున్ నేను శీర్షమ్మునన్. 8

శా॥ నామాటొక్కఁడిదేల; నేను సుతులున్ ♦ నాబంధులున్ నాసలుం
బ్రామాన్యావని రాజ్యలక్ష్మియును స ♦ ర్వస్వంబు నీచేతిదే;
యీమే నియ్యిలలోన నుంకువకై ♦ ట్లే సాఁగినన్ జాలు; నా
స్వామిస్నేహము ప్రోలఁ దుచ్ఛములు స ♦ ప్తద్వీప సామ్రాజ్యముల్ 9

గీ॥ వత్సరమున నార్నెల్లు తా ♦ వక సమక్ష
మందు నేనుందు; నాసమ ♦ యంబునందు
దేవ! నీమృదు పాద రా ♦ జీవయుగము
సూక్తు వదనారవింద మే ♦ జూడఁ గందు.'' 10

చ॥ అనుచుఁ బ్రతాపసింహ వసు ♦ ధాధిపసింహు ననుజ్ఞ నొంది శో
భనతర లక్షణాన్వితము ♦ వార్వము నెక్కి నిజాప్త యోధులున్
దను గొలువంగ నాత్మసద ♦ నంబును జేరి లతాంగి సమ్మతిన్
గొని కొనివచ్చె సూక్తు రిపు ♦ కుంజరసింహుఁ బ్రతాపుఁ జేరఁగన్. 11

గీ॥ తావియును బూవు కరణి సో ♦ దరు లిగువుదు
కలిసి రాగ రసాతి సం ♦ కలనఁ బెరసి
యేకమతు లేకవాక్కులై ♦ యెల్లరలర
నొండొరులు వాయ కొక్కఁడై ♦ యుండి రపుడు. 12

—॥ వసంతోదయము ॥—

గీ॥ పల్లవ వ్యాప్తి పుష్పవ ♦ ద్వైభవంబు
ఫల నవోదయ భూతి కొ ♦ మ్మలకుఁ గూర్చి
మాధవ గృహీతయగు మధు ♦ మాస లక్ష్మి
యఖిల జగము పూఁదోట య ♦ ట్లలరఁ జేసె. 13

—॥ సలుఁబ్రాక్కృష్ణసింహాదు లుగాదికానుకలు గొని వచ్చుట ॥—

మ॥ తలపైనన్ మగతాఁ దురాయి వెలుగొం ♦ దన్ ధాళధళ్యంబు రం
జిలు ఖడ్గంబులు వ్రేల, దొడ్డ నునుతే ♦ జీ లెక్క యోధాళి చెం
తల నేతేరఁ, బ్రితాపసింహుఁ గొలువన్, ♦ నానా మహీమండలేం
ద్రులు వేంచేసి రుగాదికానుకలు దొం ♦తుల్ దొంతరల్ తెచ్చుచున్ 14

శా॥ లోకైక స్థిర విక్రమక్రముఁడు సు ♦ శ్లోకుండు చండేశ వం
శాకల్పుండు శిశోదియాభిజన దు ♦ గ్ధాంభోధి చంద్రుండు ని
ర్భీకస్వాంతుఁడు స్వామిభక్తమణి యన్ ♦ పేర్గన్న వాఁడాసలుం
బ్రాక్కృష్ణుం డరుదెంచె స్వామి చరణ ♦ ద్వంద్వంబు సేవింపఁగన్. 15

గీ॥ ధీరలోకైకమాళి ఝూ ♦ లూరి నృపతి
సోనగుజ్జ్రా కులాంభోధి ♦ సోముఁడైన
భానుసింహుఁడు వేంచేసెఁ ♦ గానుకలుగఁ
జారు నవరత్న దివ్య భూ ♦ షలను గొనుచు. 16

గీ॥ ముందుఁ జిత్తూరి రణమున ♦ భూమి వడఁక
నెలఁగు జయమల్ల సుతుఁడు దో ♦ ర్బల యుతుండు
తేజసింగు రాఠోడ్వంశ ♦ దీపకుండు
తరలె బదనూరి నుండి ప్ర ♦ తాపుఁ గొలువ! 17

క॥ ఝూలాకులేంద్రుఁడు మహో
త్తాలమగు రుమాలుదాల్చి ♦ తపనీయ విభూ
షాలిఁగొని శ్యామసింహుఁడు
హేలాగతి సాద్రినుండి ♦ యేతెంచె వడిన్. 18

అ॥ స్వామిభక్తి యుగ్గు ♦ పాలతో మఱఁగిన
పావనుండు ఝేల ♦ వార నృపతి
యరుగు దెంచె నప్పు ♦ డా మనస్సింహుండు
కందులేని మనసు ♦ కాన్క చేయ, 19

గీ॥ మదన మాధవు లటు గాథ ♦ మైత్రితోడ
వెలయు బేడ్లా—కొఠేరియా ♦ పృథ్వినాథు
లాప్రతాప మహీంద్రు పా ♦ దాంబుజములఁ
జేరి సేవింప నెంచి వేం ♦ చేసి రపుడు. 20

మ॥ విమలారణ్య మనోజ్ఞ వస్తు వితతుల్ ♦ పెక్కుల్ రహింపన్ స్వతం
త్ర మహీరాజ్య రమాధురంధరుఁ డహా ♦ ర్యస్థైర్యుఁ డావిద్విష
త్సమద వ్యాఘ్రమహా కిరాతుఁడు కిరా ♦ తస్వామి యాభీమచాం
దమల స్నేహ మెలర్ప వచ్చెను బ్రితా ♦ పాధీశ్వరున్ జూడఁగన్ 21

మ॥ తనసామంతుల గారవించి ముదమం ♦ దన్ జేసి యాబాల్య మి
త్రుని భిల్లేశ్వరు భీమచాందుఁ గడు సం ♦ తోషంబు నొందించి మ
న్ననలన్ దన్ని ప్రతాపుఁ డంతట "నప ♦ ర్ణాదేవికిన్ బ్రీతిగా
వనికిన్ బోవలె వేఁటలాడ" నని మెన్ ♦ వారంద "రౌనౌ" ననన్ 22

—॥ సామంతరాజ సహితుఁడై ప్రతాపసింహుఁడు వేఁటకు వెడలుట ॥—

సీ॥ చైతకం బనెడు నా ♦ జానేయమున మహో
దాత్తుండు రాణాప్ర ♦ తాపసింహుఁ!
డాతనికడ నుత్త ♦ మాశ్వంబుపై ధీరుఁ
డినకోటితేజుఁ డా ♦ కృష్ణసింహుఁ!
డితని చేరువ వాజి ♦ నెక్కి గ్వాలియరు మ
హామహీనాథుండు ♦ రామచంద్రుఁ!

డతనిపత్నిక్కాన సము ♦ ద్ధత హయారూఢుఁడై
శూర శిఖామణి ♦ సూక్తసింహుఁ!

గీ॥ డతని చెంతను భానుసిం! ♦ గతని పొంతఁ
దేజసింహుఁ! డీతని కుడి ♦ దెసను శ్యామ
సింహుఁ! డతని పిఱుఁద మన ♦ స్సింహుఁ! డవలఁ
దర తమ స్ఫూర్తి వెడలి రం ♦ దఱును గలిసి. 23

మ॥ నుదుటన్ దొడ్డ విభూతిరేఖ కటియం ♦ దున్ శాటి కంఠంబునన్
రుదురాక్షల్ గల పేరులున్ ముఖమునం ♦ దున్ బ్రహ్మతేజోగతుల్
పొదలన్ రాజపురోహితాగ్రణి జగ ♦ త్పూజ్య స్వభావుం డవా
ర్యదయుండై హరభట్టునున్ వెడలె ది ♦ వ్యాందోళి కారూఢుఁడై. 24

చ॥ వెలిజిగివల్వలన్ దొడిగి ♦ శ్వేతహయంబుల నెక్కి విచ్చుక
త్తుల తెలికాంతి పుంజముల ♦ తోఁ జను నాశ్వికు లొప్పి రయ్యెడన్
గొలకున గుంపుకట్టి చను ♦ కోమల రాజమరాళముల్ వలెన్
బలుచని గాలిసోఁకులఁ శు ♦ భంబుగఁ దూఁగెడు పూలగుంపటుల్! 25

గీ॥ పణవ రవము భేరీఝాంక ♦ రణ రవంబు
తప్పెటల బూరగొమ్ముల ♦ ధ్వానములను
బూరటిలి రోదసిఁ బగిల్చి ♦ నీరధులను
గలఁచు గతి మిన్ను మన్ను నే ♦ కముగ మ్రోసె. 26

గీ॥ వనము వలయాకృతిగఁ జుట్టు ♦ కొనుచు నిలిచి
యలబలంబుల నొనరించి ♦ యుల బలంబు
భీకరాట్టహాసములతోఁ ♦ బలిచి పిలిచి
తట్టి తట్టి మృగాళి నం ♦ తటను లేపె! 27

గీ॥ భయద వార్షుక మేఘ గ ♦ ర్భంబు వెడలి
వివిధముఖములఁ బరతెంచు ♦ పిడుగు లట్లు
చిమ్మఁచీకట్లు క్రమ్మ వ ♦ నమ్మునుండి
ఘాతుక మృగాళి నానాము ♦ ఖముల వెడలె. 28

ఉ॥ ఎత్తిన హస్తయుగ్మముల ♦ నీటెలు ముందుకుఁ దూలబట్టి యు
త్కృత్తమ మంజులాశ్వముల ♦ నూల్కొని పాఱఁగ హెచ్చరించి కే
కెత్తు మహోత్సవస్ఫురణ ♦ నెల్లరు నొండొరుఁ బిల్చుకొంచు రా
హుత్తులు ముందుకున్ వెడలి ♦ రుగ్రమృగావలులన్ వధింపఁగన్! 29

చ॥ సకల దిశావకాశముల ♦ శాత కృపాణ సముజ్జ్వలాయుధ
ప్రకరముతోడ మూఁకు భట ♦ వర్గముఁ దప్పుకొనంగ లేక దా
మొకఁడును రెండు మూఁడిటుల ♦ నుగ్రమృగంబులు గుంపులై యొకా
నొకభటుమీఁదికిన్ గవియు ♦ చుండుట చూడఁగ వేడ్కయై తగెన్. 30

మ॥ ఒకపర్యాయమె యొక్కచోటనె మహా ♦ యోధుం డొకొక్కఁడు కుం
తకృపాణాదులఁ బర్వఁజేసి మృగసం ♦ తానమ్ములన్ గూల్చి యీఁ
చెక్కొనన్ వాని గుదుల్ గుదుల్ గొనుచు న ♦ ట్లేవచ్చు నాదృశ్య మిం
చుకచూడన్ గనులున్న భాగ్యమని తోఁ ♦ చున్ గాదె యెవ్వారికిన్! 31

—॥ { వేఁటచాలించి కూర్చుండిన రాజపుత్ర సైన్యమధ్యమునకు వరాహము వచ్చుట. } ॥—

మ॥ తనుకుంతంబులు దీర్ఘశూలములు వ్య ♦ ర్థంబింతయున్ గాక సా
ర్థములై యొప్పు మృగంబులన్ దునిమి వీ ♦ రశ్రేష్ఠు లక్కాన నా
శ్రమమున్ బోలె రచించి వేఁట నపుడే ♦ చాలించి; రంతన్ వరా
హమొకం డయ్యెడ కేగుదెంచి జనమ ♦ ధ్యంబందు దూఱెన్ వడిన్. 32

మ॥ ధనురస్త్రంబులు పట్టి ఖడ్గములు చే ♦ తన్ దాల్చి యుత్సాహ వ
ర్ధనులై యెల్లరు చూచుచుండఁగ నమం ♦ దస్ఫూర్తి నద్దానిఁ గూ
ల్చను సూక్తుండు ప్రతాపుఁ డశ్వములపై ♦ లఘించి; రాక్రోడమున్
జనియెన్ గుమ్మరసారె యట్లు భటులన్ ♦ బల్మాఱునున్ జుట్టుచున్. 33

చ॥ ఒకమొగమై పెనంగుచు మ ♦ హోన్నత రోషము తోడభీకరాం
బకములు పర్వఁజేసినను ♦ బందియు నక్షత భూరిగాత్రమై
సుకముగఁ బాఱుచుండెఁ; బది ♦ చూచి సహింపక వార లిర్వు రొ
క్కొక రొక మోముగాఁ దిరిగి ♦ యుగ్రతఁ దాఁకిరి క్రోడ పోతమున్! 34

క॥ వెనుక ధనంజయ విక్రమ
ఘనుఁడగు సూక్తుండు ముందు ♦ గా ఫాలవిలో

చన సదృశుండు ప్రతాపుఁడు
చని మోదిరి సూరకము ని ♦ శా తాస్త్రములన్. 35

—॥ సూక్తసింహుఁడు ప్రతాపసింహునితో వాదించుట. ॥—

క॥ ముడుచుకొని పంది పుడమిని
బడి నీల్గెఁ; బ్రతాపసింహ ♦ వసుధావరుఁ డ
య్యెడఁ జేరెఁ; దత్క్షణము సూ
క్తుఁడు దూఁకెను "బంది నాది ♦ తొలఁగు"మటంచున్. 36

క॥ "కాదిది నాచేఁ బడెఁ; నీ
యేదు మొగము పగిలి పోలెఁ; ♦ నిదె గనుఁగొనుమీ!
నాదు పెస పురోభాగము;
నీది వెనుక; ముందుఁ దగులు ♦ నే! నీశరముల్" 37

సీ॥ అని విభుండన సూక్తుఁ "డ ♦ యారె! పంది
మొపు డెచట నెట్లు తిరిగెనో ♦ మెవ రెఱుఁగుదు!
రిందు నీదని వ్రాసి తే ♦ యేమి గుఱుతు!
నాది గాదన దృష్టాంత ♦ మేది"యనియె! 38

గీ॥ "పనికిమాలిన పందికై ♦ యనృతమాడెఁ;
దిలయుఁ గ్రుంగెనె! యంభోధు ♦ లింకెచనెనె!
వెల గలుగు వస్తువేదైన ♦ వెనుకఁ బడెదె!
కోటి యనృతములేనిఁ బ ♦ ల్కుటకుఁ గాని" 39

క॥ అని నిలుచున్న ప్రతాపునిఁ
గని సూక్తుఁడు "పంది నేమి ♦ గాఁ దలచితివో!
మును దానికై కదా పా
ర్థునితోఁ బోరాడె శంక ♦ రుఁడు ఘోరముగన్! 40

గీ॥ తలఁపు లోకఁడైన లవము భే ♦ దమును రాదు;
కౌస్తుభంబైనఁ జను జిల్లిఁ ♦ గవ్వమాడ్కిఁ!
పౌరుషము మాట పట్టింపు ♦ వచ్చినపుడు
గడ్డిపోచఁయె మేరువై ♦ గణుతిఁగాంచు. 41

శా॥ పలుకన్ బూనిన విల్వనున్ గుఱిఁచి మే ♦ వాఙ్రాజ్యమున్ బోలఁగాఁ
గల భాగ్యం బిల లేదు; సోదరకృత ♦ ఘ్నత్వంబునున్ మీఱఁగాఁ
గల పాపంబును లేదు; నీతులను బ ♦ ల్కన్ వచ్చు; నెవ్వారు వా
రల తప్పుల్ గ్రహియింతురే! జనుల మ ♦ ర్యాదల్ కదున్ జిత్రముల్ 42

సీ॥ విశ్వస్తుతాఖండ ♦ విక్రమక్రముని సా
మ్మవని రాజ్యవిభూతి ♦ యంద్రు బుధులు!
మనలోన విక్రమ ♦ మహిమఁ బ్రాజ్యం బెవఁ
డతఁడె మేవాల్లక్ష్మి ♦ కర్త భర్త;
కాని నీవొకఁడవే ♦ గళమునఁ దాళిఁ గూ
ర్చిన భర్తగావు; నిన్ ♦ బ్రేమఁ గలుఁగు
పోటరు లుండక ♦ పోరు; నీ నెత్తిని
బొడ్వైన యొకకొమ్ము ♦ పుట్టె నొక్కొ!
గీ॥ యేను దప్పిన నీరాజ్య ♦ మేలు ఘనుఁడు
పుట్టఁడని యెంచినావు! నీ ♦ ముఖమునందె
పొద్దు పొడుచునె! యిటు లేని ♦ పోని దురభి
మాన మూనితి; వికనైన ♦ మాను టొప్పు! 43

క॥ పదికోట్ల మాటలేటికిఁ!
గుదురుగ వాదంబు మాని ♦ క్రోధంబు నొసం
గుదువో! నాతో మార్కొని
కదనము చేసెదవొ! తెల్పఁ ♦ గావలె" ననినన్. 44

చ॥ "కలఁగెనొ ప్రజ్ఞ! లేక చెడు ♦ కాలమె వచ్చెనొ! స్నేహ మెంతయున్
వెలసిన యన్నదమ్ములకు ♦ నిప్పువిధాన మనోవిభేదముల్
గలిగెను జూచుచుండనె; య ♦ కారణ వైరము లిట్టివే కదా!
ప్రళయము వచ్చె; మాన్పఁగను ♦ పాయము దోఁపద - యేమిసేతుమో! 45

క॥ అని పుట్లకొలఁదిగా విష
మును గడుపులఁ బోసినట్లు ♦ పొగులుచు దృష్టుల్
మొనయించి రంద ఱొక మొగ
మునను సలుంబ్రాధినాథు ♦ ముఖకమలముపైన్. 46

—॥ సలుంబ్రా కృష్ణసింహుఁడు సూక్తసింహునకు బుద్ధి చెప్పుట.॥ —

ఉ॥ ఆతఁడు లేచి సూక్తు దరి ♦ యన్ జనుదెంచి "శిశోదియాకులో
ద్భూతులు పూర్వజుల్ గనిన ♦ త్రొక్కఁగనేర్తురు కాని యెన్నఁడున్
నీతి తొలంగి తిట్టఁగను ♦ నేరరు; క్రొత్తలు తెచ్చి పెట్టి మా
చేతములన్ దహించితివి; ♦ చెప్పెడి దేమిఁక నీప్రవర్తనల్! 47

చ॥ శివశివ! యెట్టిపాతకము ♦ చేసితి! దేవుని దిట్టి కొట్టు దా
నవు లయినన్ మహోన్నత గు ♦ ణంబులఁ బొల్చిన యగ్రజన్ము పా
దవనజముల్ భజించి నుతిఁ ♦ దన్పుదు రే! గురుతుల్యు జ్యేష్ఠు ని
ట్లవినయబుద్ధివౌచుఁ దెగ ♦ నాడుచు ధర్మముఁ బాడిఁ గల్పెదే! 48

మ॥ అనురాగాంబుధి స్వామికాళ్ళఁ బడుచున్ ♦ బ్రార్థించి మూన్నాళ్ళ నీ
వనుతాపమ్మునఁ గాఁగి పస్తువడి ప్రా ♦ యశ్చిత్తమున్ జేయకుం
డిన మేవాడధరిత్రి నెందరిగినన్ ♦ 'నీవిందు రాః నూరుచుం'
డనువా రుందురె! యెవ్వ రోర్చ్చదరు క ♦ ట్టా! స్వామి ధిక్కారమున్. 49

మ॥ మనవంశంబున నెన్నఁడున్ గలుగ దీ ♦ మర్యాద; యన్నన్న! సే
మని యున్నప్పుడె నాసమక్షమున న ♦ స్మత్స్వామి నిందించు నీ
వనుకంపార్హుఁడ వౌదె! వధ్యుఁడవు! బా ♦ ల్యంబందు నిన్నెత్తి పెం
చిన దోషంబున నోర్చుకొంటిఁ! గడునో ♦ చ్చెన్ జేత మిప్పట్టునన్."50

—॥ సలుంబ్రా కృష్ణసింహునెడ సూక్తసింహుఁ డవినయము జూపుట. ॥—

మ॥ అని వాత్సల్యము ద్రుంపలేక యిటు న్యా ♦ యం బాడు నాకృష్ణునిన్
గని సూక్తుండును "బిల్లికిన్ జ్వరమనం ♦ గాఁ జెల్లెః నీమాటలన్
వినఁగా నోపను; నీప్రతాప విభునిన్ ♦ నేమ్రొక్కఁగా నోపఁ; బం
డి నెటుల్ వీడఁగ నోప; నోప రణమెం ♦ తేసిన్ విసర్జింపఁగన్. 51

ఉ॥ గుట్టుగ మీర లిర్వురును ♦ గూడుచు నాజగమల్లు బాధ్యతల్
మట్టిని బెట్టి రాజ్యరమ ♦ లాగుకొనుంగదె లోక! మందఱున్
గుట్టెడు తేలు 'ధర్మమిది ♦ గో' నని చూపిన యట్టులయ్యెః నీ
కిట్టిటులాడె బుద్ధిః కడు ♦ వృద్ధవుః నోరు మెదల్చ కుండుమీ. 52

మ॥ సిరి పీరున్ వెదకున్; ఘనుల్ బెదరి యి ♦ స్సీ! మూలలన్ దాఁగఁ బో
రురుశౌర్యోజ్జ్వలు లిందుఁ గల్గు మగలం ♦ దొక్కొక్కనూ ఱొక్కరె,

వ్వరినేఁ బూన్పుము! చెండిపై చెదఁ! ప్రతా ♦ పస్వామి మద్విక్రమం
బెఱుఁగుఁడ; బైఁబడఁ; డీవు సాయమయి ర ♦ మ్మా! చూతు నాయుద్ధతిన్ 53

మ॥ అని గర్వించెడు సూక్తునిం గని సలుం ♦ బ్రాధీశుఁ "డేమంటివి! ని
న్గనఁ బాపం! బిసుమంత యోర్వ గురుధి ♦ క్కారాఘముల్! నిన్నుఁ బెం
చిన వాత్సల్యమునైనఁ జూడక శిర ♦ చ్ఛేదంబు గావింతుని"
ష్ఠని ఖడ్గంబుఁ గొనన్ బ్రతాపుఁడు రయం ♦ బారన్ సమీపించుచున్" 54

—॥ ప్రతాపసింహుఁడు సలుంబ్రా కృష్ణసింహునకుఁ గోపోపశమనము చేయుట. ॥—

మ॥ "గురుతుల్యుండవు! మాకు వంద్యుఁడవు! సూ ♦ క్తుండాను గర్వోక్తులన్
దరుణాబ్జాత దళాతికోమలము స్వాం ♦ తం బెంతగా నొచ్చెనో
స్థిరకారుణ్యసముద్ర! వానిబదు ల ♦ ర్థింతున్ క్షమాభిక్ష! యే
కొఱలేకుండఁ బ్రసన్నమూర్తివయి నా ♦ కున్ దర్శనం బీయవే! 55

గీ॥ గురుని దండన తన్నుఁ మే ♦ ల్పఱచు ననుచు!
నెఱుఁగ కితఁడాడు నుడుల నం ♦ దుఱఁగబోకు!
వాఁడు నాచేత నిపుడు త్రో ♦ వకునువచ్చు
నస్త్ర మస్త్రేన శామ్యతి ♦ యనెడు నట్లు!" 56

క॥ అని సూక్తుఁ జూచి "కొమరా!
కనుచుండనె యెంత వఱకుఁ ♦ గడపితి నుడులన్!
నిను నీవెఱిఁగితొ లేదో!
యనుచితమని నీకు దోఁప ♦ దా! యిపుడైనన్. 57

ఉ॥ తండ్రికిఁ బంగనామములు ♦ తద్దయుఁ దీర్చెడు పుత్త్రుఁడం డ్రెపె
క్కం! డ్రొకమంచిపేర్గొనుట ♦ కష్టము; దుష్టుఁడటంచుఁ బేరు చే
కొం డ్రవివేకులూఱకయ; ♦ కూడిన వీరవరేణ్యు లింద జే
మండ్రనిరైన నెంచ కిటు ♦ లాడుచు నిందలఁ గట్టుకొందువే! 58

మ॥ జనక ప్రాయు మహాత్ముఁ గృష్ణవిభు సు ♦ స్వాంతంబు నొప్పించి న
న్ననురాగార్ద్రుని జ్యేష్ఠు భూరమణు హా ♦ స్యంబాడ నుంకించి; తిం
క నుగన్విచ్చుచు మంచిచెడ్డల నెఱుం ♦ గన్ లేక యిట్లున్న నే
మని నీభావము నెంచఁగానగును! గ ♦ ట్టా! యిట్లు వర్తింతువే! 59

గీ॥ గురు లమృత హస్తములతోడఁ ♦ గొట్టినపుడు
విసముగా నది తోఁచుట ♦ విలయమునకె;
యెందఱను గొట్టె దీవు! నేఁ ♦ డేల యిట్టి
తల బిరుసు మాట! లిపుడైనఁ ♦ దెలివిఁ గనుము. 60

మ॥ ఉరుశౌర్యుల్ మననెత్తిపై నడచు వా ♦ రున్నారు బ్రహ్మాండము
క్కఱఁ జేయంగల విక్రమప్రకటు! లే ♦ లా నీదు గర్వోక్తు లిం
దఱిలోఁ! దాడిని దన్నువాని తలపై ♦ దన్నం గలాఁడుండు! నీ
గరువంబున్ సకలంబు దింపఁగల నో ♦ క్కండున్ నిమేషంబునన్" 61

గీ॥ అనిన "ముంజేతి మణిఁజూడ ♦ నద్ద మేల!
కుడువఁబోయి కూరల రుచి ♦ యడుగ నేల!
చేయి చేయిని గలుపు! నీ ♦ శిక్ష మొగిరి
యావలఁ బడకున్న నను సూక్తు ♦ డనఁగఁ బోకు! 62

గీ॥ ఇంక నొక్కఁ డిందున్నవా ♦ రెవ్వరైన
నందఱైనను నన్ను మా ♦ ర్కొందురేని
మివుల హర్షించి ప్రళయభై ♦ రవుని మాడ్కి
సర్వ సంహార మొనరింతు ♦ క్షణములోన" 63

—॥ హారభట్టారకుఁడు సూక్తసింహునకు నీతిఁ గఱపుట. ॥—

మ॥ అని మీసంబునఁ జేయి మోపుచును గ ♦ ర్వావేశమున్ జూపు సూ
క్తుని వీక్షించి ప్రతాపసింహుఁడు కడున్ ♦ గ్రుద్ధాత్ముఁడై "నెత్తికిన్
గనులెక్కెన్ జుమి నీకు; నిప్పుడె భవ ♦ ద్గర్వాంధతన్ డింతురా"
మ్మనుసంతన్ హారభట్టు వారలను డా ♦ యన్ బోయి దీనాస్యుఁడై 64

ఉ॥ "నాయనలార! సూర్యకుల ♦ నాశకరమ్మగు ఘోరకృత్యమున్
జేయఁగ నుంటిరేల! పగ ♦ చే రిపులన్ సమయింపవచ్చుఁ గా!
కీయెడ నన్నదమ్ము లిటు ♦ లీసును రోసము నూని పోరు ట
న్యాయ మటంచుఁ బూజ్యు లన ♦ రా! వినరా! రణధర్మ పద్ధతుల్. 65

మ॥ ఒక కాడన్ జనియించు రెండు పువ్వు ల ♦ ట్లొప్పారి మీరెప్డుఁ గూ
ర్మికినిన్ జేర్మికిఁ దావులై మెలఁగినన్ ♦ మిన్నంది మాబోంట్ల మూ

అకట హర్షింతుము! కాని యుద్ధము లోన ♦ ర్పన్ బూనినన్ మానసం
బకటా! వ్రియ్యులు వ్రయ్యలై చనదె! క ♦ ట్టా! చూచి యెట్లోర్తునో! 66

చ॥ అదియును నాశ్రితుండగుట ♦ నందఱు మెచ్చఁగ నిచ్చకంబులన్
వదరె నితండటంచుఁ దలఁ ♦ పన్ వల; దింటి పురోహితుండ! న
భ్యుదయమె మీయెడన్ దలఁచు ♦ చుండుట క్రొత్తయుఁగాదు, క్షేమసం
పదఁ బరికింప నాకుఁ గడు ♦ భాధ్యత యుండు తెఱుంగు లోకమున్ 67

చ॥ తరములకొద్దిఁ మిమ్ము వసు ♦ ధాపతు లంచని మేము, మమ్ములన్
గురువులటంచు మీరలును ♦ గొల్చి పరస్పర భేదలేశముల్
పొరయఁగనీక కాలమును ♦ బుచ్చితి; మట్టులుగాన మిమ్ములన్
దఱియు విపత్తు లేశమయి ♦ నన్ మఱి మేరువుగాఁ గనంబడున్! 68

ఉ॥ మంచియుఁ జెడ్డయున్ దెలుపు ♦ మాన్యులు లేరు; గతించెఁ దండ్రి; ప్రా
పంచిక పద్ధతుల్ తెలియ ♦ ప్రాయముగా; దిఁక రాజ్య మెంతొ భా
రాంచితమౌ, రిపుల్ బలియు; ♦ రాహవ మర్గముగాదు; మిమ్ముఁ బ్రా
ర్థించెదఁ దండ్రులార! విన ♦ రే! గురువాక్యము మీఱరాదనన్. 69

మ॥ వల దాత్మక్షయకారకంబయిన యీ ♦ వ్యాపార; మిందుండియున్
దొలఁగన్ బొం; డిది సోదరత్వమునకున్ ♦ దూరంబు; నా యానయున్
గల" దంచాడిన నవ్వి సూక్తుఁడు 'నమ ♦ స్కారంబుఁ గైకొంచు న
వ్వలకున్ బొండిఁక; నడ్డువచ్చి కలిగిం ♦ పన్ బోకుఁ డాలస్యమున్. 70

ఆ॥ అపజయమొక జయమొ యి ♦ ష్టదఁ గోరి
చావు బ్రదుకుల నున్నాము! ♦ మీవచించు
చప్పనగు మాట లూర్కొట్ట ♦ మొప్పఁబోవ!
మేమిటికిఁ గష్టపడఁగ! నిం ♦ కేల వగవ! 71

మ॥ తనశాశక్తికి మీఱు కార్యములకున్ ♦ దార్కొన్నచో ముప్పు వ
చ్చును; మాయిర్వురలోన నొక్కఁడు రణ ♦ క్షోణిన్ మృతిన్ గన్న మీ
తును రావచ్చుచు! నేడ్వ వచ్చు! మఱిఁ బా ♦ రోహిత్యమున్ జేయవ
చ్చును! లబ్ధిన్ గొనవచ్చు! నిష్ఠుచనవ ♦ చ్చున్ దాఁటి దూరమ్ముగన్" 72

క॥ అనిన హరభట్టు నిలువె
ల్లను నీరయి యడుగు నవ్వ ♦ లన్ వైచి పరితా

పుని వంకను దీనముగాఁ
దన దృష్టులు వఱపె; నాప్ర ♦ తాపుం డంతన్. 73

క॥ 'గురుఁడనక దైవమన కె
వ్వరినైనను దెగడు వీని ♦ పై నభిమాన
స్ఫురణము మాను; మెఱుఁగవె!
యరసికులన్ బలుకరింప ♦ నగు ముప్పనుచున్! 74

క॥ మలినమును జలమ్ము కైవడి
నిల నలమిన పాపసమితి ♦ నింకించు రణం
బు; లవశ్యము కరణీయం
బులు నృపవంశమునఁ బుట్టు ♦ పురుషుల కెల్లన్. 75

క॥ ఏవేళ కేదివచ్చునో
యేవెరవునఁ బరిణమించు ♦ నెవ రెఱుఁగఁగలా;
రీవేళ మమ్ముఁ గూడిచి
భావమునను నొవ్వ'' కనుచుఁ ♦ బలుకుచు వెడలెన్'' 76

—॥ శక్తసింహ-ప్రతాపసింహు లొండురు పోర యత్నించుట. ॥—

మ॥ "కమలాప్తాన్వయ నీరజినం బపయశః ♦ కాలుష్యమున్ బొంది పూ
ర్ణముగాఁగన్ జెడనున్న! దీప్రళయమున్ ♦ దప్పింపఁగా నిప్డు మా
ర్గ మొకం డున్నదె; తెప్పవా టదను మీ ♦ రన్ బోయినన్ వీరి దే
హములున్ జేతికిఁ జిక్కునే! యకట! వ్రి ♦ య్యల్ వ్రయ్యలై రాలవే'' 77

మ॥ అని యందుండిన వారలందఱును దుః ♦ ఖావేశ దైన్యంబులన్
గని శోషిల్లఁ బ్రతాపశక్తులు నిజో ♦ గ్రస్ఫార ఖడ్గంబులన్
గొని వేగమ్ముగఁ ద్రిప్పు చొండొరుల ను ♦ గ్గున్నూచమున్ జేయ ము
దున కొక్కుమ్మడి దూఁకి! రేమనఁగనుం ♦ మున్ మీఁది కార్యంబులున్.! 78

—॥ హారభట్టారకుఁ డాత్మార్పణము గావించుట. —

చ॥ మెఱుపు తటాలునన్ మెఱయు ♦ మెల్పున నా హారభట్టు తత్క్షణ
స్ఫురిత మనోవికాసమున ♦ భూరి కృపాణము నెత్తి వక్షమున్
బరియలుగాఁగ జీల్చుకొని ♦ వారల మధ్యను నేల వ్రాలుచున్
బొరిపొరిఁ బ్రాణముల్ విడిచె ♦ ముక్కున నోరను నెత్తు రొల్కఁగన్ 79

మ॥ తన సేవించు నృపాలనందనులు కృ ♦ తజ్ఞత్వంబుమై నొందఁగన్
దననేత్రమ్ముల మ్రోల మూర్ఛగొనుచు నం ♦ తంబొందఁ జూడన్ సహిం
పని పుణ్యాత్ముఁడు! నాఁటి కష్టదశఁ దీ ♦ ర్పన్ బూని యాత్మార్పణం
బు సొనర్చెన్ హారభట్టు త్యాగనిధియై ♦ ముల్లోకముల్ మెచ్చఁగన్ 80

మ॥ వనధిధ్వానగభీరఘోషము రహిం ♦ పన్ బ్రక్కకున్ వచ్చి సూ
క్తిని వీక్షించి ప్రతాపుఁడున్ నినుఁ గనుం ♦ గొన్నన్ గడున్ బాపముల్
జనియించున్! గలుగంగరాని యిడుమల్ ♦ సంధిల్లె! శ్రీరాజ్ఞిఁబో
లిన సూర్యాన్వయ మొందె నీకతన మా ♦ లిన్యంబు లీనాఁటికిన్. 81

ఉ॥ ఒత్తిడిచేసి కోరకుము ♦ యుద్ధము వద్దని కృష్ణసింహుఁడున్
నెత్తిన నోరు పెట్టుకొని ♦ నీకు వచించె; వినంగనైతి వ
యుృత్తము బోధ మించుకయు; ♦ నూఱక ప్రేలితి; నేఁడు నీతలన్
గ్రొత్తలు పుట్టె; మిట్టిపడి ♦ కొంపకుఁ జేటును దెచ్చితెంతయున్! 82

మ॥ సమరంబున్ బొనరింప నుండఁగ వసి ♦ ష్ఠప్రాభవాఢ్యుండు పు
ణ్యామయుం డీహారభట్టు తా నుదయసిం ♦ హాఖ్యక్ష్మాతలాధీశు చం
దమునన్ వంద్యుఁడు ముందు దూఁకి మనము ♦ ద్యంబందునన్ బ్రాలి జీ
వము లర్పించి త్యజించె దేహముఁ దృణ ♦ ప్రాయంబుగా నెంచుచున్ 83

చ॥ ఇతఁడును వేదరాశి! శత ♦ వృద్ధుఁ! కుమారులభంగి నిన్ను నన్
సతతము పెంచె; నిట్టి సుగు ♦ ణవ్రతుఁడున్ బలియయ్యె నీదు మూ
ర్ఖతవలనన్; గనుంగొనుము ♦ కాలువ గట్టుచు నమ్మహాత్ము ర
క్తతతులు పాఱఁజొచ్చె! నెటు ♦ కన్గొని యోర్చెద నిట్టిదృశ్యమున్! 84

మ॥ పలుకష్టమ్ములఁ గూడు నీళ్లు గొనకీ ♦ బ్రహ్మాండ మున్నంతకున్
దలక్రిందౌచుఁ దపంబు చేసిన గురు ♦ ధ్వంసాఘ పుంజంబులున్
దలఁగన్ బాయునె! తన్మహానలశిఖల్ ♦ దర్పించి నిన్నున్ ననున్
గులమున్ దేశముఁ గాల్పవే! యెటుల నా ♦ కున్ దప్పు! నిప్పాపముల్ 85

ఉ॥ గురురుధిరంబు దాఁటఁగను ♦ గూడదు; కావున నిప్డు నేను సం
గరమును మానుటన్ బ్రదుక ♦ గల్గితి! వీవిఁక నాదు రాజ్యమున్
ద్వరగఁ ద్యజించి యిష్టమగు ♦ తావునకున్ జను; మాలసించినన్
శిరము నిమేషమాత్ర ధర ♦ ఁ జేబడు" నంచు వచింప సూక్తులన్ 86

॥ ప్రతాపసింహుఁడు సూక్తసింహుని దేశభ్రష్టుని గావించుట. ॥

మ॥ "హరభట్టారకమూర్తి పుణ్యతముఁ; డ ♦ య్యాచార్యుఁ డీక్లాటకున్
జెరియున్ నామది; కాన నేఁడు రణమున్ ♦ నేఁగోరఁ; భీతిల్లి నే
నరుగన్ బూనితినంచు నెంచకుము; నీ ♦ యౌద్ధత్య బాహాబల
స్ఫురణన్ వమ్మొనరింపకుండినను నే ♦ సూక్తుండనే కాదుపో! 87

చ॥ ఇరువుర నెవ్వరో యొకరుఁ ♦ డీజగతిన్ విడు నంతకున్ బర
స్పర ముఖదర్శనంబు కొన ♦ సాఁగక యుండెదుఁగాత పోరసం
గరములఁదప్పు; బ్రాణమును ♦ గాచి కొలంగు"మటంచుఁ బల్కి తా
నరిగెను ఢిల్లిత్రోవకుఁ, జను ♦ లెంతకు లందఱు పోవు తావుకున్. 88

మ॥ "సమయన్ జేసి కృతాఘపుంజములఁ బ ♦ శ్చాత్తాపదీప్తాగ్ని, శు
ద్ధమతిన్ వచ్చినఁ జోటులేదనదు వా ♦ త్సల్యాంబువారాశి కో
పము జన్మింపని దొడ్డతల్లి మనమే ♦ వాత్సాత! దాక్షిణ్యహ
స్తము పైఁగప్పు శతాపరాధికయినన్ ♦ సద్భక్తిఁ బ్రార్థించినన్." 89

మ॥ అని తా నింటికి వెళ్ళి యభ్యుదయసిం ♦ హస్వామికిన్ బోలె న
య్యనఘాచార్యున కంత్యసత్క్రియలు చే ♦ యన్ బంచి యాత్మోపశాం
తిని బెంపన్ జపహోమదానములు సం ♦ ధింపన్ మొదల్ పెట్టి య
జ్జననాథాగ్రణి యిచ్చెఁ దత్సుతునకున్ ♦ సారాగ్రహారంబులన్. 90

గీ॥ హరగురుం డనంతత్యాగ ♦ మాచరించి
నట్టియెడ నొక్క సత్రంబు ♦ గట్టఁబనిచె
శాశ్వతాన్నదానంబును ♦ జరుపఁదలఁచి
దుర్మరణదోష మతనిని ♦ దొరయకుండ. 91

క॥ అమఱునాఁడు కిరాత
గ్రామణి సామంత నృపులు ♦ గ్వాలియరు మహా
భూమీశ్వరుఁడు ప్రతాప
స్వామికడకు వచ్చి రతని ♦ సందర్శింపన్. 92

మ॥ పసఁజెన్నారు చిరత్నరత్నతతి శో ♦ భల్ గుల్కు క్రొమ్మేడపై
నసమానంబగు వ్యాఘ్రచర్మమున న ♦ ధ్యాసీనుఁడై రాజయో

గసమాధిస్థితినున్న భూపమణియుఁ ♦ గన్నెత్తి వీక్షించి చెం
త సమాసీనులు గండటంచుఁ గనుస ♦ న్నల్ జేసి యుత్సాద్యదృతిన్, 93

—॥ ప్రతాపసింహుఁ డనుచరులతోఁ గర్తవ్యము నాలోచించుట ॥—

సీ॥ "తనదేశలక్ష్మి సం ♦ తత భోగ భాగ్యవై
భవములఁ దులదూఁగ ♦ వలయుననుచుఁ!
దనప్రజ లీతిభా ♦ ధలులేక బహువిధై
శ్వర్యంబులు వహింప ♦ వలయుననుచుఁ!
దనయిల్లు పూర్వాగ ♦ త ప్రతిష్ఠాభరం
బుల వృద్ధినొందంగ ♦ వలయుననుచుఁ!
దన పేరు పరుల నిం ♦ దల కాస్పదం బీక
స్వచ్ఛమై యొప్పు చుండ ♦ వలయుననుచు!
గీ॥ వసుధపై జన్మ మెత్తిన ♦ ప్రతిమనుజుఁడు
జీవితమునిండ యత్నంబు ♦ చేయుటొప్పుఁ!
గాని మనదేశ మందభా ♦ గ్యమునఁ జేసి
యదియుఁ దలపోయ దుర్ఘటం ♦ బై రహించె! 94

మ॥ కనుఁ డా మధ్యధరాసముద్రము మొదల్ ♦ కాబూలుపర్యంత మొ
ప్పిన విస్తారసమస్తదేశముల వ్యా ♦ ప్తిన్ గన్న తౌరుష్కభూ
పనికాయంబులు పూర్వ మేడవశతా ♦ బ్దంబాదిగా భారతా
వని కేతేరఁదొడంగె నాహవకళా ♦ ప్రత్యర్థి దుర్వారమై. 95

క॥ ఎంటేఁట వారు లక్షలుఁ
గోటులుఁగా సైన్యములను ♦ గొని వచ్చు మహా
ధాటికి భారతదేశము
బీటలువారిన విధంబు ♦ వెలుఁ బొనఁగూర్చున్. 96

సీ॥ అఫ్ఘానిస్థాన ♦ హా నాప్ఘనిస్థాన
మా బెలూచిస్థాన ♦ మా యిరాను
టర్కి యిరాకు బా ♦ గ్దాదు మెసపొటోమి
యా శిరియా సీమ ♦ లందునుండి

వసుధ యీనినయట్లు ♦ బహుసంఖ్య గలుగు యా
వనవీరభటకోటి ♦ బయలు దేఱి
పలు శతాబ్దములుగాఁ ♦ బరతెంచి పైఁబడి
భరతఖండంబు డీ ♦ ల్పడఁగఁ జేసె!

గీ॥ నందనోద్యానమట్లు లుం ♦ డంగఁ దగిన
భూమి పారతంత్ర్యమహాబ్ధి ♦ మునిఁగి, కఱవు
వ్యాధు లీతిబాధలు గల్గి ♦ బలము తఱిగె!
మనభరతఖండపాప మే ♦ మని వచింతు! 97

సీ॥ కోటిసూర్యప్రభాం ♦ కుండు పృథ్వీపార్వ
భౌముఁ డీయవనుల ♦ బారి మడిసె!
సర్వజ్ఞతుల్యుఁ డా ♦ సమరసింహ నృపుండు
తురకలతోఁ బోరి ♦ తొఱఁగెఁ దనువు!
సమవర్తిమూర్తి దు ♦ ర్దమశౌర్యుఁడా హమీ
రాయు పున్నంత కా ♦ హవ మొనర్చె!
గుంభుండు రాజ ది ♦ క్కుంభి తదర్థమై
తనజీవితము నెల్ల ♦ ధారవోసె!

గీ॥ నింక సంగ్రామసింహ భూ ♦ మీశ్వరాదు
లప్రతీప ప్రతాపులు ♦ యవనసేన
నాపి మొండొడ్డి దేహంబు ♦ ప్రాణములును
గోరువెట్టి స్వాతంత్ర్యంబుఁ ♦ గొలిచి రపుడు. 98

మ॥ ఒకనాఁడా! యొకమాసమా! మఱియుఁదా ♦ నొక్కబ్దమా! వేయియేం
డ్లకుఁ బైనయ్యె మహమ్మదీయసుభటుల్ ♦ లక్షోపలక్షల్ లయాం
తకులై పైఁబడసాఁగి; యెంత జనబృం ♦ దంబున్న మేవాడమా
తకు నైనన్ దలమున్కలై బ్రదు కసా ♦ ధ్యంబంచుఁ దోఁపించదే! 99

శా॥ ఒడ్డారించుచు సైన్యముల్ గొని యలా ♦ యుద్దీను చిత్తూరుపై
నొడ్డెన్ ముట్టడి; వానిధాటికి జగం ♦ బూటాడెఁ; వాఁడెంతగాఁ
జెడ్డల్ చేసెనొ దేవుఁడే యెఱుఁగు: సి ♦ స్సీ! ధర్మమో సత్యమో
యడ్డంబుండునె! నాస్తికాధముల దు ♦ ర్వ్యాపారముల్ మాన్పఁగన్, 100

మ॥ అరుదెంచెన్ బహదూరుసాహి బహుళసై ♦ న్యానీకమున్ గొంచుఁ జి
త్తూరుపైనన్; ప్రళయాగ్నిబోలె నతఁడు ♦ ద్ద్యోతించి దుర్గంబు రూ
పఱ వహ్న్యస్త్రములన్ నిగుడ్చుచు స్వరూ ♦ ప ధ్వంసమున్ జేసె; వీ
రరసాంభోనిధు లెందఱో మడిసి రా ♦ రా! నాఁటి యుద్ధంబునన్. 101

గీ॥ ఆ లలాటాక్షు మూర్తులో ♦ యనఁదగు హార
కులజు లైదువందలమంది ♦ కొలుచుచుండ
దుర్జయుఁడు హమీతామహీ ♦ తోడఁబుట్టు
రణము సాగించి యర్జున ♦ రావు మడిసె! 102

సీ॥ నాదు ముత్తాత చం ♦ దన్నృపాలు సంతతి
వాఁడు దుర్గారావు ♦ ప్రళయభైర
వాకారుఁడై వైరు ♦ లపలిపాటుఁగఁ బోరి
పడియెఁ జోండావ ద ♦ న్వయులఁగూడి!
యాపైన వచ్చి మా ♦ యవ్వ జవాహిరి
బాయి గాయంబులు ♦ వేయుఁగాఁగ
మహిషాసురేశ్వర ♦ మర్దనివలె రేఁగి
విమతుల నోర్చి ప్రా ♦ ణములు విడిచెఁ!

ఆ॥ బదియుమూఁడు వేలు ♦ పడఁతులు గొలువఁ గ
ర్ణావతియును నాదు ♦ నాయనమ్మ
రోహితాశ్వశిఖల ♦ జోహారు గావించె!
నిట్టి వీరమూర్తు ♦ లెందుఁ గలరు! 104

సీ॥ కడకు మూఁడవమాఱు ♦ గా నక్బరే తెంచె
నంతము లేని సై ♦ న్యములఁ గొనుచు!
వీరులందఱు గూడి ♦ విశ్వపూజ్యంబైన
చిత్తూరుకోట ర ♦ క్షింపవచ్చి!
రల పరంగుల పిరం ♦ గుల ప్రమోల దుర్గంబు
గాజువిధాన వ్ర ♦ క్కలయి కూలె!
మేవాడ వీరల ♦ క్ష్మీవ్రజముకుటముల్
జయమల్ల ముఖ వీర ♦ సమితి ప్రగ్గెఁ!

గీ॥ గనుదెఱచి కాపురవి కూయఁ ♦ గాఁ దెలియని
శిశువు లాదిగ జగదేక ♦ జేతృశౌర్య
పరులవఱ కందఱను బట్టి ♦ నఱకె నక్క!
రెటులు చిత్తూరు రమ తల ♦ యెత్తి బ్రదుకు! 104

గీ॥ ఆచతుశ్శాల! లాభవ ♦ నాంగణమ్ము!
లాజయ స్తంభతతులు! దే ♦ వాలయమ్ము!
లూఁచముట్టుగఁ జెడెనో! జి ♦ త్తూరు పురము
కాడుగా మాఱె పాండవ ♦ బీడు దేలె. 105

సీ॥ తలపైనఁ గొమ్మున్న ♦ ధైర్యమేనుపులు ఘూ
లావనీంద్రుల సేన ♦ లడఁగిపోయె!
సహరాజు కోఱల ♦ నైనఁ బట్టి పెకల్చు
చోహాణ బలములు ♦ చొప్పుదప్పెఁ!
శాతాళ మఱచేతఁ ♦ బగిలించు ప్రమర లే
వలన సుక్కిరో సుంత ♦ తెలియరాదు!
గగనధాతృల నేక ♦ ముగఁ జేయఁజాలిన
రాఠోడుక్కలంబు పే ♦ ర్మఱువనయ్యె!
గీ॥ నల చతుర్దశ లోకముల్ ♦ గలిసెనేని
సమయఁజేయు చోండావతుల్ ♦ సన్నగిలిరి!
నలుగు రెదిరించినను దాఁకి ♦ నిలువరించు
పోఁడిమికిఁ దప్పి మేవాడ ♦ వాడు దేలె! 106

ఉ॥ వైరులు మాసమాసమును ♦ బైరులఁ గోసెడు నట్లు వీరులన్
నూఱులు వేలు గోయఁగ, మ ♦ నోజ్ఞ సువర్ణ శలాకలట్లు లం
గారశిఖాచయంబులను ♦ గాలుచు వేలకు వేలు స్త్రీలు జో
హారులు చేయ, దేశ మక ♦ టా! జనశూన్యము గాక నిల్చునే! 107

సీ॥ తనదు కండలును ర ♦ క్తము గ్రుమ్మరించి మే
వాణ్మాత వీరసౌ ♦ భాగ్యలక్ష్మి
నొకవేయి యేండ్లుగా ♦ నోర్చె! నోర్చుచునుండె!
శాత్రవ తతిపోటు ♦ సడల దయ్యెఁ!

దఘ్ఘాతములకు నా ♦ తల్లి శరీరమ్ము
కుమ్ములు సోవుచుఁ ♦ గుట్టు పట్టె!
నుపచారశతముల ♦ నోళ్లు పెట్టదు! చిక్కి-
చిద్రుపలై శల్యావ ♦ శిష్టమయ్యె!
గీ॥ నమ్ముహామాత గతి తలఁ ♦ పైనయుప్పొ
దొడలు పరవశమై రక్త ♦ ముడుకు లెత్తుఁ!
గడుపు చుమ్మలు చుట్టు! నే ♦ కరణి నామోఁ
దేర్తునని రేయుఁబవలు చిం ♦ తించుచుందు! 108

మ॥ తన లోకావన కచ్చవాహాన్వయము పా ♦ తాళంబునన్ గ్రుంగఁ బు
త్రిని ఢిల్లీశున కిచ్చి వియ్యమును ప్రీ ♦ తిన్ గూర్చి తత్పుత్రు నా
తని కర్పించెను మానసింహు, భగవాన్ ♦ దాసుండు తోద్రోల; నే
మని వర్ణాశ్రమ ధర్మ పద్ధతి తిరం ♦ బై నిల్చు! లోకమ్మునన్. 109

సీ॥ తనయాంతరాజు లేఁ ♦ డనిపించి విస్తార
భూమి మర్వారేలు ♦ భూపమౌళి
యుదయసింగక్బరు ♦ నెదురేగి తోడ్తెచ్చి
తనరాజ్యలక్ష్మి స్వా ♦ తంత్ర్యలక్ష్మి
నొసఁగుచు సోదరి ♦ జోధభాయి నొసంగి
యేకసహస్ర హా ♦ యేశుఁడయ్యె!
ననుజుని జంద్రసే ♦ నుని నిజాత్మజు శూర
సింహు ఢిల్లిని సేవ ♦ చేయఁబనిచె!
గీ॥ బదులుగా నక్బరొకకొన్ని ♦ పల్లెలియ్య
నతని సామంతుఁడగుచు రా ♦ జ్యంబొనర్చు!
ధీరుఁడెవఁ డధీరుఁడెవండు! ♦ వీరనృపులె
సిగ్గుచెడి తగ్గుకూటి కా ♦ సించినపుడు. 110

మ॥ బికనీరీశ్వరుఁడున్ జసల్మియరు పృ ♦ థ్వీనాథుఁడున్ వారి క
న్యకలన్ ఢిల్లికిఁ గాన్కఁగాఁబనిచి సే ♦ నాధీశ సామంతులై
సుకమున్ గోరుచు నక్బరున్ గొలువఁగాఁ ♦ జొత్తెంచి! రిట్లందఱో
యకటా! సోదరభావతుల్ చెడిరి! హే ♦ యంబైన దాస్యమ్మునన్. 111

మ॥ వడకించెన్ సచరాచరావనిఁ బ్రతా ♦ పస్ఫూర్తిఁ జిత్తూరు ము
ట్టడియ ప్పర్జునరావు; శూరథనుఁ డి ♦ ష్టశ్రేష్ఠుఁ డమ్మానుష్య పు
త్రుఁడు! మాతండ్రికి మేనమామకొడుకు! కెం ♦ తో కూర్చు వాఁడయ్యు నన్
విడి ఢిల్లీశ్వరుఁ జేరె! నీకథలు వి ♦ న్పింపంగ సిగ్గయ్యెడిన్! 112

మ॥ దురదృష్టంబదియెల్ల నాపయిని గం ♦ తుల్ వెట్టెఁ! గాదేని సా
గరుఁ డప్పుద్మహితాన్వయంబపయశః ♦ కాలుష్య మొందంగ న
శ్వరు పాదాబ్జముఁ గొల్వ నేల చను! హా ♦ బ్రంధుల్ హితుల్ సోదరుల్
పరునిన్ జేరిరి! మందభాగ్యమున కె ♦ బ్బంగిన్ వగన్ గాంతునో! 113

మ॥ అకటా! సూర్యుఁ డకారణంబుగనె క ♦ య్యంబెంచి వాదాడి ఢి
ల్లికి నేంచేసెను నిన్న; శత్రుజనపా ♦ లిన్ దున్మి తూఁటాడు సిం
హాకిశోరంబులు తమ్ము లిట్లు కుటిలై ♦ యస్మన్మనంబెట్టి బా
ధకు లోనయ్యెనొ దేవుఁడే యెఱుఁగు! ని ♦ ద్రన్ గాన రేయంతయున్ 114

సీ॥ సువిశాల దుర్నిరీ ♦ క్ష్య విశాస మస్బ రా
స్థానరంగ ప్రభా ♦ తతికి బ్రమసి!
యాశ్రయించినవారి ♦ యాసలన్నియుఁ దీర్చు
నతని వింతగు వదా ♦ న్యతకు నలరి!
తమ పేరు జగమునం ♦ దకుఁ బెద్దరాజు
పేరుతో జతగూడు ♦ పెంపు నెంచి!
కనక సౌధాగ్రభా ♦ గములందుఁ బెరలతో
విహరించు తురక బీ ♦ బ్బీలఁ దలఁచి!
గీ॥ సేతు శీత నగాంతర ♦ సీమఁ గలుగు
మానుజపతులెల్ల మతిచెడి ♦ కనులు నిదిగి
విడని పేరాస నక్బరు ♦ విజయరథము
కాడి మోసిరి స్వాతంత్ర్య ♦ ఘనత మఱచి. 115

మ॥ కనుసన్నన్ ననుఁ గొల్చు భూపతులు మో ♦ గల్ జేసి గుఱ్ఱాలు గా
యను వేంచేసి! రనేకదుర్గ వితతుల్ ♦ హారావళీ పర్వతా
వనిదక్కన్ రిపుచేతఁ జిక్కెఁ! జమువుల్ ♦ వమ్మయ్యె! భాండారముల్
ధనశూన్యంబు! లికెట్లు నిల్పనగు! స్వా ♦ తంత్ర్యంబు మేవాడకున్ 116

సీ॥ స్థానమా! విశ్వవి ♦ శ్వంభరాదేవికి
వజ్రభూషణము మే ♦ వాడసీమ!
యన్వయమా! జగ ♦ దారాధ్య దశదిశా
వ్యాప్తకీర్తి యుతంబు ♦ భానుకులము!
పూర్వులా! లోకైక ♦ పూజ్య లిక్ష్వాకు హ
రిశ్చంద్ర మాంధాతృ ♦ నృపతిమణులు!
ప్రజలా! జగజ్జైత్ర ♦ పరిపూర్ణవిక్రమ
ప్రాభవోద్దాము లా ♦ రాజపుత్రు!
గీ॥ లాత్మలో క్షాత్రగుణ మణు ♦ వంతయైనఁ
గలుగువాఁడెవఁ డుఱక గా ♦ జులు ధరించి
చల్లఁగా నింటఁగూర్చుండ ♦ సాహసించుఁ!
దనదు సర్వస్వ మర్పింపఁ ♦ దలఁచుఁగాని! 117

సీ॥ "క్ష్మాగోళమును ముంచు ♦ గాఢాంధతమసంబుఁ
గర దివ్వెతో నార్పఁ ♦ గడఁగునట్టు!
లత్యగాధము సాగ ♦ రానంతజలముల
కేతమ్ము వేయ నూ ♦ హించునట్లు!
వసుధ బొగ్గుగఁగాల్చు ♦ ప్రళయాగ్ని హోత్రంబుఁ
గన్నీటిచే నార్ప ♦ నున్నయట్లు!
క్షయకాలమున రేఁగు ♦ సప్తమారుతధాటిఁ
దేటి రెక్కల నాపఁ ♦ దివురునట్టు!
గీ॥ లని జగము నన్నుఁ బరిహాస ♦ మాడుఁగాక!
యొక్కటిని నిల్చి బలమెల్ల ♦ నెదురువెట్టి
విధికి మార్కొడ్డి స్వాతంత్ర్య ♦ విజయలక్ష్మి
యడుగులకు నిత్తుఁ ముత్యాల ♦ హారతులను. 118

గీ॥ ఎట్టి బ్రహ్మప్రయత్నంబు ♦ నేనిఁ జేసి
యుదయపురలక్ష్మికిఁ గిరీట ♦ ముంతుఁ దలను!
గాక దైవోప హతుఁడనై ♦ కడిమిచెడిన
రకతతిఁ గూర్తు రతనాల ♦ రావిరేక. 119

శా॥ నా కొక్కించుకయైనఁ గష్ట మొదవైరే ♦ నన్ మేరువున్ గాఁగ, జీ
కాకున్ జెందు మృదుస్వభావులరు! మీ ♦ యాశీస్సు శ్రీరామ ర
క్షాకల్పంబగు! ధర్మసూక్ష్మముల నీ ♦ సంధిగ్ధ కాలమ్మునన్
నాకున్ జెప్పి కృతార్థుఁ జేసి కడుఁ బు ♦ ణ్యం బొందఁ బ్రార్థించెదన్'', 120

క॥ అని పెండికొండ సింహా
సనమున శివుఁబోలె శాంతి ♦ సదనంబగు స్వా
మినిఁగని భక్త్యావేశం
బునను సలుంబ్రామహీశ ♦ పుంగవుఁ డంతన్. 121

—॥ సలుంబ్రా కృష్ణసింహవిభుఁడు తన నిశ్చయము నెఱిఁగించుట. ॥—

మ॥ "ఇవియున్ వీరరసాబ్ధి వీచికలు గా ♦ నీ మాటలున్ గావు; హైం
దవమం దెందును సత్యధర్మములు సం ♦ స్థాపింప మేవాఁడ భా
గ్యవిశేషంబునఁ బుట్టువున్ గనిన నా ♦ త్మాద్విశ్వనాథుండవౌ
దువు; మర్త్యుండవు గావు; నిన్గొలుచు టం ♦ తో మాకు శ్రేయంబగున్ 122

మ॥ తెలియున్ దేశము నాదు స్వామిపద భ ♦ క్తిస్థైర్యలీలల్; చతు
ర్జలరాశి ప్రమితావనీతల మహా ♦ సామ్రాజ్య మర్పింప దా
పలికాలన్ దగులంగ నొల్లను; భవ ♦ త్పాదాబ్జముల్ భక్తిమైఁ
దలపైనన్ ధరియించి నామనుగడన్ ♦ ధన్యంబు గావించెదన్! 123

గీ॥ నాదు భటులు దుర్గములు ధ ♦ నంబు రాజ్య
రమయు నర్పింతు మఱియు నా ♦ ప్రాణమిత్తుఁ!
దండ్రి! నీదు స్వాతంత్ర్య ర ♦ థంబు మోయఁ
గుడిబుజం బప్పగించుట ♦ గొప్పయగునె! 124

మ॥ తమ గర్జారవధాటి నెల్లెడల గో ♦ త్రక్ష్మాధరశ్రేణి ఘూ
డములై త్రెళ్ళఁగఁ జేయు దోర్బలులు చో ♦ డావ న్మహావీరసిం
హములన్ దోడ్కొనివచ్చి నిల్పెద! విప ♦ క్షారణ్యముల్ గాల్చి భ
స్మము గావింత్రు సమగ్ర విక్రమకళా ♦ సంరంభ పారీణతన్! 125

మ॥ పదివేలేన్గులయంత దార్ఢ్యమున మ ♦ ద్భావంబు నీపాదముల్
గదియున్ నిక్కము! దేవదానవులు లా ♦ గన్ జూచినన్ సుంతయున్

గదలన్ బో! దనిలోన శత్రులను మ్రగ్గన్ జేతుఁ! గాదేని నీ
పదపద్మంబుల మ్రోల వ్రాలి విడుతున్ ♦ బ్రాణంబులో యీశ్వరా! 126

మ॥ తనువుల్ నశ్వరముల్; విశుభ్రయశమున్ ♦ ధర్మంబు సుస్థాయియై
తనరారున్; వెనుకంజ వేయకు; పవి ♦ త్రంబైన దీకార్య; మే
యనుమానంబును లేదు; వేగమె రణ ♦ ప్రారంభమున్ జేయుమీ!
నిను సేవించెద; నీకు ముందు రిపుసం ♦ క్తిన్ జించి చెండాడెదన్!” 127

-॥ భానుసింహుఁడు ప్రతాపసింహునితోఁ దన నిర్ణయముఁ దెలుపుట. ॥-

గీ॥ అనుచుఁ గేల్మోడ్చి విరమించు ♦ నతని మాట
నందుకొని భానుసింహుఁ “డో ♦ యధిప! మాకు
స్వామిభక్తియె రక్తరూ ♦ పమునఁ బాఱు;
నిన్ననుసరింప కేరీతి ♦ నిలువఁ గలము! 128

సీ॥ స్వామి! స్వాతంత్ర్యశ్రీ ♦ భామనోజ్ఞంబు నీ
వదనమ్ము భువనసే ♦ వ్యమ్ముగాదె!
యకలుషస్వామిభ ♦ క్తికిని మెచ్చిన్నరా
ష్ట్రమ్ములు పూర్వకా ♦ లమ్మునుండి
సూతికాగృహముల ♦ శోభఁ జెన్నారు! సిం
దుకుఁ దోడుగా నీమ ♦ నోజ్ఞ నామ
సంస్మరణంబు దు ♦ స్సాధ దుర్భేద దు
ర్గముగాఁగ మమ్ము ర ♦ క్షణముసేయుఁ!

గీ॥ గంఠమునఁ బ్రాణవాయువుల్ ♦ గలుగుదాఁక
ముందునకె గాని వెనుకనై ♦ పునకుఁజూడ!
మరుల కలవాలములు పూల ♦ సరము లట్లు
కంఠములు కౌఁగిలించిన ♦ కాల మందు. 129

చ॥ ముదుసలినైన మోగలు చ ♦ మూవిసరంబు ముఖంబు, భూస్థలిన్
గదియుచుఁ జీల్చు నాగఁటి వ ♦ గన్ బగిలించుచు, రెండుపాయలై
చెదరఁగఁజేతు; బాణములు ♦ చిచ్చఱ పిడ్గులవోలె వైతుఁ! గ
ల్గదు లవమేనియున్ బిఱికి ♦ కండ మదీయ శరీర మందునన్. 130

ఉ॥ క్రూరతురుష్క సంతతుల ♦ కుఁగ మఱి నీకు ఘటిల్లు నామహా
భారత యుద్ధరంగమున ♦ ఫల్గున తుల్యుఁడవౌచు నీవు చె
న్నారఁగ నీపదంబులు హృ ♦ దబ్జతలంబున నిల్పి మత్స్య ధా
త్రీరమణుండ వౌకో యన న ♦ రిప్రతతిన్ గడతేర్తు వాజిలోన్. 131

మ॥ దివియున్ భూమియు నొక్కఁడై పడిన నా ♦ దేహంబునన్ బ్రాణవా
యువు లున్నంతకుఁ గన్ను లెత్తి యహితుం ♦ డొక్కండు నిన్ జూడఁగా
నవకాశంబు నొసంగఁబోవఁ; సముద ♦ గ్రాటోప మేపార న
య్యవనాంభోనిధిఁ ద్రచ్చి వైచెద జగం ♦ బానందమున్ బొందఁగన్. 132

క॥ విపులింపనేల పెక్కులు!
నిను మ్రొక్కి వచించువాఁడ ♦ నీప్రాణము వె
న్కను మాప్రాణంబులు ముం"
దనిన మనస్సింహుఁడప్పు ♦ డందఱు వినఁగన్. 133

—॥ మనస్సింహుఁడు తన యభిప్రాయము వెల్లడించుట. ॥—

క॥ "ఝూలాన్నృపతులు శౌర్యో
త్తాలులు పరిపంథి గహన ♦ దహన జ్వలన
జ్వాలాభు లనెడు కీర్తిని
నేలఁగలుప సాహసింతు ♦ నే! నీమ్రోలన్. 134

సీ॥ శూరులౌ గ్వాలియర్ ♦ సోనెగుత్తేశ్వరుల్
ద్రుపద మాత్స్యక్షితీం ♦ ద్రులును గాఁగ!
సకలసంగరపర్వ ♦ సర్వజ్ఞమూర్తి యా
భీమచాందును యదు ♦ స్వామి గాఁగ!
శ్రీసలుంబ్రాకృష్ణ ♦ సింహుండు దోర్బలో
ద్దండ సాహసుఁడు భీ ♦ ముండు గాఁగఁ!
దేజసింహుఁ డమాను ♦ షాజేయ విక్రమ
గురుకీర్తిఘనుఁడు ఫ ♦ ల్గునుఁడు గాక!
గీ॥ శ్యామసిం గేను కవలమై ♦ యుండ నుండ!
ధర్మరాజనై నిలిచి నా ♦ తంత్ర్యరథము

స్వర్ణజయఘంట మ్రోయించి ♦ జయము గాంచి
ధర్మసంస్థాప నాచార్య ♦ తను వహింపు! 135

గీ॥ దస్యుశవకోటిపైన మ ♦ ద్భటులు నేను
దనువులను వాల్చి, నీవు స్వా ♦ తంత్ర్యలక్ష్మి
కలవఱచు రత్నదేవాల ♦ యమ్ముఁ జేరఁ
బరచఁగ ల మయ్య! కనక సో ♦ పాన పఙ్క్తి! 136

మ॥ 'పనులెల్లన్ సమకూరె మీవినయసే ♦ వల్ తృప్తి సంధించె స్వ
స్వనివాసంబుల కేగుఁ' డంచు భవదా ♦ జ్ఞల్ వచ్చుదాఁకన్ దినం
బును భూశయ్యయు నేకభుక్తము వ్రతం ♦ బున్ బూని వహ్నిన్ జొరుం
డనినన్ దత్కుఁ బట్టుఁడన్న వెనుడీ ♦ యన్ బోము రాజేశ్వరా!" 137

—॥ శ్యామసింహుఁడు తన నిశ్చయ మెఱిగించుకొనుట. ॥—

క॥ అని వచియించిన నుగ్ర
శనితుల్యుఁడు శ్యామసింగు ♦ సాద్రీశ్వరుఁ "డో
యినవంశాభరణా! నా
యనుజుని మార్గము నె నేను ♦ ననువర్తింతున్. 138

ఉ॥ ప్రాణము తీపుగాదు కర ♦ వాల భుజంగికిఁ గ్రూరశాత్రవ
ప్రాణసమీర మిచ్చి విజ ♦ యంబు యశంబు గడించి నిత్యక
ల్యాణము లొందు టొక్కఁడు; మ ♦ హాహవ రంగములందు వ్రాలి ని
ర్వాణమునొందు టొక్కఁడు ప ♦ రాక్రమపూజ్యము రాజకోటికిన్. 139

సీ॥ విశ్వంబు నగలించు ♦ వేడి పిడుగులైనఁ
బువ్వులవలె శిరం ♦ బున వహింతు!
శేషాహిపతి నైనఁ ♦ జేనెత్తి ముత్యాల
హారంబువలెఁ గంఠ ♦ మందుఁ దాల్తు!
హిమవత్క్షితిధరశీర్ష ♦ 'మెవరెస్టు' పైనుండి
దూకెదఁ బాతాళ ♦ లోకమునకు!
నాత్మగర్జాస్ఫూర్తి ♦ నడవి మార్మ్రోయించు
మృగరాజు నశ్వ మ ♦ ట్లెక్కనేర్తు!

గీ॥ గూ్రరతౌరుష్కతతుల నీ ◆ మౌ్రలఁ బట్టి
కసిమసఁగ నేర్తు మననేర్తుఁ ◆ గాని, నిన్ను
విడువ నేర్తునె! ప్రాణముల్ ◆ విడిచి యైన
నరుణకేతన చ్ఛాయలఁ ◆ దిరుగ నేర్తు! 140

మ॥ మిడిమొండైనను నర్ధరాత్రమయినన్ ◆ మిట్టైన గుంటైన నె
క్కుడు వాఁడైనను లొచ్చువాఁడయిన మీ ◆ కున్ దోఁచినట్లాజ్ఞ పి
ట్టుఁడు! ముందున్ మఱి వెన్కచూడక యె పి ◆ డ్గున్ బోలె వైరివ్రజం
బడఁగన్ దాఁకెదఁ! జూడు! వేయనుడులే ◆ లా! ముందుఁగార్యంబులన్.

మ॥ కడప్రాణంబులు బొందివీడి చనుదాఁ ◆ కన్ నిన్ను సేవింతు; నె
క్కుడు దర్పోన్నతి సంగరాంగణములన్ ◆ ఘోరారి సంఘంబులన్
దొడరన్ బోయెద; పీడ కండలను గోం ◆ తుల్ గోసి తద్రక్తముల్
మడవల్ గట్టెద! దేశమంతట యశో ◆ మందారముల్ పెంచెదన్" 142

క॥ అని వచియింపఁ బ్రతాపుఁడు
తన చెంతను ధైర్యపర్వ ◆ తముఁబోలె వసిం
చిన బదనూర్ నరపతిఁ జూ
చిన వదనం బెత్తి తేజ ◆ సింహుం డంతన్. 143

—॥ తేజసింహుఁడు తన తెఱం గెఱింగించుకొనుట. ॥—

మ॥ "అవనీభారము హెచ్చి ధర్మములు వ్య ◆ త్యస్తంబులై పోవఁ బూ
ర్వవికాసం బలరింప నీశ్వరుఁడు స ◆ ర్వజ్ఞుండు మీవంటి మా
నవమూర్ధన్యుల రూపమొంది యిల జ ◆ న్మంబెత్తు! నీదర్శనా
దివిశేషంబులు లోకమంతటికి సం ◆ ధించున్ మహాశ్రేయమున్. 144

సీ॥ ఒకయెత్తు నీవు వే ◆ ఱొకయెత్తుగా దైవ
కోటి నిల్చిన నిన్నె ◆ కోరుకొందు!
స్వామి! యీ నీ పద ◆ ద్వయి విశ్వపూజ్యంబు!
నడుమ త్రోవను నీవు ◆ నడచునప్పు
డడుగు సోఁకిన ధూళి ◆ యణుమాత్ర మంటిన
సకలలోకముఁ గాల్చు ◆ హాలహాలము

చేదంతయును దగ్గి ♦ శీతమై తీయనై
నిమిషమ్ములో నమృ ♦ తముగ మాఱుఁ!
గీ॥ దప్పదము లెంత కొలిచినఁ ♦ దనివి లేదు!
నీయనఘనామ మెంత ధ్యా ♦ నించుచున్న
విసుగు గనుపింప! దింకను ♦ విడక కొలువ
ధ్యాన మొనరింపఁగాఁ గోర్కి ♦ యగుచునుగాని! 145

సీ॥ ధర్మసంస్థాపనా ♦ ర్థము ధాత్రి మెలఁగు దే
వా! యేకలింగావ ♦ తార
పదినూఱులేండ్లు యా ♦ వనన్నృపుల్ భరతఖం
డమునకుఁ గూర్చు బ ♦ న్నములు, వాని
వారింపఁగాఁ బూర్వ ♦ వీరుల త్యాగంబు,
ప్రస్తుతకార్యక ♦ ర్తవ్యములను
నెఱిఁగించుచో నీదు ♦ మృదులాతిమృదుల భా
వం బెంతనొచ్చె దై ♦ వమ యెఱుంగు!
గీ॥ వినుకొలఁది చిచ్చుదరికొన్న ♦ విధము తోఁచె!
సైన్యబల మల్పమని కాని ♦ చాలియున్నఁ
దలను బూవాడ కింట ని ♦ న్నిలిపి నేన
రిపుల సర్వనాశన మొన ♦ రించియుందు. 146

సీ॥ భువనపావన! నీవు ♦ పూనిన కృతి జగ
ద్వంద్య! మందఱము దో ♦ డ్పడఁగఁగలము!
రణ మహోత్సాహ వ ♦ ర్ధనమైన సుముహూర్త
మెంచి సూర్యధ్వజం ♦ బెత్తి నిలుపు!
కలికి బంగరు చిఱు ♦ గజ్జెల మ్రోత మో
గలులు యామ్యమహీమ ♦ కంఠ కాంస్య
ఘంటా నినాదంబు ♦ గా వినెదరు గాక!
ధ్వజము చుట్టుందుము ♦ బలిసి కొలిచి
గీ॥ పులులఁ బోలిన చరణ దా ♦ సులము మేము!
కడకు మేవాడ నొక చిన్న ♦ కత్తి పట్టు

మగనిసువు గల్గ నది రాల ♦ కెగురుఁగాక!
యమరులు నుతింత్రుగాక! నీ ♦ విమల యశము! 147

సీ॥ "ప్రాభవం బిత్తు రా ♦ ష్ట్రమునిత్తు ధనమిత్తు
రాణాను విడనాడి ♦ రం"డటంచు
ఢిల్లీ పురంబునుం ♦ డి దినంబు వచ్చు లే
ఖల నొక్కకొట్టంబుఁ ♦ గప్పవచ్చుఁ!
ద్యాగైకమూర్తి! ధ ♦ ర్మావతారా! నీము
ఖము నొక్కమాఱు దూ ♦ రమున నుండి
కనువిందుగాఁగఁ జూ ♦ చిన వాఁ డెవండైన
నీ నీచతరమార్గ ♦ మెట్లు సొచ్చుఁ!
గీ॥ ప్రాణములతోడ నిన్నడఁ ♦ బాయఁ గలుగు
వాఁడొకఁడు లేఁడు నీదు సే ♦ వకులలోనఁ!
జెంతఁ జింతామణిని వీడి ♦ చిల్లిగవ్వ
కెగుబుజము చూప నెవ్వాని ♦ మొగము వాఁచె! 148

సీ॥ హారావళీ భూధ ♦ రావతంస ప్రాంత
సానుభాగము యజ్ఞ ♦ శాల గాఁగఁ!
భావనాత్ముఁడు చంద్ర ♦ భట్టారకు కవిత్వ
ధారలు వేద మం ♦ త్రములు గాఁగ!
నల సలుంబ్రా కిరా ♦ తాధీశు లసమాన
విక్రమక్రములు బు ♦ త్విజులు గాఁగ!
శార్ఙ్గసన్నిభ బల ♦ స్థాల్యశోభితము నీ
పటు మహాధనువు యూ ♦ పంబు గాఁగఁ!
గీ॥ బ్రిబల యవనసేనలు పశు ♦ ప్రతతి గాఁగ!
యాయజూకుఁడవై దీక్ష ♦ నవధరించి
సవనమును దీర్చి జగము ని ♦ ర్యవనముగను
జేసి త్రైలోక్య నుతుల రం ♦ జిల్లవయ్య! 149

శా॥ 'ఛోరా! శాత్రవకోటి పాలిఁటికిఁ బ ♦ శ్యత్ఫాలమూర్తుల్ గదా
యీరాణ్మణు'లంచుఁ జెత్తురు రణం ♦ బం దండ జెన్నక రవి

ద్వారంబందునఁ జేసె శాత్రవ కుల ♦ ధ్వంసంబు మాతండ్రి; యా
వీరాగ్రేసర చక్రవర్తి యదుగుల్ ♦ వేయోళ్లు సేవించెదన్. 150

మ॥ "పదివేల్ వీరుల బాహుశౌర్య యుతుఁడీ ♦ బాలుం" డటం చెన్నఁగాఁ
గదనం బెచ్చట భీమవిఖ్యా నచటఁ జ ♦ క్కన్ వ్రాలి దుర్దాంత శ
త్రు. దళచ్ఛేదము చేసి నిన్ను జయ యు ♦ క్తున్ జేయ యత్నింతు! నీ
బదనూర్ సింహము తేజసింహము నుడుల్ ♦ వ్యర్థంబు గాకుండుతన్! 151

శా॥ నింగిన్ ముట్టెడు కోటకొమ్మ గుములున్ ♦ దేవాలయమ్ముల్ జయో
త్తుంగ స్తంభము లొప్పు; స్త్రీపురుషు లెం ♦ దున్ బుత్రపౌత్రాప్తి నొం
దంగా మాదృశభూపతుల్ కొలువునన్ ♦ దర్పాదముల్ మోయఁగా,
సింగారించిన తేరి యట్లలరు నా ♦ చిత్తూర్పురిన్ గాంతునే!" 152

మ॥ అని వాక్రుచ్చి హృదంతరాళమున వీ ♦ రావేశ ముప్పొంగ, వి
చ్చిన కెందామరలైన కన్నులతుదిన్ ♦ జెన్నారు లేమంచు బొ
ట్టన నొక్క శ్రుకణంబు జాఱఁగను వీ ♦ రాగ్రేసరుం డుండె; వె
న్కను గూర్చుండిన గ్వాలియర్ విభుఁ డనం ♦ తత్యాగ సంశోభియై, 153

—॥ రామచంద్రదేవుఁడు తన మనోగతము దెలయఁజేయుట. ॥—

సీ॥ "దరిలేని జల మగా ♦ ధస్థాయి వెలుఁగొందు
కడలికి నొకతోయ ♦ కణమునట్లు!
బ్రహ్మాండ మంత నా ♦ వ్పగనున్న పెనుసైక
తాద్రికి నొకచిన్న ♦ యణువు నట్లు!
శాఖాచయంబు ది ♦ శాకోణములఁ బ్రాకు
నవనీజమున కొక్క ♦ యాకు నట్లు!
భూదేవి మకుటమై ♦ పొడవు నెత్తున్న ప
ర్వతరాజమున నొక్క ♦ రాయి యట్లు!

ఆ॥ లేబలంబు లేని ♦ యేకాంగి బహువాహి
నీకు నీకు సాయ ♦ మేమి సేతు!
హృదయకుసుమ మొక్కఁ ♦ డే నాదు సర్వస్వ!
మదియె నీపదముల ♦ నప్పగింతు. 154

చ॥ అజిత పరాక్రమంబున మ ♦ హాహవసీమలఁ గత్తి మోసి నా
బుజములు కాయగాఁచెఁ! గదఁ ♦ బూర్వుఁడ వృద్ధుఁడ నైతిఁగాని, నీ
విజయరథంబు మోయ భుజ ♦ వీర్యము పట్టున లోటులేదు! నే
గజబిజిచేసి శాత్రవుల ♦ కండలు మెండుగ రాల్తు మేదినిన్! 155

శా॥ చండారాతి కులాటవీ దహన శ ♦ శ్వత్కీర్తి! సర్వస్వ మీ
తం డొక్కండె ప్రపంచమందుఁగల మ ♦ ద్భాగ్యంబు నాకూన! యీ
ఖండేరావు కురంగముల్ దునుము వ్యా ♦ ఘ్రస్వామివోలెన్ బలో
ద్దండుండై తెగటార్చు వైరులఁ గృతాం ♦ తప్రాయుఁడై యాజిలో. 156

సీ॥ పగఁబట్టి వచ్చె జే ♦ బరు సర్వభక్షకుం
డయి గ్వాలియరును గొ ♦ న్నయది మొదలు
నెట్టిసాయము లేక ♦ యొంద్రో రెక్కలు లేని
పక్షినై పడిన యీ ♦ బడుగు నన్ను
మేవాడఁ జేరిచి ♦ మీతాతగారు స
హస్ర హస్తములతో ♦ నాదరించి!
రతని యవంతరం ♦ బభిమాన మొనయఁ దం
డ్రివిధాన నోమితి; ♦ నీఋణంబు

గీ॥ వేయిజన్మంబు లెత్తి నీ ♦ విమత నృపుల
నసము రణభూమిఁ జీల్చి చెం ♦ డాడియైనఁ
దీర్పఁజాలమి సత్య! మీ ♦ దేహ మెపుడు
త్వత్పద సమర్పితంబు భూ ♦ ధవ కులేంద్ర! 157

సీ॥ నిత్యకల్యాణ మం ♦ దిరము చిత్తూరు మం
డలము వివాహమం ♦ డపము గాఁగ!
రంగుగుల్కు ననేక ♦ రాజపుత్ర స్యంద
నమ్ములైలేని కుం ♦ డలునుగాఁగఁ!
గృష్ణసింహాది వీ ♦ రేశ్వర దోఃప్రతా
పస్ఫూర్తి రత్నదీ ♦ పతతి గాఁగ!
యవనభూధవ కికి ♦ టాళి నిర్గతమఃఖల్
వజ్రరంజిత రంగ ♦ వల్లి గాఁగ!

గీ॥ దస్యు గళరక్తముల వసం ♦ తమ్ము లాడి
నీదు కరవాల మెచటఁదా ♦ నైన దళకొని
సకలమును దీర్చు నాగవ ♦ సాని గాఁగ!
విజయలక్ష్మి వరించి నిన్ ♦ బెండ్లియాడు." 158

గీ॥ అని యుపరమించె; నంత నా ♦ తని సమీప
మున మహోన్నతరూపుఁడై ♦ మూర్తిఁగొనిన
వీర రసవార్ధియో యనఁ ♦ గూరుచున్న
భిల్లలోకైక నాథుఁ డా ♦ భీమచాందు, 159

—॥ భీమచాందు తన సాయమును వివరించి చెప్పుట. ॥—

సీ॥ "కాంద్రుకాంద్రవి పెద్ద ♦ గా మ్రోతల నిగిడ్చి
గబ్బి బెబ్బులి పిండు ♦ బొబ్బరించు!
శైలముల్ పగిలి ప ♦ చ్చడిగాఁగ ధ్వని చేసి
సింహ పోతములు గ ♦ ర్జించుచుండుఁ!
జేయెత్తు లేచి ప ♦ చ్చివిసంబు వెదచల్లి
కోడెనాగులు బుస ♦ కొట్టుచుండు!
వసుధ యిట్టటు లాడ ♦ బరువైన పదువు లెత్తి
యేనుంగు గుములు ఘీం ♦ కృతులు సేయుఁ!
గీ॥ బద్మజాతాండ మంతలై ♦ భయము గొలుపు
గండశిలలఁ గొండలు చుట్టు ♦ నిండి యుండుఁ!
బ్రమథ యుతుఁడైన కైలాస ♦ భర్తకైనఁ
జాలునే గుండె! నాదు రా ♦ జ్యంబుఁ జొరఁగ! 160

సీ॥ భూలోక నాకమా ♦ భోయెపాళెం బుండుఁ!
జందన తరువర ♦ చ్ఛాయ లుండుఁ!
గొలువు కూటంబుండుఁ! ♦ గోడె గుబ్బెతగముల్
వింజామరమ్ములు ♦ వీచు చుందుర్!
బొమిడికంబుల భిల్ల ♦ పుంగవుల్ నడదివ్వె
లగుదు! రందఱును నీ ♦ యాజ్ఞ నుంద్రు!

నాయాత్మ కెంతో యా ♦ నందమా! నాదు సిం
హాసనంబందు నీ ♦ వధివసింపు!
గీ॥ మండఁ గూర్చుండి క్షణమైన ♦ నవలఁబోక
కొలిచి దేవునకట్లు సే ♦ వలు ఘటింతు!
నడుగు మన్నాట కోర్వ! నా ♦ హస్తయుగము
జాఘువా పట్టుదిండుగా ♦ సంతరింతు! 161

మ॥ సరియుంచుర్ దలయూఁచి చూడు మఱి! నా ♦ స్వర్గంబు నం దైన ని
ర్జరులుర్ ముప్పదిమూఁడుకోట్లైపుడు పూ ♦ జల్ చేసి సేవించు న
ప్పురుహూతుండును జూచియుండని సుఖం ♦ బుల్ భోగముల్ వచ్చి దాం
తరలై చుట్టును జేరి కొల్చు నిను! మ ♦ ద్వాక్యంబు నాలింపుమా! 162

మ॥ అకటా! నీయెడ నెయ్యపుఁ బలిమి నే ♦ న ట్లాడితిఁ గాక యే
టికి నాప్రార్థన మియ్యకొందు! వెపుడుర్ ♦ డెందంబునర్ దేశమా
తకు వాటిల్లు విపత్తుకై వగచి చిం ♦ తఁ గ్రాఁగు నీ వగ్గి క్రిం
గక స్వాతంత్ర్యము దక్కుదాఁక నాక చోఁ ♦ గాలూనికూర్చుందువే! 163

సీ॥ జాతియు జన్మదే ♦ శమును భిన్నము లైన,
మనపూర్వులకు మైత్రి ♦ దనరకున్న,
నాకన్న వయసు సుం ♦ తగఁ దక్కువైన, బా
ల్యమును నొంపారుఁజూచి ♦ నది మొదలుగ
నీపైన నవ్యాజ ♦ నియతి నామది నిల్చె!
రెండవ దేవుఁడర్ ♦ రీతిఁజూతుఁ!
గడఁబోదు నీదు జా ♦ గ్రన్మంగళాకృతి
కల్పనైన హృత్ఫల ♦ కమునసుండి!
గీ॥ నీవు పాల్గొనట్టి యీ ♦ నిఖిలలోక
సార్వభౌమత నరక వా ♦ సముగ రోతు:
నండ నీవున్న నంబలి ♦ నైన నమృత
మట్లు సేవించి యానంద ♦ మంద నేర్తు! 164

సీ॥ అహింత దైతేయ ప ♦ శ్యత్సాలమూర్తులా
శౌర్యదుర్జయు లోక్క ♦ జాతివారు

తరతరంబులుగ స్వా ♦ తంత్ర్యలక్ష్మి మహో
దయముఁ గోరి విదేశ ♦ ధరణి పతుల
మాఱొడ్డి బాహు శుం ♦ భత్ప్రతాపముఁజూపి
ధనధాన్య వస్తు వా ♦ హనయుతముగ
సర్వార్పణ మొనర్చి ♦ శాశ్వత ధన్యత్వ
మందు నున్వారికి వం ♦ ద్యంబు గాదు!

గీ॥ హృదయము గలట్టి మానవుం ♦ డెవఁడు వారి
యడుగులను గొల్చి యహితుల ♦ నణఁచి జన్మ
పావనము సేయఁ! డాతని ♦ బ్రదుక దేల!
బల మదేల! నిరర్థకై ♦ శ్వర్య మేల! 165

మ॥ అకటా! ముప్పదికోట్ల హైందవులు మో ♦ యన్ దగ్గ భారంబుఁ గొం
కక నీవొక్కఁడ వెత్తికోఁ దలఁచి! తిం ♦ కన్ నిన్ను సేవించి గొం
తుక లర్పించెదు వారు పూజ్యులగు భ ♦ క్తుల్! నీపతాకంబు క్రిం
దికి రానొల్లని వార లందఱును మా ♦ తృద్రోహులున్ వంచకుల్, 166

మ॥ పొదలన్ వెల్వడు దొడ్డక్రోలుపులు లే ♦ పున్ జూపు నాసింగపుం
గొదమల్ వీరని శాత్రవుల్ బెదరు ను ♦ క్కుందుంట లున్నార లేఁ
బదివే ల్లెంకలు భిల్లవంశజులు! నీ ♦ పాదాబ్జముల్ గొల్వ నే
కొదలేకుండఁగ నందఱున్ బనిచి నీ ♦ కున్ బ్రీతిఁ గావించెదన్. 167

సీ॥ వెదురు పొదలనుండి ♦ ప్రిదిలిన యాణిము
త్యములు కుప్పలు కుప్ప ♦ లై రహించు!
ఫణి ఫణాగ్రములందుఁ ♦ బండి రాలిన మణుల్
పరుపులు పరుపులై ♦ పరిఢవిల్లు!
గనుల మొల్చిన యన ♦ ర్ఘ్యస్వర్ణ రౌప్యాది
లోహముల్ పెనుకొండ ♦ లుగఁ దనర్చు!
శైలసానువులలోఁ ♦ జంద్రకాంతశిల లీ
జగ మంతటికి నైనఁ ♦ జాలియుండుఁ!

గీ॥ బెరుగుటయె కాని తఱుఁగుట ♦ యెఱుఁగనట్టి
రత్నగర్భ సార్థముగ నా ♦ రాజ్య సీమ!

యూఁచముబ్బుగ నాయొద్ద ♦ నున్న సిరులు
నాథ! నీప్రేమాల సర్వార్ప ♦ ణం బొనర్తు. 168

మ॥ రవిబింబ ధ్వజ మొప్ప నీ వసికిఁ జే ♦ రన్ నీకు మున్మున్నె యా
రవికన్నన్ మునుదోఁచు నప్పుడుపుఁ దా ♦ రన్ బోలె జృంభించి యా
హవ రంగాభ్రముఁ జొచ్చి శాత్రవ కుల ♦ ధ్వాంతంబుఁ జీల్చన్ బ్రతా
ప విభుండన్న ఫిరంగి కీఘనుఁ డయః ♦ ప్రస్ఫీత గోళంబనన్. 169

సీ॥ పారతంత్ర్య మడల్చి ♦ స్వాతంత్ర్యమును నిల్పు
బవరమ్ము వచ్చె! సం ♦ వత్సరాది
పండుగు వోలె నీ ♦ భారత ప్రజలకెల్ల
సమభాగమైన యు ♦ త్సాహ వేళ!
యందఱు మొక మొగం ♦ బై నిల్చి యరుల గె
ల్చితిమేని స్వాతంత్ర్య ♦ సిద్ధి మొదవు!
ననిలోనఁ బడినఁ గ ♦ ల్పాంతంబు వఱకు శా
శ్వత నాకలోక వా ♦ సంబు గలుగు!

గీ॥ రెంట నేది గల్గినఁ గృత ♦ కృత్యులగుదు!
మింత కన్నను జిరపుణ్య ♦ మేది గలదు!
"మీన మేషంబులను బ్రొద్దు ♦ మించకుండ
నిపుడె ప్రస్థానభేరి మ్రో ♦ యింపవయ్య!" 170

—॥ ప్రతాపసింహు నిర్ణయము నిబంధనములు. ॥—

మ॥ అని గాంభీర్యము పూనుపాకృతిని దృ ♦ శ్యంబౌచు నిందుండెనో
యనఁ గూర్చున్నఁ, బ్రతాపసింహుఁడు 'మహా ♦ త్మా! నీ కసాధ్యంబు గ
ల్గునె! యీనాఁటి కిరాత వేషమునఁ జె ♦ ల్వంబొంటి వెన్వెంట లే
దనుటే కాని పురా కిరాతుఁడవు గా ♦ వా! శత్రుపూర్దాహకా! 171

గీ॥ త్యాగమూర్తులు వీరధ ♦ ర్మైక నిరతు
లింద ఱుండఁగ జయసిద్ధి ♦ కేమి కొఱఁత!
యాకసము వ్రీలుఁగాక చే ♦ యప్పళించి
యాపఁ గలము! విపత్కోటి ♦ నోపఁ గలము! 172

సీ॥ సమరముల్ నిష్కార ♦ ణము సేఁగి రత్నగ
ర్భయు రక్తగర్భయౌ ♦ నవనిఁ జాల!
నొకచీమకైన నిం ♦ చుక హాని గలిగినఁ
గనలేను; భారతా ♦ వనిని గలుగు
తరు లతా గుల్మ భూ ♦ ధర గహ్వరములఁ బ్రే
మింతుఁ బ్రాణమును బ్రే ♦ మించు నట్లు!
నాదు హృద్బంధు లిం ♦ దఱ మిమ్ముఁ గొనిపోయి
రణరంగమునను శా ♦ త్రవుల కత్తి
గీ॥ వాదరల కప్పగింపఁగా ♦ వలయు ననిన
మేరు వంతటి బాధ జ ♦ నించు నాకుఁ!
గటకటా! కోరరాని దు ♦ ష్కార్యముల ర
ణంబు నంతటి ఘోర కృ ♦ త్యంబు గలదె! 173
గీ॥ అలఘుమేవాడ లక్ష్మి ము ♦ ఖాబ్జమునకుఁ!
గుంకుమం బట్టి చిత్తూరు ♦ గుఱుతుఁ బాపి
యిపుడు హారావళీసీమ ♦ నెల్లఁ గొనఁగ
నక్బరు తలంచినటు తెలి ♦ యంగ నయ్యె 174
గీ॥ రాజ్యలక్ష్మి సేనాలక్ష్మి ♦ కావ్యలక్ష్మి
లంచములు చూపి యతఁడు వం ♦ చించి తీఱు!
నెంత బలవిక్రమము లున్న ♦ నిపుడు మనకు
నాత్మనిగ్రహమును ద్యాగ ♦ మవసరంబు. 175
గీ॥ ఏను మొదలుగ సామంతు ♦ లెల్ల ప్రజలు
రజత సౌవర్ణ రత్న పా ♦ త్రములు విడిచి.
ప్రకృతి యర్పించు పచ్చతా ♦ పళ్లెరములు
చదురు టాకులందున మెస ♦ వుదము గాక. 176
గీ॥ తలఁచిన మనోరథప్రాప్తి ♦ గలుగుదాఁక
వ్రతము నడపిన దశరథ ♦ రాము కరణి
హంసతూలికా తల్పమ్ము ♦ లవల విడిచి
మృదుల దర్భాసనముల నుం ♦ దుదము గాక. 177

క॥ పెరుగును గావుత చికురో
త్కరము శిర శ్చుబుక గండ ♦ తలముల; భద్రా
కరణము సేయింపకయుం
దురగాత మహర్షికోటి ♦ తో నెనయగుచున్. 178

క॥ మొరయునుగావుత ముందఱ
మొరసెడు దుందుభులు వెనుక ♦ మొగమై యనిలో!
నఱ నిదురయు నఱ కడుపును
బోరయఁగఁ బూనుదము వీర ♦ పూర్ణ వ్రతమున్. 179

సీ॥ ఈశ్వర పదభక్తి ♦ యెపుడు మానఁగరాదు!
మధుమాంస సేవన ♦ మఱగరాదు!
బంగారు పట్టు వ ♦ ల్వలు గట్టఁగారాదు!
భోగకోటుల వంకఁ ♦ బోవరాదు!
కామాది శత్రు వ ♦ ర్గము లంటరాదు! స
త్యంబు శౌచము విడ ♦ నాడరాదు!
త్యాగంబుఁ గల్లనైనఁ ♦ దగ్గనీయంగరా!
దాత్మ నిగ్రహము పో ♦ నాడరాదు!
గీ॥ మాన ముత్తమధనమాట ♦ మఱువ రాదు!
ధర్మమే దైవమనుబుద్ధి ♦ తలఁగరాదు!
నిఖిల జగములు మాఱొడ్డి ♦ నిలుచుఁగాక
దేశభక్తిని విడనాడి ♦ తిరుగరాదు! 180

సీ॥ స్వాతంత్ర్య ధర్మవాం ♦ ఛాశీలురగు వారి
దారిఁగష్టంబులు ♦ చేరియుండు!
నావిపత్కోటిచేఁ ♦ నడలక వీరులు
శాశ్వత యుద్ధంబు ♦ సలుపవలయు
ననుపమ త్యాగ స ♦ మారాధనములతో
ధర్మదేవతఁ గొల్చి ♦ తనుపవలయుఁ!
దద్భక్తజన జీవి ♦ తమ్ము దుర్గమ తపో
మయమై సురక్షితం ♦ బగు తనర్చు!

గీ॥ మహితకీర్త్యానుభూతి ధ ♦ ర్మంబు పొలుచు
సపజయంబుల నది తగ్గ ♦ కతిశయిల్లు!
గాన విజయంబె ముఖ్యంబు ♦ గాదు మనకు!
ధర్మనిర్వహణంబు క ♦ ర్తవ్య మెపుడు! 181

సీ॥ ఉదయుమే లేచి జే ♦ పుదయపురము వీడి
కుంభల్‌మియర్‌కోట ♦ కును జనుదము;
పదివేల పల్లెల ♦ ప్రజలు స్వస్వనివాస
ములు వీడి యచటికే ♦ పోవ వలయుఁ;
బాలములున్న నాఁ ♦ గలి మోపఁగా రాదు;
పసుపుల నెచట మే ♦ పంగరాదు;
బాటల నెవ్వరు ♦ పయనింపఁగా రాదు;
కూపముల జలంబుఁ ♦ గ్రోలరాదు!

గీ॥ వనమృగంబు లొక్కెడ్డైనఁ జం ♦ పంగరాదు;
మఱచియో తప్పియో చెట్టు ♦ నఱుకరాదు;
కేల నొకగడ్డిపోఁచయు ♦ గిల్లరాదు;
గిరులు విడనాడి బయలులఁ ♦ దిరుగరాదు! 182

శా॥ నీరంధ్ర ద్రుమ పుంజ రంజితమునై ♦ నిద్రాణ నానామృగ
స్ఫారంబై భయదాంజనాచల మిటుల్ ♦ వ్యాపించె నా జీకటుల్
బారై యంబరు దేశమాదిగ సలుం ♦ బ్రాసీమయుఁ దాఁక బ్రి
ష్టారణ్యం బగుఁగాక దేశము జనం ♦ బందేగరాకుండఁగన్. 183

క॥ తనకించుకయును లాభము
దనరదనుచు నక్బ రెఱిఁగి ♦ దండెత్తక యుం
డిన నిరుదెగలకు మేలగు!
మన ముందము కొన్నినాళ్లు ♦ మానము తోడన్. 184

సీ॥ తతహరిశ్చంద్ర మాం ♦ ధాత్రాదులు చరించు
వజ్రిలబాట నా ♦ భానుకులము!
నరమాత్రుఁ డొకని కే ♦ శిర సొగ్గి యిక్ష్వాకు
లకు మసిపోఁక నో ♦ ర్చుకొనలేను!

భరతఖండంబు కం ♦ పము పట్టి మేవాడ
మునింగి క్రిందికి గ్రుంగి ♦ పోవుంగాక!
యవనులతోడి బాం ♦ ధవ మూన! నిన్నాళ్లు
మని తురుష్కులకూడు ♦ తినంగజాలం!

గీ॥ గాన బలమెల్లం జూపి సం ♦ గర మొనర్చి!
గెలిచి! స్వేచ్ఛాభిమానముల్ ♦ నిలుపు కొనుటో!
దురమునను వ్రాలి మరణమొం ♦ దుటో నిజంబు!
కలుగ దెందును మధ్య మా ♦ ర్గంబు నాకు. 186

క॥ ఇది నానిర్ణయ" మన "వం
చిది యెల్లర కనుసరింపం ♦ జెల్లు! నటులె చే
యుదు" మన నందఱు గదలుచు
సదనములకు వెళ్లి రధిక ♦ సంతోషమునన్. 187

మ॥ "పరివారంబులతో ధనావళులతో ♦ వస్తుప్రపంచంబుతో
నరుగన్గావలె నేండె యందఱు జనుల్ ♦ హాహారావళీ గహ్వరో
త్కారముల్ చేరంగ; నెవ్వ డాజ్ఞను దిర ♦ స్కారంబు గావించినన్
ధరపై రాలుం దదీయ శీర్ష మని మ్రో ♦ తల్ పెట్టె ఢక్కాధ్వనుల్ 178

గీ॥ అట్టి హాహారావళీ పర్వ ♦ తాంతరమునం
బరిణయము లోకులకుం యు ♦ జరిగె నేని
యంత జనబృంద ముండంబో ♦ దనంగం దనరె!
నఖిలదేశంబు ప్రజయెల్ల ♦ నచట నుండె. 189

—॥ మేవాడ్దేశమంతయుం బాడుపడి యరణ్యముగ మాఱుట. ॥—

సీ॥ రాజులు నివసించు ♦ ప్రాసాదములు గూలి
వన మృగంబులకు ని ♦ వాస మయ్యెం!
బాలములలోన వి ♦ త్తులు రాలి మొలిచి చె
ట్లా కాశమును దాంకు ♦ నట్లు పెరిగె!
గొలంకులలోం గూప ♦ ములలో జలము నిల్చి
పాడుక లేమిని ♦ బాడు పడియె!

నరులు పోఁకమి స్వేచ్ఛఁ ♦ జెరుగుచు నొకటికి
వేయిగా మృగములు ♦ వృద్ధి నొందె!

గీ॥ నలఘు రావీ వనాశాంత ♦ రావనీత
లము లతావృక్షమృగవిహం ♦ గమవృతమయి
దేవ దానవులకు నైనఁ ♦ దేరి చూడ
రాక ఘోరశాక మృత్యువ ♦ క్త్రముగఁ దనరె! 190

గీ॥ తరులు నాపాదమ్రోత, వా ♦ తముల మ్రోత,
మృగవితతి మ్రోత పలు సెల ♦ యేళ్ల మ్రోత
ఖగ తతుల మ్రోత, గలిసి యోం ♦ కార నాద
మెపుడు నల్దెసలందుఁ బై ♦ కెగయు చుండె! 191

మ॥ ఒకమాఱా 'బదనూ' రరణ్యములలో ♦ నుద్దండులై శత్రుసై
నికులేతేరఁగ నాప్రతాప విభుఁడున్ ♦ వీక్షించి యాత్మీయ సై
న్యకదంబంబులతోడ వచ్చి మదశుం ♦ డాలమ్ములన్ జీల్చి సిం
హకిశోరంబటు దాఁకి కూల్చెను జగం ♦ బౌరా యటం చెన్నఁగన్. 192

ఉ॥ వేఱొకసారి యుల్లెపడి ♦ వేలభటుల్ షహబాజుఖాను చి
త్తూరికి వెళ్ళుచుండఁగ మ ♦ హోగ్రవనంబున ముట్టడించె; వా
రూఱక నిల్చిరందఱు; ద ♦ యోదయుఁడౌచుఁ బ్రతాపుఁ డంత సం
హారము సేయకే విడిచె, ♦ నద్దిర! యాతని ధర్మ మెట్టిదో! 193

సీ॥ గొల్లలు మేకలఁ ♦ గొని మేపుదు రటంచు
బచ్చిక బయళులఁ ♦ జొచ్చి చూచుఁ!
గాపు పొలాన నాఁ ♦ గలి మోపునో యంచు
దూరప్రదేశముల్ ♦ తొంగి చూచు!
వేటరుల్ మెకముల ♦ పిండుఁ జంపుదురంచు
ఘోర వనంబులు ♦ దూరి చూచుఁ!
దరుల బోయలును వా ♦ గుర లొడ్డుదు రటంచుఁ
గొండపేటుక్కి యా ♦ దుండి చూచు!

గీ॥ నానలుంద్రాధిపతి వెంట ♦ నంటి యుండ
దేశ మెల్లెడఁ దిరిగి శో ♦ధించుచుండు!

దనదు నానతి లవమైనఁ ♦ దప్పనేని
పరిభవము మగుఁగాక! యెవ్వఁడు ♦ బ్రతుకఁగలఁడు! 194

గీ॥ భోగసన్న్యాసమున వీర ♦ పూర్ణ దీక్ష
పట్టి యిటుఁ బ్రతాపుఁడు కష్ట ♦ పడుచు నుండ!
రాజ్య తృష్ణా భరైక పూ ♦ ర్ణ వ్రతంబు
దీక్ష గాని యక్బరచట సా ♦ ధించు చుండె. 195

—॥ అక్బరు సార్వభౌముని దిగ్విజయములు. ॥—

సీ॥ అంబరు దేశమం ♦ దా రణస్తంభ పు
రము నాఘనుఁడు పాల ♦ నము నొనర్చె;
నల శమంతకసింహుఁ ♦ డను వీరుఁ డాదుర్గ
మును ఖాని కడనుండి ♦ కొనుచు "నుదయ
పురికి నంకితుఁడవై ♦ పరిపాలనము సేయు"
మని తనపతి శూర ♦ ధనున కిచ్చెఁ;
గోటవాఁకిటనున్న ♦ గొప్పపల్లె శమంత
కుఁడు గాని తా నేలు ♦ కొనుచు నుండెఁ;

గీ॥ గొండకన్న దుర్భేద మా ♦ కోటఁ గొనఁగ
దండువిడిసి యక్బరు నిల్చె ♦ రెండు నెలలు;
చెంతనున్న మందంత పో ♦ సినను గాని
జయమొదవునన్న యాస లే ♦ శమును లేక 196

సీ॥ తురకలు సంధిగో ♦ రిరి; దుర్గపతి యొప్పె;
సేవకుఁడును మాన ♦ సింహుఁ డరిగి;
రంద ఆస్థానము ♦ నందుఁ జేరిరి; శూర
ధనరావు పినతండ్రి ♦ తన కెదురుగ
మానసింహుని పీఠ ♦ మాని నిల్చిన భటుఁ
గను తెప్ప పెట్ట కా ♦ క్కాగతిఁ జూచి
యక్బరని గ్రహించి ♦ యతని చేతులు పట్టి
సింహాపీఠమున నా ♦ సీనుఁ జేసె;

గీ॥ నక్బరును శూరధనరావు ♦ నాదరించి
కాశికా మండల మొసంగి ♦ గారవించెఁ;
గోట వెలికి రాఁదలఁపఁ గ ♦ వాటసీమ
నతనిఁ దాఁకె శమంతకుం ♦ డతిరయమున. 197

మ॥ "పురముల్ పోయిన రాజ్యముల్ చెడిన నె ♦ ప్డున్ మాకు రాణామె సు
స్థిరదైవంబగు; నట్టి స్వామి పద భ ♦ క్తిన్ మాని మోగల్ ధరే
శ్వరు పాదంబులు గొల్చె శూరధనుఁడున్ ♦ భాగ్యమ్ము నాసించి; యో
హారవంశాగ్రణులార! యీయధము దు ♦ ర్వ్యాపారముల్ మెత్తురే" 198

మ॥ అని తానున్ దను గొల్చుచున్న హారవం ♦ శ్యశ్రేష్ఠులౌ సద్భటుల్
చని యొక్కుమ్మడి వారలన్ దగిలి యా ♦ స్వాతంత్ర్య యుద్ధంబునన్
దనువుల్ వీడుచు నిత్యనాకసుఖమొం ♦ దన్ బోయి; రాదేశభ
క్తిని లోకంబులు మెచ్చి వారియశమున్ ♦ గీర్తించె వేనోళులన్. 199

గీ॥ రామచంద్రుఁడు రీవాము ♦ హా మహీంద్రుఁ
డలఘు కాలంజరీ దుర్గ ♦ మప్పగించె!
బాజబహాదూ రొసంగె మా ♦ ళ్వము! సహస్ర
వాజి పతులౌచుఁ గొలిచి ర ♦ క్బరును వారు. 200

గీ॥ జోధబాయి మార్వార్మహీ ♦ శుని తనూజ
గనె జహాంగీరు; తక్కిన ♦ కాంతలందు,
నక్బరు 'మురాదు' 'దనియాలు' ♦ ననెడు సుతులఁ
బుత్రికామణు లొక్క రి ♦ ద్దరను బడసె. 201

— ॥ అక్బరు సార్వభౌముఁడు ఘూర్జరదేశము జయించుట. ॥ —

మ॥ జనసమ్మర్దము ఘూర్జరంబు 'ముజఫర్ ♦ షా' యన్న భూమీశుఁ డా
ఘనుఁడున్ బాలనసేయఁగా నచటి క ♦ క్బర్ కొంత సైన్యంబుతోఁ
జనె; వాఁడెంతయు భీతుఁడై యతని ప ♦ జ్జన్ జేరె; ఢిల్లీశుఁ డా
తని సీమన్ గొని కొన్నిపల్లె లొసఁగెన్ ♦ దజ్జీవ నార్థంబుగన్. 202

మ॥ మును బైరాముఁడు రాజరక్షకుఁడు! త ♦ త్పుత్త్రున్ బదాఱేండ్ల వా
నిని నబ్దూరహిమాను సైన్యపతిగా ♦ నేమించి యాఘూర్జరం

బునకుఁ రెండవమాఱు సేనల రణం ♦ బుఁ జేయఁగా నక్బరుఁ
గొనిపోయెఁ సచరాచరావని వడం ♦ కుఁ బొంది శోషిల్లఁగఁ. 203

సీ॥ ఉభయసేనలకు మ ♦ హోద్ధత యుద్ధంబు
పడిమె నహమ్మదా ♦ బాదు పొంత!
నక్బరుపతి ఘూర్జ ♦ రాధిపు రణరంగ
మందుఁ బెల్లుగఁదాఁకి ♦ బందెఁ గొనియె!
సమర మంతము నొందె! ♦ జయ మక్బరు వరించె!
ఖాండేషు క్షైరాయఁ ♦ గథియవాడ
కాంబె బోఁచియు రివా ♦ కాంత మాహీకాంత,
రాధాపురంబు సూ ♦ రతు బలిస్న
గీ॥ పయి బరోడా యహమ్మదా ♦ బాదు మఱియుఁ
బాలనపురాది బహుమండ ♦ లాలి యవన
సార్వభౌముని మృదుపదా ♦ బ్జములు చేరి
యేఁబదియు లక్షల ధనంబు ♦ నియ్యఁదొడఁగె, 204

—॥ అక్బరుసార్వభౌముఁడు వంగదేశమును జయించుట. ॥—

మ॥ వరుసఁ వంగ విహారముల్ కొనఁగ న ♦ క్బర్ కోరె; నాసీమలఁ
బరిపాలించె సుఖప్రదమ్ముగ సులే ♦ మాఁఖానుఁ; డాపీరుఁడుఁ
మరణం బొందినమీఁదఁ దత్సుతుఁడు స ♦ మాప్టియ్యె ద్దావూదు; ము
ష్కరుఁడై లోకుల బాధపెట్టుచును రా ♦ జ్యంబేలె వాఁడయ్యెడఁ 205

సీ॥ ధనము లక్షలు కోట్లు ♦ దనరె; నర్వది వేవు
రాశ్వికుల్ మూఁడువే ♦ లాఱునూర్ల
ద్విరదంబు లిర్వది ♦ వేల్ పిరంగులును ల
క్షయును నల్వదివేలు ♦ కాలిబంట్లు
పదినూర్ల యుద్ధనా ♦ వలు గల్గి దావూదు
చక్రవర్తిని లెక్క ♦ సలుపఁబోక
సరిహద్దు నందున్న ♦ 'జామేనియా' దుర్గ
మును సేనలను గొంచు ♦ ముట్టడించె;

గీ. నదియుఁ గోప కారణమయ్యె ♦ నక్బరునకు;
మానసింహుఁడు సోదర ♦ మల్లు వీర
బలుఁడు ఖాసిముఖానాది ♦ ప్రబల వీరు
లుండఁ గొలువుండ వెడలె బ్ర ♦ హ్మాండ మదర. 206

మ॥ అమర ద్వీపవతీ తటాంతరమునన్ ♦ హాజీపుర ప్రాజ్య దు
ర్గమునన్ జేకొని పాటలీ నగర దు ♦ ర్గంబున్ గొనెన్! ఔరా! యు
ద్ధములన్ జేసి విహార వంగముల నా ♦ తర్వాత నోఢ్రంబునున్
గ్రమమొప్పన్ గ్రహియించె నక్బరు సమి ♦ ద్గాండీవి యాతండనన్. 207

క॥ పరిపూర్ణ విజయమున న
క్బరు ఢిల్లీపురముఁ జేరి ♦ కడు సంతోష
స్ఫురణమున మానసింహుని
సరసకుఁ బిలిపించి గోష్ఠి ♦ సలిపెడు వేళన్, 208

—॥ అక్బరుసార్వభౌముఁడు కువార్ మానసింహప్రభువుతో మంత్రాంగముఁ జేయుట. ॥—

మ॥ పదమూఁడేఁడులు దాఁటిదాఁటకమొ లేఁ ♦ ప్రాయంబునన్ దండ్రియున్
ద్రిదివంబేగెను; నాఁటనుండియు ధరి ♦ త్రీ రాజ్యభారంబు నన్
గదిసెన్; దేవునికూర్మి సర్వమును జ ♦ క్కన్ దాల్చి కల్యాణ సం
పదలన్ లోపము గల్గకుండ నెపుడున్ ♦ వర్ధిల్లఁగాఁ జేసితిన్. 209

సీ॥ తెగిన హారమున ము ♦ త్తియములువోలె భా
రత రాజ్యమది పెక్కు ♦ వక్కలగుచుఁ
జిన చిన్నపాయలై ♦ చెడెఁ; రాష్ట్ర పతులలో
నొండొరులకు మైత్రి ♦ యొదవ దెపుడు;
నిత్యలక్ష్మీ శుభ ♦ నిలయములై యుండ
వలయు రాజ్యములు శా ♦ శ్వత రణముల
ధన జన వస్తు హా ♦ నశూన్యమై పాడు
వడి శ్మశానములట్లు ♦ ప్రభఁ దొలఁగె!
గీ॥ నిట్టి కుబ్జావతారంబు ♦ లెల్లఁ బోయి
భరతఖండ మఖండైక ♦ భాగ్య విభవ

నిలఁదుమై యుండఁ జూడఁగా ♦ వలయు ననుచుఁ
గష్టములఁ గొండయంతాస ♦ గలిగె నాకు 210

సీ॥ సింహాసనం బధి ♦ ష్ఠించినదాది నీ
భావమే మది వేరు ♦ పాఱియుండె!
నాఁగాఁ మొదల్గాఁగ ♦ ననుదినం బొక్కొక్క
రాజ్యంబు గెలిచి రా ♦ ష్ట్రములఁ జేర్చి
పారిజాత మృదుగంధ ♦ వహమునట్లు భారత
మేదినీతల మాక్రమి ♦ మించి పరిజన
కామోద సౌభాగ్య ♦ మలవరించుచు రామ
రాజ్య విఖ్యాతిఁ గూ ♦ ర్పంగఁ గంటి!

గీ॥ నెందరో యొక రిరువురు రాజ్య ♦ తృష్ణచేత
నశ్వరను దిగ్జయ మొనర్చు ♦ నండ్రు! గాని
సత్య మీవె యెఱుంగవె! ధాత్రి ♦ జను లెఱుంగరె!
భువన ములనేలు నాధి దే ♦ వుం డెఱుంగఁడె! 211

సీ॥ సహగమనము భీతి ♦ సడలించియుంటి, న
న్యాయయవనా పన్నుల ♦ నణఁచియుంటి;
మధుమాంస సేవన ♦ మాన్పితి; భారత
నృపులతో వియ్యంబు ♦ నెఱపుచుంటి;
నొకకంట నమృత మిం ♦ కొకకంట సున్నంబు
గలిగి వీక్షింప; మో ♦ గలులు హైంద
వు లటన్న భేదంబు ♦ గలుగదు; మీలోన
మత్ప్రాణసము లెంత ♦ మంది లేరు!

గీ॥ భారతాభ్యుదయముఁ గూర్చి ♦ పవలు రేయు
నేను పడుబాధ లా దేవుఁ ♦ డే యెఱుంగు!
నీకుఁ జెప్పినఁ దప్పున్న ♦ దే! కనులకు
క్షణము సేపైన నిద్దుర ♦ గదియరాదు! 212

శా॥ రారాజై మితిలేని సౌఖ్యభరముల్ ♦ బ్రాపించి యున్నాఁడటం
చీరెన్నందఁగుఁగాక;-నాదు హృదయం ♦ బెప్డొక్క చింతాగ్నిచే

క్షీరాంభోనిధి క్రూరబాడబ మహా ♦ గ్నిజ్వాలచేఁ బోలెఁ గం
గారాణా చుండను; దాని బాధలకుఁ గుం ♦ గన్ సాగిటిల్ వెల్లుగన్ 213

మ॥ అది యెవ్వారల తోడనేఁ దెలుప రా! ♦ దద్దాని నెవ్వారికి
ర్భేదమన్న మతి తీరఁబోవ! దెపుడున్ ♦ జింతించి చింతించి నేఁ
డుదిదాఁకన్ మది నోర్వనే వలయు; నెం ♦ తో కూర్చు మిత్రుండ! న
య్యాది నేఁ జెప్పిన నీదు మానసము చిం ♦ తాయత్తమై క్రుంగెడున్. 214

చ॥ ఇరువదియేండ్లుగాఁగ సహి ♦ యించుచు నుంటిని; వెన్నిమార్లొ నీ
వెఱుఁగవుగాని యేకతము ♦ యిర్వుర ముండిన యప్డు నావ్యథా
భర మింటులుండెనంచుఁ దెలు ♦ పన్ గమకించితి; సంతలో హృదం
తరము కలంగి మాటయయి ♦ నన్ వెలిదాటక నిల్చిపోయితిన్. 215

చ॥ ఒకయెడ సింధువాహిని మ ♦ హోక్కడఁ బూజ్యము బ్రహ్మపుత్రయుం
కొకయెడ వింధ్యభూమిధర ♦ ముత్తరమందు హిమాలయంబు పే
నికి నడుమన్ గలట్టి యవ ♦ నిస్థలి నా పరిపాలనమ్మునన్
వికసన మొంది భూప్రజయు ♦ నేనును సౌఖ్యముఁ గంటి మెంతయున్ 216

మ॥ అరులెల్లన్ నశియించి; రక్బరన నా ♦ హా! యంతరాజేఁడి యం
దురు; గర్భంబు ఫలించి పుత్రికలు పు ♦ త్రుల్ గల్గి; రత్యంత భా
గ్యరమల్ పొల్చెడి; కోటిమంది హితు; లిం ♦ కన్ బ్రాయమో స్వల్ప; మే
కొఱంత ల్లేవు; మహోన్నతస్థితులె నా ♦ కున్ జెల్లె నీనాఁటికిన్. 217

మ॥ అమరాధీశుఁడు గూడ నాసవడు నా ♦ ర్యావర్త దేశంబు స
ర్వము నాఛత్రము క్రిందికై నడిచె; మే ♦ వాడ్ రాజ్య మొకగ్రమ్మమా
త్రము స్వాతంత్ర్యరమా భిమానముల మ ♦ త్స్యాజ్యాధికారంబు లే
శము మన్నింపక గర్వముల్ బలిసి శీ ♦ ర్షం బెత్తి క్రోణించెడున్, 218

చ॥ నను గడుఁ జేర్మిమైఁ గనుచు ♦ నా ప్రభుతన్ మది మెచ్చి కన్య ని
చ్చిన మిమువంటివారి వెలి ♦ చేసి ప్రతాపనృపుండు పంక్తిభో
జనములకైన నించుకయు ♦ నైపక తేలిక చేసి చూచె; మీ
ఘనతకు హాని వచ్చినను ♦ గల్గవె నాకు విషాద వేదనల్! 219

చ॥ కలుగఁగరాదు లాభ మొక ♦ కాసును నాకని దేశమందు లో
కులఁ బురముల్ త్యజించుచును ♦ గొండలనుండఁగఁ బిల్చి సంపదల్

కాలసెడి దేశ మెల్లఁ బెను ♦ బీడుగఁ జేసె; వివేక మున్న దే!
మొలుకల దాఁడి కోడి తన ♦ యింటికి నిప్పిడు కూళ లుందు రే. 220

ఉ॥ ఆదిమ సూర్యవంశ భవుఁ ♦ డంట; తురుష్కులఁ జేరి కొల్వఁగా
బోఁడఁట; నల్పుఁడౌ వ్వరో వ ♦ చోద్రిమ వాక్యము లాడినంత మా
నిరాఁటికిఁ గాలు దువ్వఁడఁట; మే ♦ ము భయంపడి దూర మున్న మ
ర్యాదఁట! కాక రేఁగినను ♦ నంతము చేయు నటంట; వింటి వే. 221

మ॥ మఱి నా యొద్దను జేరు భూమిపతులన్ ♦ మర్యాదతోఁ జూడనో!
ధరణీభాగము లియ్యనో! పిలిచి బ్రాం ♦ ధవ్యంబు చేకూర్పనో!
చిరమైత్రిన్ విహరింపనో నృపులు నన్ ♦ సేవించి చే దేమి మే
సిరి! తానింతటి మార్ఖ్య మేమిటికిఁ దా ♦ ల్చెన్! జెప్పఁగాఁ జాలు దే! 222

సీ॥ నేఁగోరునదియెల్ల ♦ నిఖలభారతఖండ
భాగ మొక్కుండేల ♦ వలయు ననియె!
యెవ్వ డిద్వరు స్వతంత్రు ♦ లిటనుండఁ జోటుండ
రాదు! లోకము పెద్ద ♦ రాజ ననుచు
నంగీకరించె న! ♦ న్నాతఁ డంగీకరిం
చిన దాన నిసుమంత ♦ చేటు గలదె!
తన కిరీటంబు క్రిం ♦ దను వ్రాలు నే! వట్టి
పెడసరకట్టె య ♦ న్పించు కొనుట

గీ॥ కాని! నేరేఁగినను నాపఁ ♦ గలుగు వార
లేరి! తా నెంత! తనదేశ ♦ మెంత! తనదు
సేనయది యెంత! హృద్బంధు ♦ లైన మిమ్ము
వంటి వారలఁ గని యూర ♦ కుంటిఁ గాక. 223

సీ॥ నిజము చెప్పుట కేమి! ♦ నీ వాతసిని గూర్చి
పలుమాఱు గడుఁగార ♦ వంబు నెరపి
పలుకుటఁ జేసి నీ ♦ భావ మెచ్చట నొచ్చు
నో యందు నెట్టులో ♦ యోర్చియుంటి!
"నీవాఁడ" ననుమను! ♦ నేనేల నీకిష్ట
మైనట్టు లతని మ ♦ ర్యాద చేయు!

మతఁడు స్వతంత్రుఁడై ♦ యలర రాదని కాదు!
దేశ మొక్కటిగ వ ♦ ర్ధిల్లనలయు
గీ॥ ననుచు నింతగఁ జింతింతు; ♦ నతని మాక్ష
మంతకంతకుఁ బెరిగె: రా ♦ జ్యంబు పాడు
వడిమె; నేమన ఁగూడక ♦ యెడరు వడితి!
హృదయ శల్యము పాయు చొ ♦ ప్పెఱుఁగ నైతి! 224

చ॥ వినుకడమాటగా వినుతుఁ! ♦ బెద్దయుఁ గాలముగా శరీరముఁ
దినియెడి రాచపుండువలెఁ ♦ దీరని వ్యాధియుఁబోలె నాప్రతా
పునిదెస నైన చింతఁ దను ♦ వుఁ మఁనసుఁ వ్రణ మయ్యె; నేగతిఁ
దినములు బాటుఁ! దీఅ దిది ♦ దేహముతోఁడుతఁగాని యీజనిఁ 225

మ॥ అకటా! చల్లఁగ నింట నన్నిలిపి యా ♦ యస్త్రాది ... దుండి చూ
డ్కికి వ్రేఁగా నుదయాద్రిదాఁకఁ గల ది ♦ గ్దేశమ్ములఁ గెల్చి లా
భకళల్ సించెదు నీవు నా ప్రమణివై ♦ వర్తించియుఁ జింతఁబా
యక నే నెప్పుడు క్రుంగిపో వలసె! గ ♦ ట్టా! దైవమెబ్బంగిదో!'' 226

— ॥ అక్బరు చక్రవర్తికి మానసింహ ప్రభువు మనస్తాపోప
శమనము చేయుట. ॥ —

మ॥ అని యాస్యంబును వాల్చి చూపు ధరపై ♦ న్యాపింపఁగాఁ జేసి చిం
తను సూచింపఁగ మానసింహుఁడు ప్రచం ♦ డ ప్రాభవోద్దండుఁ డా
తని వీక్షించుచు "దీని కింతివడిఁ జిం ♦ తఁ బొందఁగా నేటి! కీ
వసి నీకోరిన యట్లు తీర్పఁగను మ ♦ ద్యారంబు! నీ కేటికిఁ! 227

ఉ॥ ఇంతకు నీవు కోరువసి ♦ నెవ్వరి కేసియుఁ దప్పుపట్టఁ గా
సంతయుఁ జోటు లేదు! జగ ♦ మంతయు సేమము నొందు సౌఖ్యసి
ద్ధాంతము చూపినావు! తఱి ♦ యైనపు డమ్మహానియుఁ జూచి త
త్స్వాంత మెఱింగి వీలయిన ♦ యట్టులు కార్యము నిర్వహించెదఁ. 228

సీ॥ అతఁడు మాకులముల ♦ కధిపతి; యతని శ్రే
యము జూడ మాధర్మ ♦ మందు; కాని
యెప్పటి మాటలో! ♦ యెన్నటి జోలియో!
వినుటయే యతని నే ♦ గని యెఱుంగ!

ధ్వజినీ పతిత్వసం ♦ బంధంబు సామంత
భావంబు విఖ్యాంబు ♦ భాంధవంబు
స్వేచ్ఛా ప్రాంతంబును జాటు ♦ హితవృత్తి యెల్లప్పు
సముఖమ్మున మెలంగు ♦ చనువు కలిమి
గీ॥ పంచసి నోక వేయి సంబంధ ♦ బంధములును
దోష! పూల సంకెలలు నా ♦ డెందను బడుచుఁ
గట్టువడినాఁడ నీపాద ♦ కమలములకు!
నాతనికిఁ గూర్తునే! నిన్ను ♦ యనుసరింతు. 229

గీ॥ ఉదయ పురిపైన దండెత్తి ♦ కదియఁ బోకు!
స్వల్ప రాజ్యము! నీధాక ♦ నైప లేదు!
మృదుశిరీష పుష్పమ్ము! తు ♦ మ్మెదమొ·వా్రిల
నోర్వదు! ఖగేశ్వరుఁడు తొ్రొక్క ♦ నోర్వఁగలదె!'' 230

చ॥ అన "సరి! యట్లుచేయు'' మన ♦ నక్బరు "పెక్కురు కార్యదక్షులన్
బనిచితి! రెండుసారులుగ ♦ వారలు ఘూర్జరదేశ మేగి యం
దునఁగల రాజ్యకార్యములు ♦ తోఁచిన యట్టులు తీర్చి! రైనఁ బా
లనము స్థిరత్వమున్ గనిన ♦ లా గగుపింపదు పెక్కులేండ్లకున్'' 231

—॥ మానసింహాప్రభువు ఘూర్జరమునకు వెడలుట. ॥—

క॥ అనిన "నదియెంతపని తె''
మ్మని పలుకుచు మానసింహుఁ ♦ డామఱునాఁడే
తనవెంటఁ గొంతసైన్యముఁ
గొనుచుఁ బ్రయాణంబు వెడలె ♦ ఘూర్జరమునకున్. 232

చ॥ చని యటనున్న కార్యములు ♦ సర్వముఁ దీర్చి యుత్తమ వ్యవ
స్థను నెలకొల్పె; రాజ్యరమ ♦ సర్వసుఖంబులు గాంచి వృద్ధినొం
దెను; బలవంతుఁడున్ బ్రబల ♦ నిర్గత మెంతటి దుర్గమస్థలం
బునయినఁ జీల్చి చొచ్చుకొని ♦ పోవు నటంచను పల్కు నిల్పుచున్. 233

మ॥ తనయంబర్ పురిఁ జేరఁగా మఱలి మ ♦ ధ్యన్ గల్గు మార్గంబునన్
జనుచో నొక్కెడ మానసింహుఁడు "కదున్ ♦ సద్భక్తి నీపాద ద

ర్జనముఁ జేయఁగ నోర్చెఁగల్గి [illegible] ♦ జ్ఞఁ వేగఁ బాలింపవే"
యని మామక జయమ్ముఁ బంచెను బ్రతా ♦ పాధిపు నర్థింపఁగన్. 234

చ॥ కదిసి ప్రతాపసింహనృపుఁ ♦ గార్య మతం డెఱిఁగించె; సమ్ముదా
స్పదుఁడయి భూవిభుం 'డుదయ ♦ సాగరసీమను జూతు' నన్న వా
ర్తఁ దెలిపె నాతఁ; డిచ్చటఁ బ్ర ♦ తాపుఁడు నచ్చట మానసింహుఁ డ
య్యుదయపురంబుఁ జేర గమ ♦ నోన్ముఖులై చని చేరి రిర్వురున్. 235

గీ॥ అన్నియును బర్ణశాలలే, ♦ యంతరమున
నన్ని దర్భాసనంబులే, ♦ యన్నిచోట్ల
నతిసిరాడంబరత్వమే, ♦ యందఱు ముఖ
ముల నమాయికత్వంపు ము ♦ ద్రలె, రహించె. 236

గీ॥ అచటి యందఱు భోగస ♦ న్న్యాసిమణులు!
పరమహంస ముఖ్యుఁడు ప్రతా ♦ ప ప్రభుండు!
పజ్జ నున్న గంభీరా స్ర ♦ వంతి వోలెఁ
బరమ గంభీర మందఱు ♦ భావ వృత్తి. 237

గీ॥ అతుల సువిశాల పర్ణ శా ♦ లాంతరమున
మృదుల దర్భాసనంబులు ♦ పది దనర్ప
నొక్కదానిపైనఁ బ్రతాపుఁ ♦ డుండె! నతని
చెంతనే సలుంబ్రా కృష్ణ ♦ సింహుఁడుండె. 238

—॥ మానసింహప్రభువు ప్రతాపసింహుని దర్శించుకొనుట. ॥—

సీ॥ వజ్రదీధితులు శు ♦ భ్ర కపోలములపైన
నాట్యమ్ము సలుపు కుం ♦ డలము లలరఁ!
బరమదుర్లభ మహా ♦ భాగ్యరేఖ లెసంగు
రమణీయ దీర్ఘ నే ♦ త్రములు దనర!
సౌందర్య దేవతా ♦ సదనమై సంపూర్ణ
చంద్రుని గేరు నా ♦ స్యంబు వెలుఁగ!
క్షితి నెల్లఁ ద్రుటిని వ ♦ శీకృతి గావించు
భూరి లక్షణ దివ్య ♦ మూర్తి యమర!

సీ॥ మంచి చందురుకావిరు ♦ మాలు పైన
రాజ చిహ్నమౌ మగజా తు ♦ రాయి గలుగ!
మానసింహుండు ప్రబలాభి ♦ మాన ధనుఁడు
హయము డిగి పర్ణశాలకు ♦ నరుగు దెంచె. 239

మ॥ కరముల్ రెండును మోడ్చి భూమిపయి మో ♦ కాళ్ళూని కూర్చుండుచున్
శిరమున్ వంచి నమస్కృతుల్ సలిపి ని ♦ ల్చెన్ మానసింహుండు; సా
దర చిత్తుండు ప్రతాపసింహవిభుఁ డు ♦ త్సాహంబుతో "నంబరే
శ్వర! రమ్మిచ్చటఁ గూరుచుండు"మని సం ♦ భావించి సంప్రీతిమై. 240

సీ॥ "రాజపుత్ర భూస్థలిఁగల ♦ రాజులందు
నాయనా! నిన్నుఁబోలు రా ♦ ణ్మణులు గలరె!
ప్రాభవము నందు యశమందు ♦ బలము నందు
నింత వాఁడింక లేఁడన ♦ నెసఁగినావు! 241

చ॥ ఒకత్రుటి యేనియున్ వ్యవధి ♦ యుండదు; భారతదేశ కార్యముల్
సకలము నీపయిన్బడి తో ♦ లంగవు; వేసవియందు మండుచుం
డకుఁ గడుదూర మిట్లు పయ ♦ నం బొనరించితి; వెట్టి దొడ్డ కా
ర్యకరణ మూనియో! తెలుప ♦ నర్హమ యైనను విందు" నావుఁడున్.242

మ॥ "నిజధర్మాచరణం బొనర్పఁ బురమున్ ♦ దేశంబు సర్వస్వమున్
స్వజనంబున్ విడనాడి యెప్డు ప్రబల ♦ స్వాతంత్ర్యమున్ గొల్చి చే
రజ మొక్కింత యెఱుఁగకుండెదు మహా ♦ రాజర్షి! నీపాద పం
కజముల్ గొల్చుటకన్న నిప్డు మఱి యే ♦ కార్యంబు నాకుండెడిన్!243

సీ॥ హారావళీపర్వ ♦ తాటవి రాజ్యంబు!
కొండ గుహలు కొల్వు ♦ కూటములును!
బూచిన పెనువృక్ష ♦ ములు సితచ్ఛత్రమ్ము
లౌ గండశిలలు సిం ♦ హాసనములు!
విరుల గుచ్ఛమ్ములు ♦ వింజామరమ్ములు!
పంచాస్య వితతి సే ♦ వక గణంబు!
ప్రకృతి సౌందర్యంబు ♦ భాగ్య సౌభాగ్యంబు!
జ్ఞానమే మోక్ష ల ♦ క్ష్యంబు గాఁగ!

గీ॥ ముప్పదియు నాఱు కులముల ♦ భూరమణులు
పాదములు గొల్వఁదగు జగ ♦ త్పావ నుండ
వడవిఁ బడరాని యిడుమలు ♦ పడుచు నుంటి!
ధర్మ నిష్ఠుర వీర వ్ర ♦ తంబుఁ బూని.'' 244

క॥ అని మానసింహ భూవరుఁ
డనఁగ బ్రతాపుఁడను "మత్కు ♦ లాభరణులు పూ
ర్వ నృపాలుర ధర్మము నే
ననుసరణ మొనర్చుచుంటి ♦ నతిదృఢ నిష్ఠన్. 245

మ॥ స్థిరదీక్షన్ గొని ధర్మదేవత మహా ♦ సింహన్ బ్రయత్నించు నా
నరులన్ గష్టము లెల్ల మాల్కొనను! ననం ♦ తత్యాగ ధైర్యంబు ల
క్కరయా వారికిఁ! జీఁకటుల్ బలియఁ జు ♦ క్కల్ తేజమున్ బెంచు నా
కరణిన్ ధీరులు పెంచుచుందురు విప ♦ త్కాలంబునన్ ధైర్యమున్. 246

సీ॥ దృక్పథంబున భేద ♦ మే కాని దైవద
త్తములె కా కష్టసౌ ♦ ఖ్యములు రెండు!
రెంటిలోఁ గష్ట ము ♦ త్కృష్టమం! ద్రదితాను
వలఁగొన్న వారి పా ♦ పములు గడిగి,
ప్రకృతి కజ్ఞానసం ♦ పదలఁ బెంపొందించి,
శమదమాదిగుణాళి ♦ సంతరించి,
యఖిలజగం బీశ్వ ♦ రాధీనమని తెల్పి,
యుత్తమ జ్ఞానంబు ♦ నొందఁ జేయు!
గీ॥ నిరత మాత్మ శోధనచేసి ♦ నిశిత శిక్ష
పెంచి కష్టానుభూతి ప్రా ♦ పించి గాక
మనుజుఁ డొకకోటి యోగముల్ ♦ మరగి నైన
నుత్తమోత్తమ పురుషత్వ ♦ మొందఁ గలఁడె! 247

మ॥ అమరోద్యానముఁబోలె నెల్లెడ సమ ♦ గ్రానందమున్ బెంచి లో
కముఁ గల్యాణపు మండపంబటు వెలుం ♦ గన్ జేయు స్వాతంత్ర్య ధ
ర్మమహాదేవత మున్గెఁ గిల్చిన సము ♦ ద్రంబందునన్; రక్త హ
స్తములన్ జేసిన లేచు లేవ దణుమా ♦ త్రన్ రిక్తహస్తంబులన్. 248

మ॥ పొడమొందెనను సోఁకఁగా నెఱుఁగ కె ♦ వ్వర్ శీతల చ్ఛాయలన్
బడిరన్, దుఃఖము మాఱుటంగక సుఖ ♦ ప్రాబల్యభావంబు లే
ర్పడిరన్, నొప్పి రవంతయుం దెలియ క ♦ శ్రాంతంబు భోగంబు చే
ప్పడిరన్, మానవుఁ డాత్మజీవితపు లా ♦ భాలాభముల్ చెందునే! 249

క॥ నాకష్టంబులఁ గూటిచి
నాకొనకుము; కష్టములకు ♦ భయపడ" నన "నేఁ
గాక"నుచు మానసింహుఁడు
"నాకొక్కఁడు తోఁచుఁ! దెల్పి ♦ నన్ గనలకుఁడీ! 250

—॥ ప్రతాపసింహునితో మానసింహప్రభువు సంధిమాటలు జరుపుట. ॥—

సీ॥ కాబూలుమొదలు వం ♦ గముదాఁక వ్యాపించు
సకలభూతలమేలు ♦ చక్రవర్తి!
యవన హైందవులను ♦ లవము భేదములేక
సమదృష్టిఁజూచు వి ♦ జ్ఞానశాలి!
యడుగరే కాని త ♦ న్నడిగిన రాజ్యమ్మొ
వ నొసంగఁగలఁ వదా ♦ న్య ప్రభుండు! ॥
తనచూపుపాఱు ది ♦ క్కున నెం దపజయంబు
వినరాని రణరంగ ♦ విజయ మూర్తి!

గీ॥ శాలిబంబ్లేఁబదైదు ల ♦ క్షలును బదియు
నైదులక్ష లాశ్వికదళం ♦ బైదువేలు
హాస్తితతి గల్గు విశ్వలో ♦ కైకభర్త!
యక్బరు నృపాలుతుల్యు లీ ♦ యవనిఁ గలరె! 251

సీ॥ భూదేవి పూలమే ♦ ల్ముసుఁగూనెనోయన
వఱలు నుద్యానముల్ ♦ పెరుగఁజేసె!
ఛత్రముల్ వలె వంగి ♦ చలువ నిచ్చెడు చెట్ల
రాజమార్గముల నే ♦ ర్పాటు చేసె!
ద్వాదశ వర్షముల్ ♦ వర్షంబు లేకున్నఁ
దఱుఁగని చెఱువులఁ ♦ ద్రవ్వఁజేసె!

మహియెల్ల నీశ్వర ♦ మయమంచుఁ జాటఁ గో
వెళులు దీపముట్లు ♦ వెలయఁ జేసె!

సీ॥ సకల భాషా కవీంద్రుల ♦ సత్కరించి
కృతులు వ్రాయించి బహుబహూ ♦ కృతులు చేసెఁ!
పదియు నాఱునూఱులు సైన్య ♦ పతులు గొలువ
మీఱె మధ్యమలోకమం ♦ దారుఁ డగుచు. 252

సీ॥ క్ష్మాచక్రమెల్ల నే ♦ కచ్ఛత్రమైయుండ
నాసించి దిగ్విజ ♦ యము లొనర్చెఁ!
దనచేఁ బరాభూతిఁ ♦ గనిన రాజుల నెల్ల
సమ గౌరవమ్మున ♦ సత్కరించుఁ!
దనయేలుబడిని నొఁ ♦ దలదాల్తు మనిపించి
వారిదేశమ్ము ల ♦ వ్వారి కిచ్చు!
నీకఁగొంత రాజ్యంబు ♦ నిచ్చు! నాస్థానమం
దరసి సేనాధిప ♦ త్యంబు నిచ్చు!

గీ॥ నెయ్యమునకుఁ దోడుగఁ దన ♦ వియ్య మిచ్చు!
నడుగ లేదనఁజాలఁ! డే ♦ మైన నిచ్చుఁ!
గల్పకము మేరుగిరి కాదు ♦ గవియుఁ జేరి
యతని యాకృతి సిల జన్మ ♦ మందె నిజము. 253

మ॥ అలబృందావనమేగి యందలి మునీం ♦ ద్రానీకముఁ గొల్చి గో
కులపాలాన్వయవార్ధి చంద్రుఁడగు నా ♦ గోవిందు భావించి కో
వెలలఁ నాలుగు గట్టినాఁడు! యవనో ♦ ర్వీనాథు లీభారతీ
యుల దైవంబుల ద్రొక్కి దేవళము లో ♦ హో! కట్టి సేవించిరే! 254

సీ॥ ప్రజ బానిసలుచేయఁ ♦ బడు చట్టమును నిల్పె!
జట్టుపన్నును దుద ♦ ముట్టఁ జేసెఁ!
బరమేశుఁగొలువ నం ♦ దఱును సమానార్హు
లని యాత్రికుల పన్ను ♦ నణఁచి వైచెఁ!
బ్రతిదినోదయము త ♦ ల్పమునుండి లేచిన
యంతఁ బరబ్రహ్మ ♦ మాత్మఁ దలఁచు!

నా త్రిమూర్తులకన్న ♦ నాదిదేవునికన్నఁ
బూటంబులంచుఁ గో ♦ ష్ఠులకు మ్రొక్కు!
గీ॥ నార్షవిధి సూర్యభగవాను ♦ నర్చ సేయుఁ!
దెల్లఁ ద్దయు మాంసంబుఁ ♦ దినఁగరోయు!
నింకఁ బెక్కేల నీకాల ♦ మీగుణమ్ము
లుత్తమ బ్రాహ్మణులకైన ♦ నున్నె చెప్పుమ. 255
గీ॥ స్వామి యాతండు! సద్గురు ♦ స్వామి వీవు!
నిహ మతఁ డొసంగుఁ! బరసౌఖ్య ♦ మీవొసంగె!
దిరువురును రెండు కనులు నా! ♦ కేకరీతిఁ
గొలుతు నిరువుర పాదముల్ ♦ తల ధరించి. 256
మ॥ భవదత్యుత్తమ ధర్మదీక్ష త్రిజగ ♦ ద్వంద్యంబయా! దేశకా
లవిధుల్ చూచియు సూతమార్చుకొనిరేఁ ♦ లగ్గయ్యెడిన్; రాజనీ
తివికాసం బఖిలార్థసిద్ధులను సం ♦ ధించున్; వృథా కష్టన
ష్ట విచారంబులు పెంచుపట్టుల నను ♦ స్థానంబు మార్పన్ దగున్. 257
సీ॥ నీవీరధర్మంబు ♦ నెపమున లోక మొం
తగ బాధనొందుచు ♦ న్నదియొ చూడు!
ప్రజలు విల్వఁగ నీడ ♦ పడయక తినఁగూడు
కట్ట బట్టయులేక ♦ గాసి పడిరి!
పాడువడె ధరిత్రి! ♦ బలియుకొ మగలు కం
కాళమ్ములో యన ♦ గానఁ బడిరి!
భాగ్యదేవత లట్టె ♦ పడతులు దుర్భర
దారిద్ర్యదేవత ♦ ల్గా రహించి!
గీ॥ రనుదినం బేకభుక్తంబు ♦ నవని శయ్యఁ
గొని ప్రపంచోన్నతుండవై ♦ మనఁగఁదగిన
నీవు సన్న్యాసి వేషాన ♦ నిలువ గుండె
దిటవు చెడియెఁ! గొండంత సం ♦ కటము గలిగె! 258
ఉ॥ నీ రవివంశ గౌరవము ♦ నిల్పుట పూర్వమునుండి వచ్చు నా
చారము మాకు; వందనము ♦ సల్పి వచించెద; నట్టినావిధో

వైరము మేలుగా; దెప్పుడు ♦ బాలును నీవును బోలె నొక్కెడై
వీరు మెలంగినన్ జగము ♦ మేలుగనున్; సుఖ మగ్గలంబగున్. 259

మ॥ గురువైరాగ్య కళాసముద్రుఁడవు నీ ♦ కున్ బూర్ణసౌభాగ్యభా
గ్యరమాసేవధి యక్బరీశ్వరునకున్ ♦ కల్లోల గంభీర సు
స్థిర పాథోధులఁగూర్చు చిన్న జలసం ♦ ధిన్ బోలె నే సంధినిన్
వఱలన్ జేసెద! శంభుమాధవుల తే ♦ వన్ మైత్రి వర్తింపరే! 260

క॥ సిరులఁ దులఁదూగ వలసిన
ధరణీసి యుద్ధములు లేపి ♦ దారుణ వధలన్
జరిపించి రక్తబలులను
నెఱపఁ దలఁపఁ బోకుమనుచు ♦ నిర్ధరింతున్." 261

క॥ అన మోము నుందహాసము
చినుకఁ బ్రతాపుఁడును మాన ♦ సింహు వదనమున్
గని "సీవచించు హితముల
కును నామది నెంతయేనిఁ ♦ గుతుకంబయ్యెన్. 262

సీ॥ సచరాచర ప్రపం ♦ చము పుట్టుటాది యా
త్మస్వేచ్ఛ ప్రథమ భా ♦ ధ్యత నరునకు!
నొక మానవుండు వే ♦ ఱొకనికి లోఁబడి
మనుటయు దైవ స ♦ మ్మతముగాదు!
ధన రాజ్య విభవ సా ♦ ధనము లాసగఁజూపు
వారు వానికి నాస ♦ పడెడువారు
సమముగాఁ గలుప భా ♦ జను! లైహికాముష్మి
కసుఖముల్ వారికిఁ ♦ గలుగఁబోవు!
గీ॥ స్వేచ్ఛ మదినెంచి స్వజనంబు ♦ నెల్లసిరులు
ప్రాణమును సర్వమును బాయు ♦ వారియెడల
దైవమే లేకయున్న నీ ♦ ధరణియందు
సత్యమే లేదు! పైన నీ ♦ శ్వరుఁడె లేఁడు. 263

సీ॥ రాజనీతియును ధ ♦ ర్మం బీద్వయిని నీతి
తఱుచుగా లాభప్ర ♦ దముగఁ దోఁచుఁ!

గాని కామోపభో ♦ గముల కైశ్వర్య సం
పాదనకే యది ♦ పనికి వచ్చు!
ధర్మం బఖిలలోక ♦ తత్వంబులకు నెల్లఁ
దల్లియుఁ దండ్రియుఁ ♦ దైవమగును!
నీతియో గౌరవ ♦ స్వాతంత్ర్యముల కడ్డు
పడనంతవఱకె సం ♦ భావనీయ!
గీ॥ మాత్మ గౌరవహాని దా ♦ పైన యపుడు
మానధనులకుఁ ద్యాగసం ♦ పదయుఁ బౌరు
షమును సాహసమును గాక ♦ శరణ యోగ్య
మగు పథం బొక్కఁడుండ దీ ♦ యవనియందు. 264

సీ॥ పలువురు నీవంటి ♦ వారు ఢిల్లీశ్వరుం
డగణిత గుణశాలి ♦ యనఁగ విందు;
నతఁడు ఘనుండు కాఁ ♦ డనను నేఁగూడ; న
క్బరుదెసఁ గడు గౌర ♦ వం బెసంగు;
నతఁ డమానుష సద్గు ♦ ణాఢ్యుం డనను; గా
ని యవనభూపతుల యో ♦ గ్యతముఁ డందుఁ;
గొన్ని మంచిగుణంబు ♦ లున్నవి నిజము; శా
త్రవుఁడైన గుణమున్న ♦ దాపరాదు;
గీ॥ పరులవృత్తి విమర్శించి ♦ పారఁబట్టి
లేని పోని దుశ్శంకలు ♦ లేవనెత్తి
నలుపులు గణించి లేని నిం ♦ దలు ఘటించు
టభిమతముగాదు నాకు బా ♦ ల్యంబునుండి 265

సీ॥ జగమునం దిప్పుడున్న ♦ సమ్రాట్టులందెల్ల
నక్బరు పెద్దవాఁ ♦ డగుట నిజము!
నీవనినట్లు సే ♦ నా వారములు లక్ష
లుం గోటు లతని కుం ♦ డంగవచ్చుఁ!
బట్టిన దంతయు ♦ బంగారు గావచ్చు!
గోపాలదేవునిఁ ♦ గొలువవమ్ము!

సర్వేశ్వరుని కటా ♦ క్షమున శ్రీమంతుఁడై
జనియించె! నతఁడు సం ♦ శయము లేదు
గీ॥ కాని నరుఁడౌట నిష్పాక్షి ♦ కముగఁ జూడ
నుండ నేయుండు లోపమ్ము ♦ లొకఁడు రెండు!
మనకును దురుష్కులకును ధ ♦ ర్మములు వేఱు!
మనది వేదంబు! వారిదై ♦ చను ఖొరాను. 266

వ॥ తనచే నిర్జితులైన భూపతులు క్రో ♦ ధంబుల్ విసర్జించి యె
ప్డును బ్రేమంబునఁ దన్నుఁ జుట్టుకొని కొ ♦ ల్వగ జేయఁగాఁ గాంక్షించి యెం
దును దేశంబు మతంబు వేఱయిన బం ♦ ధుత్వంబుఁ గల్పించు నా
పనికిన్ డిగ్గె; నిగూఢ మాతని మనో ♦ వ్యాపార లీలాగతుల్. 267

గీ॥ అల్లుఁడై భావమై మామ ♦ యైన తన్ను
వెలితి గనసీక శ్రీమహా ♦ విష్ణు నట్లు
భారతీయులు గొలుతు రగ ♦ భావ మెఱిఁగి
యక్బ రిటుచేసె; హేతు వ ♦ న్యంబు గలదె! 268

సీ॥ తన కెదురుండ రా ♦ దను దీక్ష కకట! దు
ర్గావతితోడి సం ♦ గరము సాక్షి!
చాందేలు వంశాబ్ధి ♦ కిందిరా సతి! మహా
బా గన్న పుణ్యసం ♦ పన్న మూర్తి!
యామహాజనని రా ♦ జ్యము సంపదల తోడ
వేదనాదము తోడ ♦ విద్య తోడ
వ్యాపారముల తోడ ♦ వస్తువ్రజము తోడ
నానంద సదనమై ♦ యతిశయిల్లె
గీ॥ రాజ్యతృష్ణా భరైకకా ♦ రణము గాక
తోడరి చంపంగనేటి కా ♦ దొడ్డ తల్లి!
జగము కటకటపడె; స్వదే ♦ శప్రభువుల
మైన మాకెల్లఁ దలవంపు ♦ లై దనర్చె. 269

సీ॥ అఖిల ప్రజా హృద ♦ యక్షేత్రముల సత్య
ధర్మబీజము లుంచు ♦ ధన్యచరిత!

యూబాజబహదూర్ను ♦ యూనాపతుల గెల్చి
పరిభూతి నొసఁగని ♦ బలిమికర్త!
పల్లెలపైఁ బులి ♦ పడెనన్నఁ జని చంపు
దాఁక నుపవసించు ♦ ధర్మమూర్తి!
వివిధ వర్ణాశ్రమ ♦ విధులు తూచా తప్ప
కయె ప్రతిష్ఠించిన ♦ గౌరవాఢ్య!
గీ॥ యట్టి క్షాత్రతపస్విని ♦ నరులు దాఁక
బ్రాణముల నియ్యలేక భా ♦ రత మహీశు
లంగనలకన్న దుర్బలు ♦ లై రటంచు
దేశదేశముల్ తిట్టు దు ♦ స్థితులు దెచ్చె. 269
సీ॥ సిరి పుట్టినిల్లు ఘూ ♦ ర్జరదేశమును దవా
నల మొకో యన క్షామ ♦ మలముకొనియె;
త్రింగ మెదుకు లేక ♦ మేదినీప్రజ తిన
రాని జంతుల శరీ ♦ రములు దినియు
నాకలి చల్లార ♦ కట్టె కుప్పలు కుప్ప
లై కూలెఁ; దక్కువా ♦ రా శవములఁ
గాకులు గ్రద్దల ♦ కరణిఁ బైబడి పీకి
తినఁజొచ్చి; రక్బరు ♦ దిగ్విజయము
గీ॥ చల్లఁగా సాఁగ వంగదే ♦ శమున నుండెఁ
గాని త్రుటినైనఁ జింతించు ♦ కరణి లేదు!
జగము సర్వంబు గెలిచిన ♦ సౌఖ్య మేమి
ప్రజ కెడరు లేక పాలింప ♦ వలయుఁగాదె! 270
మ॥ పదిపండ్రెండు వసంతముల్ గడచి పో ♦ వ లేదె! సన్న్యాసులన్
గదనంబున్ బురికొల్పి యందు నొక ప ♦ క్షంబూని తా నందఱన్
దుదముట్టించి ధనేశ్వరంబు ననుగ ♦ న్నుల్ చల్లఁగాఁ జూచుచున్
మదిమోదింపఁడె; దొడ్డవారి కుచితం ♦ బా! యిట్టి హింసారతుల్! 271
మ॥ ఘనదుర్గంబులు వాహినీతతులు భా ♦ గ్యశ్రేణులన్ బట్టి మె
ప్పును దేశోన్నతి నెన్న రాదు; గుణసం ♦ పూర్ణత్వమున్ నిగ్రహం

బును ధర్మాచరణంబు సత్యము యశం ♦ బుఁ ద్యాగముఁ గల్గు న
య్యనఘ స్వాంతుల సంఖ్యఁ బట్టియెపుడా ♦ యౌన్నత్య మేపారెడుఁ 272

క॥ తనతల్లియుఁ దనదేశము
తనకా స్వర్గమునకన్నఁ ♦ దత లక్ష్మీ వ
ర్ధనములు పూజ్యతమంబులు
నను నిది సత్యమును సహజ ♦ మై పొలుపొందుఁ. 273

సీ॥ అచలవృత్తి వహింతు ♦ నాధర్మ మూపి! లో
కము పుట్టుటాది యీ ♦ క్షణము దాఁక
మాభానువంశంబు ♦ మానవమాత్రున
కెవనికిఁ దలయొగ్గి ♦ యెఱుఁగ దెప్డు!
డస్వతంత్రము మేరు ♦ వైన లక్ష్యముచేయ
స్వేచ్ఛ జీవింప మా ♦ హంతుఁగాని!
యక్బరు తన రాజ్య ♦ మంత యిచ్చెద నన్న
నదియేల! క్రీఁగంట ♦ నైనఁ జూడ

గీ॥ వల్కలముఁ గట్టి స్వాతంత్ర్య ♦ వైభవమున
నిట్లు సన్న్యాసినై యున్న ♦ నిదియె చాలు!
నాకు భోగభాగ్యముల కెం ♦ తయును దూర!
మాస విడిచిన వాసి కా ♦ యాస మున్నె! 274

సీ॥ అఖిల భోగము లున్న ♦ నాత్మతృప్తియు లేక
దారిద్ర్య జలధి నా ♦ తఁడు మునుఁగు!
నేసంపదయు లేక ♦ యే స్వతంత్రత నుండి
యీశ్వరుకృప గడి ♦ యింప నేర్తు!
గౌరవమునకు భం ♦ గముఁ దెచ్చు నక్బరు
తో సంధి నాకు సం ♦ తోష మిడదు!
మేమిర్వురము దూర ♦ మై మనుటయె శ్రేయ!
మిది దైవ సంకల్ప ♦ మింతమాత్ర

గీ॥ భారతావని కెట్టి లో ♦ పమును రాదు!
కాలచక్రము తిరిగెనా ♦ కలిమి తిరుగుఁ!

దిరుగఁబో యుండనిమ్ము! సా ♦ ధింప రాని
పనికి వగ పేల! యాయాస ♦ పడఁగ నేల! 275

శా॥ ఆకాపట్యము! లాదరస్మితము! లా ♦ యౌదార్య! మావియ్య మా
మోకాల్ మ్రొక్కులు! నాచమూవిభవ! మా ♦ ముప్ప్రొద్దు సేవించుటల్
నాకెత్తుఁ దలనొప్పి పట్టణము ల ♦ న్నన్; మీరు నెట్లుందురో!
నాకీ కొండలువోలె సౌఖ్యమిడు శాం ♦ తస్థానముల్ లేవు పో! 276

శా॥ ఈసర్వంసహయెల్లఁ లోఁబడక పో ♦ యెన్ నాకటం చెప్పుడున్
గాసిన్ బొందఁ; బొగడ్తపై మదిసిడన్; ♦ గష్టంబు లెక్కింపఁ; జే
రాసన్ ద్రవ్యముఁ గోర; నిట్టి తృణశ ♦ య్యల్ పర్ణశాలల్ సుధ
న్మా సింహాసన వైజయంతముల మే ♦ రన్ జూచి యుప్పొంగెదన్.'' 277

గీ॥ అనుచుఁ దనమాట మోయనీ ♦ యమిని జేసి
మో మొకింత వివర్ణతఁ ♦ బొందుచుండ
నెల్లొ సవరించుకొని ప్రీతా ♦ పేంద్రుఁ జూచి
మానసింహుఁడు కార్యంబు ♦ మఱువ లేక, 278

సీ॥ "క్రొత్తఁగా నేఁ జెప్పు ♦ కొనఁగ నేమిటికి! నీ
యెఱుఁగని ధర్మంబు ♦ లెందు లేవు!
మేవాడరాజ్య ల ♦ క్ష్మీదేవి దెస నొక్క
కనువైచి యుండు న ♦ క్బరు నృపాలుఁ!
డెప్పుడు రేఁగునో! ♦ యేదెస వచ్చునో!
యెట్లు చేయునో! యెవ్వ ♦ రెఱుఁగఁ గలరు!
పట్టు పట్టెనయేని ♦ వాని చలంబును
బౌరుష మింతని ♦ పలుక వశమె!

గీ॥ లేడిపయి దూఁకు సింగంబు ♦ జాడ వచ్చు!
నెంత విక్రమోన్నతి యున్న ♦ నేమి ఫలము!
వాని పౌరుషధాటి కో ♦ ర్వంగ లేక
బాధ పడెదవు; బలవద్వి ♦ రోధ మేల! 279

చ॥ పరనృపులెల్ల లోఁబడెదు ♦ వేళలఁ గొన్ని నిబంధనంబు ల
క్బరు విధియించుచుండుట జ ♦ గం బెఱుఁగున్ గద! యైన నిన్ను నా

తెలియునె బొమ్మన్నగల దె! ♦ దేవుని యిల్లో మఱొక్కచోటో నే
నెఱుఁగనె! యెల్లకార్యముల ♦ నే సమకూర్చెద నీకుఁ దృప్తిగన్. 280

సీ॥ నీకన్నియల బాదు ♦ సా కిచ్చుటయు లేక!
జుట్టుప న్నేనాఁడు ♦ గట్టకుండఁ!
బనిమీద సింధువా ♦ హిని దాటుటయు లేక
యాస్థానమున కెప్పు ♦ డరుగకుండ!
జాతియు మతము లే ♦ శము వీడుటయు లేక!
సేనాధిపత్యంబు ♦ చెందకుండ!
మోఁకాలిపై వ్రాలి ♦ మ్రొక్కి నిల్చుట లేక
గుఱ్ఱంబులను దెచ్చు ♦ కొనకయుండ!
గీ॥ వత్సరారంభపు నవరా ♦ త్ర్యుత్సవముల
సంతలకు రాణివాసమ్ము ♦ చనుట లేక!
కడుపులోఁ జల్ల యిటునటు ♦ గదలకుండ!
సమత దైవార మీకు నే ♦ సంధిఁ గూర్తు. 281

సీ॥ నీ కగౌరవమైన ♦ నా కైనయట్లు! నీ
దివ్యచిత్తము సుఖ ♦ స్థితిని నుంచు!
మీ పర్ణశాలలో ♦ నేకాంతముగ నుండు!
మిచటికి నొరు లెవ్వ ♦ రెఱుఁగకుండ
మెలమెల్లఁ జీకటుల్ ♦ మొలుచు వేళకుఁ దెత్తు!
నక్బరు చెవిని ర ♦ హస్యముగను
"సరిరొమ్ము పొమ్మ"ను! మొక్క ♦ క్షణమున నాతని
నేను గొంపోయి ఢి ♦ ల్లీని జేర్తు!
గీ॥ నుదయపురి నేలుకొనుము! చి ♦ త్తూరు పురము
బాగుపఱుపంగఁ బట్టు ద్ర ♦ వ్యంబుఁ దెత్తుఁ!
గొదువ యనిపించినను మాళ్వ ♦ ఘూర్జరములు
తీసికొన నాజ్ఞ నెత్తిపై ♦ మోసి తెత్తు! 282

సీ॥ ముప్పదిమూఁడు రా ♦ ణ్ముఖ్యవంశములు పా
దములు గొల్చెదు గురు ♦ స్థాన మీవు!

నీపాదపాంసుల ♦ నిరత మౌదలఁ దాల్చి
నేను నీయున్నతి ♦ నెగ్గఁజేతు!
సంధి సంగరములే ♦ శరణమై కనుపించు;
సంధిఁ ద్రోసినను ని ♦ శ్చయము రణము!
ప్రస్తుతస్థితుల న ♦ క్కరు వీడి నిను జేరి
దుర మొనర్పుట నాకు ♦ దుర్లభ మగు!
గీ॥ నతఁడు విడఁ! డీవు లోఁబడ! ♦ వంత మేది!
మకర గజరాజముల పోరు ♦ మాడ్కి సాగుఁ!
బుష్పవన మట్టి భారత ♦ భూమి యెల్ల
నగ్గి పెట్టితిరంచు దు ♦ ర్యశము గలుగు! 283

ఉ॥ భూరమణేంద్రులందఱును ♦ బోయిన మార్గమె యోగ్య! మింతకున్
వేఱగు త్రోవ లేదు; పృథి ♦ వీతగల సర్వము వెంటఁగొంచు నీ
వే ఱటు పాఱఁజొచ్చె! నెదు ♦ రీద నెవండు సమర్థుఁడో; వృథా
పౌరుష మున్నదంచు బడ ♦ బాజ్వలనంబును బాఱ మ్రింగెదే" 284

క॥ అన మునిముసి నగవులు మో
మునకుం జెంగావి రంగు ♦ మొనయింపఁ బ్రతా
పన్నృపతి యంబర్పతి యా
ననము దెసను గాంచి "ముగిసె ♦ నా! నీమాటల్" 285

సీ॥ కోమటి యొకచిల్కఁ ♦ గొని కొన్నియేండ్లకుఁ
బంజరంబును గొంచు ♦ వనికిఁ బోయె!
నడవి చిలుక "చుట్ట ♦ మా! బందె గొనిరె! స్వా
తంత్ర్యమ్ము చెడె! నెట్లొ ♦ తప్పుకొనుచు
నేగుదె" మ్మనె! స్వేచ్ఛ ♦ యెఱుఁగని తొలి చిల్క
"గాలిలో నెట్టులు ♦ తేలుచుంటి!
క్రిందఁ బడవె! యేమి ♦ తిందు వీ యడవి! నె
వ్వరు సాకెదరు! శత్రు ♦ భయము లేదె!
గీ॥ పంజరమునఁ జొటిత్తు! నా ♦ పజ్జనుండు!
కోమటియుఁ దియ్యమామిడి ♦ గుజ్జు పెట్టు!

బిల్లి కరువదు! పామును ♦ బీక దిచటు!
భయము లేక కాలముఁ గడ్ప ♦ వచ్చు"ననియె. 287

సీ॥ ఆది సెల్యూకసుం ♦ డరుదెంచి నపుడు స
ర్వబలంబు లుండె భా ♦ రతధరిత్రి!
కాచంద్రగుప్తుఁ డా ♦ హానమందుఁ దాఁకి వా
నిని మూఁడు చెఱువుల ♦ నీళ్లు ద్రావె!
నాపిమ్మట నరబ్బు ♦ లరుదెంచి! రప్పుడు
దార్ఢ్య తేజము కొంత ♦ తగ్గి పోయె!
నవలఁ బఠానులు ♦ యవనులు వచ్చి! ర
మ్మెడ దేశవీర్య మె ♦ క్కుడుగఁ జెడియె!

గీ॥ నిపుడు భారతలక్ష్మి తా ♦ నెట్టు లుండెఁ!
గోట్ల కొలఁదిగ జనులెల్ల ♦ గూడు లేక
పమరదారిద్ర్య జలధి ము ♦ న్గిరి; కనుఁగొను
మినుప సంకెలల్ మనకాళ్ల ♦ కెక్కియుండె! 288

సీ॥ పదివేల పల్లెలు ♦ పాడుగాఁ బడియుండె;
రాష్ట్రమంతయు మహా ♦ రణ్య మయ్యె;
నొకకాని ధనమేది ♦ నొకచిట్టి ధాన్యమేఁ
గరగతమా నట్టి ♦ వెరవు లేదు;
పడమటి కొండల ♦ బ్రహ్మనాానుల మాడ్కి
బీదల మగుచు జీ ♦ వితముఁ దీర్తు;
మిట్టి దేశముపైన ♦ నీపట్టుదల యేల!
మము గెల్చి యేమి లా ♦ భము వచింపు!

గీ॥ పరుల కావంత కీడొన ♦ ర్పంగ లేని
హరిణశాబము హింసించు ♦ నతఁడు రెండు
కొమ్ములును జర్మమును గాక ♦ కోట్ల కట్టి
పడగ లెత్తెడు భాగ్యంబుఁ ♦ బడయఁ గలఁడె. 289

సీ॥ స్వాతంత్ర్యలక్ష్మి వి ♦ శాల సేవలకు జీ
వితమును నేఁడీసి ♦ పెట్టినాఁడ;

బ్రహ్మాండ మంత వి ♦ పత్తు వచ్చిన నోర్తు;
నించుక యేని జిం ♦ తించఁ బోను;
మఱి నెందుఁగాని ని ♦ ర్మాణమ్మునకు ముందు
విధ్వంసనము ముఖ్య ♦ విధిగ నుండుఁ;
బరతంత్రగతి నొందు ♦ వైభవంబున కన్న
స్వాతంత్ర్యమున వచ్చు ♦ చావు మేలు;
గీ॥ మాశిశోదియా వంశ సం ♦ భవులు బ్రదికి
స్వేచ్ఛమై నుండవలె; లేని ♦ యెడలఁ జచ్చి
స్వర్గమున నైన నుండఁగా ♦ వలయుఁ; గాని
మధ్య నేఱొండు మార్గంబు ♦ మాకు లేదు. 289

సీ॥ ఆర్త రక్షణము చే ♦ యఁగఁబూని మేని కం
డలు చెండి యిచ్చి వి ♦ జ్ఞాన నిధులు!
సత్యంబుకొఱకు యో ♦ షాపుత్రకుల నమ్మి
మాలనిఁ గొలిచిన ♦ మానధనులు!
పితరులకై పూని ♦ క్షితియెల్ల మేలొంద
స్వర్గంగఁ దెచ్చు దీ ♦ క్షా నిరతులు!
జనకాజ్ఞకై పెక్కు ♦ సంవత్సరము లర
ణ్యములఁ గష్టములొందు ♦ విమల యశులు!
గీ॥ భానుకులమునె కాక స ♦ ర్వప్రపంచ
మును యశశ్చంద్రికలఁ బూత ♦ పూయఁ గలిగి!
రట్టి పూర్వుల దొడ్డపే ♦ రగ్గిఁ గలుప
నోర్తునే! ప్రాణములు వీడ ♦ నేర్తుఁగాక. 290

సీ॥ మానసింహా! యభి ♦ మానసింహుఁడవుగా
కగునని యెట్లాడఁ ♦ దగునె నీకు!
నుర్వి యెప్పుడు పుట్టె ♦ నో యప్డె మాభాను
వంశంబు ప్రభవించి ♦ వాసిఁగాంచె!
నెన్ని యుగంబులో! ♦ యెన్ని యుద్ధంబులో!
యుందాఁకఁ దలవంప ♦ కెత్తి నిలిచె!

మావంశనృపతుల ♦ మహిమ నూహించి నేఁ
బరవశత్వమున నై ♦ మఱచుచుందు!
గీ॥ నట్టి విశ్వోన్నతం బైన ♦ యన్వయమున
కకట! యేనీచుఁడైన దు ♦ ర్యశముఁ గూర్పఁ
బూనినను బ్రాణముల కోడఁ ♦ బోవఁ గలఁడె!
వ్రక్కలై శీర్ష మది నేల ♦ వ్రాలుఁగాక, 292

సీ॥ అప్రతిహతముగా ♦ నక్బరొక్కఁడె యేల
క్షితిని దేవుఁడు సృష్టి ♦ సేయలేదు;
వితత ప్రజాకోటి ♦ యతనిచేఁ దనుమాడఁ
బహుటక్కై వుట్టింపఁ ♦ బడఁగ లేదు;
సకల భూపాల క ♦ న్యక లాఘనుని భోగ
పరత కుద్దేశింపఁ ♦ బడఁగలేదు;
ధరణీశులెల్ల నా ♦ తనిఁ జేరి కొలిచి పా
దము లొత్తఁ బుట్టువాం ♦ డంగ లేదు;
గీ॥ తన యొకని రాజ్యతృష్ణకై ♦ ధరణిఁ గలుగు
ప్రజయు స్వాతంత్ర్యమును బాసి ♦ పారతంత్ర్య
మున మునుఁగు టెల్లఁ బాడిగా ♦ దనుచు నక్బ
రెంత యెఱిఁగిన జగమున ♦ కంత మేలు. 293

మ॥ "అకటా! కష్టము! నాకుఁ దోడుపడుమీ;" ♦ యంచొక్కనిన్ వేఁడు పా
తక మే నేరను; మీఁదు మిక్కిలి భవ ♦ త్సాహాయ్యముల్ నాదు కు
త్తుకయున్ బోయెడు నప్పుడైన నడుగన్; ♦ దోర్దార్తిఁ బౌరుష్కు నిం
టికి నిన్నిల్లట పల్లుగా విడిచి, పా ♦ డిన్ దప్పి వర్తింతునే! 294

సీ॥ తెఱవ లఖండ పా ♦ తివ్రత్య బలమున
జ్వలదగ్నిశిఖలఁ జే ♦ వను రహంత్రు!
పురుషులు వీరధ ♦ ర్మ రసావతారులై
వితత ఘోర శతఘ్ని ♦ పిండము లటు
లొక్కొక్క రొకదుర్గ ♦ మోయన నుందురు;
వైరుల దృష్టి మే ♦ వాడ సీమ

చిన్నదై కానుపిం ♦ చినను దుర్భేదమా!
దేశ నైసర్గిక ♦ స్థితులఁ బట్టి
గీ॥ యెంత మేరయు గెలిచిన ♦ నంతెకాని
యంగుళంబైన ముందున ♦ కరుగు టరిది!
శత శతాబ్దముల్ యుద్ధముల్ ♦ జరిపి యైన
నక్బ రథులంబుఁ గొనుట సా ♦ ధ్యంబె కాదు! 294

మ॥ నను నారాజ్యము దూర ముంచి తనస ♦ న్నాహంబు లెచ్చోట్లనై
నను సాగించిన నాకునే మనుచు మా ♦ నం బూనఁగా వచ్చు; నా
ఘనుఁడున్ నాదెసఁ జిన్నిగ్రేవేలోకఁడు ని ♦ క్కన్ బెట్టినన్ మాటలన్
బని యేమున్నది! దేశమున్ బ్రళయ మొం ♦ దన్ జేతు నిక్కంబుగన్ 295

క॥ విమతుల ఖడ్గము హృదయా
బ్జముఁ జొచ్చునుగాక! యచటి ♦ స్వాతంత్ర్యపు బీ
జముఁ జంపుట మాత్రి మసా
ధ్యము; నెఱవేఱదు జగంబు ♦ తల క్రిందైనన్! 296

మ॥ పుడిసెం డూపిరి మేన నున్నవఱకున్ ♦ బోరాడి యీయాత్రలోవ నే
నడతున్; గాదని యాకసం బురలుచున్ ♦ నాశక్తికిన్ మీఱు న
ప్పుడు ఢిల్లీపురిఁజేరి యక్బరు సభా ♦ భూమిన్ బ్రవేశించి కే
ల్మోడుతున్ బొమ్మిక; నంతదాఁకను వినన్ ♦ బో నేరి సందేశమున్." 297

గీ॥ అనుచు గంభీరముద్ర యా ♦ స్యమునఁ దొలక
రింపఁగా నుండె నంతలోఁ ♦ గృష్ణసింహుఁ
డాత్మ భావ మించుక తెలి ♦ యంగఁజేయ
మానసింహుని వదన ప ♦ ద్మమును గాంచి, 298

—॥ పలుంబ్రా కృష్ణసింహుఁడు మానసింహు నధిక్షేపించుట. ॥—

సీ॥ "సాటిరాజుల భుజా ♦ శౌర్యవంతుఁడవు! ధై
ర్యబలంబు సాహసం ♦ బలరు ప్రోఁడ!
వఖిలదేశమ్ము దా ♦ స్యాంధ కారమ్మునఁ
బడి దుర్గతుల మున్గి ♦ చెడెడు వేళ

భుజమిచ్చి లేపక ♦ మొగలురాజులఁ జేరి
సేవించుచుంటకై ♦ సిగ్గు పడక
తగుదు ననుచు వచ్చి ♦ ధర్మదేవత వంటి
యిమ్మహాప్రభు సము ♦ ఖమ్మునందుఁ

గీ॥ బిర్కికి మందు పోయఁగ నిట్లు ♦ పెనఁగుచుంటి!
వారా! యిన్నాళ్లు బ్రదికి నీ ♦ నీరసోక్తు
లాలకింపఁగ నయ్యెఁగా ♦ యనుచుఁ జింత
హెచ్చె! నేమందు! నీభాగ్య ♦ మిట్టు లుండె. 299

సీ॥ నవ నిబంధనముల ♦ నవల నుంచుదు వంట;
చీఁకటిలో సంధి ♦ చేతు వంట;
యక్బరుచెవి నేమొ ♦ యూదఁగా వలె నంట;
నెవరిని బ్రదికింప ♦ నిన్ని పాట్లు!
టాటోటు విద్దెలు ♦ బూటకం బీమహా
విభుఁ డొప్పు ననియె భా ♦ వించినావె!
మాయ యెఱుంగని ♦ మహనీయులకు రహ
స్యములతో నెపుడైన ♦ నవసరంబె!

గీ॥ కనులు కర్ణంబు లోకవేయు ♦ గలిగి జగము
నిండి యుండెడు దేవుండు ♦ నిజ మెఱుఁగఁడె!
ధర్మ తత్త్వైక మూర్తి! ప్ర ♦ తాపుఁ డేడ!
జగము లన్నియు రోయు నీ ♦ సంధి యేడ! 300

గీ॥ యవనుల పదంబుఁ గొలిచి వి ♦ య్యంబు వలచి
కుశ మహారాజు కుల కీర్తి ♦ గుంటఁ గలిపి
చెడుప వచ్చితె మమ్ముఁ! దాఁ ♦ జెడ్డ కోతి
వనము నంతయుఁ జెఱచు నా ♦ భంగి దోఁప. 301

క॥ ఉరగమును వృశ్చికమ్మును
గరళ-క్రూరములు; పాము ♦ కన్నను మేలం
దురు తేలు; నిన్నుఁ గన న
క్బరు మేలనవచ్చు స్వకుల ♦ వర్ధనుఁ డౌటన్. 302

శా॥ పావిత్ర్యంబున కాటపట్టు! పరిశు ♦ భ్రంబైన సత్కీర్తికిన్
దా! వాసత్యము నూతకోల! యగు నీ ♦ ధర్మాత్మతో నూఱులున్
వేవే లక్ష్యరులైనఁ దూఁగుదు రొకో! ♦ నీ కేటికీ వెఱ్ఱి! కా,
శీ విశ్వేశ్వరుఁ డొక్కఁడే సవతుగాఁ ♦ జెప్పంగఁ బోలున్ జుమీ! 304

మ॥ లవమున్ నీదగు బోధ మొప్పఁడన నే ♦ లా! యేకలింగేశుఁ 'డి
య్యవనీచక్ర సమగ్ర రాజ్యమును నీ ♦ కర్పింతు నన్నార్చి య
య్యవనాధీశ్వరు మైత్రిచేయు'మనఁగా ♦ నానంచనన్ బోఁడు; మా
నవుఁడీ ధైర్యసురాద్రి వట్టునల మా ♦ న్పన్ నేర్చునే యెవ్వఁడున్. 305

మ॥ సకల స్థావర జంగ మాత్మక మహీ ♦ చక్రంబునన్ సత్య ధ
ర్మకళల్ సించు ప్రతాపసింహ విభుఁ! డీ ♦ రాజర్షి కాలుంచు పా
దుకలున్ మోయఁగ యోగ్యతల్ మనకు నెం ♦ దున్ గల్గునే!యట్టి వా
నికి ధర్మంబులు నేర్పఁజాలుదు మొకో! ♦ నీవున్ మఱిన్ నేనునున్. 306

చ॥ కరఁగిన లక్కపైన నదు ♦ కన్గల ముద్రిక వోలె మాకు నం
దఱకు మనోంబుజంబులఁ బ్ర ♦ తాపుఁడు తాండనమాడు; నీతఁ డొ
క్కఁగఁడని యెంచెనే యొకొ యె ♦ గల్పతి; యిర్వది రెండు వేల యు
ద్ధురఖలులుందు మించుకయుఁ ♦ దొట్రిలఁబోని శతఘ్నులున్ బలెన్. 307

మ॥ కర ముద్రేకముతోఁ దరంగతతు లా ♦ కాశంబునున్ సోఁక సా
గర మధ్యంబున శీర్ష మెత్తి లవమున్ ♦ గంపింపఁగాఁ బోని దు
ర్భర భీతిప్రద గండశైలము వలెన్ ♦ రాణా ప్రతాపేంద్రుఁ డ
క్బరు సేనాంబుధి చుట్టినప్డు నిలువం ♦ గా నేర్చు శౌర్యోగ్రుఁడై! 308

మ॥ ధరణిన్ గల్గిన రాజు లందఱు బళా ♦ దత్య ప్రభారేఖ న
క్బరు దుస్సాధుఁడటందు; రీశ్వర కటా ♦ క్షంబున్న నాస్వామి యె
డ్కరుఁ డన్యానిదిఁ బట్టి గావుగొను; భూ ♦ కంపంబు దుర్వార భూ
ధరమున్ జెప్పయు మూయు లోపలనె పా ♦ తాళంబునన్ దింపదే!309

మ॥ ఘనుఁ డయ్యక్బరు మాట యేమిటికి; న ♦ క్బర్. వానిసేనల్, స్వదే
శస్నృపాలుర్, మఱి భారతక్షితియు, వి ♦ శ్వంబెల్ల బైనెత్తి వ
చ్చినఁ దానొక్కఁడనంచుఁ గొంచెమయినన్ ♦ జింతింపఁ! డువ్వేత్తుగా
గొనిజృంభించిరసాతలంబునకుఁను ♦ గ్గున్ నూకఁగాఁదొక్కెడున్. 310

మ॥ కనులన్ మూసియు నూఱకుండినను మే ♦ లన్నన్! ప్రతాపప్రభం
జనుఁడన్ రేఁగిన సర్వ వస్తుతతులున్ ♦ శైలంబులున్ భారతా
వనియున్ సప్తసముద్రముల్ చెదిరి స ♦ ర్వం బేకమై చూర్ణమై
చనుఁ నీయక్బరు నెచ్చటన్ వెదకెదో ♦ సందేహ! మూనిరాఁదటన్. 310

మ॥ రవి యస్త్రాద్రిని మొల్చుఁగా! కఖల పా ♦ రావారముల్ కుంగుఁగా!
కవనీ చక్రము వ్రీలుఁగాక! చెడుఁగా ♦ కాకాశ! మయ్యుగ్ర భై
రవుఁడై విశ్వముఁ గాల్చుఁగాని! లవమున్ ♦ రాణాప్రతాపుండు గౌ
రవమున్ గోల్పడి మర్త్యమాత్రునకు శీ ♦ ర్షంబొగ్గఁ డెప్పట్టునన్! 311

గీ॥ పెద్ద పిన్న మర్యాదల ♦ విధము తెలిసి
యభ్యుదయము గోరెడు వాని ♦ కత్యవసర!
మట్టి తొందర పడకు''మ ♦ టంచుఁ దెలిపి
యాప్రతాపాధినాథు నా ♦ స్యంబుఁ జూచి, 312

సీ॥ "వసుమతీదేవి కీ ♦ శ్వరుఁ డిచ్చు మణిభూష
లగుఁచు బుష్పము లుండు ♦ నంతదాఁక!
క్షణమైన విడక జ ♦ త్ప్రాణుఁడును జగ
త్ప్రాణ మగుచు నుండు ♦ నంతదాఁక!
సమరసన్నుతము స ♦ త్యంబు చిరస్థాయి
యై లోకమున నుండు ♦ నంతదాఁక!
స్వాతంత్ర్యధర్మ శ ♦ బ్దము ధీరహృదయాభ్ర
మందు మ్రోయుచునుండు ♦ నంతదాఁక!

గీ॥ నో ప్రభూ! నీమహార్ఘగు ♦ ణోజ్జ్వలతయు
భావపరిశుభ్రతయు సత్య ♦ వైభవంబు
ధర్మ సంత్రాణకీర్తి యీ ♦ ధరణి నిండి
యారవి సుధాకరం బౌచు ♦ నలరుఁగాక." 314

గీ॥ అని పలుకునంత నొక్క సే ♦ నాధినాథుఁ
డరుగుదెంచి "జగద్గురూ! ♦ యారగింప
వేళ యయ్యె'' నటంచని ♦ విన్నవించి
నిలువ, నందఱు లేచి లో ♦ పలికిఁ జనిరి. 315

మ॥ కనులన్ మూసియు నూఱకుండినను మే ♦ ల్గల్గున్! బ్రతాపప్రభం
జనుఁడున్ రేఁగిన సర్వవస్తుతతులున్ ♦ శైలంబులున్ భారతా
వనియున్ సప్తసముద్రముల్ చెదిరి స ♦ ర్వం బేకమై చూర్ణమై
చను; నీయక్బరు నెచ్చటన్ వెదకెదో ♦ సందేహ! మామీఁదటన్. 310

మ॥ రవి యస్తాద్రిని మొల్చుఁగా! కఖిల పా ♦ రావారముల్ క్రుంగుఁగా!
కవనీ చక్రము వ్రీలుఁగాక! చెడుఁగా ♦ కాకాశ! మయ్యుగ్ర భై
రవుఁడై విశ్వముఁ గాల్చుఁగాని! లవముల్ ♦ రాణాప్రతాపుండు గౌ
రవముల్ గోల్పడి మర్త్యమాత్రునకు శీ ♦ ర్షంబొగ్గఁ జెప్పట్టునే! 311

గీ॥ పెద్ద పిన్న మర్యాదల ♦ విధము తెలుఁగు
టభ్యుదయము గోరెడు వాని ♦ కత్యవసర!
మట్టి తొందర పడకు''మ ♦ టంచుఁ దెలిపి
యాప్రతాపాధినాథు నా ♦ స్యంబుఁ జూచి, 312

సీ॥ “వసుమతీదేవి కీ ♦ శ్వరుఁ డిచ్చు మణిభూష
లగుఁచు బుష్పము లుండు ♦ నంతదాఁక!
తృణమైన విడక జ ♦ త్ప్రాణుఁడును జగ
త్ప్రాణ మగుచు నుండు ♦ నంతదాఁక!
సమరసన్నుతము స ♦ త్యంబు చిరస్థాయి
యై లోకమున నుండు ♦ నంతదాఁక!
స్వాతంత్ర్యధర్మ శ ♦ బ్దము ధీరహృదయాభ్ర
మందు మ్రోయుచునుండు ♦ నంతదాఁక!

గీ॥ నో ప్రభూ! నీమహార్ఘగు ♦ ణోజ్జ్వలతయు
భావపరిశుభ్రతయు సత్య ♦ వైభవంబు
ధర్మ సంత్రాణకీర్తి యీ ♦ ధరణి నిండి
యారవి సుధాకరం బౌచు ♦ నలరుఁగాక.” 313

గీ॥ అని పలుకునంత నొక్క సే ♦ నాధినాథుఁ
డరుగుదెంచి “జగద్గురూ! ♦ యారగింప
వేళ యయ్యె” నటంచని ♦ విన్నవించి
పిలువ, నందఱు లేచి లో ♦ పలికిఁ జనిరి. 314

గీ॥ పఙ్క్తిభోజన మది తప్పు ♦ వలయురీతిఁ
గోటి మర్యాదలను గూర్తుఁ! ♦ గొదువ గలుగ!
దయ్య! భటులును నీవు విం ♦ దారగించి
చల్లఁగాఁ బొందు రేపు మీ ♦ ఢిల్లి పురికి" 318

మ॥ అనుచున్ బల్కినఁ దోఁక ద్రొక్కిన భుజం ♦ గాధీశు మర్యాద బో
రన శృంగంబులు భంగమై చనిన గో ♦ రాజంబు చందంబునన్
గినుకన్ దాల్చుచు మానసింహుఁ "డరరే ♦ నీయున్నతిన్ బెంపు సే
యనె తౌరుష్కనరేంద్రబాంధవము చే ♦ యన్ గల్గె నాబోంట్లకున్. 319

ఉ॥ నేఁడును నక్బరీశ్వరుని ♦ నేను భరంపడి నిల్పకున్న న
వ్వాఁడు ప్రచండ వారినిధి ♦ భంగములో యవన సేన లంపి మే
వాడ రసాతలంబునకుఁ ♦ బంపుచు నిన్నును బట్టి తున్మి తూ
టాడక పోయియుండఁ! డిపు ♦ డైనను గండము తప్పి పోయెనే! 320

మ॥ తలతో నీపదపద్మముల్ గొలువఁ జెం ♦ తన్ జేరు నన్నున్ మహా
బలదర్పోద్ధతుఁ బంక్తిబాహ్యుఁడనుచున్ ♦ వాక్రుచ్చె! ది క్కైనచో
నిలువన్ నేర్చునొకో భుజద్వయి పయిన్ ♦ నీశీర్షమున్! గన్నులన్
దలకొక్కన్ ఋమి! నీదు గర్వమును డిం ♦ దన్ జేతు నేకత్రుటిన్. 321

గీ॥ తెగియె నేటి కిర్వురను బం ♦ ధించి యున్న
స్వామి భృత్య ధర్మము! లాహ ♦ వములు పెంచి
నిలువ నీడ లేకుండ గు ♦ ట్టలఁ జరింపఁ
జేయ లేకున్న నను మాన ♦ సింహుఁ డనకు.' 322

సీ॥ అని కోపమునఁ బల్క ♦ నాప్రతాపమహీంద్రుఁ
"డీ నిష్ఠురోక్తుల ♦ నేమి లాభ!
మున్న మాటాడిన ♦ నులుకు నొందెద వేల!
యిట నీకుఁ బరిభవ ♦ మేమి గలిగె!
నేనయి నినుఁబిల్చి ♦ యిటు చేసియున్న లో
పంబెల్ల నానెత్తి ♦ పయిన నుండు!
నీవె వచ్చితివి! సం ♦ భావించి దర్శనం
బిచ్చితి! భేదమిం ♦ తేని లేక

గీ॥ చేయఁ దగిన మర్యాదలు ♦ చేసి యుంటిఁ!
బూర్వ నియమానుసారము ♦ భోజనమును
విడిచితిని; వేఱు గతిని భా ♦ వించి కినుకఁ
జెంది యేమేమొ పలుకఁజా ♦ చ్చితివి నీవు. 323

సీ॥ నేను గోపంబు నొందను! ♦ గాని మాన
సింహు రణమందు సంధించి ♦ చేయి చేయి
గలిపి బలము తూఁచుకొనంగఁ ♦ గలిగె నేని
యదియ పదివే లటంచు స ♦ మ్మదముఁ గాంతు'' 324

మ॥ అని మందస్మితరోచులన్ వెఱపఁగా ♦ నయ్యంబరీశుండు "నీ
వనియున్నంతకు నాదునామము జపిం ♦ పన్ జేసి రే నిద్రయున్
దినమం దన్నము బుద్ధికిన్ లవము శాం ♦ తిన్ గల్గఁగానీక నే
బెను కష్టంబులు పెంచి డీల్పఱచి నిన్ ♦ వెన్నంటి వేఁటాడెదన్." 325

మ॥ అని శేషాహి విధాన రోఁజుచు నమ ♦ ర్షావేశుఁడై యున్న దే
వుని ప్రీత్యర్థముగాఁగ నైదు. మెదుకుల్ ♦ బోసేసి చేగద్ది ప్రో
లనె నిల్చుండిన యాత్మసైనికుల నె ♦ ల్లన్ శీఘ్రమే లేచి రం
డని తానానతి యిచ్చి వచ్చి జవనా ♦ శ్వారూఢుఁ డయ్యెన్ వడిన్ 326

మ॥ పరమోల్లాస హృదంతరుండగు నలుం ♦ బ్రాస్వామి "యోయంబరీ
శ్వర! నీమాట యటుండనీ; నగరిలో ♦ వర్తించు నీబావ న
శ్వరు నివెంటనె తేవలెన్! మఱచిపో ♦ వన్ రా''దటంచాడ నం
దఱు నొక్కుమ్మడిఁ జప్పటల్ చఱచి రు ♦ త్సాహమ్ము దైవారఁగన్ 327

గీ॥ మండిపడి వెన్కచూచి యం ♦ బరు విభుండు
"భవునికడ నున్న బసవన్న ♦ వలెఁ బ్రతాపుఁ
గొలిచి తలయూఁప మఱఁగిన ♦ పలుకుబండ!
నిన్ను లక్ష్యపెట్టుదునె! నే ♦ నెన్నఁడైన. 328

క॥ కనుఁగొందువు లే నీగతి"
యనుచు నెలుంగెత్తి పలికి ♦ యాత్మీయ దళం
బును గొంచు ఢిల్లి దెసకై
చనె మదిఁ గార్యమ్ము నిసు ♦ సందడి గొనఁగన్! 329

మ॥ అవన్నిదేవులఁ బిల్చి పంచుచును బ ♦ ణ్యాహమ్ము చేయించి ప్రో
ల వెలుంగొందు నదీజలంబుల సచే ♦ లస్నానముల్ చేసి పూ
జ్యవిధానమ్మునఁ బంచగవ్యమును బ్రా ♦ యశ్చిత్తముల్ బొంది శు
ద్ధ్యుక్తవమై నందఱు పోయి చేరుకొని రా ♦ 'కుంభల్ మియన్' దుర్గముల్.

గద్య:— ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత రసవ త్కావ్య నిర్మాణ చాతురీధురీణ, సుగుణగణపారీణ, దుర్భాకవంశ దుగ్ధాంభోరాశి రాకాకైరవమిత్ర, శాలంకాయనగోత్ర పవిత్ర, సుజన జనానుగ్రహపాత్ర, వేంకటరామార్యపుత్ర, కవిసార్వభౌమ సాక్షా ద్వీర ప్రతాపాది వింశత్యధిక బిరుదవిఖ్యాత, సుకవి రాజశేఖర, రాజ శేఖరకవి ప్రణీతంబయిన "రాణా ప్రతాపసింహ చరిత్రం"బను పద్య కావ్యమునందుఁ ద్వితీయా శ్వాసము.



శ్రీ

కామేశ్వర్యై నమః

# రాణాప్రతాపసింహ చరిత్ర.

## తృతీయాశ్వాసము.



మ॥ జలపూరంబడుగంటి కూపములు కా ♦ సారంబులున్ వ్రీలి సం
దులఁ బాతాళము లోఁతు చూప; ధరయున్ ♦ దుర్వార ఘోరాగ్నిమం
డలమై మండుచుఁ బేలగింజ వలెఁ బె ♦ ట్లన్ జంతు జాలంబు శో
షిల గ్రీష్మంబది నిప్పులన్ జెఱఁగి. డా ♦ సెన్ సర్వమున్ గాల్చుచున్ 1

—॥ అక్బరు సార్వభౌముఁడు మేవాడపైఁ దన సైన్యముల నంపుట. ॥—

సీ॥ స్థిరవైరి యముఁడనన్ ♦ జెల్లు తోడరమల్లు!
రణ మర్మము లెఱుంగు ♦ రాయసింగు!
చండారి విపినాన ♦ లుండు వీరబలుండు!
పరిబలకీర్తిని దేలు ♦ రాయశీలుఁ!
డుల్లాసమతియు న ♦ బ్దుల్లా చమూపతి!
పౌరుషంబూను షా ♦ బాజుఖానుఁ!
డభిమానసంధానుఁ ♦ డబ్దూరు రహిమానుఁ!
డసమ శౌర్య నిధానుఁ ♦ డసపుఖాను!
గీ॥ మఱియు ఖాసిముఖాన్ ముఖుల్ ♦ మహిత శౌర్య
రేఖ ముల్లోకములఁ జప్పు ♦ రింపఁ గలుగు
యవన నరపాలవాహి సై ♦ న్యాధినాథు
లేక ముఖమునఁ గదలి దం ♦ డెత్తి రపుడు, 2

మ॥ అరి సంత్రాసకరోగ్ర సత్వ యుతమై ♦ హారావళి పర్వతాం
తరమందున్ జెలరేఁగుచున్ జగమునం ♦ తన్ గాల్చు స్వీయాగ్ర సో

దర శౌర్యప్రబలాగ్ని నార్పఁగ మహా ♦ ధారాధర స్ఫూర్తి సా
గరసూ క్తద్వితయంబు లేచెను దు♦ రుష్కశ్రేణి మే ల్మో లనన్. ౩

సీ॥ యువరాజమణి సలీ ♦ మొక మదించిన కొమ్ము
టంబారి యేన్గుపై ♦ నధివసించె!
నతి విక్రమోద్భాసి ♦ యగు మానసింహుండు
యవనదేశ మహోన్న ♦ తాశ్వ మెక్కె!
శతనిశో నిర్వది ♦ నైదు వే లాశ్వికుల్
గదలి! దుర్వార గడ ♦ గడవడంకె!
నక్బరు సర్వసే ♦ నాధిపత్యము భార
మంబరేశ్వరు శిర ♦ మందు మోపె!

గీ॥ జలనిధి తరంగములఁ బోలు ♦ సైన్యములును
దత్త దధినాయకులు గూడి ♦ తరలి పోవ
ఢిల్లిపురి జనశూన్యమా ♦ శేవఁ దనరె!
నరిగి యంద 'అంబరు' దాటి ♦ రతి రయమున. 4

గీ॥ మండలగృహంబను పురంబు ♦ దాఁడఁ గనును
కరిగి హారావళీ పర్వ ♦ తాంతరమున
లోయలఁ బడి పయనంబు ♦ చేయ సాఁగి
రతి భయంకర విపిన మ ♦ ధ్యంబుఁ జొచ్చి. 5

—॥ హాల్డిఘాటు కనుమ వర్ణనము. ॥—

సీ॥ హారావళీ పర్వ ♦ తాంత ముత్తరము 'కుం
భల్ మియర్,' దక్షిణ ♦ పార్శ్వ మందు
రుక్ననాథమ్ము, తూ ♦ రుపు సతుల్లా, పశ్చి
మము మేరుపురము, లీ ♦ మధ్యసీమఁ
బాడ వెనుబది మైళ్లు ♦ వెడలు పెన్బది మైళ్లు
గలుగు హాల్డిఘాటు ♦ కనుమ తావు!
పాషాణములతోఁ బ్ర ♦ పాత సంతతులతో
లతలతో నిబిడ గు ♦ ల్మములతోడఁ

సీ. బోదలతో గండశిలలతో • నదుల తోడఁ
గంటకమ్ముల తోడ వృ • క్షముల తోడఁ
నీఁగ కైనను జొరఁగ సం • దీయ నట్టి
భీకరారణ్య శైలదు • ర్భేద తలము. 6

సీ. కుండలీంద్రుఁడు చుట్టు • కొని పండెనోయన
వలగొనియున్న ప • ర్వతపుఁబంక్తి!
నిలువుగా నఱకిన • ట్టులు ప్రాకఁగారాక
చక్కఁగా నిలుచు పా • షాణసమితి!
ప్రకృతి నైసర్గిక • భంగిఁ బొల్పుగ నిల్పె
కొండపేటులమీఁది • కోటగములు!
మలిచి కొలిచియుంచు • మాదిరినై యేట
వాలగు పర్వత • పార్శ్వములును!

సీ. శకటములు రెండు సుళువుగాఁ • జనుటకైన
నను వొసఁగనట్టి యొకచిన్న • కనుమ గలిగి
యల సురాసురులకుఁ జొర • నలవి గాని
కఠిన తలము 'హాల్దీఘాటు' • కనుమ సీమ! 7

ఉ. ముందుగ మ్రోఁగు దుందుభుల • మోతలు నిల్పుచు సైన్యకోటి నం
దందును నిల్పఁజేయుచు ర • యంబునఁ దా నొకచోటఁ జేరి య
య్యందఱ వాహినీపతుల • నచ్చటఁ జేరిచి మంతనంబు చె
ల్వొందగ మానసింహ విభుఁ • డాదర మేదుర చిత్తమేర్పడన్. 8

- మానసింహుఁడను చరులను హాల్దీఘాటు కనుమఁ జొర నియోగించుట -

సీ. "ఇఁక దుర్గమము మార్గ; • మిా మీఁదటి ప్రయాణ
మతి కష్టతరము; భ • యాస్పదంబు;
గంటకుఁ దక్కువ • గాఁ బ్రొద్దు నిలిచెఁ "గుం
భల్మియ' రిటకు ని • ర్వదియు మైళ్లు
గలదు! హాల్దీఘాటు • కనుమ కట్టెదురఁ గ
న్పడి మృత్యు ముఖమట్లు • భయముఁ గొలిపె!

మెలమెల్లఁ జీఁకటుల్ ♦ మొలుచు వేళకునైనఁ
గనుమ నెట్టులొ దాఁటి ♦ చనెద మేని
గీ॥ యర్థరాత్రము కుంభలేమి ♦ యరును జేరఁ
గలము! జయమొందఁగల! మటు ♦ గాక రిపులు
మనకు ముందుగఁ గనుమ దూ ♦ రినముఁ బిదప
నంగుళంబైన ముందున ♦ కరుగు టరిది. 9

సీ॥ ఈగిరులెల్ల రా ♦ ణాగారికి సమీప;
మెపు డెందు దూఁకునో ♦ యెఱుఁగరాదు;
మనగాలి సుంత సోఁ ♦ కినను సింహంబుల
వంటి శిశోదియా ♦ భటులు గొలువ
నీనిన పులి యట్లు ♦ లెగిరి పైవ్రాలుః నా
తని నోర్వ నుదుట నే ♦ త్రమ్ము గలుగు
నా గజాసురవైరి ♦ కైన దుర్భర; మెంత
యప్రమత్తులమైన ♦ నంత మేలు;
గీ॥ కాన వాద్యంబు లెల్లను ♦ గట్టి పెట్టి
పెదవి గదలింపకయె మాన ♦ విధి వహించి
వడివడిగ దాటి కనుమ వెం ♦ బడిని సాఁగి
యవలఁ జేరంగవలయు నే ♦ ర్పతిశయిల్ల." 10

మ॥ అనుచున్ నల్వురు నల్వురై నిలువ సై ♦ న్యం బంతయున్ దీర్చి యీ
వని సంద్రంబున కేత మెత్తు టనుచున్ ♦ భావించియున్ మానసిం
హాన్నృపాలుండు ప్రతాపునిన్ గెలుచు న ♦ త్యాశా బలాకృష్టుఁడై
చనుఁడం చాజ్ఞ నొసంగె ముందునకుఁ ద ♦ త్సైన్యాధిపుల్ భీతిలన్ 11

—॥ సలుంబ్రా కృష్ణసింహుఁడు హఠాత్తుగాఁ గనుమ నాక్రమించుట. ॥—

సీ॥ కడ గానరాని దీ ♦ ర్ఘ శరీరమున మహా
రగము నికుంజ గ ♦ ర్భంబు వెడలి
వంకరగా సాఁగి ♦ పైకిఁ బ్రాకెడు రీతి
యవన సేనా దండ ♦ మల్ల నల్లఁ

గదలి పాక్ష్మీఘాటు ♦ కనుమ డాయుచు నందు
మొదటి నల్వురు కాలు ♦ మోపు నంతఁ,
బిడుగుల చప్పుడై ♦ లైడ రేఁగ మూఁడువే
లాశ్వికోత్తములు త ♦ న్ననుసరింపఁ
గీ॥ దటము లెక్కతట్టుకొని మహా ♦ ధ్ధతిని దూఁకు
పరమ గంభీర గంగా ప్ర ♦ వాహ ఘాటి
నాకనుమఁ దూఱి యాద్యంత ♦ మలమి నిలిచె
సింహమటు సలుంబ్రాకృష్ణ ♦ సింహ విభుఁడు! 12

చ॥ అనుపమ వాయువేగమున ♦ నద్రి ప్రతిధ్వను లీన నుద్ధతిన్
గనుమ మొగంబు చొచ్చుకొని ♦ కట్టెదురన్ లయకాల రుద్రుఁడో
యనఁ బయిదూఁకు కృష్ణవిభు ♦ నా మొగలుల్ గని భీతిఁ గ్రుంగుచున్
వెచుకకు మ్రొగ్గి రగ్గురుఁడు ♦ నిన్ గని తగ్గు నహిం బ్రజం బనన్. 13

—॥ యవనసైన్యంబులు రాత్రికి దండు విడియుట. ॥—

మ॥ సమయం బెంతయుఁ బ్రాతికూల్యము వహిం ♦ చన్ గట్టునన్ జిక్కి తా
లిమివాఁ డోఁడెను నాదిశేషునలె ని ♦ ల్చెన్ మానసింహుండు వై
రము సాధించెద నంచుః నంతఁ జతుర ♦ శ్రే వ్యూహమున్ బన్ని ప
శ్చిమ దిఙ్న్యస్త ముఖంబుతోడ వసియిం ♦ చెన్ బాదుసాసైన్యముల్ 14

మ॥ బలుసింగంపుఁ గడాని కేతనము శో ♦ భల్ నల్దెసల్ నిండు గ్రొం
జిలుఁగున్ బట్టు జిరా గుడారమున ని ♦ ల్చెన్ దా జహంగీరు; ముం
గలిప్రక్కన్ నును పంచవన్నియ పతా ♦ కల్గులుక్ గ్రొమ్మించు చ
ల్వల డేరాకడ మానసింహుఁడు వసిం ♦ పన్బోయె నారాత్రికిన్. 15

క॥ ఇరువుర గుడారముల నలు
తెఱగుల యువరాజు నింటి ♦ తెరవలు గణికల్
మఱి కవులు గాయకులు విడి
సిరి తత్తద్దత్త రుచిర ♦ శిబిరము లందున్. 16

క॥ నలుదెసల సీగుడారం
బుల చుట్టును మానసింహ ♦ భూవరు నంబర్

# హల్దీఘాటు కనుమ

[ నాలుగు గజముల వెడలుపు ]

ఉ

తోడరమల్లు

| 2500 పిరంగులు | అసఫ్ఖాను 25000 అశ్వికులు | సూక్తుడు-సాగరుడు 50000 అశ్వికులు | ఖాసింఖాను 25000 అశ్వికులు | 2500 పిరంగులు |
|---|---|---|---|---|

రాయసింహుడు 50000 కాల్వురు

పృథ్వీరాజు 50000 కాల్వురు

పాకశాలలు, గోశాలలు

ధనధాన్యశాలలు

25000 భటులు

రాణివాసము

మూలబలము

గాయకులు

జహాంగీరు

కున్వార్ మానసింహుడు

[illegible]

కవులు

కున్వార్ మానసింహుని

వైద్యశాలలు, అంగళ్లు

రాయశీలుడు జయమల్లుడు 50000 తుపాకి ఫౌజులు

అబ్దుల్లా 50000 కాల్వురు

వేశ్యలు

అంబరదేశము

మద్యశాలలు

| 2500 వారణ బలము | అబ్దారు రహిమాను 50000 కాల్వురు | వీరబలుడు 50000 కాల్వురు | 2500 వారణ బలము |
|---|---|---|---|

ద

బల మిరువదియై దగు వే
లలరారె నరాతివిక్ర ♦ మాపహ లీలన్. 17

మ॥ అలసైన్యంబులచుట్టు వీథులను జే ♦ యన్ బంచి పానీయశా
లలు గోశాలలు నాఁటి ధాన్య ధనశా ♦ లల్ చేర్చి సద్వైద్య శా
లలు నెక్కాల్పియుఁ బెక్కులంగడులు ని ♦ ల్పన్ జేయుచున్ మద్య శా
లలు స్థాపింపఁగ గొప్ప పట్టణము లీ ♦ లన్ గ్రాలెఁ జోటంతయున్. 18

క॥ ఈవీథుల వెలి వరుసను
యావనపాదాతిదళము ♦ లాశ్వికులును దం
తావళసమితి పిరంగుల
ప్రోవులు నందంద భీతి ♦ పొడమఁగ నిలిపెన్. 19

సీ॥ మొనసి హాల్డిస్టాటు ♦ కనుమకు నెదుర యా
వనచమూ పశ్చిమ ♦ పార్శ్వమెల్ల
ముగురు సేనాధీశ ♦ ముఖ్యు లయ్యెడఁ బంచు
కొని వారివారి యు ♦ క్కువల నుండి;
రవ్వాదిలో మధ్య ♦ మందున నేఁబది
వేల యాశ్వికులు సే ♦ వించుచుండఁ
బరిభూతి యెట్టిదో ♦ నెఱుఁగని విక్రమ
మహితుండు తోడర ♦ మల్లు నిలిచె;
గీ॥ ఘనుఁ డసఫ్ ఖాను ఖాసిము ♦ ఖాను ప్రబల
బాహుబలు లొక్కరొక్క రి ♦ ర్వదియు నైదు
వేల యాశ్వికుల్ గొలువ న ♦ వ్వీరవర్యు
లుభయ పార్శ్వదళంబుల ♦ నుండి రపుడు. 20

మ॥ అదయాక్రాము దరాతివీరభట శౌ ♦ ర్యాగ్ని చ్ఛటా నాష్టకాం
టుఁడ మబ్దూర్ రహిమాను వీరబలుఁ డా ♦ పూర్ణప్రభారాను లేఁ
బదివేల్ కాల్వురతో నొక్కరుఁడు ప్రా ♦ గ్భాగంబునన్ నిల్చి రా
త్మదళంబుల్ జయనాదముల్ సలుప ను ♦ త్సాహంబు దీపింపఁగన్. 21

మ॥ చలదంభోధి గంభీర ధీర గుణు లా ♦ షాబాజుఖాన్ రాయసిం
హులునున్ దక్షిణమందు; నుత్తరము శౌ ♦ ర్యోదగ్రులై కోరిలు బా

బ్బలులన్ బోలిన రాయశీలుఁడును న ♦ బ్దల్లాయుఁ బౌరుషక్క సే
నల నొక్కొక్కరుఁ దగ్ధలతుఁ గొనుచున్ ♦ దాముండి రాయామొసన్. 22

సీ॥ రాత్రికాలమ్ము గా ♦ త్రివపాహినీ సమూ
హమున కతి సమీప ♦ మగుటఁ జేసి
పడమటి దెసయందు ♦ వాయవ్య నిరృతి కో
ణములఁ బిరంగి తం ♦ డములు నిలిపి
తూరుపు తరులతా ♦ దుర్గ మారణ్యంబు
గానఁ దద్భాగర ♦ క్షణము మదిని
వలచి యీశాన వై శ్వా ♦ నర కోణంబు
లందు వారణ సమూ ♦ హంబు నిలిపి
గీ॥ పనులు పదివేల కనులతో ♦ భద్రపఱచి
మానసింహుఁడు శిబిరంబు ♦ లోని కరిగె;
గాయకుల గేయములు గణి ♦ కా చయముల
యాటలును సాగఁగా జేసె ♦ నాసలీము. 23

—॥ రాజపుత్రసైన్యము లెదిగివచ్చి హల్దిఘాటు కనుమచేరుట ॥—

సీ॥ కల్ప విఖ్యాత సం ♦ కాశ రాఠోడ్వంశ
దీపకుల నడపెఁ ♦ దేజసింహుఁ!
డతులవిక్రములఁ జో ♦ హాణవీరులను గొంచుఁ
బరతెంచె బలియుండు ♦ భానుసింగు!
ఝేలవారా సుభ ♦ టాళుల నడిపించె
సింహశౌర్యుఁడు మన ♦ స్సింహవిభుఁడు!
పులిపిల్లలని శాత్ర ♦ వులు భీతినొందు ఝూ
లాన్వవాయులఁ దెచ్చె ♦ శ్యామసింగు!
గీ॥ హర కులోద్భవులును దేవ ♦ రాన్వయులును
భ్రమర భటులు హారావళీ ♦ పర్వతంబు
ముక్కముక్కలై పడఁ బెడ ♦ బొబ్బలిడుచు
వెడలి రప్పు డిర్వదిరెండు ♦ వేల దొరలు. 24

గీ॥ సకల యవనుల కాల మూ ♦ సన్న మైనఁ
బూని సంయమనికిఁ గొని ♦ పోవ వచ్చు

యముఁ డతని భటుల్ వీరని ♦ యరులు వెఱవ
భిల్ల భటులతో ముందుండె ♦ భీమచాంద. 25

సీ. సర్వ సర్వంసహా ♦ స్వాతంత్ర్య ధర్మ మం
త్రోపదేశ గురూత్త ♦ మోత్తముండు!
నియతేశ్వర ధ్యాన ♦ నియతి బ్రహ్మైక్య సం
ధానంబు నెఱపు నా ♦ నందవార్ధి!
కారణమాత్ర సం ♦ సార మంటియు నంట
కుండు నుత్తమ రాజ ♦ యోగి మౌళి!
సచరాచర ప్రపం ♦ చము నెల్లఁ దనుఁబోలె
సమబుద్ధిఁ జూచు వి ♦ జ్ఞానశాలి!
గీ॥ ధర్మ సంస్థాప నార్థము ♦ ధ్రువము నొందు
దేవతా దివ్య తేజంబు ♦ దీర్ణమూర్తి!
యా ప్రతాపుఁడు "చైతక" ♦ హయము నెక్కి
తరలె నమరులు మెచ్చి యాఁ ♦ దలల నూఁప! 26

సీ॥ రాజపుత్ర భటోత్క ♦ రంబు దొంతరలుగాఁ
గనుమకు రెండు ప్ర ♦ క్కలను జేరెఁ;
ప్రబల శిశోదియా ♦ వంశ్య వీరులతోడ
దానికి నడుమఁ బ్రి ♦ తాపుఁ డుండెఁ;
నతని దక్షిణ పార్శ్వ ♦ మందుఁ జోండావ దవ్వ
రేణ్యులతో నిల్చెఁ ♦ గృష్ణసింహుఁ;
డవ్వలఁ దేజసిం ♦ గాతని చెంత ఝా
ల్వాపతి నిల్చిరి ♦ భటుల తోడ;
గీ॥ నాపప్రితాపుని వలపట ♦ శ్యామసింగు
భానుసింహుండు గ్వాలియర్ ♦ పతియు ధేల
వార భూపతి బేడ్లా—కొ ♦ ఠేరియా న్మ
పాలకులు నిల్చి రహితదు ♦ ర్వార లీల. 27

మ॥ తళుకు స్నిగ్ధఁపు జాళువా కలికి పూఁ ♦ తల్ గుల్కుచుౕ వేయు వె
ల్గులు నల్దిక్కులఁ బిక్కటిల్లఁ బలు ని ♦ గ్గుల్ దేలు బంగారు గ

జ్జెలు వాతాహతి ప్రమోఁతలెత్తఁగఁ జలిం ♦ చెఁ వైరిసైన్యంబు గుం
డెలు ప్రీలంగ రవిధ్వజోత్తమము హా ♦ ల్దీఘాటు సీమోపరిన్. 28

సీ॥ పరిసర భూభృచ్ఛి ♦ ఖర కోటి పైన! ను
గ్రములైన ప్రకృతి దు ♦ ర్గముల పైనఁ;
గడు నెత్తుగానున్న ♦ గండ శిలల పైన!
మధ్య నుండెడు నితం ♦ బముల పైన!
నేటవాలగు కొండ ♦ పేటుల పైనఁ! జెం
గట నున్న గొప్ప వృ ♦ క్షముల పైనఁ!
గ్రింద మీఁదను గల్గు ♦ సందు గొందుల లోన!
గుములురులై తగు నికుం ♦ జముల లోన!
గీ॥ నెందుఁ గనుఁగొనినను నేల ♦ యీని నట్లు
భీమచాందు తో తెచ్చిన ♦ భిల్ల భటులు
సింహనాదంబుతోఁ బోయి ♦ చేరు కొనిరి
పర భయంకర శర ధను ♦ ష్పాణు లగుచు. 29

సీ॥ హైందవాంగనల నా ♦ ట్యము సాఁగె రుచిరమై
రాయశీలుని గుడా ♦ రమ్ము లందు;
నమృత మూరెడు గాన ♦ మలరారె నబ్దూరు
రహిమాను పట కుటీ ♦ రముల యందు;
మొగలు నపుంసకా ♦ పూర్వ నృత్యపు గోల
చెలఁగె వాసఫ్ఖాను ♦ శిబిర మందు;
ద్రాక్షారసంపుఁ బా ♦ త్రలు సల్పె నర్తన
ల్షాబాజుఖాను వే ♦ లముల యందు;
గీ॥ నవల మిగిలిన యవన సే ♦ నాధి పతుల
విడుదలను బ్రొద్దుపోకకై ♦ వెలసె మద్య
పానమును ధూమపానమ్ము ♦ వచ్చి నల్ల
మందు విందులు నందుపై ♦ సందడులును. 30

మ॥ యవనాశ్వంబులు హైందవాశ్వము లసం ♦ ఖ్యాకంబు లొండొంటిఁ జూ
చి విరోధమ్మునఁ గాలు దువ్వి రజనీ ♦ సీమంతినీ కర్ణ రం

ధ్రి విదారంబుగ హేషలన్ సలిపెఁ గాం ♦ తారంబు భేదిల్ల; ని
క్కువలన్ నిల్చుచుఁ గొండకోళ్ల గుములున్ ♦ గూసెన్ విశేషార్భటిన్. 31

మ॥ నగవుల్ వెన్నెల మోము చందురునితో ♦ నాకెంపుఁ బావాలతో
సొగసుల్ జందురుకావి నిద్దపు జిరా ♦ చొక్కాయతోఁ గాంతులన్
బగటిన్ గూర్చు కృపాణితో నటఁ బ్రతా ♦ పస్వామి శైలంబుదం
డ సుధారంబులలోఁ జమూపతులఁ జూ ♦ డన్ బోయె శీఘ్రమ్ముగన్. 32

సీ॥ తల్లి పుత్రకుల నా ♦ దరమునఁ జూచున
ట్లనురాగ పూర్ణుఁడై ♦ యధిపుఁ డరయ
పౌరులందఱు భక్తి ♦ వివశులై "మాదేవుఁ
డిట మమ్ముఁ బ్రోవ ని ♦ ట్లేగుదెంచె!
మందహాస జ్యోత్స్న ♦ లందమై వర్షించు
నీమోము జూచి న ♦ నెల్లలోక
సామ్రాజ్య మిడిన హ ♦ స్తము సోఁక నిత్తుమే!
యీతని పద సేవ ♦ యింద్రభోగ"

గీ॥ మనుచుఁ గన్నులఁ గని హృద ♦ యములఁ దలఁచి
భూవిభుని సద్గుణంబులు ♦ పొగడుచున్న
యంత నుదయ ధరాధర ♦ మందు మొలిచె
వెలుఁగు గములకుఁ బలునిక్కు ♦ వేఁగుఁ జుక్క! 33

మ॥ "కలనాదంబు లొనర్చెఁ బక్షితతి; చు ♦ క్కల్ వీడె వజ్రింపు శో
భలు; ప్రాచీదిశఁ గాంతిపూర మలమెన్; ♦ బ్రాభాత మందానిల
మ్ములు వీతెంచె" నటంచు మంజులరవ ♦ మ్ముల్ మీఱఁ జారుష్యయో
ధులకున్ బాడిరి మేలుకొల్పు లపు డం ♦ తో రక్తులై తాళికుల్. 34

—॥ సూర్యోదయము. ॥—

మ॥ "కులమున్ బ్రోచెడు ధర్మమూర్తులకు నె ♦ గ్గుల్ కల్గరాదీ తుష
ష్కులబారిన్ బడకుండఁ బ్రోచెద" నటం ♦ చున్ వేయి బంగారు చే
తులు పైఁగప్పుచు నాదరించె" ననఁ బ్రా ♦ దుర్భావమున్ బొందె తొ
ల్దొలుతన్ సూర్యుఁడుదోఁచెఁ దూర్పుమలయం ♦ దున్ రాజపుత్రాళికిన్! 35

—॥ ప్రతాపసింహుఁడు సూర్యోపాసనము చేయుట. ॥—

శా॥ "పేరుల్ పోయిన రాజ్యముల్ చెడిన ను ♦ ర్వీఁ దేశదేశ ప్రజా
వారం జేగిన నూత్నజీవ మిడు శో ♦ భారాశివై విశ్వము౦
దారప్రియుఁడవై నభోగతి ననం ♦ త బ్రహ్మకల్పంబుగా
మీఱఁగల్గిన బ్రహ్మమూర్తివి! నినుఁ ♦ జేర్కొందు ఛాయాధిపా! 36

సీ॥ నగరమందలి ప్రధా ♦ న ద్వార మెల్లప్డు
సూర్య మహాద్వార ♦ శోభఁ గాంచు!
మాహాత్మ్యమున రాజ ♦ మణులు కొలువుండు భా
గము సూర్యభవన వి ♦ ఖ్యాతిఁ గాంచు!
జనులకు నృపులు ద ♦ ర్శన మిచ్చు పైమేడ
సూర్య శిఖర మంచు ♦ స్తుతి వహించు!
సింహాసనము వెన్కఁ ♦ జికిలి బంగరు మేటి
సూర్యబింబము మూర్తి ♦ సొబగు నొందు!
గీ॥ ధ్వజములు సితాతపత్రముల్ ♦ తనరు నీదు
పేరనే; నిన్ను మించిన ♦ వేల్పు లేఁడు;
తలఁపులను గదలికలను ♦ బలుకులందు
నీ వెపుడు గోచరించుచుం ♦ డెదవు మాకు. 37

మ॥ జననం బందినవాఁడ నీకులమునఁ! ♦ స్వాతంత్ర్య ధర్మంబు ని
ల్పను గాంక్షించితి; నేఁడు వైరుల నద ♦ ల్పఁగ నూల్ప యత్నింతు; నీ
మునిమన్నంద మదీయ గౌరవ యశం ♦ బుల్ నిల్వ దీవింపుమీ"
యని ప్రార్థించెఁ బ్రతాపుఁ డర్యముని భ ♦ క్త్యావేశ ముప్పొంగఁగఁ 38

ఉ॥ ఆపయి నేకలింగవిభు ♦ నవ్వలఁ బర్వత సార్వభౌము పు
త్రి పదపద్మ యుగ్మము మ ♦ దిఁ గడుభక్తి భజించి ధర్మశీ
లోపరులైన పూర్వనృప ♦ సత్తములఁ దలఁచెఁ బ్రతాపుఁ డెం
తో పరిశుద్ధమౌ హృదయ ♦ తోయరుహంబున భక్తిఁ బెంచుచుఁ. 39

సీ॥ పదపడి దుందుభి ♦ ధ్వానంబు చెలరేఁగె;
రాజపుత్రులు తను ♦ త్రాణములను

ధరియించి దీర్ఘకుం ♦ తములు ఖడ్గములు హ
స్తములఁ దాలిచి, శిర ♦ స్త్రాణములను
వహియించి యున్నతా ♦ శ్వము లెక్కి, భండనో
చిత మండనములు రం ♦ జిల్లు చుండ,
సమర సన్నద్ధులై ♦ తమతమ సేనాధి
పతులపైఁ గన్నుంచి ♦ పజ్జ నిలువఁ
గీ॥ కృష్ణసింహాది బహు వాహి ♦ నీశ్వరులును
వీరరస పూరుషాకృతుల్ ♦ వెడలి వచ్చి
యా ప్రతాపుని యడుగుల ♦ యందు వ్రాలి
'యుద్ధ మొనరింపఁగా సెల ♦ వొసఁగు' మనిరి. 40

—॥ ప్రతాపసింహుఁ డనుచరులకు యుద్ధము చేయ సెల వొసంగుట ॥—

మ॥ తలఁగన్ బోవని దేశభక్తిమెయి స్వా ♦ తంత్ర్యంబు భావించి యీ
ధర మున్నెవ్వరు పూని యుండని మహా ♦ ధర్మవ్రతం బూని భో
గ రమావైభవముల్ త్యజించితిరి! ని ♦ ష్కామ క్రియాయోగు! లిం
దఱ మిమ్మున్ గనుఁగొన్న నాహృదయ మా ♦ నందాబ్ధి నోలాడెడిన్ 41

శా॥ నా మేవాడఁ గలట్టి వీరరస స ♦ న్నాహంబు సర్వస్వ మీ
భూమిధ్రంబున నేఁడు చేరినది పూ ♦ వుల్ పూచు చందాన! 'మీ
రా మేమా' యని ముందు దూకఁవలె వీ ♦ రశ్రేష్ఠు! లీనాటి సం
గ్రామంబట్టి మహావకాశ మిఁక గ ♦ ల్గన్ బోవ దెన్నండ్లకున్. 42

సీ॥ అక్బరు సకల లో ♦ కాతిశాయి బలుండు!
లక్షలున్ గోట్లు కా ♦ ల్బంట్లు, లక్ష
లాశ్వికుల్ గల ధీరుఁ! ♦ డఖిలజగం బొక్క
నిమిషమే పిండిపిం ♦ డిగను జేయఁ
గల పిరంగులు వేలు ♦ గలవాఁడు! నడకొండ
లట్టి వారణబలం ♦ బలరువాఁడు!
వేనోటి కీసర్వ ♦ విశ్వంబు ప్రతిసాల
ముగ మనపైఁ ద్రిప్పి ♦ పూన్చువాఁడు!
గీ॥ మనము నిరుపేదలము! విక్ర ♦ మం బొకండె
మనకుఁ గల సర్వసమర సా ♦ మగ్రి; కాన

ఝంకకయు వెల్తిఁగనక యు ♦ త్సాహ మంది
పోరు సలుపుద మపకీర్తి ♦ పారయ కుండ! 43

సీ॥ రాజ్య తంత్రిములు కా ♦ ర్యస్వతంత్రిత వైభ
వంబులు చతురంగ ♦ బలము లోకట!
ధర్మంబు దైవత ♦ త్పరతయు స్వాతంత్ర్య
వాంఛ యాత్మబలోప ♦ పత్తి యొకట!
దమతమ శౌర్య వీ ♦ ర్యములతో మొనకట్టి
యొండొంటి డీకొన్న ♦ యుద్ధ మిదియు!
నేపక్ష మిచట జ ♦ యించునో యని ప్రపం
చమువారి కన్నులి ♦ చ్చటికేఁ దిరిగె!
గీ॥ నాత్మవంచన లేక యా ♦ హవము నడిపి
జయముఁ గైకొన్న స్వాతంత్ర్య ♦ సౌఖ్య మబ్బుఁ!
బహుబలము నిల్వ లే దాత్మ ♦ బలము మోప్రిల
ననెడి సిద్ధాంతమును నిల్పు ♦ యశము గలుగు. 44

సీ॥ కల్లోల భయద సా ♦ గర మధ్యమున నిల్చు
గండోపలము మాడ్కిఁ ♦ గష్టవేళఁ
గంప మొందని భట ♦ గ్రామణి వీరుఁ! డా
తనికన్న మేటి యీ ♦ ధరణిఁ గలుగఁ!
డాతని వైభవం ♦ బాత్మగౌరవ దీక్ష!
ప్రఖ్యాతి యతని సం ♦ పాదనంబు!
తలఁగని కష్టవే ♦ ళల స్వదేశీయుల
దృష్టు లాతని దెసఁ ♦ దిరుగుచుండు!
గీ॥ దేశ భక్తాగ్రగణ్యుఁడా ♦ ధీరు బ్రమకు
వేయి నేండ్లైన క్షణమైన ♦ వెలితి యున్నె!
కాల గర్భంబునందుఁ రాఁ ♦ గల యుగముల
నతని కీర్తి దివ్యజ్యోతి ♦ యై వెలుఁగు! 45

శా॥ నా యీసైన్యములందు నొక్కభటుఁడై ♦ నః భీరుఁడై యున్న ని
ష్ఠే యుద్ధాంగణముః ద్యజించి యొటకే ♦ నేగంగ లగ్గౌ; జిగీ

పాయత్తుల్ భయమే యెఱుంగని యుద ♦ గ్రాటోపులే నేఁడు నా
కా యీ పార్శ్వములందు నిల్చి జయముల్ ♦ హర్షంబు నీయఁగదగుల్. 46

క॥ సమయమున భీతిగొని శౌ
ర్యముఁ గోల్పడి లోకపూజ్య ♦ మగు మీ సంతా
నము దాస్యశృంఖలా బ
ద్ధము చేయకుఁ డనుచు మిమ్ముఁ ♦ దగ నర్థింతుల్. 47

సీ॥ నాల్గు దిక్కులఁ జుట్టు ♦ నభము సోఁకెడు మహో
ద్దండ శైలము లొప్పు ♦ కొండలోయ!
మనల నెవ్వరు చూతు ♦ రని తలంపకుఁడు! జ
గచ్చక్షుఁడైన యీ ♦ కర్మసాక్షి
పై నుండి చూచు లో ♦ పలి తలంపులు! విప
క్షచ్ఛేద మొనరించి ♦ సమయు వారి
నభినందనము చేసి ♦ యశము నిల్పిరటంచుఁ
గడుపుపైఁ జేరిచి ♦ గారవించుఁ!

గీ॥ దాతలకుఁ దాతయైన యీ ♦ ధన్యతముని
బొజ్జపై నెక్కి మాహేంద్ర ♦ పురము పోవు
తొలి మహాద్వారమున దేవ ♦ దూత లెల్ల
మ్రొక్కఁగల భాగ్యమొందు ట ♦ ద్భుతము గాదె! 48

సీ॥ శత్రులు నాల్గుల ♦ క్షలకుఁ బైఁబడియుండ్రు!
ద్వావింశతి సహస్ర ♦ దళము మనది!
యొక్కఁ డిరువదిమంది ♦ యోధుల నోర్చిన
జయమున కింక సం ♦ శయము గలదె!
యీ పాటి సాహసం ♦ బలరని వాఁడు మీ
యందఱిలో నొక్కఁ ♦ డైనఁ గలఁడె!
కవచ ఖడ్గము లుండఁ ♦ గా రాజపుత్రుఁ డి
రువదిమందిఁ గూల్చు దు ♦ ర్ఘటమె యెందు!

గీ॥ నైదువేల పిరంగులు ♦ నంతె సంఖ్య
ద్విరద తతి యున్న భయమేమి! ♦ వేఁడి వేఁడి

పిడుగు లురలెడు మనచూపు ♦ లడర గజము
లజములు పిఱుఁగు లవి బొంగు ♦ లగుచుఁ బడవె! 49

సీ॥ వనచర సాహాయ్య ♦ మున రాముఁ డొక్కఁడే
యసురబలంబుఁ జ ♦ క్కాడ లేదె!
గోగ్రహణము నాఁడు ♦ కురువీర కోటుల
ఫల్గునుం డొకఁడె డీ ♦ ల్పఱుప లేదె!
మూంజుని భిల్ల చ ♦ మూ సమూహము నెల్ల
హమ్మీరుఁ డొకఁడె తు ♦ న్మాడ లేదె!
నాఁడు ముత్తాత చం ♦ డ నృపాలుఁ డొక్కఁడే
చిత్తూరి సేన ని ♦ ర్జింప లేదె!
గీ॥ యాత్మ తేజో బలాఢ్యు లి ♦ య్యఖిల జగము
లెత్తి వచ్చినఁ ద్రుటిని జ ♦ యింప నేర్తు!
రంద తేకాగ్ర మనముల ♦ నహిత భటుల
నూఁచముట్టుగఁ దాఁకంగ ♦ నొప్పు నిపుడు." 50

— ప్రతాపసింహునితోఁ గృష్ణసింహుఁడు తన పట్టుదల నెఱిఁగించుట. —

గీ॥ అనిన రాణానుగని సలుం ♦ బ్రాధినేత
"యిచటి భటుల భీరుం డొకం ♦ డేని లేఁడు!
కట్ట కడపటి భటుఁడైనఁ ♦ గట్టి తెచ్చి
మృత్యుదేవతఁ జెఱసాల ♦ నిడఁగఁ గలఁడు. 51

సీ॥ ఒక్కొక్కఁడును సమ ♦ స్తోర్వీతలము నిండ
నిరుప మామోదంబు ♦ నెఱపు నట్టి
పూవు లసంఖ్యముల్ ♦ పూచె రాజస్థాన
నందన దేవ మం ♦ దార తరువు!
తడ వొకింతయు లేని ♦ తౌరుష్క వాహినీ
చైత్రయాత్రా ప్రభం ♦ జనము ధాటిఁ
గూఁకటి వ్రేళ్లతోఁ ♦ గూడఁ గంపించెఁ జె
ట్టా పూవు లన్నియు ♦ నవని రాలె!

గీ॥ నీవనెదు దొడ్డప్రాపైన ♦ నిలుచుఁ బోలుచు
విశ్వ విశ్వంభరామోద ♦ విజయ లక్ష్మి
నలుదెసల నించు నంచని ♦ తలఁచుచుండ
నక్క రనెడి ఝంఝానిలం ♦ బలమె నేఁడు! 52

శా॥ పోనీ రాజ్యము; భోగభాగ్యవితతుల్ ♦ పోనీ; సతీపుత్రులు
బోనీ; ప్రాణము పోవనీ; మఱియు నీ ♦ భూచక్రమే పిండియై
పోనీ; చండనృపాలు పావన కులం ♦ బున్ దాస్యమున్ మోయఁగాఁ
బోనీయన్ ద్రిదివాధిపత్య విభవం ♦ బుల్ దక్కు నట్లుండినన్." 53

క॥ అనుచు సలుంబ్రా కృష్ణుం
డని నంతన తేజసింహుఁ ♦ డమలస్మిత శో
భన వదనం బెత్తి ప్రీతా
పునిగని సైన్యంబు లెల్ల ♦ మోదంబుఁ గనన్, 54

—॥ తేజసింహుఁడు తన శక్తి యుక్తు లెఱిఁగించు కొనుట. ॥—

సీ॥ శత శతాబ్దములు శ ♦ ష్టము చేసి కట్టిరి
వంశ పావనులు మే ♦ వాడ రాజ్య
సౌవర్ణ సౌధరా ♦ జము! దుర్బలులమైన
నిమిషంబులో నది ♦ నేల గ్రోలుఁ;
బరతంత్రగతి సార్వ ♦ భౌములై బ్రహ్మాండ
మున్నంతకు బ్రదికి ♦ యుండు కంటె
దారిద్ర్యయుక్త స్వ ♦ తంత్ర జీవన మొక్క
గంటయుఁ గడ కొక్క ♦ క్షణము చాలు;

గీ॥ దేశ ధర్మ రక్షాదీక్ష ♦ ధీర వృత్తి
మీఱెదము గాక! రిపులఁ జం ♦ పెదము గాక!
భీతి మృత్యు మహావృక్ష ♦ బీజ మగుటఁ
బిరికి చేతి బల్లెం బది ♦ బెండు గాదె! 55

సీ॥ తనపాలు త్రోవ దు ♦ ర్గమ గండశిలలైనఁ
దునియలు తునియలై ♦ తొరఁగునట్లు

రాజాధిరాజు లే ♦ ర్పడుటకు మున్నె! నా
గరకత భువిని బ్రా ♦ కకయ మున్నె!
యీయేరు లీకొండ ♦ లీ గండశిలలు నీ
వనములు మాభిల్ల ♦ వంశజులవి!
గీ॥ యీతురుష్కులె కాదు మ ♦ హేశుఁడైన
నరుగుదెంచినఁ బ్రాణము ♦ న్నంతలోన
శిరములను ఖండ ఖండముల్ ♦ చేతుఁగాని
మిగులనిచ్చిన నిదియొక్క ♦ మీస మొక్క! 61
సీ॥ గొలుసులనున్న బె ♦ బ్బులి పిల్లలనఁగ యీ
వనచర మృగముల ♦ పైన వ్రాలి
కడికండ లొలుచు యో ♦ గం బెప్పు డెప్పుడం
చదె భిల్లభటులు ము ♦ ప్పదియు వేలు
కొండకోటలపైన ♦ నుండి గుప్పున దూఁక
నుత్సాహ భరమున ♦ నున్నవారు!
రణముం దరుల డీల్ప ♦ ఱచి గెల్చుటో లేక
చచ్చుటో మూఁడన ♦ జాడ గలుగ!
గీ॥ దింక మేవాడపైన దం ♦ డెత్తు టనిన
మృత్యుముఖముఁ జొచ్చుటె యంచు ♦ నెఁడద ప్రీలి
యక్బరును భీతిగొనఁగ నా ♦ హవము సేతు!
నీపదము లాన ప్రాణంబు ♦ తీపుగాదు! 62
మ॥ మదమాతంగ సమూహ మట్లు బలసం ♦ పన్నాస్యు లొక్కొక్క రేఁ
బడి శైలంబుల నెత్తి సంద్రమునఁ ద్రో ♦ వన్ జాలు వా రల్ల ము
ప్పది వేల్ భిల్లుల షింటికిన్ మఱలిపో ♦ వన్ గోరఁ డొక్కండు! నే
దుదిప్రాణంబులు మేన నుండు వఱకున్ ♦ దోడుందు నీముందటన్." 63
గీ॥ అనిన నాభానుసింహాదు ♦ లంద ఱొకమొ
గమున "నేఁడు హాల్దీఘాటు ♦ కనుమనిండ
వైరి రక్త ప్రవాహముల్ ♦ పాఱఁజేతు"
మనిన నంద ఱొఁదల లూఁపు ♦ నంత లోన, 64

మ॥ "అరిసంఘంబులఁ గూల్చి గెల్పుఁగొన నా ♦ యత్నంబుగం" డంచునం
దఱకున్ దెల్పుచు యావనాయన బృహ ♦ న్నాళాస్త్రి శుంభద్గళాం
తరమందుండియుఁ బేలె గుండ్లొకఁడు ద ♦ ద్గంతి శ్రవో యుగ్మగ
హ్వర విచ్ఛేది కఠోర దుస్సహ మహా ♦ ధ్వానంబు సంధించుచున్. 65

—॥ మొగలు సైన్యంబులు యుద్ధమున కాయత్త మగుట. ॥—

శా॥ బారుల్ బారులు తీర్చి యావన భట ♦ వ్రాతంబు లశ్వంబులం
దారోహించుచు నిల్చెఁ గట్టెదుర! బా ♦ హా విక్రమ ప్రాభవో
దారుల్ తోడరమల్లముఖ్యులు తను ♦ త్రాణాదులన్ దాల్చి యా
మేరు క్ష్మాధర శృంగముల్ వలెఁ గడున్ ♦ బెంపారి రత్యుగ్రులై! 66

శా॥ ధీరశ్రీలయకాల మృత్యుముఖ స ♦ ధ్రీచీన ఘోరంబులై
నోరుల్ విచ్చు శతఘ్నులన్ నిలిపి యం ♦ దున్ శ్వేత సూచీముఖుల్
క్రూరాత్ముల్ భృతిపాలితుల్ జగము సం ♦ క్షోభింపఁగా నిల్చి రా
శూరుల్ పంచసహస్రముల్ బుడుతకీ ♦ చుల్ నిప్పులన్ గుప్పుచున్. 67

మ॥ సమసత్త్వంబులు నగ్నిచూర్ణయుతముల్ ♦ షష్ట్యంగుళ క్రూర నా
ళములున్ భీకర తిర్యగూర్ధ్వ బల మూ ♦ లమ్ముల్ తుపాకుల్ విశా
లములౌ బొమ్మల కాన్చి పచ్చితురకల్ ♦ బాహాబలాటోప దు
ర్దమ్ములై నిల్చిరి దీర్ఘకాయులు రణా ♦ రంభ క్రియాలోలురై. 68

సీ॥ ధవళ ఘూసర హరి ♦ ద్ర శ్యామ లోహిత
పింగవర్ణ తనుత్ర ♦ వితతిఁ దొడిగి
కరవాల పరశు ము ♦ ద్గర భిండివాలాది
సమకోచి తాయుధ ♦ సమితిఁ దాల్చి
మూఁడులక్షల భటుల్ ♦ మూఁగిరి; మృగ మిశ్ర
భద్ర మంద్ర విభేద ♦ వారణములు
నాకర్ష దీర్ఘ ము ♦ ఖాభీల కఠిన శా
తాంకుశ హస్తులౌ ♦ హస్తిపకులు
గీ॥ నిలువ వివిధబలంబుల ♦ యలబలంబు
యుగ సమయ ఘూర్ణమాన ప ♦ యోధిరవము

ననుకరింపంగ యవనసై ♦ న్య ప్రపంచ
మొక్కుమొగి విజృంభించె మ ♦ హోగ్రగతుల. 69

—॥ ప్రతాపసింహుండు యుద్ధసన్నద్ధుం డగుట. ॥—

గీ॥ శుభద గోస్తనాము సమ్మిత ♦ స్థూల లోహ
వర్మమును దాల్చి యాప్రతా ♦ ప ప్రభుండు
తనరె భారత భూమి స్వా ♦ తంత్ర్య లక్ష్మి
వీర యోధావతారమై ♦ వెలిఁగె ననఁగ. 70

సీ॥ నలువది యంగుళం ♦ బుల దీర్ఘ వదన ము
తకును మూఁడంత లౌ ♦ న్నత్య మలరి
మాయూర కంఠ స ♦ మగ్రీవమును హ్రస్వ
కుక్షియు నత్యల్ప ♦ ఖురపుటమును
మేఘనిస్వనము న ♦ మేయసారము కాంత
కాంతిమంతమ్ము సు ♦ గంధరుచిర
మాకాశ నీల వ ♦ ర్ణామోఘమును సర్వ
శోభద్ర పద్మ ప్రభ ♦ మాభిరామ

గీ॥ ముత్తమోత్తమ లక్షణ ♦ యుతము పూర్ణ
హర్షము సువర్ణ రత్నభూ ♦ షాంచితంబు
నైన చైతకాజానేయ ♦ మధిపుఁ డెక్కె
నఖిల సామంత మండలి ♦ యభినుతింప. 71

శా॥ హేషారావ శ్వచలప్రపంచము నితం ♦ బాపత్కోపత్యకాం
తారామాశ్మఘనాధుపి ఘుతముగా ♦ నాకంపమొందెన్ మహో
దారప్రభవుఁ డాప్రతాపుని మహో ♦ ద్యద్దక్షిణావర్త శం
ఖారావంబులు భూనభోంతరము ప్ర ♦ య్యాల్ గాఁగ మ్రోసెన్ వడిన్. 72

సీ॥ తపనీయ వజ్ర సూ ♦ త్రములు నాల్గంచు లె
క్కిన శంఖ మూదెను ♦ కృష్ణనృపతి!
సౌవర్ణ చిత్ర పు ♦ ష్ప మనోజ్ఞ శంఖంబు
మ్రోయించె గ్వాలియర్ ♦ భూమివిభుఁడు!

మొలుఁగారు మగఱాల ♦ మిసిమి గజ్జెల సరుల్
దెమరు శంఖం బొత్తెఁ ♦ దేజసింహుఁ!
డాణేము త్రియముల ♦ హారముల్ తుదివ్రేలు
శంఖంబుఁ బూరించె ♦ శ్యామసింహుఁ!

గీ॥ డుత్తమావర్త మర్ధ హ ♦ స్తోన్నతంబు
పశ్చిమాంభోధి భవము సౌ ♦ వర్ణ వృంత
మగు మహాశంఖ మొత్తె స ♦ ర్వాతిశాయి
వీర లోకైకమౌళి యా ♦ భీమచాందు! 73

సీ॥ అచలోపమాన దే ♦ హాభీల యావన
ద్విప సమూహము భూరి ♦ బృంహితములు!
జగదేక విక్రమో ♦ జ్జ్వల రాజపుత్ర వీ
ర కదంబ సింహ గ ♦ ర్జా విరావ!
మహిత సైంధవ దర్ప ♦ నాతిరోషిత తురు
ష్క తురంగ బహుళ హే ♦ షా స్వనంబు!
లసిలధాటీచలి ♦ తాసంఖ్య సూర్యకే
తన జాత పటపటా ♦ త్కారరవము!

గీ॥ తురకల పిరంగిగుముల యు ♦ ద్ధురరవంబు!
భిల్ల సుభట కోదండ మౌ ♦ ర్వీ ధ్వనులును!
రెండు సైన్యంబులను రేఁగు ♦ డిండిమ రవ!
మట్టె మిన్నుమ న్నేకమౌ ♦ నట్లు మ్రోసె. 74

—॥ { రణమున కుపక్రమింపుమని చంద్రభట్టారకుఁడు ప్రతాపసింహుని హెచ్చరించుట } ॥—

ఉ॥ "వైరులు సర్వసన్నహన ♦ భారముఁ దీర్చి రణంబుసేయ ను
న్నారలు; వారలన్ బలిగొ ♦ నన్ మనవారలు గూడఁ బూని యు
న్నారు; ఉపక్రమింపుము ర ♦ ణంబు క్షణంబున" నంచుఁ జంద్రభ
ట్టారకుఁ డాప్రతాపు నిక ♦ టమ్మునకున్ జని తెల్పనాతఁడున్, 75

— ప్రతాపసింహుని విషాదము. ॥—

మ॥ శిరమున్ వంచి నమస్కరించి "సుకవి ♦ శ్రేష్ఠా! సుఖావాప్తి సం
బరమున్ గష్టమునన్ విషాదమును బెం ♦ పన్బోని యస్మన్మహా

తురకలనుగొల్చి మనతోడఁ ♦ దొడరవచ్చె!
నింక స్వామిభృత్య న్యాయ ♦ మెందుఁ గలదు! 79

సీ॥ ఆయుత్తర దిగంత ♦ మందుఁ దఁపాకి పౌ
జులనెల్ల సంగ్రామ ♦ సుముఖులుగను
జేయుచుండెడి రాయ ♦ శీలుఁ డంబరు నృపు
డగు భగవాన్ దాసు ♦ నంకితుండు!
వానిపజ్జఁ దురుష్క ♦ పాదాతిదళము మఱి
దార మహీజ కే ♦ తనము క్రిందఁ
బూన్చుచు నున్న జాం ♦ బూనద కవచుండు
జయమల్లుఁ డంబ రే ♦ శ్వరుని మఱఁది!
గీ॥ యోధపుర రాజమాళియా ♦ నుదయసింహు
ప్రియ తనూజను జేకొన్న ♦ పెండ్లికొడుకు!
మానసింహుని దనకూర్మి ♦ మేనయల్లు
మొన్న సేగద దర్శన ♦ మునకుఁ దెచ్చె. 80

మ॥ కడఁజూడన్ బడనట్టి దుర్దమ తురు ♦ ష్క ప్రాజ్య సైన్యాధినా
థుఁడయ్యె సంగరచక్రముల్ గిరము లం ♦ దున్ద్రిప్పు నా మానసిం
హుఁ డెవం! డన్నియుఁ జక్క నుండినను న ♦ త్యుల్లాసియై యెప్డు నా
యడుగుల్ గొల్చెడు నాశ్రితుండెకద! యయో ♦ రా! కాల మెబ్బంగిదో! 81

సీ॥ అందఱొక్క విధంబు ♦ ముందున్నది ముసల్మ
పండుగ యన్నట్టి ♦ భంగి దోఁప
సిధిగా తోడరమల్లు ♦ నిరుదెస సింహమ్ముఁ
జేరి కొల్చెడు వ్యాఘ్ర ♦ శిశువులట్లు
సూక్తసాగరులు నా ♦ సోదరు లిరువురు
గనుపింతు! రకట! ర ♦ క్తంబుఁ బంచు
కొని యేకగర్భంబు ♦ నను బుట్టితిమి! ఛాయ
యట్లు నన్నెప్పుడు ♦ ననుసరింత్రు!
గీ॥ నాకు వారికి భేదమిం ♦ తయును గలదె!
కదలి నంతనె వారలే ♦ యెదురు పడుదు!

రిది యవనసేనతోఁ జేయు ♦ కదనమో! స్వ
జనముతోఁ జేయు కదనమో! ♦ శంక గలిగె. 82

చ॥ బవరము లోకపావనము; ♦ భ్రాతలు మిత్రులు తండ్రులైన నా
హవమునఁ దాఁక బోరుట నృ ♦ పాళికి ధర్మముటందు; రట్టి ధ
ర్మ వెఱుఁగలేక కాదు; మొగ ♦ ముల్ గని సోదర బంధు మిత్ర కం
ఠ విదళనం బొనర్చుట క ♦ టా! కడుఁగ్రూర మటంచుఁ ద్రోచెదుర్ 83

సీ॥ అనఁ గవి "లేవాత్మ ♦ కయ్యవస్థాభేద
నాశముల్ దేహంబు ♦ నకును గాని!
నాత్మ నిత్యంబు! దే ♦ హం బనిత్యము! వీరుఁ
డగు వానికిని స్వధ ♦ ర్మాచరణము
తల్లి దండ్రులకన్నఁ ♦ దనకన్న మిత్రుల
కన్నఁ జుట్టంబుల ♦ కన్న మిగుల
నుత్తమంబగు! క్షత్రి ♦ యుం డెప్పు డుత్తమో
త్తమ కర్మవీరుఁడై ♦ తనర వలయు!
గీ॥ సమధి కాత్మైక తత్త్వవి ♦ జ్ఞాన మయుఁడ!
ఓటు గెలుపుల సమబుద్ధి ♦ నూహసేతు!
నీకు ధర్మంబులను నేర్పు ♦ నే నెవండ"
ననిన దిటవూని నృపతి సై ♦ న్యములఁ జూచి; 84

—! ప్రతాపసింహుఁడు సైన్యాధిపతుల యుద్ధమునకుఁ బురికొల్పుట. !—

సీ॥ "హతశానవ పర్వ ♦ తాగ్రగణ్యము విశ్వ
పావనమైన మే ♦ వాడసీమ
యీ కోన లీ లోయ ♦ లీ నదు లీ వను
లీ భానుమండలం ♦ బిన్ని మనవి!
పూర్వు లెన్నిరొయుద్ధ ♦ ములు చేసి వారి ర
క్తములతో నీభూమిఁ ♦ దడిపినారు!
ప్రాణ మున్నంత కీ ♦ యవని విదేశీయు
లాక్రమింపంగ నీ ♦ యంగ రాదు!

గీ॥ కట్ట కడయూపి రున్నంత ♦ కట్టె తనదు
పట్టి బిగఁబట్టి పరులకుఁ ♦ బట్టి యీని
జనని కరణి హల్దీఘాటు ♦ కనుమ నాని
పూని కాపాడుఁడో రాజ ♦ పుత్రులార! 85

సీ॥ ఇంత విస్తారమం ♦ చెఱుఁగరానిది కాల
పాథోధి! యలలు సం ♦ వత్సరమ్ము!
లాకాల గర్భంబు ♦ నం దెందఱు నృపాలు!
రెన్నెన్ని దేశంబు! ♦ లెన్ని రణము!
లెన్నెన్ని జాతులో! ♦ యెందఱు గెలిచిరో!
యెందఱు మడిసిరో! ♦ యెఱుఁగఁ గలమె!
యందఱిలో నొక్కఁ ♦ డైన నేఁ డున్నాఁడె!
యశమె చిరస్థాయి ♦ యయ్యెఁగాక!
గీ॥ మాటలను గట్టి యాయువు ♦ ♦ బుట్టకెత్తి
శాశ్వత బ్రహ్మకల్ప మీా ♦ జగతి నుందు
మో! యరులఁదాకి గెలుపొ యో ♦ టో గ్రహింత!
మంద తేక మనస్కులై ♦ యనికిఁ జనుఁడు! 86

ఉ॥ ఆవడ గండ్ల వాన వలె ♦ నంతట విశ్వములోని దుష్ట వా
తావరణంబు శుద్ధమగు ♦ న ట్లొనరించెడు యుద్ధముల్ జగ
త్పావనముల్; విపక్ష బల ♦ భంజనులై గెలుపొంది వచ్చినన్
బూవుల సోన వానలను ♦ భూజనముల్ గురియింత్రు మీాపయిన్. 87

సీ॥ వనిని బూవులు రాలి ♦ పడును! వసంతుఁ డా
దట వచ్చి మఱల న ♦ న్నిఁటిని దెచ్చుఁ!
జెడ నెండఁ బాఱిన ♦ చెట్టులు క్రొక్కాఱు
చినుకుల మఱల లేఁ ♦ జవురుఁ దాల్చుఁ!
గొందఱో మనలోన ♦ నందఱో మడిసిన
మన తావు చేకొంద్రు ♦ మన తనయులు!
నాయంత కేమి యం ♦ తము నొందుదు నటన్న
భయ మింతయైనఁ గ ♦ న్పడఁగఁ బోదు!

గీ॥ సాహసంబునఁ బోరి వి ♦ శ్వప్రపంచ
మునఁ బ్రజాహృదయములఁ జూఱఁ ♦ గొనెద మేని
మాట లేటికి! మనకింక ♦ మరణ మేది!
క్షితిఁ జిరంజీవుల మయి ని ♦ ల్చెదముగాక.'' 88

చ॥ అను విభు విక్రమోక్తులను ♦ నంతట నంతట నిల్చి తేజసిం
గును మఱిఁ గృష్ణసింహుఁడును ♦ గొండొక వైపున భానుసింగు యో
ధ నికర కర్ణ పేయముగఁ ♦ దద్రస మింత తొలంగ కుండఁగా
విసిచిరి యక్షరాక్షరము! ♦ వీరరసంబున నూఁగె సైన్యముల్! 89

సీ॥ గగన భాగంబెల్లఁ ♦ బగిలించి పరతెంచు
పిడుగు తండముల స ♦ వ్యములఁబోలి!
ప్రళయ కాలాభీల ♦ వనదముల్ రాపాడ
జనియించు మేఘ గ ♦ ర్జనము మించి!
రంగదుత్తుంగ త ♦ రంగ పంక్తులు రేఁగు
వనరాశి ఘోర ని ♦ స్వనముఁ గేరి!
సచరాచర ప్రపం ♦ చము తూలిపడ వీచు
ప్రకట ప్రభంజను ♦ ధ్వనిని మీఱి!
గీ॥ దిగ్గజంబులు చెవు డెత్తి ♦ తెలివి దప్ప
నట్టె హారావళీ శైల ♦ మంత నిండి
యంబరేశ్వరు శిబిరంబు ♦ నజుత మ్రోగ
సంగ రారంభ దుందుభి ♦ స్వనభరంబు 90

—॥ రాజపుత్ర సేనాధిపతులు యవనసేనలను దాఁకుట. ॥—

సీ॥ అద్రి నెల్లెడ 'హర! ♦ హర! మహాదేవ!' యను
సమరనాదం బాక ♦ సంబు నిండ
శ్రీ సలుంబ్రా కృష్ణ ♦ సింహుఁ డాసఫ్ ఖాను
మూఁడువేల్ భటులతో ♦ మొదటఁ దాఁకె!
బదనూరు భర్త షా ♦ బాజ్ ఖాను రాయసిం
హుల కడ్డుపడె నంత ♦ బలముతోడ!

నాశ్వీక త్రిసహస్ర ♦ మమర ఖేలాన్వపతి
యబ్దూరు రహిమాను ♦ నని నెదిర్చె!

గీ॥ నవ్రతీపప్రతాపాంసుఁ ♦ డాప్రతాపుఁ
డతుల కాలాగ్ని సమమూర్తు ♦ లగు శిశోది
యాన్వయులు మూఁడు వేలతో ♦ యవన సైన్య
మధ్యమున నున్న తోడర ♦ మల్లుఁ దాఁకె! 91

సీ॥ రెండువేలాశ్వికు ♦ లాడఁగొల్వఁగ ఖా
సింఖానుతో శ్యామ ♦ సింహ నృపతి!
యంతటి బలముతో ♦ నద్రిధైర్యుఁడు రాయ
శీలునితో భాను ♦ సింహ భర్త!
పూని యబ్దూల్లా చ ♦ మూపతితో రామ
చంద్ర మనస్సింహ ♦ శౌర్యఘనులు!
విక్రమ ప్రకటు లా ♦ వీర బలునితోడ.
బెడ్లా-కొటేరియా ♦ పృథ్వినాథు!

గీ॥ లాహవారంభ మొనరింప ♦ నలఘు బలుల
నాత్మ సుభటులఁ గొనుచు బ్ర ♦ హ్మాండ మదురు
వీర గర్జారవ మెలర్ప ♦ భీమచాంద్ర
భీకరాస్త్రంబులు నిగుడ్చి ♦ తాఁకె రిపుల!

మ॥ వనధుల్ రెండును దాఁకి ఘూర్ణి లెడు తే ♦ వన్, గొండతోఁ గొండ డీ
కొనున, ట్లంబుదమాలికల్ దొడరి సం ♦ క్షోభించు చందాన యా
వన సైన్యంబులు రాజపుత్ర చముపుల్ ♦ వైరంబు వీర్యంబు నె
క్కొన నొండొండు కలంగఁదాఁకె సమర ♦ క్రోధ ప్రవృద్ధంబులై. 93

మ॥ బెడఁగుం గత్తుల మేల్తళత్తళల ద్యో ♦ వీథిన్ దటిత్పుంజముల్
పొడమన్; వీర రసావతారు లగుచున్ ♦ మొగల్ భటగ్రామణుల్
కడుశౌర్యమ్మున రాజపుత్రకులపై ♦ లంఘించి దోర్దర్ప మే
రడ నొక్కుమ్మడిఁ దాఁకి యార్చిరి రణ ♦ ప్రారంభ సంరంభులై! 94

—॥ ఖేల్నాపతి-యబ్దూరహిమానుతోఁ జేయు యుద్ధము. ॥—

ఉ॥ తారకదైత్యనాథు ననిఁ ♦ దార్కొని యొంచు కుమారు భంగి ఖే
ల్నా రమణుండు బాహుబల ♦ వైభవుఁ డా లయకాల భైరవా
కారుల యోధులన్ గొనుచు ♦ గాఢ రయంబున నేగి తాఁకె న
బ్దూరహిమాను మొగలులు ♦ తోడనె వెన్కకుఁ దూలి యార్వఁగన్. 95

ఉ॥ ఆతఁడు శైలముల్ పగుల ♦ నార్చుచు నేఁబది వేలు వీరపా
దాతుల హెచ్చరించుచు గ ♦ దా కరవాల పరశ్వధాయుధ
వ్రాతములన్ ధరించి గిరి ♦ వర్గము ఛేదిలఁ దాఁకు నా బలా
రాతి విధానఁ దాఁకె నతి ♦ రౌద్రి భరమ్మున రాజపుత్రులన్. 96

మ॥ ఇరువైయేఁడుల ప్రాయమున్ జెలువమున్ ♦ హెచ్చింప వారిద్దరున్
స్మరుఁడున్-శంబరు నట్లు, సాత్యకియు- న ♦ శ్వత్థామయున్ బోలె, సాం
ద్రోరు వెన్నిక హయాధిరూఢు లగుచున్ ♦ యుద్ధంబు సాగింప న
య్యిరువాగున్ భటులెల్ల నిల్చిరి దిదృ ♦ క్షైకాగ్రచేతస్కులై. 97

సీ॥ ఉభయకూలంబుల ♦ నుప్పొంగి యుల్లోల
కల్లోల మాలికల్ ♦ గడలు కొనఁగ
నతితర ఘాటితో ♦ నరుగు నఖండ గం
గా ప్రవాహాభరంబు ♦ కరణి దూఁకు
రాజపుత్రచమూభ ♦ రంబు డాకకు మొగల్
కాండముల్ పులినోటి ♦ కండలయ్యెఁ
నెంత ఖండించిన ♦ నంతయుఁ జెడక స
ముద్ర తరంగముల్ ♦ పోలెఁ బొంగి
గీ॥ పొరలి సైకత్తి నచ్చు న ♦ మ్మొగలు పక్ష
వాహినీ భూరి పరిమాణ ♦ భార మప్పు
డతులిత పరాక్రమోపేతు ♦ లైన రాజ
పుత్ర సైనికులకుఁ దల ♦ మున్క లయ్యె 98

మ॥ కుదురొందన్ మహబాజుఖానుఁడు తుపా ♦ కుల్ ప్రేలిపింపంగ నేఁ
బదివేల్ గుండులు లేచి ధూమము నభో ♦ భాగంబుఁ గప్పంగఁ దా

మ్మదములన్‌బోలె దటాలునన్ వెడలి క్ర ♦ మ్మన్ రాజపుత్త్రాశ్వప
ద్మ దళంబందునఁ! జేతఁ దట్టి యవి క్రిం ♦ దన్ గొట్టి రశ్వీయులున్! 99

—॥ తేజసింహుఁడు యవనసైన్యముపైఁ బడి ధ్వంసము చేయుట. ॥—

మ॥ పెడబొబ్బల్ నికటాద్రిశృంగములఁ ద ♦ బ్బిబ్బ్బు వడన్ జేయఁ బ
ల్విడిఁ దారుష్కపదాతివర్గము విజృం ♦ భించెన్; మహావీరయో
ధుఁడు రాణోన్మణి తేజసింగు భటులన్ ♦ దోడ్కొంచు వైరివ్రజం
బడఁగన్ దాఁకెను శంఖమూఁదుచును బ్ర ♦ హ్మాండంబు భేదిల్లఁగన్ 100

సీ॥ ఒకమాఱు ముందున ♦ కుఱికి సంధానరించి
యవన యోధుల శిరం ♦ బవియ మోదు!
నొకమాఱు దాపటి ♦ కుగ్రుఁడై దూఁకి యం
దిన వారినెల్లను ♦ ద్రెళ్లఁ జేయు!
నొకమాఱు వలపటి ♦ కురవడి లంఘించి
యందఱఁ దున్మి తూఁ ♦ టాడి వైచు!
నొకమాఱు పిఱిఁది కిం ♦ చుక తగ్గి తనచుట్టు
వెనుక నుండెడివారిఁ ♦ బిలుకు మార్చుఁ!
గీ॥ దీఁగ మెఱుపట్లు లశ్వంబుఁ ♦ ద్రిప్పికొనుచు
మృత్యుదేవత చందాన ♦ మెలఁగె! నపుడు
యవన పాదాతి దళముల ♦ చెవుల మ్రోసె
యమ మహిష కంఠ ఘంటా మ ♦ హా స్వనంబు. 101

చ॥ అడరి మహాగ్నికీలలను ♦ నంతటఁ జిమ్ము తుపాకిగుండులున్
గమపునఁ జొచ్చి చుట్టు తిరు ♦ గన్ బలువేదన నొందు మర్త్యులై
వడి నల తేజసింహు భట ♦ వర్గము దానును గర్భమున్ జొరన్
బడఁగఁ దురుష్క సైన్యములు ♦ బగ్గుముపాముగఁ గూలె నేలకున్! 102

ఉ॥ ఆషహాబాజఖాను సుభ ♦ టాళులఁ గొందఱఁ గొంచు విద్విష
ద్భీషణ బాహుగర్వమునఁ ♦ దేజిని ముందుకుఁ బూన్చె; నంతలో
రోషకషాయితాక్షుఁడు గు ♦ రుస్థిరశౌర్యుఁడు రాయసింహుఁ డా
శేషఫణీంద్రు మాడ్కిఁ గవి ♦ సెన్ రభసమ్మునఁ దేజసింహుపై! 103

ఉ

# హల్దీఘాటుకనుమ.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| షేలావ్వతి 3000 ఆశ్వికులు | రాఠోడు తేజసింహుఁడు 3000 ఆశ్వికులు | సలుంబ్రా కృష్ణసింహుఁడు 3000 ఆశ్వికులు | మహారాణా ప్రతాపసింహుఁడు 3000 ఆశ్వికులు | శ్యామసింహుఁడు 2000 ఆశ్వికులు | భానుసింహుఁడు 2000 ఆశ్వికులు | రామచంద్రుఁడు ఖండేరావు మనస్సింహుఁడు 2000 ఆశ్వికులు | బేడ్లా-కోఠేరియానృపులు 4000 ఆశ్వికులు | భీముచాందు 30 000 భిల్లులు |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అబ్దుల్ రహమాను 50 000 కాల్వురు | షాబాజుఖాఁ రాయసింహుఁడు 100,000 కాల్వురు | ఆసఫ్‌ఖాను 25 000 ఆశ్వికులు | తోడరమల్లు సూర్తుఁడు— సాగరుఁడు 50 000 ఆశ్వికులు | ఖాసింఖాను 25 000 ఆశ్వికులు | రాయశీలుఁడు 50000 తుపాకి పౌజు | అబ్దుల్లాఖాఁ 50 000 కాల్వురు | పిరబలుఁడు 50 000 కాల్వురు |

| |
|---|
| కున్వార్ మానసింహుఁడు సలీము అంబరు బలము 25 000 ఆశ్వికులు |

శా॥ అవీరుల్ హయముల్ గదల్చుకొని శౌ ♦ ర్యాయత్తులై మీఁదికిన్
రా వీక్షించి గజంబులన్ గనిన హ ♦ ర్యక్షప్రభుండో యనం
గా విచ్చేసెను సింహనాదము వెలుం ♦ గన్ దేజసింహుండుఁ డా
ప్రావృట్కాల పయోద గర్భగత గ ♦ ర్జాస్ఫూర్తిఁ గ్రీడించుచున్. 104

సీ॥ కల్పాంతకాల మే ♦ ఘము గర్భముననుండి
వెడలు సౌదామనీ ♦ వితతి మించి!
తత మండలాగ్ర దీ ♦ ధితులు దిక్కులఁ బర్వఁ
ద్రిప్పుకొంచును బోయి ♦ తేజసింగు
వార లిర్వుర మధ్య ♦ వ్రాలి పో రొనరింప
జ్యోతిర్లతలు చుట్టు ♦ జుట్టినట్లు
కనులు కానఁగరాక ♦ వెనుకకుఁ దిరిగి భీ
కరహయంబులు త్రిప్పి ♦ మఱల దాఁకి!

గీ॥ రంత రాఠోడ్కులుండు క ♦ ల్పాంత రుద్రు
శూలమును బోలు కుంతంబుఁ ♦ గేలఁ దాల్చి
"తెగితి రింకెందుఁ బోదురో ♦ ధీరులార!"
యనుచు సింహనాదమునఁ బై ♦ కరుగు దెంచె! 105

మ॥ ఉదయద్భాను సహస్ర బింబగత ర ♦ క్తోదగ్ర కాంతిచ్ఛటల్
వదనం బీనెడు తేజసింగు నెదిరిం ♦ పన్ ధైర్యముల్ లేక పైఁ
గదియుండంచు భటాళి కాజ్ఞ యిడి చ ♦ క్కన్ బాజి రాయుఁడున్; ర
య్యాదవన్ గాల్చెను దేజసింహ దహనుం ♦ డావైరి సైన్యాటవిన్. 106

గీ॥ అసమ దక్షాధ్వర ధ్వంస ♦ మాచరించు
నుగ్రశివుఁబోలెఁ దేజసిం ♦ హుండు పొడిమి
వ్రచ్చి-వండఱలాడ వి ♦ పక్ష సైన్య
మాక్షణం బకాండ ప్రళ ♦ యమున మునిగె! 107

—॥ సలుంబ్రా కృష్ణసింహుఁడు—ఆసఫ్‌ఖానుతోఁ దలపడుట. ॥—

శా॥ ఆసంరంభ విజృంభణంబు నఖిలం ♦ బాలించి కోపోగ్రుఁడై
యాసఫ్‌ఖానుఁడు పంచవింశతి సహ ♦ స్రానీకినిన్ బూన్చుచున్

డాసెన్ ముందుకు; మూఁడువేలు భటులం ♦ డన్ గొల్వఁగా నాసలుం
బ్రాసింహాం బెదిరించె నాతని భుజా ♦ వష్టంభ సంరంభమై! 108

సీ॥ ఎనిమిదంతలు బలం ♦ బెక్కుడై యున్నఁ జోం
డావతుల్ విక్రమా ♦ డంబరమునఁ
జిచ్చఱపిడుగులై ♦ చెలరేఁగి యావనా
శ్వికులపై వ్రాలి ని ♦ ర్జింపఁ జొచ్చి;
రాతురుష్కులు విజ ♦ యాతురుల్ సంఖ్యా బ
లమున నొక్కఁడుగఁ గ ♦ లంగఁదాఁకి;
రుభయ సైన్యంబు లొం ♦ డొంటి సోఁకినఁ దోఁచె
నుదధి ద్వయము పొంగి ♦ యొరసి నట్లు;
గీ॥ ప్రళయ కాలాంత కోగ్ర జి ♦ హ్వ కరాళ
దీర్ఘ కుంతంబు రుచులు న ♦ ల్దెసలఁ బరవ
నా సలుంబ్రాధినాథుండు ♦ యవన వీర
సుభట వక్షమ్ములను గ్రుమ్మఁ ♦ జొచ్చె నపుడు! 109

క॥ కడు నున్నతాశ్వమును గుడి
యెడమలకున్ ద్రిప్పుకొనుచు ♦ నిన తేజుఁడు కృ
ష్ణుఁడు రిపుల గాత్రములు ప
చ్చడియై పడ నఱకె శౌర్య ♦ సాహసవృత్తిన్. 110

చ॥ అదిగని యోర్వలేక జ్వలి ♦ తాగ్రహుఁ డాసపుఖాను కృష్ణునిన్
గదిసిన నాతఁ డశ్వమును ♦ గ్రక్కున వెన్కకుఁదీసి యొక్కపె
ట్టదరఁగఁ దాఁకి సాశ్వుఁడగు ♦ నాసపుఖానుని గొంచుఁబోయెఁ బె
ల్లదిగి తృణంబు నెత్తుకొని ♦ యేగెడు నా సుడిగాలి కైవడిన్! 111

ఉ॥ సాహసవంతులున్ సమర ♦ శౌర్యనిధానులు రాజపుత్రులు
త్సాహభరంబుతోడ రిపు ♦ సైన్యములన్ జొరఁబారి చీల్పఁ ద
ద్వ్యాహిని పట్టుదప్పి నలు ♦ వంకలకున్ జెడఁబాఱె! నట్టి కో
లాహల మాకసంబు పగు ♦ లన్ గవిసెన్ నలుదిక్కులందునన్! 112

—॥ { ప్రతాపసింహుఁడు-తోడరమల్లు సైన్యముఁ దాఁకి చీకాకు గావించుట. } ॥—

మ॥ తనసూర్యధ్వజ మొక్కచేత నొకచే ♦ త నా శేష నాగేంద్రుఁబో
లిన దుర్వార కరాళ ఖడ్గము రుచుల్ ♦ నింపన్ జగజ్జాలమున్
దునుమాడన్ జనుదెంచు నాప్రళయ రు ♦ ద్రుండో యనంగాఁ బ్రతా
పనృపోత్తంసుఁడు కొండ డిగ్గి యహిత ♦ వ్రాతంబు డాసెన్ వడిన్! 113

ఉ॥ ఎత్తుననుండి వచ్చు కడు ♦ నెత్తగు నశ్వము! దానిపైన లో
కోత్తర శౌర్య సాహస స ♦ మున్నత మూర్తి ప్రతాపదేవుఁ! డా
యుత్తమువెంట నొత్తుకొని ♦ యుగ్ర బలాఢ్యులు సూర్యవంశ్య రా
హుత్తులు! మొత్తమై గదలి ♦ రుర్వి సమస్తము కంప మొత్తఁగన్! 114

క॥ ఆరాజపుత్ర సుభటుల
యారభటులు యవనసైని ♦ కాళుల పృథు గ
ర్జారావంబులు నిబిడం
బై రోదసి నిండిఁ పొంగి ♦ యవలికిఁ బర్వెన్! 115

మ॥ త్వర లంఘించుచు వచ్చి సింహములు మా ♦ తంగోత్తమాంగంబులన్
ఖర నిర్ఘాత నఖాగ్ర సంతతుల వ్ర ♦ క్కల్ చేయు చందాన భా
స్వర శౌర్యాఢ్యులు రాజపుత్రులు తురు ♦ ష్క శ్రేణిపై వ్రాలి నె
త్తురునన్ గండలు కాల్వలై ధరణియం ♦ దున్ బార్చి రొక్కుమ్మడిన్!

ఉ॥ శృంగము భంగమైన వృష ♦ భేంద్రుని చందము దోఁచఁ దోఁకఁ ద్రొ
క్కంగనె పైకిఁదూకు భుజ ♦ గప్రభు మాడ్కి సరోష సాహసా
భంగురమై తురుష్క భట ♦ వర్గము రేఁగుచు రాజపుత్ర సే
నాంగము వెన్కకున్ బడ మ ♦ హాబల ధాటిని దాఁకె నయ్యెడన్! 117

ఉ॥ కత్తులు తాఁకు చప్డు! మెయిఁ ♦ గప్పిన జోడులు చిన్గు చప్డు! రా
హుత్తులు వ్రాలు చప్పుడు! హ ♦ యోత్తమముల్ ధరఁగూలు చప్పుడుల్!
దుత్తలఁబోలె నెత్తురులు ♦ దూఁకెడు చప్పుడు! గాయ మొంది యె
గ్గెత్తినవారి చప్పుడులు! ♦ నెల్లెడ రేఁగె రణాంగణంబునన్. 118

ఉ॥ ఒక్కొక రాజపుత్రకుల ♦ యోధుని బెక్కురు చుట్టు ముట్టి యు
క్కెక్కిన మొగలుల్ గవిసి ♦ యెల్లెడ నొంపఁగసాఁగి రార! వా
రొక్కకరున్ ప్రతాపనృపు ♦ నుజ్జ్వలమూర్తు లనంగ వైరులన్
సుక్కఁగఁ జేసి! రెంతటి య ♦ శోనిధులో క్కొ! శిశోదియాకులుల్. 119

మ॥ పొదివియై తాఁకెను రాజపుత్త్రిల బలం ♦ బుల్ పుష్కలావర్తనీ
రదముల్ గాఁగఁ, బ్రతాపభావరుఁడు ప ♦ ర్జన్యుండుగాఁగన్, బ్రభా
స్వద వర్ణంబులు చంచలాతతిగ, శుం ♦ భత్ఖడ్గ తీవ్రాశనుల్
ఘదులై రాల్పఁ దురుష్క సైన్యములు ను ♦ గ్గున్ నూచమై సోలినన్; 120

మ॥ విరియన్ బాఱెడు వాహినీ నికరముల్ ♦ వీక్షింపఁగాలేక తో
డరము ల్లిందఱ హెచ్చరించుచుఁ బ్రచం ♦ డస్ఫూర్తిమై దాఁకె; సా
గరుఁడున్ సూక్తుఁడు కోపఘూర్ణిత కటా ♦ క్షశ్రీలు రంజిల్లఁ గే
సరియుగ్మంబు వలెన్ బ్రతాపుపయి ను ♦ త్సాహంబుతోఁ దూఁకఁగన్

సీ॥ త్రిజగద్విరోధులౌ ♦ త్రిపురాసురులతోడఁ
దొడరు కైలాసమం ♦ దిరుఁ డనంగ!
విలయకాలమున జృం ♦ భించు త్రేతాగ్నుల
ముంచెడు వరుణదే ♦ వుం డనంగ!
మాల్యవన్మాలి సు ♦ మాలి ముఖ్యులఁ బట్టి
వేధించు శ్రీమహా ♦ విష్ణుఁ డనఁగ!
ఖరదూషణాది ర ♦ క్షశ్శ్రేష్ఠులన్ గోప
మునఁ దాఁకు శ్రీరామ ♦ మూర్తి యనఁగ!
గీ॥ నసమ విక్రమ రణ సాహ ♦ సాంక మూర్తి
యాప్రతాపుఁడు సర్వసం ♦ హార లీల
సాఁగి సూక్త తోడరమల్ల ♦ సాగరులను
మించి కలగించి ఏఁచి డ ♦ య్యించె నపుడు. 222

మ॥ బరువై యొప్పెడు దీర్ఘఖడ్గము ప్రతా ♦ పస్వామి పై కత్తి తో
డరమల్లున్ బడమోది కంటకము గా ♦ డన్ జీల్చి సూక్తున్ ధరన్
బొరలన్ దప్పఁగఁ ద్రోసి సాగరు శిరం ♦ బున్ జూచి వేయంగ, ము
ప్పురు నవ్వీరుని మ్రోల నిల్వక పరి ♦ భూతాత్ములై పాఱిరన్, 123

మ॥ ఉరగవ్రాతము సంహరింపఁగ మహో ♦ గ్రోత్సాహముల్ బెంచు నా
గరటామంతుఁడు వానిచుట్టముల పై ♦ కన్ రాజరాజేశ్వరుం
డరుగన్ దెంచెఁ బ్రతాపుఁడున్ భటయుతుం ♦ డై! యావన శ్రేణికు
ర్భర తద్ఘోర కఠోరధాటికిఁ జలిం ♦ పన్ సాగ నాదస్వాంతముల్!

మ॥ కడు శాంతంబు నగాధమై పొలుచు నా ♦ గంభీర వారాశిలో
నుడుకున్ నీళ్లప్రవాహ మొక్కమొగమై ♦ యుప్పొంగుచున్ బాఱుకై
వడి రాణాయు శిరోదియా భటులు గ ♦ ర్భంబున్ బ్రవేశించి యు
య్యెడఁ దౌరుష్కచమూసమూహము బలం ♦ బింకించి రత్యుగ్రులై 125

ఉ॥ మందరశైల మంబునిధి ♦ మధ్యము చొచ్చి కలంచునట్లు చు
ట్టుందళమెందు మోగలు భ ♦ టుల్ పదులున్ శతముల్ సహస్రముల్
మ్రిందఁ బ్రతాపసింహుఁడు బ ♦ లస్థిరు లాతని యోధవీరు లం
దందఁ బరాక్రమస్ఫురణ ♦ మచ్చుపడన్ విహరించి రయ్యెడన్. 126

—॥ శ్యామసింహ—ఖాసింఖానుల యుద్ధము. ॥—

మ॥ ఇరువై యైదగు వేల యాశ్వికబలం ♦ బిరవ్వంకలన్ గొల్వ సు
స్థిర దుర్వార పరాక్రమక్రముఁడు ఖా ♦ సింఖానుపై శత్రుసం
హరణోద్యోగుఁడు శ్యామసింహవిభుఁ డా ♦ సాద్రీశుఁడున్ వీరకే
సరియోనాఁగఁ బరాక్రమించి నడిచెన్ ♦ ఝూలాన్వయుల్ గొల్వఁగన్.

మ॥ క్రతుకాలమ్మున యాయజూకుఁడు హవి ♦ ర్వ్రాతంబులన్ వహ్ని నా
హుతులన్ జేసెడునట్లు శత్రుభటులన్ ♦ యుద్ధంబునన్ దాఁకి శీ
ర్షతతిన్ దుంచుచు శ్యామసింహుఁడు గుహా ♦ సంఘాతముల్ వ్రక్కలై
క్షితిపైఁ గూలఁగ సింహనాదము నొన ♦ ర్చెన్ వీర శౌర్యార్భటిన్. 128

ఉ॥ దండధరోపమాన భయ ♦ దస్థిర మేచక దీర్ఘదేహు లు
ద్దండ కృపాణ పాణులయి ♦ దర్ప మెలర్ప మహామ్మదీయు లా
భండన సీమ వైరిభట ♦ భంజనమున్ బొనరింప, గాలిచేఁ
బండులు భూమిపైఁ బొరలు ♦ భంగి శిరంబులు దుల్లెఁ బెల్లుగన్ 129

శా॥ బాహాశౌర్యులు శ్యామసింహుఁడును ఖాన్ ♦ వర్యుండు శౌర్యోగ్రులై
బాహా-బాహి కచా-కచిన్ బల మెల ♦ ర్పన్ బోరఁ దద్దర్శనో
త్సాహశ్రీరతులొచు రెండుమొనలన్ ♦ దైవారు రాహుత్తు లెం
తో హర్షంబున మాన మూని రణమున్ ♦ దున్ నిల్చి రవ్వేళలో. 130

ఉ॥ అత్తఱి విక్రమించి భయ ♦ దాహవశౌర్యుఁడు శ్యామసింహ భూ
స్వత్త్రిలకుండు శీరకము ♦ ప్ఛేదిల మోదుచు ఖాను ఖడ్గము

ద్వృత్తి వియత్తలంబునకుఁ ♦ దెఱివ్వఁగఁ గొట్టి హయంబుఁ గూల్ప నో
రెత్తక వాఁడు మానము వ ♦ హించుచుఁ బాఱెను నేల దూఁకుచున్.

—॥ భానుసింహుడు - యవనసేనల నుఱుమాడుట ॥—

మ॥ దెసలెల్లన్ దన కేతనప్రభలు సం ♦ దీప్తంబులై వెల్గ సా
హసశౌర్యాంకుఁడు భానుసింహవిభుఁ డ ♦ య్యాదిత్యుఁడున్ బోలె వె
క్కసమౌ తేజముతోడఁ బొంగుచు విప ♦ క్షవ్రాతమున్ జీల్చి వి
రసమూహంబును మోహరించుకొను సం ♦ రంభంబు వీక్షించుచున్; 132

చ॥ యవనులవైపు యోధులను ♦ నా జయమల్లుఁడు రాయశీలుఁ డా
హవమున కెచ్చరింప రయ ♦ మారఁ దుపాకులు గాల్చి రందఱున్;
బవనము వీఁవ దుమ్మెదలు ♦ పద్మములన్ విడి వచ్చు నట్లు గుం
డ్లు వెడలి రాజపుత్రభట ♦ లోకముపైఁ బడియెన్ మహోగ్రమై. 133

చ॥ పిడుగులు గుంపులై పడెడు ♦ వీఁకను నిప్పులు రాలునట్లు పైఁ
బడెడు తుపాకిగుండ్లు జడి ♦ వానల పెల్లున కోర్వఁ జాలమిన్
దడఁబడి రాజపుత్రభట ♦ తండము ముందును వెన్క దోఁప క
య్యెడ స్పృహ లేక నిల్వఁబడె ♦ నెచ్చటి గుం పచటన్ స్థిరంబుగన్ 134

మ॥ "అకటా! శత్రులు వేయఁ బెల్లెగయు న ♦ య్యాగ్నేయ మాహేంద్రనా
గ కఠోరాస్త్రచయంబుఁ జూపులనె ద్రవ ♦ క్కల్ సేయు నో రాజపు
త్రకులారా! కడుస్వల్ప మియ్యనల వ ♦ ర్షంబున్ భరింపంగఁ జా
లక ముం దేగక వైరిఁ గూల్పకిటు ని ♦ ల్వన్ బాడియే! యియ్యెడన్."

చ॥ అనుచును భానుసింహవిభుఁ ♦ డడి హయంబుఁ గదల్చి వెంటరం
డని కదలన్ భటాళి నిబి ♦ డాతప మారవి వెంట నేగు న
ట్లనువున ధాటి లేచి యన ♦ లాస్త్రి శరంపర కోర్చి శత్రుసే
న నెదుగఁ బాఱె; నంతట ర ♦ ణంబు చెలంగె భయానకస్థితిన్. 136

చ॥ కడువడి రాజపుత్రులు ము ♦ ఖాముఖిఁ జెంతకు వచ్చి దూఁకి పైఁ
బడఁగ మహమ్మదీయులు తు ♦ పాకులు గాల్పఁగ వీలు లేక యా
బడెలను ద్రిప్పి మోదిరి; కృ ♦ పాణ భయంకర తీక్ష్ణ ధార లె
ల్లెడ నిగుడంగ వారి నల ♦ ఝుంచి కలంచిరి రాజపుత్రకుల్. 137

చ॥ తరణి నభంబునన్ దిరుగు ♦ దారి మెలంగుచు భానుసింహుఁడ
త్తతి జయమల్లు శీర్షకము ♦ ధాత్రిని వ్రాలఁగ మోది ముందుకున్
బరచుచు రాయశీలు ఘన ♦ వక్షము నుద్ధతి వ్రేయ నాతఁడున్
సరగునఁ బాతె ఖడ్గము భు ♦ జంబున సోఁకుచు నెత్తురొల్కఁగన్. 138

మ॥ ఖురసంఘట్టన రేఁగు ధూళి సమర ♦ క్షోణిన్ దివిన్ జేరఁగా
హరి శౌర్యాఢ్యులు రాజపుత్రకులు కో ♦ పాటోప మేపారఁ ద
త్కరవాలోగ్ర భుజంగకోటికిఁ దురు ♦ ష్క ప్రాణ వాతంబు ల
త్తఱిన్ భక్షింపఁగఁ బెట్టి యార్చిరి వియ ♦ ద్ధాత్రుల్ ప్రకంపింపఁగన్. 139

—॥ రామచంద్రదేవుని యుద్ధము. ॥—

మ॥ సమరోత్సాహ విజృంభమాణ పటుగ ♦ ర్జాస్ఫూర్తితోఁ గొండనుం
డి మనస్సింహుఁడు రామచంద్రపతి ఖం ♦ డేరావు దోస్సారులై
బాణవిండుల్ ముడిఁ దేలఁగా వెడలి య ♦ బ్దుల్లా చమూశ్రేణి స
ర్వము చీకాకుపడంగఁ దాఁకి సమయిం ♦ పన్ జొచ్చి రాచెంగటన్. 140

శా॥ తోఁకన్ ద్రొక్కు భుజంగరాజు వలె న ♦ బ్దుల్లా ఖొరాసాన్ భటా
నీకంబున్ బురికొల్పి గ్వాలియరు క్షో ♦ ణీనాయకున్ దాఁకె; ము
క్కాఁకల్ దీఱిన యానృపోత్తముఁడు ఖ ♦ డ్గం బెత్తి సింహం బటుల్
కేకల్ వేయుచు వానిమస్తముఁ బగి ♦ ల్చెన్ మోగలుల్ బెగ్గిలన్. 141

శా॥ పెల్లై రక్తము దూఁకి మూర్ఛిల, భటుల్ ♦ వీక్షించి శీఘ్రంబె య
బ్దుల్లాఖానుని మోసికొం చవలికిన్ ♦ బోవన్ మనస్సింహుఁ డ
త్యుల్లాసంబునఁ బొంగుచున్ రిపులపై ♦ నుద్వృత్తి లంఘించుచున్
దుర్విళ్ళన్ జేసెఁ దురుష్క వీరభటసం ♦ దోహంబు నిర్వంకలన్. 142

మ॥ ఒకమూల్తాను విభుండు దుర్దముఁ డలా ♦ యుద్దీనుఁడన్ వీరుఁడో
ర్వక యుద్ధాంగణమందు నర్దెసలకున్ ♦ బాఱన్ బ్రియత్నించు సై
న్య కదంబంబుల హెచ్చరించుచు దద ♦ ధ్యక్షత్వమున్ బూని యా
జికి ధైర్యం బెసరొత్తఁ జేసి మరలిం ♦ చెన్ బూన్చి యవ్వేళలో. 143

—॥ ఖండేరావు యుద్ధము. ॥—

సీ॥ పదునాఱు వర్షముల్ ♦ పాయని ప్రాఁపలేఁ
బ్రాయంబు సౌకుమా ♦ ర్యము వెలార్పఁ!

దరుణారు ణాబ్జప ♦ త్ర విశాలమగు తేట
కనుఁగవ పరమ భా ♦ గ్యంబుఁ దెలుపఁ!
దనమూర్తి సొబగు మ ♦ దన వసంత జయంత
సౌందర్యములకు సి ♦ గ్గందఁ జేయ!
నిజ తనుత్రాణ కాం ♦ తిచ్ఛట లఖిల భా
గములందు దుర్నిరీ ♦ క్షతను బెంప!
గీ॥ నసమ వజ్రాభరణ శోభి ♦ యై తనర్చు
దొడ్డకాంభోజ హయము ముం ♦ దునకుఁ ద్రిప్పి
రామచంద్రు ఖండేరావు ♦ రణ ముఖమునఁ
దాఁకె విక్రాంతి వఱల మూ ♦ ల్తాను దొరల. 144

మ॥ పులిపిల్లల్ చెలఁరేగి పైఁబడునటుల్ ♦ మూల్తాన్ ఖొరాసాను యో
ధులు కౌక్షేయక కుంత ముద్గర గదా ♦ దుల్ దాల్చి శౌర్యబు వా
టిల నొక్కుమ్మడి వచ్చి పైఁబడిరి; ఖం ♦ డేరాయఁడున్ దుర్భర
జ్వలనుండో యన యుద్ధసీమఁ జరియిం ♦ పన్ సాగె వీర్యాఢ్యుఁడై. 145

మ॥ నికటారామఫలాళిఁ బాలకుఁడు ఖం ♦ డింపన్ మొదల్ పెట్టు నా
రకమై పాచకసార్వభౌముఁడును గూ ♦ రల్ గోయు నట్లాచుఁ బా
నికమై వీరవిహారముల్ నెఱపి ఖం ♦ డేరావు తౌరుష్కయో
ధ కదంబంబుల మస్తముల్ దునిమె దు ♦ ర్దాంత క్రియాభీలుఁడై. 146

మ॥ వరుసన్ భీమ-ఘటోత్కచా-ర్జును లద ♦ ల్పన్ భీతిమైఁ బాఱు న
క్కురు సైన్యంబుల భంగిఁ బాఱిరి తురు ♦ ష్కుల్ రామచంద్రుండు, సు
స్థిర శౌర్యుండు తదీయపుత్రుఁడు, మన ♦ స్సింహుండు, దుర్దాంత వీ
రరసావేశముతో నరాతిభట శీ ♦ ర్షంబుల్ విదారింపఁగన్. 147

—। బేడ్లా — కొటేరియా ప్రభువుల యుద్ధము ।—

సీ॥ ప్రణయబద్ధులు చోహాణ ♦ వంశ్యమణులు
వీరమూర్తులు బేడ్లా-కొ ♦ టేరియా నృ
పతులు నాల్గువేలాశ్విక ♦ బలము గొలువ
యవనులను దాఁకి రపుడు భ ♦ యంకరముగ. 148

ఉ॥ గండశిలాప్రపంచము న ♦ గంబుననుండియు దొర్లినట్టు లు
ద్దండమహోన్నతాశ్వకవి ♦ తానము నాలుగువేలసంఖ్య పై
నుండియు మీఁదరా నిలువ ♦ నోపక యూవనసేన లన్నియున్
బండిన పైరునాఁ దలలు ♦ వాల్చుచు మ్రొగ్గె రణాంగణంబునన్. 149

మ॥ కవలున్ గౌరవసేనలన్ బొదివి వ్ర ♦ క్కల్ చేయు చందాన దా
నవసైన్యంబుఁ గలంచు దంతిముఖసే ♦ నానుల్ వలెన్ వచ్చి శౌ
ర్యవికాసంబునఁ జోహణప్రభు కుమా ♦ రద్వంద్వ మవ్వేళ శా
త్రవసైన్యంబుల కంఠలుంఠన మొన ♦ ర్చన్ సాగె వేభంగులన్. 150

—॥ భిల్లులు - యవనులతోఁ జేయు యుద్ధము. ॥—

మ॥ కడు నెత్తుండెడు కోటకొమ్మగుములన్ ♦ గండోపల శ్రేణిపై!
వడిఁ గూర్చుండిన భిల్లులున్ ధనువులన్ ♦ బాణాళి సంధించి సం
దడిగా నార్చుచు వేయఁగాఁ దొడరి; రే ♦ తద్బాణ సందోహముల్
జడివానల్ వలెఁ జెల్లు ముంచెను దురు ♦ ష్క ప్రాజ్య సైన్యంబులన్. 151

చ॥ అచల నితంబ భాగముల ♦ యందు రహించెడి గొప్పగుండులన్
బ్రచురబలుల్ కిరాతభట ♦ వర్యులు నూఱులు వేలు పట్టి ప్రా
నిచి కదలించి, దొర్లెడు ధ్వ ♦ నిన్ గిరు లన్నియు వ్రీల శత్రుహ
స్తిచయము నిల్చుచోటికిని ♦ జెచ్చెరఁ ద్రోసిరి గుంపుగుంపుగన్. 152

ఉ॥ ఆపయినుండి దుర్దమ మ ♦ హాబలధాటిని దాఁటివచ్చు గం
డోపలకోటి మార్గమున ♦ నున్న పదార్థములెల్ల నజ్జు గు
జ్జై పడ వ్రాలి మోగలు గ ♦ జావళిఁ జొచ్చి పదుల్ శతంబులున్
రూపఱ దొర్లసాఁగె యవ ♦ నుల్ ప్రళయంబున మున్ని కూలఁగన్ 153

మ॥ హనుమ ద్వానరభర్తృ శైలముల బా ♦ హాశక్తిమై తెచ్చి వై
చిన రామాయణ యుద్ధమందు నసుర ♦ శ్రేణుల్ వలెన్ వ్రాలి యూ
వన దంతావళకోటియున్ శిలలు పై ♦ వ్రీలన్ ధరన్ వ్రీలి యొ
క్కనిమేషంబున మ్రగ్గె నట్లవలెన్ ♦ గాత్రంబులున్ నుగ్గుగాన్. 154

చ॥ వెఱచుచుఁ గాలిమూఁకలును ♦ బిక్కబలంబునఁ బాఱె; నాశ్వికుల్
పరచిరి నోరులన్ దెఱచి ♦ ప్రక్కలకున్ గిరి నెక్కలేక; యు

ద్ధురతఁ దుపాకిపౌజులును ♦ దోడనె కాల్చిరి; కాని గుండు లా
గిరి పయినున్న భిల్లతతి ♦ కేగవకుఁ బోక పడెన్ ధరిత్రిపై. 155

శా॥ ఆమాయా శబరస్వరూప మనఘుం ♦ బై యింద్రకీలాచలో
ద్దామప్రస్థములన్ జరించు గజమై ♦ తద్ధ్వంసి చందంబునన్
భీమాటోపుఁడు భీమచాండు ధరణీ ♦ భృచ్ఛృంగమందుండి యు
గ్రామోఘ ప్రదరాళిఁ గూల్చెను విప ♦ క్షారణ్య సత్త్వంబులన్. 156

గీ॥ అలరి యలరించు నొక్కమా ♦ ఱా ప్రతాపుఁ!
బరుల నొకమాఱు కనుసన్న ♦ భ్రమియఁజేయు.
విడక యుభయసైన్యము మధ్య ♦ విజయలక్ష్మి
యబ్జనాళఘుఁ దూఁగుఁటు ♦ య్యాల నూఁగె! 157

—॥ మధ్యాహ్న వర్ణనము. ॥—

శా॥ మెండై యెండలు నిండెఁ; నల్దెసలఁ గ్ర ♦ మ్మెన్ నిప్పులన్ గుప్పు చు
ద్దండ గ్రీష్మ సమీరముల్; సిఖిల స ♦ త్త్వంబుల్ గడున్ డస్సెఁ; బ్ర
హ్మాండంబందుఁ బొగల్ సెగల్ తుటుములై ♦ వ్యాపించె; మధ్యాహ్నమా
ర్తాండుం డుజ్జ్వలకాండుఁడై గగన మ ♦ ధ్యంబందు వెల్గొందఁగన్ 158

ఉ॥ ఆతప నాతపోద్ధతికి ♦ నాయస వర్మము లెల్లఁ గ్రాఁగి సం
జాత కృశాను కీలలు భృ ♦ శమ్ముగఁ జిమ్ముటఁ జేసి యోధసం
ఘాతము దేహముల్ బడలి ♦ కల్ గని సేనలు రెండు వైపులం
దాతతి సుంత కన్మొగిచి ♦ నట్టులు కూర్కె నిమేషకాలమున్. 159

సీ॥ తలలపై బొమిడికం ♦ బుల యిన్పరేకుల
నలమి దహించు సూ ♦ ర్యాతపాగ్ని!
నలుదెసల మిడుంగు ♦ రులు చిమ్ము రక్త దీ
ర్ఘాక్షులఁ గోప భ ♦ యంకరాగ్ని!
ప్రాభాత సంగర ♦ వ్యాయామమున రేఁగి
జగము మ్రింగఁగఁ గోరు ♦ జాఠరాగ్ని!
భువన సంతతి నెల్లఁ ♦ బొడిపొడి గావించు
బహు బృహన్నాళాస్త్ర ♦ భైరవాగ్ని!

గీ॥ యన్నిఁటిని మించి లోకభ ♦ యంకరముయి
యతిశయిల్లు బాహాప్రతా ♦ పాగ్ని వెలుఁగ,
భటులు పంచాగ్ని యోగ భా ♦ వనల మెదిగి
మణులఁ దలఁపడి రసికి ని ♦ ర్జరులు పొగడ. 160

—॥ మానసింహుఁడు పరంగుల నుసికొల్పి పిరంగులు ప్రేలిపించుట. ॥—

చ॥ "ఇరువది రెండు వేల భటు ♦ లెల్లెడ నాలుగు అక్షు లున్న మ
మ్మరవఅచేయఁ జొచ్చి రక ♦ టా! గతియే''మని కుంది దక్షిణో
త్తరముల మానసింహుఁడు శ ♦ తఘ్నుల సంతతధార నిప్పులన్
గురిసి విపక్షసైన్యములఁ ♦ గూల్పఁగ నాజ్ఞ యిడెన్ భటాళికిన్. 161

సీ॥ మొగలాయి సేనా స ♦ ముద్రాంతరమునుండి
పొడతెంచు బడబాగ్ని ♦ మూర్తు లనఁగ!
రాణా ప్రభంజన ♦ రాజి మోగల్ శాఖ
నిలువ కూడెడు తాళ ♦ ఫలము లనఁగ!
రణదుర్గ వీర రా ♦ ద్రిమునఁ జేతి కొలంది
గుప్పు నిప్పుల గొప్ప ♦ కుప్ప లనఁగ!
దురక దండను తోఁటఁ ♦ దొడిమ యూడుచు దొర్లు
పరిపక్వ కూష్మాండ ♦ ఫలము లనఁగ!
గీ॥ సమయ మాంత్రికచూళి భూ ♦ తములఁ దనుప
నడుపు రక్తాన్న నిబిడ పిం ♦ డంబు లనఁగ!
నల పరంగులు పెనుపిరం ♦ గులను బేల్చ
రాలె దెసలఁ దప్తాయస ♦ గోళతతులు. 162

మ॥ అవి లోకంబులఁ గాల్పఁగాఁ దొడరు బ్ర ♦ హ్మాస్త్రాళివా నిప్పులన్
దివికిన్ జిమ్ముచు వ్రాలి యోధులను భే ♦ దింపంగ రాణా చమూ
నివహం బుబ్బట లూఁగి యెత్తువడి భ్రాం ♦ తిన్ జెంది వెల్వెల్లఁ బో
యి వితాకొందిన లేఁత మోముల విధం ♦ బేమంచు వాక్రువ్వఁగన్ 163

మ॥ గుముత్తై నిల్చి గుభా ల్గుభా లని పిరం ♦ గుల్ మ్రోగుచే కాని స
ర మునిశ్శబ్దతఁ దాల్చె; యోధతతి చా ♦ వన్ జూడఁగా లేక డెం

దమునఁ గుందుచు చాందుభట్టోక మహా ♦ దంతావళం బెక్కి యు
త్తమ గంభీర మనోజ్ఞ నిశ్చల గళ ♦ ధ్వానంబు శోభిల్లఁగన్, 164

-1 చంద్రభట్టారకుఁడు రాజపుత్రసేనలకు రణోద్రేకముఁ గలిగించుట. 1-

ఉ॥ "ఓయసమాన సాహస స ♦ మున్నత శౌర్య సమగ్రమూర్తులా
! రా యడలంగఁ బోకుఁడు పి ♦ రంగుల గుండ్లకు! ఖండ యుద్ధవి
ద్యాయుతులైన మీకుఁ గర ♦ మందు ధరింపఁగఁ బూలచెండ్లు గా
వే యవి! యొక్కమై దగులుఁ ♦ డీ! పొడియైపడ సర్వలోకముల్. 165

సీ॥ మొన్న గాఁ జిత్తూరి ♦ మూఁడవ ముట్టడి!
పదియునా ఱేండ్ల లేఁ ♦ బ్రాయమందె
కరకంకణములు మం ♦ గళ వస్త్రములతోడఁ
బెండ్లి పీటల నుండి ♦ వెడలి వచ్చి
పుత్త సూర్యద్వార ♦ మున శాత్రవులఁ గూల్చె!
భార్య చంద్రవదేండ్ల ♦ పఱచు రిపులఁ
గుప్పగూరగఁ ద్రుంచెఁ! ♦ గోమలి త్యాగ వి
క్రమములు సకల లో ♦ కములు మెచ్చె!
గీ॥ నా యరుంధతీ దర్శన ♦ మపుడె స్వర్గ
మునకు నచ్చరల్ కనుసన్న ♦ లను బొనర్ప
వలచు శౌర్యైక ధనులు మీ ♦ కొలము వార!
లతుల మతులారా! ఖేల్యా భ ♦ బాహులార! 166

సీ॥ గౌతమ గోత్రంబు! ♦ గాధిపురము రాజ
ధాని! యాచార్యుండు ♦ దైత్యగురుఁడు!
వంశంబుకర్త వి ♦ శ్వామిత్రుఁ! డాస్వర్గ
మర్త్యముల్ మునుపు స్తం ♦ భన మొనర్చెఁ!
బదునాల్గు లోకముల్ ♦ పైకి వచ్చిన సుంత
కీ డెఱుంగనిది రా ♦ ఠోడ కులము!
బిగఁబట్టి తెచ్చి ని ♦ ల్పినఁ దురుష్కులు మీ ము
ఖముఁ జూడ వెఱతురన్ ♦ ఖ్యాతి గలిగె!

గీ॥ నఖిల భారత వీర మ ♦ హా భవనము
గోపురమున నెత్తిన పూర్ణ ♦ కుంభతుల్యుఁ
డగుచు మీరెండిరి జయమల్లు ♦ యశముఁ గాంచె!
దివ్యమ్ము దేహేంద్రిసింహా! యో ♦ తేజసింహా! 167
సీ॥ సామ్రాజ్య మఖిలంబు ♦ సవతి తమ్మున కిచ్చె
సంతతత్యాగి యో ♦ చండనృపతి!
యో బయానాసీమ ♦ నరుల తలల్ వేలు
రాలఁగా విహరించె ♦ రత్నసింగు!
చిత్తూరుకోట డు ♦ స్సనచోట నిలిచి దు
ర్గారావు ప్రళయ కా ♦ ద్రమునఁ బోరె
నెనిమిదేడుల కింద ♦ నీరేడు లోకముల్
జయవెట్ట వర్తించె ♦ సాహిదాసు!
ఆ॥ సకల పూజ్యమైన ♦ చండేశు వంశంబు
స్వామి భక్తి యుగ్గు ♦ పాలఁ బెటిగె!
నా కులంబు వీరు ♦ లందు నాయకమణి
కృష్ణసింహ విభుఁడు ♦ కృష్ణ నిభుఁడు. 168
సీ॥ జగదేక దుర్నిరీ ♦ క్ష పరాకాశు లటన్నఁ
జూపు నూర్ల కొలంది ♦ సూర్యకులము!
నిత్య సత్యవ్రత ♦ నిష్ఠావరు లటన్నఁ
జూపు వేల కొలంది ♦ సూర్యకులము!
కండ లొలిచి యిచ్చు ♦ ఘనవదాన్యు లటన్న
జూపుఁ లక్ష కొలంది ♦ సూర్యకులము!
లోకంబులెల్ల గె ♦ ల్చు ధనుర్ధరు లటన్నఁ
జూపుఁ గోట్ల కొలంది ♦ సూర్యకులము!
గీ॥ క్షోణి వెలయు నసంఖ్యాక ♦ కులము లందు
సురలకును సాయ మొనరించె ♦ సూర్యకులము!
సూర్యకులము దూరం బుంచి ♦ చూచు నెడల
నఖిల భువనంబు లంధకా ♦ రావృతములు! 169

సీ॥ ఇక్ష్వాకు వెటు లోక ♦ హితుఁడు! కాకుత్స్థ త్రి
శంకులు మఱి హరి ♦ శ్చంద్రుఁ డెట్టి
వారు! మాంధాత ప్రా ♦ భవ మెంత! నాభాగుఁ
డంబరీష భగీర ♦ థాది నృపులు
సామాన్యులే! యిఁక ♦ సగర-దిలీప-ర
ఘు క్షితీశుల కీర్తిఁ ♦ గొలువఁ గలమె!
బ్రహ్మాండ మంతయుఁ ♦ బ్రాసున నిడిన నిం
దుల నొక్కఁడొక్కఁడే ♦ తూఁగఁ గలఁడు!

గీ॥ భువన సామ్రాజ్య లక్ష్మికా ♦ పురము చేయు
వజ్రహార్మ్యరాజంబు మీ ♦ భాను కులము!
శత శత నమస్కృతులు చేసి ♦ సకల జగము
నీపదముఁ గొల్చు టరుదె ప్ర ♦ తాపదేవ! 170

సీ॥ కాఫరిస్థాన్ ప్రజా ♦ గణము నేఁటికిఁగూడ
బప్పరాయల ఖడ్గ ♦ పటిమఁ బొగడు!
నాఖోరాసాన్ దేశ ♦ మందు ఖోమనసింహా
నాణెంబు లింకను ♦ నడచుచుండ!
సమరసింహేంద్రు వి ♦ క్రమగాథ లెల్లపు
ఘోరీజనులు కొడు ♦ కులకుఁ దెలుపఁ!
గుంభరాణా శౌర్య ♦ జృంభణం బేవేళ
దేశదేశములు కీ ♦ ర్తించుచుండ!

గీ॥ భారతీయుల యొడళులఁ ♦ బ్రాణ ముండ
మఱువ నేర్తురె రవివంశ ♦ మహిమ మెపుడు!
ధర్మ సంస్థాప నార్థమే ♦ తత్కులమున
దేవుఁడై పుట్టితి ప్రతాప ♦ దేవ! నీవు. 171

సీ॥ భరతఖండ క్షమా ♦ భరము నిజోద్దండ
బాహు దండంబున ♦ వఱలఁ జేసి
జగమెల్ల జయపెట్ట ♦ శకము నిల్పిన మేటి
విక్రమాదిత్య ప్ర ♦ థ్వీ విభుండు!

సతత మింద్రప్రస్థ ♦ సామ్రాజ్యమున సార్వ
భౌమ పరంపరఁ ♦ బాదుకొలిపి
బహుకాల మేలి శా ♦ శ్వతకీర్తిఁ గనిన య
నంగపాలాది రా ♦ ట్పుంగవులును!
ఆ॥ సకల సుగుణ గణవి ♦ శాలు రేవంశసా
గరము గనిన దొడ్డ ♦ కౌస్తుభమ్ము!
లట్టి మేటి వంశ ♦ మపకీర్తిఁ బడకుండఁ
జూరరయ్య! త్వరయ ♦ వీరులార! 172
సీ॥ పావకాన్వయ సంభ ♦ వ క్షత్రియుల కెల్ల
నాధారయష్టి చో ♦ హాణ కులంబు!
ము న్నేడవ శతాబ్ద ♦ మునఁ దురుష్కులను ఖం
డించె లక్షలుగ మా ♦ ణిక్యరాయఁ!
డితని యన్న కుమారుఁ ♦ డేఁడేండ్ల లాటుండు
దస్యుకోటిని ద్రుంచి ♦ తాను మడిసె!
సకల వీరప్రపం ♦ చము మాళి వెలయు ది
వ్యజ్యోతి యితఁడను ♦ ఖ్యాతిఁ గాంచె!
గీ॥ నతని తండ్రి దూలారావు ♦ యవన వీర
వాహినీ వార్థి కుంభసం ♦ భవ మహర్షి!
మిమ్ముఁ గనినంత జగము కం ♦ పించుచుండు!
బాహుబలులార! చోహాణ ♦ ప్రభువులార! 173
సీ॥ ఆ యనంగు ననుంగు ♦ టాఁడు బిడ్డకొడు! కిం
ద్రప్రస్థ పురము పు ♦ ణ్యముల పంట!
సోమేశు కులవార్థి ♦ శుభ్ర మరీచి! రు
క్మాంగ గర్భ శుక్తి ము ♦ క్తాఫలంబు!
సమరసింహుని స్నేహ ♦ సౌహార్ద ప్రతిమ! పృ
థామహాదేవి సా ♦ దర్య ధనము!
కల్యాణు మేనత్తి ♦ కపు ముద్దుమామ! సం
యుక్తా మనోజ్ఞ భా ♦ నూదయంబు!

గీ॥ సమద జయచంద్ర జలద జం ♦ ఝూ మరుత్తు!
ఘోరి గజ సింహ! మితనిఁ బోల్ ♦ వీరు లేరి!
యీచతుర్భుజ రాజేంద్రు ♦ నెన్నఁదరమె!
పృథ్వి రాజై చతుర్భుజుం ♦ డెసఁగెఁ గాక. 174

శా॥ సౌరాష్ట్రంబుననుండి వచ్చుచుఁ దురు ♦ ష్క శ్రేణిఁ జక్కాడుచో
మారాణాలను దొల్తనుండి బలసం ♦ పన్నాన్యులై కొల్చు దో
స్సారం బెల్ల జగంబునన్ బొగడె! మీ ♦ ఝాలా మహావంశ మా
ధార స్తంభము భారతాభ్యుదయ సౌ ♦ ధస్థాయితన్ నిల్చెఁగన్. 175

శా॥ ఐదాదేఁడుల చిన్నకుఱ్ఱలయినన్ ♦ హార్యక్షశాబంబు ల
ట్లాదస్యుప్రకరంబుఁ గూల్చు కులమ ♦ ర్యాదల్ వెలుంగన్ రిపు
చ్ఛేదంబున్ బొనరించి వారితలలన్ ♦ జెండాడి చెండాడుఁడీ!
యేదీ చూతము మీభుజాబల మహా ♦ హేలా కళా దీధితుల్! 176

ఉ. తొమ్మిది నూఱులేండ్లు ధృతి ♦ తో నెలకొల్పు మతాభిమానభా
వమ్మును మాతృభక్తి ఫల ♦ పాకము వమ్ముగ వైరి నోర్చు తూ
కమ్మునఁ దక్కువైన; వటు ♦ గావున నిష్ఠుర దీక్షఁ బూని శౌ
ర్య మ్మఖిలంబు చూపి రిపు ♦ లందఱ నొంపరె! కీర్తి నింపరే!'' 177

మ॥ అని విప్రోత్తముఁ డంబుద స్వనముతో ♦ నందందునన్ నిల్చియుం
డిన యవ్వీరుల వంశగౌరవము వ ♦ ర్ణింపన్ శ్రవఃప్రీతిగా
విని యాద్యంతము సైన్యమంతయు విజృం ♦ భించెన్ సముద్రంబు పొం
గిన చందమ్మున భూరి వీర రస సం ♦ కీర్ణ ప్రభావమ్మునన్. 178

ఉ॥ అంతట మానసింహ విభు ♦ నాజ్ఞఁ బరంగులు పెన్ పిరంగు ల
త్యంతజవంబు రౌద్రమును ♦ దార్కొనఁ ద్రిప్పుచుఁ జెంతనున్న మం
దెంతయుఁ దొంటికన్న నిపు ♦ డిబ్బడి ముబ్బడిగాఁగఁ బ్రేల్చెఁ గ
ల్పాంత మహాశనిప్రతతి ♦ యు ట్లని యాత్మబలంబుఁ డాయుచున్, 179

గీ॥ హరుని నయనాగ్నిఁ బొడమి ది ♦ గంతరములఁ
గ్రమ్ము చండాగ్నికణముల ♦ కరణి యవన
సైనిక ముఖాబ్జ నిర్గత ♦ చంచరీక
పటలములు పైన వ్రాలెఁ దు ♦ పాకి గుండ్లు! 180

—॥ రాఠోడ్తేజసింహుఁడు విజృంభించి పిరంగుల పైకేఁగుట. ॥—

సీ॥ ఆజాను దీర్ఘ బా ♦ హార్గళ యుగళంబు
సమధికోదాత్తల ♦ క్షణముఁ దెలుప!
నతనుసింహాసనం ♦ బైన వక్షము మహా
రాజన్య పట్టభ ♦ ద్రిత వెలార్ప!
నరుణ రేఖా మనో ♦ హర దీర్ఘ నేత్రముల్
సతత లక్ష్మీనివా ♦ సతను బెంప!
దర్శనీయంబైన ♦ తనమూర్తి నవకోటి
మన్మధ సౌందర్య ♦ మహిమ నింప!
గీ॥ నమృత రస మొల్కు మొలక న ♦ వ్వలరు మోము
శతశరచ్చంద్ర సౌభాగ్య ♦ సరణి గేరఁ!
దన భటుల వీడి హయము ముం ♦ దునకుఁ ద్రిప్పె
ధీర లోకైకమౌళి యా ♦ తేజసింగు! 181

సీ॥ రణదుర్గ పరమ శౌ ♦ ర్య ప్రాభవము మెచ్చి
పైఁజల్లు శతపత్ర ♦ పటల మనఁగ
గుహలు మార్మ్రోయంగ ♦ బహు శతఘ్నిక లవి
చ్ఛిన్న ధారల నగ్నిఁ ♦ జెఱఁగుచుండ
వేదమంత్రముల దీ ♦ వించుచు భూదేవ
తతి చల్లు మంగళా ♦ క్షతల నడుమఁ
గరములు ముకుళించి ♦ శిర మొకించుక వాల్చి
పెండ్లికొడుకు మ్రొక్క ♦ వెళ్లినట్లు
గీ॥ గుదియఁ గేడెంబుఁ జేతుల ♦ గుదిల పఱచి
చిత్రధార నశ్వముఁ బూన్చి ♦ శిరము వంచి
పరమ సాహసుఁడగుచు బ ♦ ర్వతము డిగుచుఁ
దేజసింగు పిరంగుల ♦ దెసకు ధూఁకె! 182

ఉ॥ "నిమిషంబుఁ నిను వీడి యుండఁగలమే ♦ నీతోడిదే మాకు లో
క"మటంచుఁ దమ జన్మమాది దృఢదీ ♦ క్షా భక్తులఁ గొల్చు ను

త్తమ రాఠోడ్కులవీరు లందఱును మొ ♦ త్తంబై నిజాధీశు పా
దములన్ గొల్వఁగ వెంటఁ దూఁకి రరిసం ♦ తానమ్ము చింతింపఁగన్ 183

శా॥ ఆలోకోన్నత శౌర్యసాహస సమ ♦ గ్రాశ్చర్య దృశ్యంబుఁ దా
మాలోకించుచు రెండుపక్షముల వా ♦ "రౌరా! సురల్ గూడ నీ
లీలల్ నేర్తురె! నీసమాను లిలలో ♦ లే" రంచుఁ దద్విక్రమ
శ్రీలన్ బాడిరి తేజసింహునకు "జే! ♦ జే!" యంచుఁ గీర్తించుచున్.

—॥ రాఠోడ్ తేజసింహునకు సలుంబ్రాకృష్ణసింహుఁడు తోడగుట. ॥—

శా॥ దూరంబందున నుండి యాకృతులు సం ♦ తోషమ్ముతోఁ జూచి "యౌ
రా! రాఠోణ్మణీ! నీబలోద్ధతి ప్రపం ♦ చాతీత! మద్దానికిన్
బారం బున్నదె" యంచు మెచ్చుచు సలుం ♦ బ్రాస్వామి చోండావతుల్
బారై కొల్వ శతఘ్నికాతతిపయిన్ ♦ లంఘించె సింహాకృతిన్. 185

మ॥ తనచేఁ గాలుని దండమంతటి గదా ♦ దండంబు సంధించి భీ
ముని చందంబున గొప్పకన్నుఁగవ ని ♦ ప్పుల్ రాల దుర్దాంత వృ
త్తిని రోషించుచుఁ దేజసింహుఁడును నాం ♦ దిన్ దీర్చి పుణ్యాహవా
చనమున్ జేసె శతఘ్నికాత్రయము పి ♦ చ్చుల్ గాఁ బడన్ మోదుచున్

మ॥ ఖరఖడ్గంబునఁ బోర్చుగీసుభటులన్ ♦ ఖండించుచున్ ఘోర ము
ద్గరఘాతంబుల నాశతఘ్నులను వ్ర ♦ క్కల్ చేయుచున్ లోక సం
హారణోద్యోగ పరాయణుండగు న ♦ పర్ణాధీశ్వరున్ బోలి సు
స్థిరరౌద్రోద్ధతిఁ దేజసింహుఁడు చరిం ♦ చెన్ శాత్రవుల్ బెగ్గిలన్. 187

మ॥ సునిశాత స్థిర వీరవిక్రమ యుతుల్ ♦ చోండావతుల్ వారి ప్ర
క్కన రాఠోడులు బాహుశక్తి యలరం ♦ గా నా"మహారా"యె డా
రిని నిప్పుల్ దిను కోడిపుంజులటు లు ♦ ద్వృత్తిన్ శతఘ్నీచయం
బును వ్రయ్యల్ పడ మోదసాగిరి గదా ♦ భూరి ప్రఘాతంబులన్. 188

చ॥ కెరలుచు వ్రాలుచున్ బుడుత ♦ కీచులఁ గూల్చుచు నాశతఘ్నులన్
జెఱచెఱలాడి పరిక్కలుగఁ ♦ జేయుచు దక్షిణ మాది చేసి యు
త్తరమున కేగు లోకభయ ♦ దవ్రతనిష్ఠుఁడు తేజసింహ భూ
వరమణి యుత్తరాయన ది ♦ వాకరుఁబోలె వెలింగె నత్తఱిన్. 189

సీ॥ ఖగరాజు కినిసి ప ♦ న్నగరాజు శీర్షముల్
చిదురుపలై వ్రాలంగ ♦ జెండి నట్లు!
వానకారునఁ గృషీ ♦ వలుఁడు గుద్దలి పట్టి
పుట్ట లన్నియుఁ దెగఁ ♦ గొట్టి నట్లు!
కడురోషమున లోహ ♦ కారుండు మండెడు
మూసలన్నియు డుల్ల ♦ నేసి నట్లు!
గ్రీష్మవాతము బిట్టు ♦ రేఁగి యారామ జ
పా పుష్పముల రాల్చి ♦ వైచి నట్లు!
గీ॥ దండధర గదాదండ ప్ర ♦ చండ దీర్ఘ
దండమున శతఘ్నీనము ♦ దాయ పృథుల
వక్త్రములు వ్రక్క వ్రక్కలై ♦ పడఁగ మోదెఁ
దేజసింహుండు క్షాత్రసం ♦ దీప్తుఁడగుచు! 190

మ॥ వడిమై నిప్పులయేఱు దాఁటి భువన ♦ వ్రాతంబుపై నెత్తి వ
చ్చెదు వైవస్వతుఁడో యనంగ "బదనూర్ ♦ సింహంబు" రాఠోడు లె
ల్లెడఁ జుట్టుక్ దనుఁగొల్వఁగా యవన వా ♦ హిన్యగ్రముక్ దాఁకి యొ
క్కఁడు విక్రాంతి భటాళి మస్తముల ను ♦గ్గుక్ నూఁకగా దంచినక్;191

—॥ యవనసేనాపతు లొక్కుమ్మడి రాజపుత్ర సేనలను దాఁకుట. ॥—

ఉ॥ ఆరటమంది సైన్యవిభుఁ ♦ డాసఫుఖానుఁడు రాయసింహు న
బ్దారహిమానునిక్ సమర ♦ ముష్కరు నాషహ బాజుఖానునిక్
జేర గఁబిల్చి సైన్యములు ♦ చేరిచి నల్వురు గూడి శౌర్యదు
ర్వారులు రాజపుత్రకుల ♦ పై దొడరక్ నియమంబు చేయుచుక్, 19

మ॥ తనకంఖాణ హయంబు ద్రిప్పి సముదా ♦ త్తప్రాఢి నా తేజసిం
గు నెదిర్చెక్; షహబాజుఖాను దవిలెక్ ♦ గ్రోధోద్ధతుక్ గృష్ణసిం
హుని; ఖేల్వావతి దూరమందు సకలం ♦ బూహించి యత్యంత ధా
టిని జేరక్ జని రాయసింహవిభుఁ బ ♦ ట్టెం బైపైఁ గేయుండనక్.193

మ॥ బదనూర్సింహము సింహవిక్రమమునక్ ♦ బైవచ్చి ఖడ్గద్యుతుల్
చదలక్ బర్వఁగ నొక్కమైఁ దగిలె నా ♦ సప్ఖాను; వాఁడంత బె

ట్టిదమహా కోపముతోడఁ గుంతమును నా ♦ టెన్ నీర్ఘవక్షంబుపై;
నదితుంటల్ పడెఁ దేజసింహవిభు ఘో ♦ రాసిప్రయోగంబునన్. 194

మ॥ త్వరమై సాయుధుఁడై చు వాఁడు బదనూర్ ♦ భర్తన్ సమీపించె; నా
బిరుదున్ వీర రసాబ్ధి పేచికవలెన్ ♦ పీతెంచె నాఖానుపై;
మెఱుపుల్ వోలెఁ గృపాణముల్ దిరిగె; గ్రి ♦ మ్మన్ వాజిపై వాజి; యా
పరివేషమ్ముల సూర్యచంద్రులవలెన్ ♦ భాసిల్లి రయ్యిర్వురున్. 195

మ॥ కరవాలమ్ములు నాగుపాములవలెన్ ♦ గంఠంబులన్ జుట్టె; ని
ర్భర వ్రేటుల్ మఱి పోటు లిన్నియనుచున్ ♦ రూపింప రాకుండె; భా
స్వర ఖడ్గంబునఁ దేజసింహనృపుఁ డా ♦ సప్ఖాను మోదంగఁ, ద
త్తురగం బీల్గినఁ జెట్టుతోడఁ బడు మ ♦ ర్త్యుం డట్లు వాఁడున్ బడెన్! 196

ఉ॥ ఆ రణవీరుఁ డిట్లయిన ♦ నవ్వల దాఁటుచుఁ దేజసింహుఁ డ
బ్దారహిమానుపైఁ గవిసెఁ; ♦ దోడని వాఁడును దాఁకె, వారిధిన్
వారిధి దాఁకు నట్టులు; ర ♦ ణంబు క్షణంబున ఘోర మయ్యెఁ; బా
కారి బలాసురుల్ పెనఁగు ♦ నట్టులు పోరఁగ సాఁగి రిర్వురున్. 197

ఉ॥ భూరి భుజాప్రభావ గుణ ♦ మున్ బ్రకటించుచుఁ దేజసింహుఁ డ
బ్దారహిమాను ఖడ్గరణ ♦ దుర్వహ శక్తి వెలుంగ, నుగ్రులై
యారణవేది వెల్గెడు మ ♦ హాదహనోగ్రసమగ్ర మూర్తులై
పో రొనరించి రిర్వురును ♦ బూర్ణ పరాక్రమ రేఖ మెప్పఁగన్. 198

శా॥ ఔరా! నీదగు సాహసం''బని మనం ♦ బందెంచుచున్ విద్విష
ద్ఘోరారణ్య దవానలుండు బదనూర్ ♦ పృథ్వీశ్వరుం డశ్వమున్
ప్రేరేపించుచు ముందు దూఁకి తనవై ♦ రిన్ గుఱ్ఱ మందుండి దు
ర్వారేభంబు మృణాళమున్ గొనిన తే ♦ వన్ గొంచుఁబోయెన్ వడిన్.

ఉ॥ సైంధవుఁడో యనంగ బల ♦ సాహసుఁ డాషహబాజుఖాను ద
ర్పాంధుఁడు ప్రోవకడ్డుపడ ♦ నాతనిఁ బైకొనెఁ గృష్ణసింహుఁ డా
కంధిని జొచ్చు కుంజరము ♦ కైవడిఁ! దద్బలధాటి వాఁడు వ్రా
లెం ధరపైన దోమయుఁ బ ♦ లెన్ గనుమూసిన యంతలోపలన్. 200

మ॥ పరమోదారుఁడు రాయసింహవిభు ఖే ♦ ల్వాభర్త యాకౌరవే
శ్వరుసిన్ దాఁకెడు సాత్యకిన్ బలెఁ గడున్ ♦ సంరంభ మేపార సం

గర రంగంబునఁ దాఁకి యాతని భుజా ♦ గర్వమ్ము వమ్మై చనన్
గరవాలమ్మున వేయ నాతఁ డుఱికెన్ ♦ గాయంబు గాయంబుగాన్. 201

శా॥ ప్రావృట్కాల పయోధర ప్రతతి తే ♦ వన్ రేఁగి రాఠోడు చోం
డావద్వీరు లరాతిసైన్యపట లాం ♦ తర్భాగమున్ జేరి వీ
రావేశమ్మున వైరి వీర తతి నం ♦ దందన్ విదారించుచున్
ప్రోవుల్ ప్రోవులు వోసి రెల్లెడ నమి ♦ ద్భూమిన్ శిరశ్శ్రేణులన్! 202

ఉ॥ చండపరాక్రమంబు భుజ ♦ శౌర్యము శోభిలఁ దేజసింహుఁడున్
ఖాండవమున్ దహించెడు ధ ♦ నంజయుఁ బోలె నరాతి యోధులన్
మెండుగ శీర్షముల్ తఱిగి ♦ నేలకుఁ గోలకుఁ దెచ్చినంత నా
భండనసీమ మొగలులు ♦ పచ్చము పాఱుగఁ గూలి రెల్లెడన్! 203

మ॥ పరసేనన్ బదనూరుభర్తయు నలుం ♦ గాప్రినేతయున్ జొచ్చి యి
రువ్వురు ఖడ్గంబుల కప్పు తిరని పనిన్ ♦ బుట్టించి! రవ్వాగ్రి వీ
రరసోద్రేకమునందుఁ జిక్కి యమదం ♦ ష్ట్రా మధ్యమున్ జొచ్చు నా
కరణిన్ వైరులు నూగ్గు వేలుగను ద్రుం ♦ గన్ సాఁగి రవ్వేళలో. 204

ఉ॥ ఓడలు గుంపుగూడుచు మ ♦ హోదధియందలి నీటి మొత్తమున్
దోడనె చించుచున్ జవము ♦ తోఁ జనున ట్లరిసేనఁ జొచ్చి చ
క్కాడుచు వార లిర్వురును ♦ నాశ్విక వర్గము గొల్వ సంగర
క్రీడల ద్రేఁగు చూపి విహ ♦ రించిరి శాత్రవ మధ్యసీమలన్. 205

—॥ ప్రతాపసింహుని ద్వితీయ యుద్ధము ॥—

మ॥ ద్విసహస్రంబు శిశోదియాభటులు సే ♦ వింపన్ ప్రతాపప్రభుం
డసమాన స్థిర వీర విక్రమ కళా ♦ వ్యాపార మేపార శ
త్రుసమూహంబుల మీఁదికిన్ వెడలి గొం ♦ తుల్ గోసి కోరాడి యు
గ్ర సహస్రాంశుఁడు వోలెఁ దేజము వెలుం ♦ గన్ నిల్చె దుర్వారుఁడై.

మ॥ కడుదట్టంబయి యొప్పు చెట్టడవి చీ ♦ కాకై ధరన్ వ్రాల సం
దడిమై దంతిపరంపరల్ గవియు చం ♦ దంబార, రాణాప్రతా
పుఁడు తద్యోధులు వైరిసైన్యము ముఖం ♦ బున్ జీల్చి దోర్దర్ప మే
ర్పడఁ దన్మధ్యమునందు దూఁకి రహితుల్ ♦ పాటింగ నల్దిక్కులన్. 207

శా॥ తోడర్ మల్లును యుద్ధనైపుణకళా ♦ దోస్సారుఁడౌ యోధులన్
దోడై కొల్వ, శిశోదియా పరిభవశ్రే ♦ ణ్యగ్ని వీకన్మై దాఁకి పో
రాడన్ జూచెఁ; బ్రతాపసింహవిభుఁ డు ♦ ద్యద్ధాటిఁ దచ్ఛీర్ష మూఁ
టాడన్ ఖడ్గము నెత్తి మోది యరిమ ♦ ధ్యంబందు దూఁకెన్ వడిన్ 208

ఉ॥ రోసము నొంది చుట్టును దు ♦ రుష్కులు కొందఱు కొల్వ లోకసం
త్రాస విశేషశౌర్య బల ♦ దర్పుఁడు సాగరుఁ డగ్రసోదరున్
డాసెఁ; బ్రతాపుఁ డాతని తు ♦ ణంబునఁ గ్రిందికిఁ దెచ్చె; నిట్టి భ
స్మాసురుఁ డట్టి యుగ్రనిట ♦ లాక్షుని చెంగట నిల్వ నేర్తునే! 209

శా॥ దూరంబందుఁ దురుష్కయోధులను సూ ♦ క్తుం బొక్కెడన్ జేర్చి "మీ
రీ రాణా నెదిరించి కూల్చుఁ"డన వా ♦ రెల్లన్ బ్రతాపేంద్రుపై
బారై దూఁకిరి; కొందఱన్ దనియఁ గో ♦ పస్ఫారితన్మై సూక్తునిన్
జేరన్ బోయి తదీయ శీర్షకముఁ జిం ♦ చెన్ రాజమార్తాండుఁడున్. 210

చ॥ జలరుహబాంధవుం డుదయ ♦ శైలము నెక్కినఁ దత్ప్రకాశముల్
నలుదెసలన్ వడిన్ గవియు ♦ లాగు ప్రతాపుఁ డరాతి సైన్యసీ
మల మెలఁగన్ దదీయభట ♦ మండలి చుట్టును జుట్టుకొంచు మో
గలు భట శీర్షకోటి కడి ♦ కండలుగా నిలరాల్చె నయ్యెడన్. 211

సీ॥ అతిపావనంబు హా ♦ రావళీశైల రా
జమున హల్దీఘాటు ♦ సవనశాల!
యతులప్రతాప బా ♦ హావీర్యభర యశో
ధనుఁడు తోడరమల్లు ♦ దక్షుఁడాని!
యాతని యాజమా ♦ న్యమునఁ జేరి మెలంగు
రాజపుత్రకులు ని ♦ గ్జుల గణము!
వేలకువేలు సే ♦ వించు యావనభటుల్
వ్రేలెడు పోఁడుగ ♦ డ్డాల బుష్టులు!

గీ॥ శూరవరులు శిశోదియా ♦ వీరభటులు
ప్రమథ గణములుగాఁ! బ్రతా ♦ ప ప్రభుండు
ప్రళయభైరవ విగ్రహ ♦ ప్రాభవమున!
నరి చమూతతిఁ జొచ్చి చ ♦ క్కాడె నపుడు. 212

మ॥ కఱకుంభీరపు రాజపుత్రకుల డా ♦ కల్ సైపఁగా లేక యా
కొఱప్రాణంబులతోడ నెల్లెడఁ దురు ♦ ష్కుల్ పాఱఁగాఁ జొచ్చి! రా
హారిశౌర్యుండు ప్రతాపుఁడుల్ యవనసే ♦ నాంతంబుఁ బ్రాపించి శం
ఖ రవంబుల్ బొనరించె భూధర గుహా ♦ గర్భంబు లూఁటాడఁగల్. 213

మ॥ ప్రళయాంభోధర గర్జనంబువలెఁ ద ♦ ధ్వానంబు వీతేర న
వ్వల నిల్వంబడు మానసింహవిభు నం ♦ బర్ యోధులుల్. జెంతనే
పులి గాండ్రించిన దద్దఱిల్లి హరిణా ♦ బుల్ పాఱు చందాన, ది
క్కులకుల్ బాఱఁగఁ జొచ్చి; రెంతభయ మొ ♦ కో! యా ప్రతాపుండనల్

గీ॥ అంతలోఁ బ్రక్కనున్నట్టి ♦ యవనసేనఁ
జెండు బెండాడి శ్రీకృష్ణ ♦ సింహవిభుఁడు
శంఖనాదంబు విని చాల ♦ సంభ్రమమున
స్వామి యొద్దకు మెఱుపట్లు ♦ వచ్చినూఁకి. 215

మ॥ "అకటా! యొంటిగ నిట్లు రాఁదగునె! దే ♦ వా! శత్రుమధ్యం బపా
యకర స్థానము! వైరి సైన్యము లసం ♦ ఖ్యాకంబుగా నున్నచో
టికి రాఁ జెల్లదు! నాదు ప్రార్థనముఁ బ్రా ♦ టింపుం డటం చొందు ప్ర
క్కకుఁ గళ్లెంబును బట్టియశ్వముఁ ద్రోలం ♦ గదిప్పెఁ గార్యజ్ఞుఁడై. 216

చ॥ పువు వికసించినట్లు మొగ ♦ మున్ జిఱునవ్వలరింపఁగాఁ బ్రతా
పవిభుఁడు "తండ్రి! వీరువక ♦ పాయము లేని స్థలంబు లున్నె! యా
హవమిది; వెన్కఁ జూడఁ దగ" ♦ దంచన-నాతటఁ దేజసింహుఁ డా
యవనులసేనఁ జించుకొని ♦ యక్కడకుల్ జనుదెంచె నూటికల్. 217

చ॥ ఒకమొడఁ గృష్ణసింహుఁడు ను ♦ ఱుక్క మెడల్ బదనూరుభర్త చై
తకము ఖలీనముల్ గొని ప్ర ♦ తాపునిఁ జేర్చిరి త్రొంటిచోటఁ; దా
ని కవల రెండుసైన్యములు ♦ నింగియు నేలయు రాయునట్టి పో
లిక, నతిరౌద్రఘాటిఁ దవి ♦ లెల్ రణశౌర్య విజృంభణంబునన్. 218

—॥ యవనుల వారణబలముతో రాజపుత్రులకైన యుద్ధము. ॥—

సీ॥ స్థావరత్వము మాని ♦ జంగమత్వముఁ దాల్చు
నంజనాచల సమూ ♦ హము లనంగ!

మొగలాయి వాహినీ ♦ పుష్కరస్థలి నిల్చు
నీల కాదంబినీ ♦ నివహ మనఁగ!
దళముగా మొలిచి వి ♦ చ్చలవిడిఁ బెఱుగు ను
త్తాల తమాల సం ♦ తాన మనఁగ!
మొగలు నదీ జలం ♦ బులు తగ్గ వెలిఁదోఁచు
విపుల గండోపల ♦ వితతి యనఁగ!
గీ॥ యవన సైన్యోత్తర దిశా ము ♦ ఖాగ్ర సీమ
నిలిచి ఘీంకారముల నింగి ♦ నేలఁ గలిపి
కరి ఘటాకోటి కాఱుచీ ♦ కటుల దాఁటి
యరితతులఁ దాఁక వెడలె! భ ♦ యానకముగ. 219

సీ॥ కడుఁబదనైన యున్న ♦ గన్నెరా కమ్ములఁ
దలలలో మెదడు బ్ర ♦ ద్దలుగఁ గోసి!
బలమైన కత్తివా ♦ తి లకోరులు నిగుడ్చి
దీర్ఘ దంతంబులఁ ♦ ద్రెళ్ళ వ్రేసి!
నిశితధారల నొప్పు ♦ నెలవంక కోలల
శ్రోత్రి వృంతములు రా ♦ సులుగఁ బోసి!
వాఁడిమి గల పాఱ ♦ వాఁతి యలుంగులఁ
దుండముల్ మిగులఁ దు ♦ త్తుమురు చేసి!
గీ॥ పలు రకంబుల నంప దె ♦ బ్బాటు వాన
గురిసి కుంభ స్థలంబులు ♦ గూలఁ ద్రోసి!
శరములను 'జిత్తుజల్లు' గాఁ ♦ బరపి భీమ
చాందు భటులు గూల్చిరి దంతి ♦ సంతతులను! 220

క॥ బలవంతులైన భిల్లుల
యలుగులు మెయి నిండ నాఁటి ♦ యావన గజముల్
వెలిఁగె నొడలెల్ల ముండులు
పులకెత్తిన యేదు వంది ♦ మూఁక లనంగన్! 221

ఉ॥ బిట్టుగ మావటీంద్రు గజ ♦ బృందములన్ నిశితాంకుశంబులన్
నెట్టుచుఁ బూన్చి రద్రిః కవి ♦ నెమ్మది నెక్కఁగ సాఁగె ఘీంకృతుల్

పెట్టుచు; మోగలుల్ కరుల ♦ వీపులనుండి తుపాకిగుండ్లతోఁ
గొట్టిరి; వాని డాకలకుఁ ♦ గొందఱు భిల్లులు కూలి రయ్యెడన్. 222

ఉ॥ దట్టముగాఁగ మూఁగి బల ♦ దర్పులు భిల్లులు ప్రాసముల్ గదా
పట్టిస భిండివాల కర ♦ వాల తతుల్ గొని తుండముల్ తెగన్
గొట్టినఁ గుంజరోత్కరము ♦ కొండలు గూలిన యట్లు బిట్టు గీ
పెట్టుచు నేలపై నొఱఁగెఁ ♦ బెంటలు పెంటలు గాఁగ నత్తఱిన్. 223

—॥ భీమచాందు యుద్ధము. ॥—

సీ॥ వామబాహువు నంటి ♦ వఱలు చాపము, మహా
రగ రాజ దీర్ఘ మహో ♦ రంబు గాఁగ!
గడతెల్ల దుర్నిరీ ♦ క్ష్య ద్యుతుల్ వెదచల్లు
శూలంబు ముమ్మొన ♦ వాలు గాఁగ!
హస్తాగ్రమున దక్షి ♦ ణావర్త శంఖ మ
య్యంబుజాసను కపా ♦ లంబు గాఁగ!
గడియయైనను దను ♦ విడక కొల్చెడు భిల్ల
తతులెల్ల బ్రమథ సం ♦ తతులు గాఁగ!
గీ॥ నప్పు డబ్దూర్ నబీ తెచ్చు ♦ హస్తి దైత్యు
భిల్లపశుపతి గదనెత్తి ♦ పిప్పి సేయ
గాయపడి చెందిరప్పుఁ గొండ ♦ కరణి నదియుఁ
గాళ్లు పైకెత్తి పిల్లేరు ♦ గంతు వైచె! 224

ఉ॥ భండనభీముఁ డాశబర ♦ వంశ్య శిఖామణి భీమచాందు దో
ర్దండ గదాభిఘాతముల ♦ దంతి సమూహము కుంభగోళముల్
మెండుగఁ జీల్చివైచుచు వె ♦ లింగెను గండశిలా వ్రజంబులన్
బిండిగఁ గొట్టుచుండు నొక ♦ పెద్ద యయోమయ యంత్రమో యనన్.

క॥ బరువయిన గదను దాలిచి
యరవరలై పడఁగమోద, ♦ నాద్విరదము లే
క రదములై యాపిమ్మట
న రదములై కూలె నంగ ♦ లార్పఁగ యవనుల్. 226

మ॥ విబుధేంద్రుండు పవి ప్రయోగముల ను ♦ ద్వీధ్రింబులన్ బోలె ని
స్పబడెన్ ద్రిప్పుచు వ్రేయుచున్ యవనసే ♦ నాలక్ష్మి సింగారపుం
గబరీభారముఁ గోసి వైచెనో యనం ♦ గా! దంతిసంతానమున్
శబరస్వామి హరించె దోర్బల కళా ♦ సంరంభ మేపారఁగన్. 227

—॥ బుడుతకీచులు పిరంగులను ప్రేల్చుట. ॥—

సీ॥ యావన సైన్య దు ♦ గ్ధాబ్ధిఁ ద్రచ్చినఁ బుట్టు
కాలకూటానల ♦ జ్వాల లనఁగఁ!
దురక దండను చిల్వ ♦ దార ఫణంబులఁ దోఁచు
మాణిక్య పటల సం ♦ పద లనంగఁ!
గదనానిలమున మో ♦ గలు సరస్సున నుండి
రాలెడు శతపత్ర ♦ రాజి యనఁగ!
బహుళ శతఘ్ని ప్ర ♦ వాళ వల్లుల జాఱు
గుములైన పగడాల ♦ గుత్తు లనఁగఁ!
గీ॥ బరగి, తాళ బింబ కపిత్థ ♦ ఫల సమాన
నీల భయద తప్తాయస ♦ గోళ తతులు
బహుబృహన్నాళి కాస్త్రముల్ ♦ పఱచఁగఁ జేసి
బుడుతకీచులు నడిపి ర ♦ బ్బరము దోఁప! 228

సీ॥ మొగలాయి సైన్య జీ ♦ మూత గర్భమునుండి
వెలిజాఱు పిడుగుల ♦ పిండనంగ!
యావన సుభట బా ♦ హా ప్రతాప మహాగ్ని
కడ లేచు నంగార ♦ కణము లనఁగ!
రణదుర్గ యురిమి నే ♦ త్రముల రౌద్రముఁ గ్రక్కు
బొడమిన గొప్ప ని ♦ ప్పుక లనంగ!
మృత్యుదేవత కోప ♦ మెత్తి తూరుపు పట్టఁ
దోఁతెంచు కౌరవుల ♦ తుంట లనఁగ!
గీ॥ నల్లనేరేడు పండ్లంత ♦ లగుచు యవన
భట తతులనుండి వెడలు తు ♦ పాకి గుండ్లు

రాజౌ నీలోత్పల చ్ఛాయ ♦ రాజపుత్ర
సైనికులకుఁ గర్వా వతం ♦ సంబు లగుచు! 229

క॥ పడిపడి నవి తొడరుచుఁ బైఁ
బడినఁ దడఁబడియు డీలు ♦ పడి యీడిగిలన్
బడి యెత్తువడి బడల్పడి
బుడివడి కదుఁ జెడియె రాజ ♦ పుత్రుల సేనల్. 230

క॥ పదుగురు పదునేనుగు రి
ర్వదిగురు నలువదిగురు నఱు ♦ వదిగురు మఱి లోం
బదిగురు నూర్గురు సుభటులు
తుదముట్టిరి వేఁడిగుండ్ల ♦ తోరపు జడికిన్. 231

—॥ ఖండేరావు యుద్ధము. ॥—

శా॥ చండాగ్నేయ కరాళ గోళములు వ ♦ ర్షం బట్లు పై తేర, బ్ర
హ్మాండం బంతయుఁ బిండిసేయఁగల దై ♦ ర్వ్యాహార్యులున్, సుంతయున్
గుండెల్ నిల్వక క్రుంగు కష్టదశ, న ♦ క్షుద్రప్రభావాఢ్యుఁడై
ఖండేరావు నిజాప్తయోధు లలరం ♦ గా నశ్వమున్ ద్రిప్పుచున్, 232

క॥ పుష్పసమ యావసరమునఁ
బుష్పంధయ సేన గొలువఁ ♦ బుష్ప రథముపై
బుష్పాస్త్రమ్ములఁ జిమ్మెడు
పుష్పశరుని మాడ్కి నపుడు ♦ ముందుకుఁ గదలెన్. 233

చ॥ వెనుకనె రాజపుత్త్రకుల ♦ వృద్ధ పితామహుఁడైన భానుసిం
గు నడిచెఁ; శ్యామసింహుఁడును ♦ గొండ విధంబున వారి వెంబడిన్
జనియెను; రామచంద్ర నృప ♦ సత్త్ముఁ డట్టులె చేరెఁ; ధేలవా
ర నృపతి వచ్చి దూఁకెను; జో ♦ రంబడి రయ్యెడఁ జోహణప్రభుల్ 234

ఉ॥ అందఱు ప్రక్క ప్రక్కలకు ♦ నా రణ రంగమునన్ శతఘ్నికా
బృందము లున్న చోటు విడి ♦ యేగ తుపాకులవారిఁ జేరి యిం
దిందిరరాజి మాడ్కిఁ బర ♦ తెంచి కలంచెడి గుండ్ల కోర్చి వా
రిం దెగవ్రేయసాఁగి! రర ♦ రే! యల వీరుల శౌర్య మెట్టిదో! 352

మ॥ మురువౌ కస్తురి వానలున్ గురియ నా ♦ పుత్రుల్ చుట్టునుండన్ వసూ
వరు లూరేగెడు నట్టి మాడ్కిని బ్రతా ♦ పస్వామి సామంతభూ
వర సైన్యంబు తుపాకిగుండ్లను సహిం ♦ పన్ గల్గి యానాఁటి సం
గర వైవాహిక మండపంబున వెలుం ♦ గన్ జొచ్చెఁ గోళీగతిన్, 236

మ॥ "యమునంశంబులఁ బుట్టియుండవలె! లే ♦ దా యిట్టి బాహాప్రతా
పము ధైర్యంబు మనుష్యమాత్రుల కిల ♦ ర్పన్ సాధ్యమే!" యంచు ఖా
సిముఖానాది సమస్తయోధులును యో ♦ జింపన్ మొదల్ పెట్టె సై
న్యము లన్నింటిని జేర్చి రొక్కెడ విప ♦ క్షానీకముల్ దాఁకగన్. 237

మ॥ నలిగెన్ హైందవసైన్య ధాటికిని బ్రా ♦ హ్ణంబందుఁ దౌరుష్కసే
నలు! నా హైందవసేన డస్సె నపరా ♦ హ్ణంబందుఁ దౌరుష్కసే
నల నాళాగ్నులఁ; గట్టిచో నుభయ సై ♦ న్యంబుల్ రణోన్మాద మ
గ్గలమై యొండొరు మీఱఁబోరు సలుపం ♦ గాఁ బూను టాశ్చర్యమే! 238

సీ॥ పూరాంగ్రియాయి ఖం ♦ డేరావు యవనుల
నఱఁటి మొక్కలనట్లు ♦ నఱికి వైచె;
భానుసింహుని ధాటిఁ ♦ బరసేన శిశిరంబు
నం దాకు రాలెడు ♦ నట్లు రాలె;
సింహాశౌర్యుఁడు శ్యామ ♦ సింహ భూభృన్మణి
చెట్టుకొక్కఁడు పాఱఁ ♦ జేసె రిపుల;
సరిరాజ సమవర్తి - యగు మనస్సింహుండు
విమత సైన్యము పీన్గు ♦ పెంట చేసె;
గీ॥ సుహృత యశులు మదన- ♦ మాధవ తుల్యులు
స్థైర్య రతులు సమర ♦ శౌర్యఘనులు
వెలగపండ్లు వోలె ♦ బేష్లా-కొటేరియా
నృపులు రాల్చి రపుడు ♦ రిపుల తలలు! 239

సీ॥ షట్రత్యైక భయదార ♦ వములు శోభిలు రాజ
పుత్రాశ్వ హేషా స ♦ మూహా రుతము!
లహితుల గుండియ ♦ లవియఁ జేసెడు యోధ
సముదాయ సింహగ ♦ ర్జా స్వనంబు!

పరిపుష్ట తౌరుష్క ♦ భట కపాలములు క
త్తులు తాఁకి పగులు ను ♦ ద్ధుర రవంబు!
రాజపుత్రుల చమూ ♦ రాజ హస్తాంభోజ
భాస్వన్మహా శంఖ ♦ నిస్వనములు!
గీ॥ భట సమూహాట్టహాస శుం ♦ భన్నినాద
మఖిల దిశలను బగిలించి ♦ యడలు గూర్ప
నతిభయము నొంది మానసిం ♦ హ ప్రభుండు
'పద పదం' డని తనమూల ♦ బలము నడిపె! 240

—॥ భానుసింహ - వీరబలుల యుద్ధము. ॥—

ఉ॥ వాడినచేన్నిపైఁ బడెడు ♦ వర్షము నట్టులు మానసింహుడుర్
దోడయి వచ్చినంత యవ ♦ నుల్ ధృతితోఁ జెలరేఁగి మూఫులుగా
మూడయి పొంగ, వీరరస ♦ పూర్ణుఁడు వీరబలుండు యోధులన్
గూడి యెదిర్చె నయ్యహిత ♦ కుంజర సింహము భానుసింహముర్ 241

మ॥ కరవాలంబులు కన్నుఁగొనలు స్ఫులిం ♦ గ శ్రేణి నల్దిక్కులన్
బరపన్ భీషణ చంద్రహాస రుచు ల ♦ ఖ్రంబంటె వర్తింప ని
ర్భర గంధర్వములన్ విచిత్రగతులన్ ♦ బోనిచ్చుచున్ దాఁకి సం
గరమున్ జేసిరి బాహుశౌర్యము సమ ♦ గ్రప్రౌఢి దీపింపఁగన్! 242

మ॥ తన గర్జారవధాటికిన్ దెసలు బ్ర ♦ ద్దల్ బ్రద్దలై పోవ, నూ
తన సంరంభ విజృంభణంబున నమి ♦ త్రశ్రేణి భీతిల్లఁగా
వెనుకన్ జూడక భానుసింహుఁడు రణో ♦ ర్విన్ శాత్రవున్ దాఁకి, యా
తని యశ్వంబు గళంబునున్ దఱిగె ను ♦ ద్యత్ఖడ్గ ధారాహతిన్! 243

ఉ॥ వీరబలుండు వ్రాలి రణ ♦ వీధి మఱొండు హయంబు నెక్కి 'రా
రో! రణవీరులార!' యని ♦ యోధులఁ బిల్వ నరాతివీర సం
హార పరాయణుల్ సుభటు ♦ లట్టులె దూఁకిరి; భానుసింహ భూ
త్రీరమణుండు వారి నెది ♦ రించె నొకండె పరాక్రమమ్మునన్! 244

క॥ కమల సరోవరమున ద్విర
దము విహరించిన విధానఁ ♦ దనివి సనక వి

క్రిమరాశి భానుసింహుఁడు
సమయించెఁ దురుష్కభటుల ♦ సమర తలమునన్. 245

చ॥ అడిఁగని మానసింహ విభుఁ ♦ డంబరు వీరుల 'భానుసింహుపైఁ
గదిసి రణంబుసేయుఁ' డని ♦ కట్టడ సేయఁగ నట్టహాసముల్
పొదలఁగ వారు పైఁబడిరి; ♦ భూరి భుజాబల రేఖ మొప్పఁగాఁ
గదనము చేయఁసాగె లయ ♦ కాల యముండన నాతఁ డుగ్రుఁడై. 246

ఉ॥ నూరితురుష్క వీరుఁ డొక ♦ రుం డతనిన్ దరిఁజేరఁ బోయి దు
ర్వార కృపాణ మెత్తి తల ♦ వ్రక్కలుగాఁ బడ మోద, రక్తముల్
వాఱఁగ భానుసింహుఁడును ♦ వ్రాలె ధరిత్రిఁ; దదీయ వాజియ
వ్వీరునిపైన నిల్చె నరి ♦ వీరులు పైఁబడకుండఁ గాచుచున్. 247

ఉ॥ అంతట శ్యాసింహుఁడు ర ♦ యమ్మున నచ్చటి కేగుదెంచి జం
భాంతకు నోటువుచ్చి విమ ♦ లామృత భాండముఁ గొన్న యాగరు
త్మంతుఁడు పోలె వీరబలు ♦ దర్ప మడంచుచు, భానుసింహు సే
నాంతరమందు నుండి కొని ♦ యవ్వలి కేఁగె సురక్షితమ్ముగన్. 248

చ॥ "పడెఁ బడె భానుసింహుఁ!" డను ♦ వార్త దవానలమో యనంగ నె
ల్లెడలను నాక్రమింప విని ♦ యీనిన బెబ్బులి మాడ్కి, రామచం
ద్రుఁడు జయమల్లు సైన్యముల ♦ తోఁ నొనరించు రణంబు వీడుచున్
వడివడి వచ్చె వీరబలు ♦ పై గిరిపైఁబడు వజ్రమో యనన్! 249

—॥ రామచంద్రదేవుని ద్వితీయ యుద్ధము. ॥—

ఉ॥ కైటభదైత్యుపై నడచు ♦ కంజ దళాయత నేత్రుఁడో యనన్
సూటిగ రామచంద్ర నృప ♦ సోముఁడు మొగలువీర యోధులన్
దాటుచు వచ్చి, వీరబలుఁ ♦ దాఁకి తదీయ భటాళిఁ జేతులన్
దీట యడంగఁ గంఠములు ♦ ద్రెంచి యనేకులఁ గూల్చె నత్తఱిన్. 250

శా॥ గుల్లల్ గుల్లలు గాఁగఁ గొందఱను, ను ♦ గ్గున్ నూకఁగాఁ గొందఱన్
ద్రెళ్లన్ జేయుచు, రామచంద్రుఁడును దా ♦ ర్వీరుల్ విజృంభించు ను
ద్యల్లీలల్ గని మానసింహ విభుఁడున్ ♦ దౌదవ్వ లందున్న య
బ్దుల్లాఖానునిఁ బిల్చి వారిపయికిన్ ♦ బూన్చెన్ మహోగ్రాజికిన్. 251

శా॥ ధీరోదాత్తుఁడు రామచంద్రుఁడును సం ♦ దీప్తానల జ్వాలయై
తౌరుష్కాటవి భస్మసాత్కృతముగా ♦ దర్పించి చెండాడి యా
శ్రీరామప్రభుఁ డస్త్రిధార నసుర ♦ శ్రేణీశిరశ్శ్రేణులన్
నూఱుల్ నూఱులు రాల్చునట్లు రణమం ♦ దుర్రాల్చె మస్తంబులన్ 252

చ॥ అలయక రామచంద్రపతి ♦ యావనసేనల వేటడంచి, చే
తులకసిపోవఁ బోరి బల ♦ ధుర్యుని వీరబలేంద్రుఁ దాఁకి, మం
ట లుమియు ఖడ్గరాజము బె ♦ డంగుగఁ ద్రిప్పుచుఁ దచ్ఛిరంబు వ్ర
క్కలుగను మోదె! వాఁడు పడఁ ♦ గన్ భటులున్ గొనిపోయి రవ్వలన్

మ॥ పొగపోలెన్ దగఁ బాఱి యానృపతి య ♦ బ్దుల్లా చమూనాయకున్
దగిలెన్; వాఁడు పరాక్రమించి, నడగొం ♦ డన్బోలె వచ్చెన్; మహో
రగమున్ దార్క్ష్యుఁడుపోలెఁ బట్టి యిలపై ♦ రాల్పంగఁ, దత్సేనయున్
మొగవిచ్చెన్ గను విచ్చి యంబరువిభుం ♦ డున్ గాంచి శోకింపఁగన్.

శా॥ గాసిన్ బెంచుచు రామచంద్రుఁడు తురు ♦ ష్కశ్రేణి ఖండించుచో
ఖాసింఖాను షదాఱుమందిభటు లం ♦ గశ్రేణి రక్షింప యు
ద్ధాసక్తుం డయి యాతనిన్ దొడరి యు ♦ ద్యద్ధాటిమై ఖడ్గమున్
వేసెన్; భూపతి దాని రాల్చె నవనిన్ ♦ నిస్త్రింశధారాహతిన్. 255

ఉ॥ ఆపదునేడుమంది యొకఁ ♦ డై పయినంబడి; రంత దోర్బలా
టోపమునై నెదిర్చుచుఁ గ ♦ డుం గడు డస్సియు రామచంద్రధా
త్రీపతియున్ దురుష్కభటు ♦ దెబ్బ గళంబున సోఁకి క్రిందుమీఁ
దై పడికూలెఁ; గల్పకమ ♦ హావనజాతము గూలు చాడ్పునన్. 256

॥ శ్యామసింహాదుల యుద్ధము ॥

శా॥ ఝాలావీరుల శ్యామసింహుఁడు తురు ♦ ష్కశ్రేణిపైఁ బూన్చి దా
వాలంబున్ బొనరించి రక్తతతు లే ♦ ర్లై పాఱెఁ; దద్ధాటికిన్
రాలెన్ మస్తము లెల్లెడన్; లయసమీ ♦ రమ్ముల్ విజృంభింపఁగాఁ
దాళీపక్వఫలంబులున్ ధరణి మీఁ ♦ దన్ రాలు చందంబునన్. 257

మ॥ పరుషాకారులు యామ్యకింకరుల తే ♦ పన్ వెల్గు, నాచోహాణుల్
సరసన్ గొల్వఁ గొఠేరియావిభుఁడు చే ♦ శ్లాఘగ్రత్తయున్, యావనో

త్కారముల్ భీతిలి నాల్గువెప్పులఁ జనం ♦ గా సంగరక్షోణి శౌ
ర్య రసాస్వాదముతోడఁ బోరిరి మృగేం ♦ ద్రారావముల్ జేయుచున్ 258

శా॥ ఆటోపమ్మున రామచంద్రిసుతుఁ డా ♦ వ్యాఘ్రింబువోలెన్ నిరా
ఘాటప్రక్రియ వైరిసైన్య మృగసం ♦ ఘాతంబుపై వ్రాలెఁ ద
ద్ధాటిన్ సైఁపఁగలేక తుత్తుమురుగాఁ ♦ దండోప తండంబుగా
రోటన్ బెట్టి సడించుమాడ్కి యవనేం ♦ ద్రుల్ సుక్కి రవ్వేళలో. 259

చ॥ జలధి తరంగ మాలికల ♦ చాడ్పున యావనసేన పైఁబడెన్;
జలమున రామచంద్ర నృప ♦ సత్తముసూనుఁడు శేషనాగ మ
య్యెలుకలపిండు పైబడెను ♦ నేఁపున వ్రాలుచుఁ జోరుచున్ దురు
ష్కుల తల లేరివైచె, సుమ ♦ గుచ్ఛము లల్లన గిల్లు కైవడిన్. 260

మ॥ అతఁడున్ రెండవ భైరవుం డనఁగ బా ♦ హాటోప సాహంక్రియా
రతి నుప్పొంగుచు వీరవిక్రమ విహా ♦ రమ్ముల్ పొనర్పన్ దురు
ష్కతతుల్ క్రుగ్గెను; మృత్యుదేవతయు నా ♦ ల్కన్ జాచెనో నా రణ
క్షితియెల్లన్ భటశూన్యమౌచుఁ గనుపిం ♦ చెన్ వాని నల్దిక్కులన్ 261

శా॥ 'అండన్ జేరఁగ నీఁడు! తుత్తుమురుసే ♦ యున్ జొచ్చె మమ్మెల్ల! నీ
'ఖండేరావు యముండొ! రుద్రుఁడొ! మమున్ ♦ గాపాడి రక్షింపఁగాఁ
రం'' డంచున్ యవనుల్ చమూపతుల మొ ♦ ఱ్ఱల్ వెట్టి ప్రార్థింప, ను
గ్రుండై యాజయమల్లుదూఁకె! 'భయమున్ ♦ గోల్పోవుఁడం'చార్చుచున్

శా॥ చండాటోప మెలర్ప నయ్యెడ ఖొరా ♦ సాన్ వీరులున్ వచ్చి యా
ఖండేరాయనిఁ దాఁకి; రాతఁడు భుజా ♦ గర్వంబుమై మార్కొనెన్;
వెండై శౌర్యము, కొండ తాఁగిరి రణో ♦ గ్రిన్ బెంచుచున్, గొంద ఱు
ద్దండస్ఫూర్తి నెదిర్చి, రప్పరశుకుం ♦ తశ్రేణులన్ గ్రుమ్మరన్! 263

చ॥ తడయక రామచంద్రవసు ♦ ధాపతి సూనుఁ డవక్ర విక్రమా
ఢ్యుఁ డయి రణంబు సేయ, నొక ♦ యోధుఁడు ఖడ్గము నెత్తివేయఁగాఁ
గుడిభుజ మట్టె ప్రీలి బెడఁ ♦ గుం గరవాలము ధాత్రి డుల్లినన్
బొడుపుఁ డటంచు వైరులుర ♦ మున్ బడఁ గ్రుమ్మిరి కుంతసంతతిన్ 264

—॥ ఖండేరావు రణరంగమునఁ గూలుట. ॥—

సీ॥ గగనహర్మ్యాగ్రభా ♦ గమున నిల్చుట మాని,
ఇలఁ జేరు చంద్రమః ♦ కళ యనంగ!
గ్రాంచచ్ఛేదనము గా ♦ వించి విశ్రాంతిఁ గూ
ర్చుండెడు షాణ్మాతు ♦ రుం డనంగ!
గ్రతువైరి ఫాలనే ♦ త్రజ్వాలలకు సొమ్మ
సిల్లి కూలెడు మన ♦ సిజుఁ డనంగ!
గల్పాంత పవన సం ♦ ఘర్షణంబున కోర్వ
కిల వ్రాలు హేమాద్రి ♦ శృంగ మనఁగ!
గీ॥ నభ్రమునునుండి తనదు పు ♦ ణ్యంబు దప్పి
సూటి తెగిపడ్డ చక్కని ♦ చుక్క యనఁగ!
దనువుఁ బాల్చిన భువన సౌం ♦ దర్య ధనము
బవరమందు ఖండేరాయఁ ♦ డవనిఁ గూలె. 265

మ॥ వనరాశిన్ జొరఁబాఱు వాహినులటుల్ ♦ బ్రాక్తై మనస్సింహుఁ డా
తని తొమ్మండ్రు సహోదరుల్ యవనమ ♦ ధ్యంబందుఁ బోరాడ జొ
చ్చిన ఝూలాసుభటేంద్రులున్ భటశిర ♦ చ్ఛేదంబు సేయన్. విప
క్షనికాయంబులు దిగ్భ్రమన్ దవిలి వె ♦ న్కన్ జూడఁగా సాఁగినన్,
ఉ॥ "గ్వాలియరీశులున్ దెగిరి; ♦ వ్రాలెను నేలను భానుసింహుఁ; డి
వ్వేళ జయంబు తప్పు; దొక ♦ పెట్టున వైరులఁ దాఁకి కూల్చుటల్
మే'' లని మానసింగు నియ ♦ మించెఁ; దురుష్కులు దిక్కులెల్ల గ
గ్గోలువడంగ నార్చి రిపు ♦ కోటులఁ దాఁకి రవార్యశౌర్యులై, 267
సీ॥ భయద యావనవీర ♦ భటు లారభటులతోఁ
బ్రళయకాల పయోద ♦ పటలి మాడ్కిఁ
జెలరేఁగి నాల్గుది ♦ క్కులఁ గ్రమ్మ, దావాగ్ని
యలమిన మృగములు ♦ కలఁగి నట్టు,
లగ్నివర్షించు గ్రీ ♦ ష్మాతపోద్ధతికిఁ బు
ష్పవనంబు తలవాల్చి ♦ వాడి నట్లు,
వారాశి యుప్పొంగి ♦ మేరమీఱఁగ, నదీ
తోయపూరం బెక ♦ దొట్టి నట్లు,

గీ॥ రాజపుత్రులు పటుపరా ♦ క్రమ సమగ్ర
మూర్తులై పోరుచున్నను ♦ మొగలు వీర
భటుల సంఖ్య హెచ్చౌట నో ♦ ర్వంగ లేక
బరువు పడిరి కొండలు పైన ♦ వ్రాలి నట్లు! 268

—॥ చంద్రభట్టారకుఁడు యవనులపైఁ గవియుట ॥—

మ॥ అరు లాత్మీయబలంబు నొంపఁ, గవిలో ♦ కైకాగ్రగణ్యుండు స
ద్గురుఁడున్ విప్రుఁడు చాందుభట్టు కర ము ♦ గ్రుండై రణోన్మాద వి
స్ఫురితుండై గజరాజవాహముఁ గలం ♦ బున్ గైతమున్ వీడుచున్,
గరవాలంబు ధరించి దూఁకెఁ బ్రతిప ♦ క్ష చ్ఛేదమున్ జేయఁగన్. 269

చ॥ అనిలజవంబునన్ విఱుగు ♦ నభ్రము లట్టులు, శ్యేనధాటికిన్
వెనుకకుఁ బోవు నవ్విహగ ♦ బృందము నట్టులు, వేఁటకాని ద
ర్శనమున నోడి పర్విడెడు ♦ సత్వము లట్టులు, చాందుభట్టు ఘో
ర సబిడ ధాటి బెండువడి ♦ మగ్గిరి మోగలు యుద్ధవీరులున్. 270

సీ॥ కడదాఁకఁగనిన భ ♦ గ్న పాస నివహంబు!
ఖండితాలంకార ♦ మండనంబు!
ససమన్విత్రోరు ప ♦ దార్థ సంఘాతంబు!
స్ఖలిత వ్యవస్థాక ♦ గణయుతంబు!
దుష్క్రియాకృత శబ్ద ♦ దోష భూయిష్ఠంబు!
నపరాసహిష్ణు వా ♦ క్యాన్వితంబు!
సధిక విసంధియుఁ ♦ నపగత నియతియు!
నగణమాన గురు ల ♦ ఘ్వంతరంబు!

గీ॥ నపగత రసావకాశంబు! ♦ నత్యవన్వ
య క్రమముగాఁగ, యవన సై ♦ న్యంబు నెల్ల
సరస కవిలోకపతి యయ్యుఁ ♦ జంద్రభట్టు
కుకవి కావ్యంబుఁబోలె నె ♦ క్కొనఁగఁ జేసె. 271

మ॥ "పిడుగుంబాటున సైన్యగర్భమున నా ♦ వేశించె నీతండు; చం
పుఁడు పోనీకుఁ" డటంచు నొండొరులు గుం ♦ పుల్ గుంపులై వ్రేలుమో

పేఁడు సందీయక చుట్టు మూఁగిరి మొగల్ ♦ వీరుల్ తదధ్యక్షులు! ల
య్యెడ దేవాసుర యుద్ధ మట్లు సమరం ♦ బేపారె నత్యుగ్రమై! 272

సీ॥ చంద్రహాసం బెత్తి ♦ జయమల్లు కేడెంబు
శీర్షకంబును జించి ♦ చెండె వైవ!
రాయశీలుఁడు సువ ♦ ర్ణప్రాభవుం డౌచుఁ
గరవాలఫణిని వ్ర ♦ క్కలుగఁ జేయ!
సింహశౌర్యుండు ఖా ♦ సింఖాను మున్మున్న
పరతెంచి యున్నతా ♦ శ్వంబు నఱుకఁ!
బులివంటి ప్రౌఢ యా ♦ బ్దుల్లా చమూపతి
నెత్తిపై ఖడ్గంబు ♦ నెత్తి వేయ!

గీ॥ రాజపుత్రశతాధిక ♦ గ్రంథకర్త
చంద్రభట్టారకుఁడు యశ ♦ స్సాంద్రమూర్తి
తల పగిలి యశ్వమున నుండి ♦ తెలివి తప్పి
ముందునకు సోలి ధరవ్రాలి ♦ మూర్ఛ మునిగె. 273

చ॥ ఎవని పదాంబుజాతము ల ♦ హీన నృపాలవరేణ్యసేవ్య మా
కవి ధర వ్రాలినన్ మెఱుపు ♦ గ్రక్కున వీచిన యట్లు ఖేలవా
రవిభుఁడు వచ్చి దూఁకి కరి ♦ రాజు మృణాళముఁబోలె నెత్తియా
హవతల మందునుండి వడి ♦ నవ్వలఁ జేరిచె నశ్రమంబుగన్! 274

మ॥ "కవి నిర్యాణమునొందె; మమ్ము నెదురం ♦ గా లేఁడోరుండంచు, న
య్యవనుల్ పొంగుచుఁ బేక లార్పులును జే ♦ యన్, దన్మహానాదముల్
దివి మ్రోయంగఁ బ్రతాపభూవిభుఁడు త ♦ త్సేనాధిపుల్ నెమ్మనం
బవియన్ శోకము నొంది కుందిరి దురం ♦ తాయాస భారమ్మునన్. 275

—॥ రాఠోడ్ తేజసింహుని మూఁడవ యుద్ధము ॥—

సీ॥ సాగరాంతర నివా ♦ సము మాని ధరణికిఁ
బరతెంచు బాడబ ♦ వహ్ని యనఁగ!
నా ప్రతాపేశ్వరుం ♦ డను గజాసురవైరి
ఫాలనేత్రానల ♦ జ్వాల యనఁగ!

సచరాచర ప్రపం ♦ చముఁ గూల్పఁ బఱతెంచు
ప్రళయ కాల పరేత ♦ రాజనంగ
యవన సేనారణ్య ♦ మలమి భస్మము చేయఁ
దవిలెడు నిర్ధూమ ♦ దహనుఁ డనఁగ!
గీ॥ ధరకు దిగి వచ్చు చండమా ♦ ర్తాండుఁ డనఁగ!
వైరిగిరి కోటిపై వ్రాలు ♦ వజ్ర మనఁగ!
భూతలంబు నిర్యవనంబు ♦ చేతు ననుచుఁ
దేజసింగు హయంబును ♦ ద్రిప్పి కదలె! 276

మ॥ తనరాతోడులు రెండువేల్ భటులు చెం ♦ తన్ గొల్వఁగా సింహగ
ర్జనమున్ జేసి యజాండ కర్పరము పి ♦ చ్చల్ గాఁ బడన్ దూఁకఁ, ద
ద్ధ్వనియున్ మృత్యువు నట్టహాస మటు క్రో ♦ ధద్వంద్వమున్ జీల్చ 'నిం
డెను నూఱేండ్ల'ని ప్రేలె మొగలుల గుం ♦ డెల్ తేజసింహున్ గనన్.

ఉ॥ మారట వదుర్ఁడై యతఁడ ♦ మందపరాక్రమ రేఖ యొప్పఁ గ్రొ
క్కారు మెఱుంగువోలెఁ దుర ♦ గంబు రణాంగణమందుఁ ద్రిప్పి దు
ర్వారజవంబునన్ దలల ♦ పై నడిపించి తురుష్క లోక సం
హార మొనర్పఁగాఁ దొడఁగె ♦ నచ్చటి యందఱు కన్నిరూపులై. 278

మ॥ కృతసర్వాహవ సాధనాఢ్యము రణో ♦ ర్వన్ దేజసింహాగ్నిప
ర్వత ముప్పొంగుచుఁ దన్మహానలము ప ♦ ర్వన్ దప్పకో లేని దు
స్థితిఁ దారుష్క చమూ మహావనము భ ♦ స్మీభూతమై చుట్టునన్
క్షితిపై రాలెను గుప్ప తెప్పలుగ ని ♦ ర్జీవస్థితిన్ గూలుచున్! 279

మ॥ యవనోర్వీరుహ కోటిఁ ద్రుంచి ధరపై ♦ వ్యాపింపఁగాఁ జేసి యా
హవసుక్షేత్రము సర్వమున్ జదను సే ♦ యన్ గల్గి దుర్వార సైం
ధవ సంఘట్టనతోడ మెత్తఁగను దు ♦ న్నన్ గల్గి రాతోడు పుం
గవుఁడున్ శత్రుల రక్తధార మడవల్ ♦ గట్టెన్ ప్రతాపోన్నతిన్. 280

గీ॥ అహితు లందఱు తనదు సా ♦ హసము మెచ్చ
విసుగ కంతంతకును విజృం ♦ భించి పొంగి
యాకుగుమి దూసి పోసిన ♦ యట్లు నఱికి
వైరి సంహార మొనరించె ♦ వాలు మగఁడు. 281

మ॥ ఖురసంఘట్టన తాళమానముల ని ♦ గ్గుఁ జూప రాహోద్భటుల్
తురగవ్రాతము బూన్చి యాప్రళయ రు ♦ ద్రుల్ వోలెఁ దీండ్రించి యు
ద్ధుర తౌరుష్కచమూ సమూహములపైఁ ♦ దొ్రక్కించి ద్రుక్కింప, న
య్యరులున్ వ్రాలిరి పీనుగుపెంటలుగ హా ♦ హాకారముల్ చేయుచున్ 282

మ॥ తెగియున్నట్టి మనోజ్ఞ హారమున ము ♦ త్తెంబుల్ వలెన్ దిక్కులన్
మొగలుల్ పాఱిరి, మానసింహుఁడు "జయం ♦ బుల్ చేతికిన్ జిక్కెనోఁ,
దెగబాఱన్ దగు నయ్యా! ధైర్యము సం ♦ ధిల్లన్ రిపుశ్రేణిఁ గూ
ల్పఁగఁ బొం" డంచని ముందలించ నట ని ♦ ల్వన్ లేక వా రందఱున్ 283

సీ॥ "ప్రళయరుద్రులు గాని ♦ బదనూర్ భటులుగారు!
తెలియవే రాహోడు ♦ తేజసింగు!
మృత్యుదేవత కైనఁ ♦ గృప గల్గుఁగాక! చం
పినదాఁక నీతండు ♦ విడువఁబోఁడు!
నితనితో మార్కొని ♦ యేన్గుతొండం బంత
బుస వచ్చె! నోడళుల ♦ నుసురు లేదు!
కొలుసులఁ గట్టి లా ♦ గుకొనిపోయిన మోము
తేజసింహుని దిక్కు ♦ త్రిప్పఁబోము!
గీ॥ నిలక తూగాడెఁ గాళ్లు! నీ ♦ కొలువు చాలుఁ!
బ్రాణ ముండిన లాభముల్ ♦ వడయ వచ్చు!
"రాము రాలేము మేము పో ♦ రంగఁ జాల"
మనిన, మానసింహుఁడు దిగు ♦ లంది నిలిచె! 284

శా॥ ఆసఫ్ఖానుఁడు కొంతసేనఁ గొని డా ♦ యన్ వచ్చె నచ్చోటికి; క
ష్టా సక్తిన్ గని మానసింహవిభుఁడున్ ♦ బ్రాణంబుఁ బ్రాపించి పె
ల్లాసల్ బాసలు పెంచి కష్టపడ. నా ♦ యా సైన్యముల్ దైన్యముల్
వానెన్; డాసిరి తేజసింహు నెదిరిం ♦ పన్ బూని వా రందఱున్. 285

మ॥ చిఱున వ్వాస్య మలంకరింప; రిపులన్ ♦ జేయెత్తి "వేంచేయుఁ డం
దఱు వీరుల్! మిముఁ దాఁకి పోరుటకు డెం ♦ దం బుత్సనం బందెః సు
స్థిరులై పాఱక నిల్వుఁ" డంచు బదనూర్ ♦ సింహంబు పూరించె ని
ష్ఠుర శంఖంబు విపక్షకోటి వడు రా ♦ హోడుల్ వడిన్ దూఁకఁగన్ 286

చ॥ ఒక యెడ రెండులక్షలగు ♦ యోధులు గుండెలు లేక నిల్వ, నిం
కొక యెడ రెండు వేల భటు ♦ లుర్వి వడంకఁగ వారిఁ దాఁకఁగా;
నొకనికి నూఱుమంది భటు ♦ లొడ్డెడి యారణరంగ వైభవం
బొక వెయి కండ్లఁ జూడవలె! ♦ నూఱక వర్ణన చేయు టెట్లగున్. 387

చ॥ ఉదధి తరంగ పంక్తులు ను ♦ హోన్నతఘాటిని శైల పార్శ్వమం
దుఁ దగిలి పాయలై విఱిఁగి ♦ తోడనె వెన్కకుఁ బాఱి శాంతమై
పొదలుగతిన్ దురుష్కచము ♦ వుల్ రథసమ్మునఁ దేజసింహుపైఁ
గదిసి తదీయ ఘాటికిసి ♦ గ్రిమ్మఱి వెన్కకు మొగ్గ నయ్యెడన్. 288

మ॥ పురదైత్యేందుని నొంచు రుద్రుని వలెన్ ♦ బోనీక యాలోకభీ
కరుఁ డయ్యుగ్ర నృసింహమూర్తి యరులన్ ♦ ఖండించి దోర్దర్ప వి
స్ఫురణన్ వెల్గ, రణాంగణం బఖిలమున్ ♦ శూన్యంబుగాఁ దోఁచెఁ; “గు
మ్మరికేఁడున్ గుదె కొక్కినాఁ”డ నెడుసా♦మ్యంబున్ నిరూపించుచున్ 289

మ॥ అలఘువ్యోమ ధునీప్రవాహభర ను ♦ ల్లత్యార్భటిన్ దాఁకు నా
జలపాతం బటు దేజసింహుఁ డతిభీ ♦ ష్మప్రాభవుం డౌచు ముం
గలికిన్ దాఁకఁ దదీయఘాటి నిలువం ♦ గా లేక సర్వంబు మో
గలు సైన్యంబు దిశాముఖంబులఁ గలం ♦ గన్ బాఱె దైన్యంబునన్. 290

ఉ॥ “ఈ యపమృత్యువున్ దొడరి ♦ యీశ్వరుఁ డైన మనంగ లేఁడు! మా
యాయువు గట్టి దౌట నొడ ♦ లం దసువుల్ గనఁ గంటి! మింటికిన్
బోయియు నాలుబిడ్డలఁ గ ♦ నుంగొనువారము! వైరి గెల్వ నే
దో యొకదారి చూచుకొను! ♦ మూఱక చంపకు కూటి పేదలన్.” 291

మ॥ అనఁగా, సంబరు భర్త యాయుగుర సై ♦ న్యాధీశులన్ జేర్చి యే
మని తా నాశలు చూపెనో; భటులు తో ♦ డై కొల్వ వారున్ రణో
ర్విని దూరమ్మునఁ బొంచి పొంచి యనువౌ ♦ వేళన్ వడిన్ దేజసిం
హుని చుట్టున్ వలయాకృతిన్ గవిసి ర ♦ త్యుగ్ర ప్రతాపాఢ్యులై. 292

చ॥ అది గని తేజసింగు ధను ♦ రాకృతి వార్వముఁ ద్రిప్పి, ఖడ్గముల్
చిదియఁ దురంగమంబులు న ♦ లిన్ బడ, యోధులు ద్రుల్లి కూల ‘స
ర్వదమనుఁ’ డంచు నెల్లరను ♦ బల్కఁగ వైరుల నొక్కఁడైన దె
బ్బ దినని వాఁడు లేఁ డనన ♦ వార్యబలంబునఁ జేసె యుద్ధమున్. 293

సీ॥ "ఇదె చెంతఁజేరితి ♦ నిపుడైన నెదిరింపు"
డని కొందఱను దాఁకి ♦ యసువు లూడ్చి!
"పరువు లెత్తెద రేల! ♦ మరణంబు దప్పునే"
యనుచుఁ గొందఱ తల ♦ లవియ మోది!
"యేది మీవిక్రమం ♦ బిట్టిదేనా" యంచుఁ
గొందఱ డాసి ను ♦ గ్గుగను జేసి!
"గొందిగి యుండెద రేల ♦ కదిసి రా రం"డని
కొందఱ నసిధార ♦ మ్రింద నేసి!
గీ॥ "మీరు కంపించు టట్లుండ ♦ మీహయములు
వడఁకెఁ గనుఁ"డంచుఁ గొందఱఁ ♦ బట్టి కూల్చి
మెలఁగె రణమునఁ దేజసిం ♦ గెలుకపిండు
నలముకొని పిల్లి చెరలాట ♦ మాడు నట్లు! 294

సీ॥ ఆననేందువు దర ♦ హాస చంద్రికలీనఁ
జని రాయశీలు వ ♦ క్షమ్ముఁ గ్రుమ్మెఁ;
నొయ్యారమునఁ బోయి ♦ యోరచూపునఁ జూచి
జయమల్లు నశ్వంబు ♦ సంహరించెఁ;
నిలిచినట్టులె నిల్చి ♦ చెలరేఁగి ముందేఁగి
వీరబలేంద్రు ను ♦ ర్విఁబడమోదెఁ;
నొర ఖడ్గ ముంచి య ♦ త్యుల్లాసమునఁ జేయి
సాచి ఖాసింఖానుఁ ♦ జక్కడంచెఁ;
గీ॥ గరయుగంబున ఖడ్గయు ♦ గంబుఁ దాల్చి,
చనుచు నతికె నబ్దుల్లా భు ♦ జ ద్వయంబు!
మీస మొత్తి యానస్ ఖాను ♦ మేను చించెఁ!
దేజసింగు ప్రతాప సం ♦ దీప్తుఁ డగుచు, 295

మ॥ కదురక్తిన్ జయలక్ష్మియున్ వధువు, మో ♦ గల్ వీరు లాదేవి సం
దడిమైఁ గొల్చెడు చుట్టపక్కములు యు ♦ ద్ధంబున్ వివాహంబుగా,
బెడఁగున్ గత్తుల పూల మాలలు శుభా ♦ స్త్రిన్ గూర్చుచున్ దేజసిం
హుఁడు డేగాటల నాడు పెండ్లికొడుక ♦ ట్లొప్పారె నవ్వేళలో. 296

గీ॥ దేవ తిర్యఙ్మనుష్యులఁ ♦ దేజసింహు
నట్టి వీరుండు లేఁ డని ♦ యంద ఱనఁగ
సమర మొనరించెఁ; శాత్రవుల్ ♦ సమసి! రపుడు
శిశిరమున నాకు రాలెడు ♦ చెలువు దోఁచె! 297

ఉ॥ పోఁడిమిమీఱ నార్వురు చ ♦ మూపతులున్ భటు లెంత కాల మ
ల్లాడినఁ దేజసింహుఁ డిసు ♦ మంత కలంగుట గాని వాజి తూ
గాడుటగాని, కత్తి కర ♦ మందుఁ జలించుట గాని లేద; క్రొ
వ్వాఁడిమితోఁ దురుష్క భట ♦ భంజనమున్ బొనరించె నుగ్రుఁడై. 298

మ॥ కదనక్షోణిని మానసింహుఁ డట వె ♦ న్కన్ వెన్కనే పొంచి పా
గి దరిన్ జేరుచు జోడుగుండుల తుపా ♦ కిన్ బేల్చఁగా వర్మమున్
జిదుగన్, వెన్ను నగల్చి వక్షమున దూ ♦ సెన్ గుండు; లా దెబ్బతోఁ
జదియన్ మోదెను తేజసింగతని దో ♦ స్స్తంభంబు బెంగై చెడన్. 299

—॥ రాథోడ్ తేజసింహుని నిర్యాణము. ॥—

సీ॥ గిరిచ్ఛేదనము చేయు ♦ తఱి నొక్కచో భ్రాంతిఁ
బడయు దైవతచక్ర ♦ వర్తి యనఁగ!
గగనమార్గాగ్ర భా ♦ గ విహారమును మాని
ధరఁ జేరు చండమా ♦ ర్తాండుఁ డనఁగ!
దివి నేగు వేళఁ గ్రిం ♦ దికి విమానము జాఱి
పడిన ఖేచర సార్వ ♦ భౌముఁ డనఁగ!
భువనముల్ కంపిల్ల ♦ మ్రోఁగి యాఁగిన ప్రతా
పాబ్జాప్తు పాంచజ ♦ న్యం బనంగ!
గీ॥ నంతదాఁకను మొగలు సే ♦ నాబ్ధి యింకఁ
బరమ వీర్యంబున జ్వలించు ♦ బాడబాగ్ని!
తేజసింగశ్వమున నుండి ♦ త్రెళ్లి పడియె
'నో జగద్గురూ! త్రిజగద్గు ♦ రూ!' యటంచు! 300

శా॥ ఆరావోద్భవ ప్రతాపతపనుం ♦ డస్తంగతుం డైచనన్
భేరీనాదము బొబ్బ లార్పులును శో ♦ భిల్లెన్ మొగల్ సేన; శో

కారావంబుల రాజపుత్రకుల సై ♦ న్యం బంతయున్ స్రుక్కిని
స్సారంబై స్పృహ తప్పె జీవకళ లే ♦ శంబైనఁ గన్పింపమిన్. 301

—॥ ప్రతాపసింహుఁడు విజృంభించి యవనసైన్యముఁ జొచ్చుట. ॥—

సీ॥ హారావళీ పర్వ ♦ తాంతర మందుండి
వచ్చు కేసరి సార్వ ♦ భౌముఁ డనఁగ!
యావనభువన·సం ♦ హారంబు గావింప
నెత్తిపైఁబడు పెను ♦ మిత్తి యనఁగ!
జగము లన్నిఁటిని ధ్వం ♦ సం బొనర్పఁగ రెచ్చి
పరతెంచు లయకాల ♦ భర్గుఁ డనఁగ!
గల్పాంతమున జగ ♦ ద్గణము దుమ్ముగఁజిమ్ము
సప్తప్రభంజనో ♦ చ్చలన మనఁగఁ!
గీ॥ దేజసింహుని మృతికి నా ♦ ర్తిని వహించి
"యవన సైన్యాంబునిధి మదీ ♦ యాస్త్రబాడ
బానలవ్యాప్తి నింకింతు" ♦ నని ప్రతాప
విభుఁ డరాతులపై విజృం ♦ భించె నపుడు! 302

సీ॥ ముక్కు తోడరమల్లు ♦ భూరిసైన్యంబు; బసఫ్
ఖాను ఖాసింఖాను ♦ కన్నుఁగనయుఁ;
గంత మబ్దుల్లాయుఁ; ♦ గడుపున జయమల్లు
రాయశీలుల ♦ భట వ్రాతములును;
బాదంబులను వీర ♦ బల-రాయసింహుల
సైన్యంబు, రెండు ప ♦ క్షంబు లందు
షాబాజఖాన్ చమూ ♦ సమితి యబ్దారహ
మాను సేనాపరం ♦ పరలు బెరసి;
గీ॥ యంబరీశుండు పుచ్ఛంబు ♦ నందు నిలిచి;
గారుడవ్యూహ మొనరింపఁ ♦ గాఁ బ్రతాప
విభుఁడు సామంతులందఱు ♦ విడక కొలువ,
దస్యుకోటి దండవ్యూహ ♦ ఘాటిఁ దగిలె. 303

మ॥ ఉరగాధీశు సహస్రజిహ్విక లటం ♦ చూహింప దోర్దర్ప దు
ర్భరులై యొప్పు శిశోదియా సుభటు లా ♦ రాణా పిఱుందన్ భయాం
కర నిస్త్రింశ కఠోర ధార నిగుడం ♦ గా, గండభేరుండముల్
హరిణ వ్రాతము నట్లు చెండిరి విప ♦ క్షానీక ము త్కృద్ధతన్. 304

శా॥ లోకమ్ముల్ పొడిగాఁగఁ దాండవకళల్ ♦ దోల్కాడ నర్తించు నా
శ్రీకంఠున్ బురుడించు రౌద్రరస మూ ♦ ర్తిప్రాభవం బొప్పఁ బ
ట్టాకత్తిన్ గొని యాప్రతాపుఁ డరికం ♦ ఠంబుల్ విదారించుచున్
జీకాకై పడఁ జేసె; మొగలు చమూ ♦ శ్రేణిన్ సమీకస్థలిన్. 305

మ॥ క్రమమై హస్తము లట్టె లేచుటయు, ఖ ♦ డ్గవ్రాతముల్ కాంతి పూ
రములన్ బెల్లుగఁ జిమ్ముటల్, భటుల మూ ♦ ర్ధమ్ముల్ వడిన్ వ్రీలి ర
క్తములన్ బైకెగఁజిమ్ముటల్, యవనయో ♦ ధ వ్రాతముల్ గూలి ప్రా
ణము గోల్పోవుట తప్ప వేఱెదియుఁ గా ♦ నన్ రాదు నల్వంకలన్. 306

మ॥ తమవ్యూహంబు చొరన్ బడన్ యవన యో ♦ ధశ్రేష్ఠు లిర్వంకలన్
గుములై పైఁబడఁగాఁ, బిపీలికములున్ ♦ గుంపౌచుఁ బై కెక్క న
శ్రిసుమై పాఱు భుజంగ రాట్సదృశమౌ ♦ రాణా చమూదండ మా
ర! మహావేగముతోఁ దురుష్క భటగ ♦ ర్భం బందు దూరెన్ వడిన్.!

మ॥ శతధా ఖండము లౌచు రాలె సమర ♦ క్ష్మా మధ్య మందున్, విశీ
ర్ణ తనుత్రాణ చయంబులున్, దళిత కుం ♦ త శ్రేణు లొప్పై విలుం
ఠిత కంఠంబులు; భగ్న ఖడ్గములు; కుం ♦ ఠీభూత భేరుల్; నిపా
తిత కేతువ్రజముల్; విఖండిత గదా ♦ దీవ్య న్మహా దండముల్. 308

చ॥ తడయక వైరి శీర్షములు ♦ తాళ ఫలంబులు వోలె దుల్లఁగన్
బొడువఁగ నమ్మహాపురుష ♦ మూర్తికి చెల్లును; శాత్ర వాశ్వముల్
వడిఁ దనుఁ గాంచి భీతి గొని ♦ పాఱఁగ వల్గిత ధార నెత్తి వ
చ్చెడు పని చైతకంబునకె ♦ చెల్లు ననఁగ మెలంగి రిర్వురున్. 309

ఉ॥ అప్రతిమాన సాహస మ ♦ హాబల విక్రముఁ డైన రాజపు
త్రప్రభుఁ డాప్రతాపుఁడును ♦ దస్యు సమూహములన్ వధించి; బ్ర
హ్మప్రళయంబు చేసె; సమ ♦ రాంగణమున్ విడి యంబరీశు నై
న్యప్రతతుల్ గలంగుచు భ ♦ యావిలచిత్తతఁ బాఱె దిక్కులన్! 310

—॥ ప్రతాపసింహుఁడు మానసింహ - సలీములఁ దగులుట. ॥—

గీ॥ పూఁచి పట్టిన నడగొండ ♦ పోల్కిఁ దనరి;
పట్టు బంగారు జిలుగు టం ♦ బారి నెసఁగి
"పంచమంగళ" గజరాజు ♦ వఱలెఁ; నందు
మానసింహ-సలీములు ♦ గానఁబడిరి! 311

గీ॥ తెఱలి తీవ్రక్రుధాశోణ ♦ దృగ్యుగంబుఁ
బఱపి; యశ్వముఁ గోల్తలఁ ♦ బైఁ గవించి;
యుగ్రసింహంబు వేదండ ♦ యుగము నట్లు
బల్లె మెత్తి ప్రతాపుఁడ ♦ వ్వారిఁ బొదివె. 312

సీ॥ రౌద్రరసారూఢి ♦ శ్రవణముల్ రిక్కించి
వీఁపున నున్న ప్ర ♦ తాపుతోడ
నుబికి; ముందరికాళ్లు ♦ లున్నతంబుగ నెత్తి;
యువరాజ మానసిం ♦ హుల గజంబు
దంత ద్వయంబుపైఁ ♦ దగ మోపి భయద హే
షలఁ జేసి దర్పించి ♦ చైతకంబు
నిలిచె; నాపంచమం ♦ గళము తద్ధాటికి
వెఱచి తొండముఁ దల ♦ విసరు కొనుచు

గీ॥ వెనుక కొక్కుమ్మడిని బాఱెఁ ♦ బృథివియదురఁ;
గజగమనధాటి గండంబు ♦ గడచి పోయి
మానసింహ-సలీములు ♦ మనఁ గలిగిరి;
మానవులు మాత్ర మిరువురు ♦ మడిసి రపుడు! 313

సీ॥ కను లున్న భాగ్య మి ♦ దని యమానుష శౌర్య
రేఖఁ గంటి మటంచు ♦ రెండు పక్ష
ముల భటు లని మాని ♦ నిలిచి; రబ్దురహీ
మాను నిల్వెల్ల వి ♦ స్మయము గదురఁ
"బదునాల్గు భువనముల్ ♦ వెదకిన రాజపు
త్రికు లట్టి విక్రమ ♦ రాసు లుండ్రు!

రిట్టి పృాజ్యులఁ బట్టి ♦ హింసించు మామొగల్
జాతులు పరమ దు ♦ ర్జాతు లగుత॥

గీ॥ దనువునను జీవ ముండెడు ♦ దాఁక, వారి
చరణసేవ సేయుదుఁ గాని! ♦ మఱచి తప్పి
నైన, నిసుమంత యపకార ♦ మాచరింప"
నని ప్రతిన చేసి తనఖడ్గ ♦ మవని వైచె. 314

మ॥ తనచే నున్న రవిధ్వజంబుఁ గని "యీ ♦ తండే ప్రతాపేశ్వరుం"
డని మొగల్ భటకోటి చుట్టుకొని ఖ ♦ డ్గానీకకుంతాది సా
ధనముల్ వైచిరి; కాని యాతఁ డణుమా ♦ త్రైన వెన్కకుఁ బోక, కే
తనముం వీడక, పోరుచుండె నరిసం ♦ తానంబు ఖండించుచున్. 315

సీ॥ అరి పీఁచు, పీఁడ పుత్రుఁ ♦ డనరాక సంకుల
రణ మయ్యె; రాణా న ♦ రాతికోటి
ముట్టడించెను; రాజ ♦ పుత్రవీరులు క్షీణ
బలులౌట మేవాడ ♦ భానుని గతి
సందిగ్ధముగఁ దోఁచె; ♦ మందేహ గణముతో
రణమున రక్తధా ♦ రలను దోఁగు
తపనునిమాడ్కిఁ బ్ర ♦ తాపప్రభుండు గా
యములతో రక్తసి ♦ క్తాంగుఁ డయ్యె

గీ॥ విరియఁ బూచిన కింశుక ♦ తరువువోలె
వెలుఁగుచుండియుఁ గడు విజృం ♦ భించి వైరి
భటుల శిరములు చిదురుపలై ♦ వసుధ రాల,
నతఁడు రణ మొనరించె భ ♦ యంకరముగ. 316

సీ॥ వెనుకు ముందులు చూచు ♦ కొనక యూపిరి పుచ్చు
కొనక, యాలోచించు ♦ కొనక, వీరు
వా రనుకొనక, క ♦ న్పడు వారలను బట్టి
చంపు నా సంకుల ♦ సమరమందు,
వాసపుఖానుతో ♦ నాబదోనియు "మన
ప్రక్క, వైరులప్రక్క, ♦ రాజపుత్రు

లుండురుగా; వీరి ♦ యందు శాత్రవు లంచు
హితు లంచు మీ రెట్లు ♦ తెలుగుచుండు”
గీ॥ రన, నసఫ్ఖాను “కన్యాసి ♦ కొనుచుఁ జీల్చి
వేయుదుము; రాజపుత్రులు ♦ విమతులైన
విహితులైన యావన మత ♦ ద్వేషు లగుట
నం దెవరు సీల్గినను మేలె’’ ♦ యనుచుఁ దెలిపె. 317

సీ॥ తమరాజరాజు ర ♦ క్తము గన్పడ శిశోది
యావీరులును సలుం ♦ బ్రాధిపతియు,
శ్యామసింహాదులు ♦ సంవర్త సమవర్తి
మూర్తులై యరిగళం ♦ బులను జీల్చి;
రపుడు మనసింహుఁ ♦ డాప్రతాపేంద్రుని
యడుగులు మ్రొక్కి సూ ♦ ర్యధ్వజంబు
పెటికి కొండొక దూర ♦ మరిగె; నచ్చట రవి
ధ్వజ మున్న నచటఁ బ్ర ♦ తాపుఁ డుండు
గీ॥ ననుచుఁ జెక్కురుయవను లం ♦ దరిగి; రంత
దురము భర మయ్యె; భటులతోఁ ♦ దొమ్మిదిగురు
సోదరులతో మనసింహుఁ ♦ డాదినంబు
స్వర్గమున కేఁగి చెల్లించె ♦ స్వామిభక్తి! 318

మ॥ అవనిన్ బ్రాలఁగ ఖేలవారనర ప ♦ లాధీశుఁ డుద్యత్ప్రతా
పవిశాసంబునఁ బెల్లురేఁగుఁచు ప్రతా ♦ పస్వామి రోషించి శా
త్రవ విచ్ఛేదము చేయఁ జొచ్చెను సలుం ♦ బ్రాభర్తతో స్నాచు నా
హావరంగంబున వైరి వీరభట శీ ♦ ర్షాళిన్ విదారింపఁగన్. 319

గీ॥ బల్లెమది మూఁడుచోట్లఁ దు ♦ పాకి యొక్క
చోటఁ, జంద్రహాసము మూఁడు ♦ చోటు లందు
దాఁకి రక్తము లురలఁ బ్ర ♦ తాపదేవుఁ
డొప్పె నంగారవల్లరి ♦ యో యనంగ! 320

ఉ॥ తూములనుండి ధార లయి ♦ తోయము దూకెడు నట్లు; భీప్రదం
బై మెయినుండి తొమ్మిదియు ♦ నల్వది గాయములందు నెత్తురుల్

భీమముగాఁగ దూఁక, రిపు ♦ వీరహయాళి భయంబు నొందిది
క్షీమలఁ బాఱఁ, జైతకము ♦ సింహముమాడ్కిఁ జెలంగె నయ్యెడిన్ 321

మ॥ "విన! నేఁ డీమొగలాయివీరుల తలల్ ♦ ఛేదింతు; నిందుండి రా!"
నని జృంభించుచు వైరిఁ గూల్చెడు ప్రతా ♦ పాధీశు నర్థించి ప్రా
ర్థనముల్ సేసియు విన్నవించియు సలుం ♦ బ్రా భిల్లలోకేంద్రు లా
తనిఁ దోడ్తెచ్చిరి శత్రు వీరభట మ ♦ ధ్యంబందుఁ దప్పించుచున్. 322

మ॥ తనవంశంబునఁ బుట్టి స్వచ్ఛముగు స్వా ♦ తంత్ర్యంబుఁ గాంక్షించి యా
వనసైన్యంబును జించి చెండుచుఁ బ్రతా ♦ పప్రాభవుండౌ ప్రతా
పునకున్ గల్గఁగ నున్న క్లేశము లవం ♦ బున్ జూడఁగా నోడి క్రుం
కె ననంగా రవి పశ్చిమాంబుధి మునిం ♦ గెన్ రక్తకాంతిచ్ఛటన్. 323

సీ॥ ఆనాఁడు రణరంగ ♦ మందుఁ గూడిన ప్రతా
పపృథు సుభటు లి ♦ రువదియు రెండు
వేలలో నెన్మిది ♦ వేల్మంది బ్రదికి; రా
తని బంధు లైదు వం ♦ దలు మడిసిరి;
త్వారువీరులు మూఁడు ♦ వందలేఁబదిమంది
పడి; రొకొ్కక కులంబు ♦ వందలుగను
భటులఁ గోల్పడియె; యా ♦ వన పక్షమందుఁ దొం
బదివేలు వ్రాలి ర ♦ క్కడదనమందు;

గీ॥ మూఁడులక్షల కెక్కుడై ♦ మొగలు భటులు
మనిన వారెల్ల గాయముల్ ♦ దినినవారె!
శత్రులం దాఁక నోపక ♦ సైన్య మెల్ల
నిలిచె బెగడంది సింగఁ జూ ♦ డ్కులు నిగుడ్చి! 32[illegible]

—॥ { కృష్ణసింహుఁడు యుద్ధమునుండి వెడలిపొమ్మని ప్రతాపసింహు నర్థించుట. } ॥—

మ॥ పరమోదారుఁ బ్రతాపుఁ గన్గొని సలుం ♦ బ్రాభర్త "యెల్లప్పు డిం
తరుదై నీముఖచంద్రునిన్ దవిలి లో ♦ కాహ్లాదమున్ బెంచు నా
దరహాసాంకుర మెందు డాఁగె! నిటు చిం ♦ తన్ గుంద నేలా! సురే
శ్వరుఁడున్ (గాలము దప్పు) నొక్కకరణిన్ ♦ వర్తించుటల్ వింతయే! 32[illegible]

సీ॥ "ఏకలింగేశ్వరుఁ ♦ డిచ్చిన దానితో
నేవేళఁ దృప్తి వ ♦ హించు టొప్పు;
సాధన సంపత్తి ♦ చాలమి విజయ మొం
దఁగలేక పోయియుఁ ♦ డంగ వచ్చుఁ;
బరిభూతి యనినంతఁ ♦ బ్రళయ మంచుఁ దలంప;
మపజయంబున సత్య ♦ మతిశయిల్లు;
నీపూట కిది చాలు; ♦ రేపు మరల వచ్చి
భువనముల్ కీర్తింపఁ ♦ బోరొనర్తు;
గీ॥ మెంతకాల మజేయమై ♦ యెసఁగి ధర్మ
మహిమ స్వాతంత్ర్యదీక్షయు ♦ మనల విడువ
వంతకాలము శాత్రవు ♦ లంగుళంబు
మేర నైనను గదలింప ♦ లేరు మనల! 326

చ॥ ఇదియుఁ బ్రదోషకాల; మిపు ♦ డెట్లును యుద్ధము నిల్చె! నిందుఁ జే
యఁ దగిన దేది కన్పడదు; ♦ హాయిగఁ గొండను దాఁటి పొమ్ము; నేఁ
డుదిమొదలీ చమూతతులఁ ♦ దోడ్కొని నీపదముల్ భజింపఁగా
నుదయము వత్తు; నొండుగతి ♦ నుల్లమునన్ దలపోయ కేఁగుమా!" 327

మ॥ అనఁ "దండ్రీ! నను నమ్మి కొల్వఁగల సే ♦ నాధీశ్వరుల్ ప్రాలి కూ
లిన నీచీఁకటిఁ ద్రోసి నే నెటుల వా ♦ ర్ధిఘాటు వీడంగ నే
ర్తును! మేవాడ్భటశౌర్యలక్ష్మి రణమం ♦ దున్ దుమ్ము పాలయ్యె! నే
నని గావించెద; శత్రులన్ దునిమెదన్; ♦ ప్రాణంబు లర్పించెదన్. 328

మ॥ "గురులున్ మాన్యులు చుట్టపక్కములు నా ♦ కున్ గూర్చు సామంత భూ
వరు లీలోకమునందు నాకుఁగల సం ♦ బంధుల్ భుజావీర్యవి
స్ఫురణన్ బోరుచు వారి వారి పొముగున్ ♦ క్షోణీస్థలిన్ గొల్చి వం
డిరి; వీరందఱ వీడి దొంగవలె నొం ♦ టిన్ బోవఁ గాఁగ్లానునే! 329

మ॥ ఒడలం దూపిరి యాడునంతకు రణో ♦ ద్యోగంబునందుండి నా
యడుగుల్ వెన్కకు రావు; సుంతయు శరీ ♦ రాయాసమున్ దోఁప దీ
కడ; రే యైన దివంబ యైన, నొకఁడై ♦ కన్పట్టు; బూర్వాద్రి సూ
ర్యునిఁ దోతెంచెడుదాఁక శాత్రవుల ♦ నోర్తున్; గూర్తుఁ గీర్తిచ్ఛటల్"

సీ॥ అని ప్రతాపుఁడు పల్క ♦ విని భీమచాందు "భా
రతఖండ చండమా ♦ ర్తాండమూర్తి!
యని యొనర్పంగలే ♦ వని కాదు; భీతిల్లు
దని కాదు; సకల లో ♦ కాళి యెఱుఁగు
నినువంటి వీరుఁ డెం ♦ దును ద్రిలోకములఁ ద్రి
కాలమ్ము లందును ♦ గలుగఁ డనుచు;
సమయ మట్టిది గానఁ ♦ "జనుట మే" లనెఁ గృష్ణ
సింగు: నాకట్ల తోఁ ♦ జెడఁ దలంపఁ!
గీ॥ గొంతకాలము సంగర ♦ క్షోణి విడిచి
యవలఁ దొలఁగుట పౌరుష ♦ హాని గాదు;
నీవు గలిగిన నిఖిలార్థ ♦ నియతి గలుగు;
దైవ మున్నది యాపై వి ♦ ధానమునకు" 331

చ॥ అనినఁ బ్రతాపుఁ "డేమియును ♦ నాడఁగలేను; పరాభవాగ్ని నా
మనసు దహించె" నంచన, న ♦ మాత్యశిఖామణి కృష్ణసింహుఁడున్
వినయ మెలర్ప వేఁడుకొని ♦ వేయు విధంబుల విన్నవించి సాం
త్వనములఁ గుస్తరించుచుఁ బ్ర ♦ తాపునిఁ బంపె రణంబునుండియున్ 332

―॥ రణరంగము వీడిపోవు ప్రతాపసింహుని యవన సేనాధిపతులు వెన్నంటుట. ॥―

సీ॥ కాలిబాటను జైత ♦ కముపైఁ బ్రతాపుఁడు
గిరివెంటఁ గొంత ద ♦ వ్వరుగునంతఁ,
జెంత నశ్వఖురాళి ♦ క్షితి సోఁకు ధ్వని విని
తిరిగి వెన్కకుఁ జూచి ♦ తురకభటులు
తఱుముకొనుచు వచ్చు ♦ టెఱిఁగెఁ; గొండొకదూర
మరిగి మరలి చూచి ♦ యం దొకండు
తగ్గియుండుటఁ గాంచెఁ; ♦ దనప్రయాణము సాగఁ
జేయుచు మరలి వీ ♦ క్షించె; నింక
గీ॥ నొకఁడు లోపించె; నంతలో ♦ నుద్ధురగతిఁ
బాఱు పదినూరల వెడల్పు ♦ యేఱు దవిలెఁ;

జైతకము దేహమున నున్న ♦ సత్వ మెల్ల
నొక్కచోఁ జేర్చి సెలయేటి ♦ నుబికి దాఁటె. 333

మ॥ కడుఁ గష్టంబున వెన్కవచ్చు భటుఁ డా ♦ క్కం డేటియందుర్ హయం
బడుగుల్ మోవఁగఁ జేసి, దాఁటుకొని "నీ ♦ లాశ్వంబుపై నెక్కిపో
యెడి యా యోధకులాగ్రణీ! నిలువుమీ! ♦ యి ష్టంచుఁ బల్కన్ బ్రతా
పుఁడు; "సిద్ధంబుగ నుంటి ర" మ్మని హయం ♦ బున్ డిగ్గి నిల్వంబడెన్

—॥ సూక్తసింహుఁడు ప్రతాపసింహుని మన్నన వేఁడుట. ॥—

మ॥ త్వరమై నశ్వము డిగ్గి యోధుఁడును జెం ♦ తన్ వ్రాలి 'నానామహీ
శ్వర శీర్షస్థ కిరీట రత్న చయ శో ♦ భాపూర నీరాజన
స్ఫురణన్ మించు భవత్పదాంబుజయుగం ♦ బున్ గాంచి సేవించు నా
పర మైశ్వర్యము గల్గె నేటికిఁ! బ్రతా ♦ పా! విశ్వలోకార్చితా! 335

మ॥ "ధర, సామాన్యపు శబ్దజాలమున "సా ♦ తంత్ర్యంబు" దానొక్కఁడై
పరఁగెన్; నేఁడు భవత్పరిగ్రహ మహా ♦ భాగ్యంబునన్ జేసి, స
ర్వ రసాధిష్ఠిత యాధి నొప్పుచుఁ బర ♦ బ్రహ్మ ప్రభావ ప్రభన్
వఱలన్ జొచ్చెను; దివ్యమూర్తివి! ప్రతా ♦ పా! విశ్వలోకార్చితా! 336

సీ॥ అన్నవు; స్వామివి; ♦ యాచార్యుఁడవు; ప్రాణ
మెత్తుగాఁ జూచి న ♦ న్నేలు నిన్నుఁ
దెగనాడి, యకట! భ్రా ♦ తృద్రోహమును గురు
ద్రోహంబు నొడిగట్టి, ♦ తురకలందుఁ
గలిసి, మేవాడపైఁ ♦ గత్తిగట్టుటను మా
తృద్రోహ మొనరించి ♦ తిట్లు పడితి!
నేఁటు వాఁడెడి బాష్ప ♦ వారి నీ యడుగులు
తడుప నాచిత్తము ♦ త్తలము నొందె!

గీ॥ నఖిల భువన వంద్యంబు నీ ♦ యడుగు దోయిఁ
దలఁచుదున్ నాదు పాడు చే ♦ తుల స్పృశింపఁ;
బెరిఁగెఁ గొండలు కొండలై ♦ దురిత రాశి;
యెట్లు కృపఁ దేల్తువో! వన్ను ♦ నింక మీఁద.! 337

సీ॥ మరణదండన మాన్పి ♦ కరుణించి యమృత సా
రము పోసి తనదు ప్రా ♦ ణమున కన్న
నెక్కుడుగాఁ జూచి ♦ యిర్వదేఁడుల దాఁకఁ
గ్రిందమన్నని బొజ్జ ♦ యందుఁ జేర్చి
జనకుఁడై పెంచె శా ♦ శ్వతయశోనిధి సలుం
బ్రాజ్యరాజ్యలక్ష్మి గా ♦ రాబుభర్త!
యకటకటా! నోర ♦ నన రాని విధమునఁ
గాఱు లాడితిఁ గండ ♦ కావరమున;
గీ॥ నభినవ కిసాల కోమలం ♦ బై తనర్చు
నామహారాజు మది యెంత ♦ యడలెనొక్కొ!
యా పితృద్రోహి యొక్కఁడే ♦ యెట్టి దుర్గ
తులకు నైనను గొంపోవఁ ♦ గలఁడు నన్ను. 338

క॥ ఈతఱి నీ పంచమహా
భూతమ్ములు సాక్షి; వైర ♦ ము నశించెను నా
చేతమ్మున; నన్నుఁ గృపా
న్వీతుఁడవై యేలు" మనినఁ ♦ బృథ్వీశ్వరుఁడుం, 339

సీ॥ "నిర్హేతుకంబుగా ♦ నీవు వాదాడి న
న్నెడఁబాసి చని పెక్కు ♦ లేఁడు లయ్యెఁ!
బోరాని చోటికిఁ ♦ బోవితి! కొలువంగఁ
గూడని విమతులఁ ♦ గొలుచుచుంటి!
హృదయంబునుండి న ♦ న్నదిరి తఱిమి పోరు
నడిపితి సాయంత ♦ నంబువఱకు!
మూఁడు మాఱులు నన్ను ♦ ముట్టి యంతంబునొం
దింప గట్టిగఁ బ్రియ ♦ త్నించి యుంటి!
గీ॥ వని మునిగిసి గంట కాలేద! ♦ యపుడె యేండ్ల
పొడవున నెసఁగు వైరంబు ♦ పొలిసె ననుచు
నిచ్చకపు మాటలాడుచు ♦ నిటులు వచ్చి!
తెటుల నిను నమ్మనగును! నా ♦ కెఱుక పడదు! 340

క॥ దుర మొనరించుటకే యిపు
డరుదెంచియ యున్న యుష్మ ♦ దగ్రజుఁ డెపు డె
వ్వరు కోరిన వెను దీఁడని
యెఱుఁగు" మని వచింప, సూక్త ♦ "ఢిల్లు లేమిటికిఁ! 341

సీ॥ సకల సామంత రా ♦ జ సమూహములు సభా
స్థానంబునందు ని ♦ ర్జర గణంబు
తేజరిల్లఁ గొలువంగ ♦ దేవేంద్ర సమ వైభ
వంబున నీవు మే ♦ వాడ రాజ్య
సింహాసనం బధి ♦ ష్ఠించి యేలుట గాంచి
యెడఁద నోరిమి లేక ♦ యీర్ష్య వొడమెఁ!
గాని యెన్నెన్నియో ♦ గతుల యత్నించి బ
య ల్పడనీక లో ♦ నణఁచి యుంటి!
గీ॥ వేఁట చాలించి కూర్చున్న ♦ వేళ నెట్టు
లో మహాత్మ్యగ నదియుఁ బై ♦ కుబికి రాఁగఁ
బంది నెపమున నీతోడ ♦ వాదు పెంచి
యుంటి! నాచిత్త వృత్తి యి ♦ ట్లుండె నాఁడు. 342

సీ॥ సంధ్యాముఖమున నిన్న ♦ శత్రుసైన్యములు సా
ర్ధఘాటు కనుమఁ గా ♦ ల్నిలుపఁ బోవ
నెటనుండి వచ్చెనో ♦ యేలు మూఁకిన యట్లు
మాతండ్రి యాసలుం ♦ బ్రా మహీంద్రుఁ!
డితులు క్రమ్మెడు వేళ ♦ కిరువది రెండు వే
ద్దారలు గొల్వంగ నీ ♦ వరుగు దెంచి
సూర్యధ్వజము నిల్పఁ ♦ జూచితి! నపుడ నా
మదిలోన నొక గొప్ప ♦ మార్పు గలిగెఁ!
గీ॥ బత్తివలె నీపదము లొద్ద ♦ వ్రాలి యుందుఁ!
గాని రిపుల యుప్పును దిన్న ♦ కారణమున
రాత్రి నిలిచి పొద్దుటనుండి ♦ రణము నడిపి
వారి ఋణ మావిధమున దీ ♦ ర్చంగఁ గంటి! 343

గీ॥ అని ముగిసినంత సకల ♦ సేనాధి పతుల
మంబరీశ్వరు శిబిరంబు ♦ నందు నుంటి!
మంత నీవు దేవా! చైత ♦ కాశ్వ మెక్కి
యరుగు టందఱమును గంటి ♦ మద్రి దెసను! 344

సీ॥ అంబరీశుఁడు "పోయె ♦ నదుగో! బ్రతాపుఁ డా
తని తలఁ దెచ్చు వీ ♦ రునకు మాళ్వ
ధర యిత్తు"ననియె; మూ ♦ ల్తాన్ ఖొరాసాన్ దొరల్
గదలి; రేకాకి నిన్ ♦ గాంచి కరిగి
మొగలుల దెసఁ గిన్క ♦ పోడిమి యా యిరువురఁ
దఱిమి గీటడఁచి నీ ♦ దరిఁ దరిసితి;
మూఁడేండ్ల కఱువున ♦ మునిఁగి నేఁటికిఁ గంటిఁ
దనివివో భ్రాత్రువ ♦ త్సలుని నిన్ను;

గీ॥ నకట! యీర్ష్యా గ్రహ గ్రస్త ♦ మైన హృదయ
పాప మెల్లఁ బశ్చాత్తాప ♦ వహ్ని సమసెఁ!
ద్వత్కృపామృత వృష్టి నా ♦ పైనఁ గురిసి
నన్నుఁ గృతార్థునిఁ జేయు మ ♦ నాథ నాథ! 345

గీ॥ అకట! నావంటి పాపాత్ము ♦ నకుఁ బవిత్ర
మైన మేవాడఁ జోటుండ ♦ దని యెఱుఁగుదుఁ!
గాని నీదు విశ్వ విశాల ♦ మైన హృదయ
సీమఁ దావుండు ననియె వ ♦ చ్చితి క్షమింపు! 346

క॥ మదిఁ గోపము వాయద యే
నదె కుంతము నీదు హస్త ♦ మం! దిదిగో నా
హృదయము! సూటిగఁ బొడువుము!
పద సీమను వ్రాలి విడుతుఁ ♦ బ్రాణానిలముల్!" 347

క॥ అని జడివట్టిన వడువునఁ
గనులను బాష్పములు దొరఁగ ♦ గద్గద కంఠం
బునఁ గేలు మొగిచి నిలిచినఁ
గనుఁగొని వాత్సల్య ధారఁ ♦ గళ లుట్టిపడన్, 348

సీ॥ ఔను! నావెన్కయుఁ ♦ దశ్వముల్ తెఱుఁచుచు
నరుగుదెంచుట మున్న ♦ యరసి యుంటి!
నటఁ గొంత సేపటి ♦ కగుపడె రెండుమా
త్రము! మఱియును గొంత ♦ తడవునకును
మిగిలె నొక్కఁడం! దంతఁ ♦ దగిలె నీ యే ఱడ్డ
మై! దీని దాఁటెడు ♦ నంత నీవు
పిలిచితి! శాత్రవ ♦ వీరుల యశ్వంబు
లవిగో! రౌతులు లేక ♦ యడవి పట్టె!
గీ॥ మంచి మనసున నీవరు ♦ దెంచియుంట
కింత కన్నఁ దార్కాణ మిం ♦ కేమి వలయు!
రణ పరాజయ దుఃఖ ని ♦ ర్మగ్నుఁడ నగు
నాకు సోదర లాభ మీ ♦ నాఁడు గలిగె! 349

గీ॥ ఇట్టు లనుతాపపడి యుప ♦ కృతి యొనర్చి
సరసఁ జేరితి వని విన్న ♦ క్షణమె నన్ను
శిరమునను జేర్చుకొనుఁ గృష్ణ ♦ సింహ విభుఁడు!
పరమ కోమల మన్మహా ♦ ప్రభువు మనసు! 350

గీ॥ మబ్బు తెర జాఱ సుప్రభా ♦ మహితుఁడైన
చంద్రుని విధానఁ గిల్బిష ♦ క్షాళనమున
ద్విగుణిత కళా విభాసివై ♦ తేజరిల్లు
చుండు నీ వేర్మికైన మా ♦ న్యుఁడవు కొమరా! 351

మ॥ నను నీవింతగ వేఁడుకో వలెనె! య ♦ న్నా! రమ్మటంచున్ బ్రతా
ప నృపోత్తంసుఁడు సూక్తుఁగౌఁగిటను ని ♦ ల్పన్, వాఁడు హర్షించె; నం
తనె నిల్వంగను లేక చైతకము క్రిం ♦ దన్ వ్రాలె; వీక్షించి గ్ర
క్కున జీనిన్ సడలించి తేఁడు సరసన్ ♦ గూర్చుండెఁ జింతారతిన్. 352

—॥ చైతకాశ్వము వీరస్వర్గమున కేగుట. ॥—

మ॥ అతిదీనంబుగ స్వామిమోముఁ గని యా ♦ యత్యుత్తమాశ్వంబు బా
ష్పతతుల్ వీడుచు మంద మందముగ హే ♦ షాధ్వానముల్ జేసి, యం

చితమౌ భక్తిఁ దదీయపాదములపై ♦ శీర్షంబుఁ బొందించి స్వ
స్థతఁ గన్మూసె; మఱెప్డు మేల్కొనని ని ♦ ద్రానిష్ఠలో మున్గుచుఁ. 353

చ॥ "అకటకటా! జగత్ప్రళయ ♦ మైన, నొకంగుళ మైనఁ దప్పు దా
రికిఁ జనకాయరాతి హయ ♦ బృందము భీతిలి పాఱఁ దాఁకి యా
ర! కుడిభుజంబ వౌచు సమ ♦ రంబుల నన్ను భరించుచుంటి; చై
తకమ! ఋణానుబంధములు ♦ దప్పెనె! నీకును నాకు నేఁటికిన్. 354

సీ॥ నాయెడ నీకు నెం ♦ తటి భక్తి! యెంత వి
శ్వాస! మెంతటి మహో ♦ త్సాహ భరము!
కొడుకున కన్న నె ♦ క్కుడు ప్రీతిఁ బండ్రెండు
వత్సరంబులుగ నా ♦ పంచ గాచి!
తక టకటా! శిర ♦ మందుఁ దురాయితోఁ
బెండ్లికొడుకు నట్లు ♦ వెడలి వచ్చి
కనువిందొనర్తువు; ♦ కదనరంగముల నీ
సరిలే దనఁగఁ గీర్తి ♦ నెరపినావు;
గీ॥ బంధులను నాప్తులను వీడి ♦ వచ్చు నన్ను
విడువఁ జాలక యుండాక ♦ వెంట వచ్చి
తోయి! మధురాతి మధురమై ♦ యొప్పు నీదు
పీరహేష నాలించెడు ♦ పెంపు చెడెనె!" 355

—॥ సూక్తసింహుఁడన్న కళ్వము నిచ్చి యవనుల శిబిరమున కేగుట. ॥—

సీ॥ అసి కుందఁ గని సూక్తుఁ ♦ "డభ్రంబు తలపైన
నొఱుఁగ నుంత కలంగి ♦ యొఱుఁగవీవు;
చైతకంబు మృతికి ♦ శతపత్రి జైత్ర నే
త్రముల బాష్పములు ము ♦ త్యంబు లట్లు
క్రమ్మ నేఁ గని యోర్వఁ ♦ గాఁ జాల; నిదిగో నా
"యంకారు;" నీ సేవ ♦ లవధరించు;
దీనినిఁ గొని భద్ర ♦ మా నెడ కేగు; మం
బరు భర్త మో మొక్క ♦ మాఱు చూచి

గీ॥ త్వరితముగ వచ్చి నీపద ♦ ద్వయముఁ గొలుతు,"
ననుచు, నశ్వము నిచ్చి జో ♦ హా రొనర్చి
యచ్చట నున్న ఖొరాసాను ♦ హయము నెక్కి
యరిగె. కనె మొగల్ సర్వ సే ♦ నాధినాథు. 356

గీ॥ "ఆప్రతాపుని శిర మేది! ♦ యకట! కాన
రారె! ముల్తాన్ ఖొరాసాను ♦ వీర వరులు!
నీహయం బేది! సూక్త! సం ♦ దేహ మయ్యెఁ!
జెప్పు సత్యం" బనిన, మాన ♦ సింహుఁ గాంచి, 356

సీ॥ "అల్ల హాల్దీఘాటు ♦ నందుఁ సూర్యధ్వజం
బెత్తి నప్పుడె చిత్త ♦ వృత్తి మాఱె;
నాల్గు లక్షలు మిమ్ము ♦ నావార లిరువది
రెండువేల్ దొర లెది ♦ రింపఁ గంటి;
నపజయంబున ఖిన్నుఁ ♦ డై యన్న యని వీడి
యొంటిఁ బోఁ దలను దె ♦ మ్మొంటి వీవు!
పొగిలె నాహృదయంబు ♦ ముల్తాన్-ఖొరాసాను
భటులఁ గూలిచి నాదు ♦ వాజి నిచ్చి
గీ॥ పంపి నినుఁ జూచి పో నిట్లు ♦ వచ్చినాఁడ!
నమ్మినను నమ్ము; లేక చి ♦ త్తమ్ము వచ్చు
నట్లు దండింపు! వెఱవ! నా ♦ ప్రాణమాన''
యనిన, మానసింహుఁడు కోప ♦ మంది నిలిచి, 358

శా॥ "మేమై నీవిపు డాప్రతాపు తలఁ దె ♦ మ్మిమ్మా పొమ్మనన్ లేదు; తా
నై ముందుఁ బడిపోయి మాహితుల సం ♦ హారంబు గావించి ధా
ణా మే లెంచి తొలంగఁ బంపె; నను నిం ♦ దల్ చేయుచున్ వచ్చె; నీ
స్వామిద్రోహినిఁ బట్టుకొండు; చెఱ నుం ♦ పన్ బోలుఁ, బోనీకు రే!" 359

—॥ సూక్తసింహుని దండింప వలదని యబ్దారహిమాను వాదించుట ॥—

గీ॥ అనుచు గర్జింప నచటి సై ♦ న్యాధిపతులు
వానిఁ జుట్టిరి రబ్దారహి ♦ మానుఁ "డిటఁ ను

ధైర్యమున వచ్చి యున్న స • త్యంబు చెప్పి;
నే మనంగఁబోకుఁ' డని యంబ • కీశుఁ జూచి 360

మ॥ "ఇతఁడుగ నేనును రెండువత్సరములు ల • య్యొర్గ మైత్రిఁ బాటించి; పు
ణ్యాతముం దంచు వచింతు నిక్కముగ; దో • హం బుండెనేనిగ బ్రతా
పు తలగ దెమ్మని నన్నె నీదగు శిరం • బుగ జెండియే యున్న మా
స్థితి యెట్లుండెడి! నించు కేనియును యో • జిం పంగ సం దుండు నే!

ఆ॥ భ్రాతృ కొలము సామి, • పౌరుషవంతుండు,
రాజ రాజు, రణ ప • రాజితుఁ డయి
చను ప్రతాపుఁగూర్చి • సాయంబు చేయు ట
'బ్బురమె!" యని సలీము • మోమముఁ గాంచి, 362

ఉ॥ 'శరణము దిటుల్ మనల • నిందఱ నొంచి కలంచి తోలఁగా
నేరిచె! నావ్రతాప విభు • నేటి యమానుష వీర విక్రమో
దార విహారముల్ గనినఁ • దత్పక లోకము లన్నియుగ నమ
స్కారము చేయు నన్న, నను! • జన్యుఁడు మెచ్చి చనంగ వింతయే!

ఉ॥ నేనును రాజపుత్రుల జ • యించి యశంబుఁ గడింప వచ్చితిగ;
గాని, తదీయ పౌరుష వి • కాసము దైవత దైత్యకోటులుగ
గానము చేసి రప్పుడు; జ • గన్నుతశౌర్యుఁ బ్రతాపు మానవుం
డౌ ననరాదు! దేవుఁ డను • టన్నమటం చని తోఁచు నామదిగ 364

సీ॥ హారావళీపర్వ • తాగ్రంబునం దొక
నవరత్నదివ్య మం • డపము గట్టి!
యుపరంజితో నామ • హాభాగు విగ్రహం
బమరించి తన్మధ్య • మందు నిలిపి!
విశ్వశోభన మైన • వేళలో నాధీరు
పరమపావన నామ • పాదమందు
సకల జగజ్జేతృ • సంజ్ఞా మనోహర
స్వర్ణ తులాకోటి • సంతరించి!

గీ॥ భక్తి మెయి విశ్వవీర వ్ర • పంచ మెప్పు
నర్చ చేయంగ వలయు షా • రాగ్రయాఖు!

నా వెతలు మాన్పి నను( దేర్చ ♦ నీ వెవండ!
వగు నదియు( గాక మాన'' ద ♦ టంచు విసిగె! 371

సీ॥ అప్పు డంబరు నేత ♦ యక్బరీశుని గాంచి
"దేవ! నీ విట్లు చిం ♦ తింప( దగునె!
నా జీవితంబును ♦ నా యభిమానంబు
నీ యధీనము చేసి ♦ నిలిచినాఁడ;
శక్తివంచన లేక ♦ క్షణ మేమఱక( గాక
యాప్రతాపాధీశు ♦ నని నెదుర్తు;
యముఁడనై యతని ప్రా ♦ ణానిలమ్ముల నూడ్చి
పీల్చి పిప్పి గొనర్చి ♦ వెతల( బెనుతు(;
గీ॥ బలుకు లొక నేయు నేటికి! ♦ భరత ఖండ
మందు శాశ్వతస్థాయిగా ♦ యవన లోక
రాజ్యసంస్థాప నాచార్య ♦ రాజ రాజ
బిరుదములు నీకు( జూర్చి శో ♦ భిల్ల( జేతు." 373

మ॥ అన, నక్బర్ విభు( 'డౌను గా' కని కరం ♦ బానందముం బొంది "గొ
క్కనిమేషంబును నూరకుండకయె సం ♦ గ్రామంబు సాగింపు పొ''
మ్మని శాసించిన, మానసింహుఁడును సే ♦ నాధీశ సైన్యంబులం
గొని రాణాపయి కేఁగు నుత్సుకతతోఁ ♦ గొల్వుండె నిర్వ్యాళుఁడై. 374

గద్య:—ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత రసవ
త్కావ్య నిర్మాణ చాతురీ ధురీణ, సుగుణగణ పారీణ, దుర్భాకవంశ
దుగ్ధాంభోరాశి రాకా కైరవమిత్ర, శాలంకాయన గోత్ర పవిత్ర,
సుజన జనానుగ్రహపాత్ర, వెంకటరామార్య పుత్ర, కవిసార్వభౌమ
సాక్షాద్వీరప్రతాపాది వింశత్యధిక బిరుద విఖ్యాత, సుకవి రాజ
శేఖర, రాజశేఖరకవి ప్రణీతంబయిన ''రాణాప్రతాపసింహ చరి
త్రం'' బను పద్యకావ్యము నందుఁ దృతీయాశ్వాసము.

సంపూర్ణము.

శ్రీ

కామేశ్వర్యై నమః.

# రాణాప్రతాపసింహచరిత్ర.

## చతుర్థాశ్వాసము.

మ॥ స్థిరశౌర్యుండు ప్రతాపసింహపతి హ ♦ ల్దీఘాటు యుద్ధంబు రా
తిరి సూర్తున్ విడనాడు నా పిదప న ♦ ద్రిశ్రేష్ఠమున్ దాటుచున్
మఱునాఁ డయ్యుదయాద్రి సూర్యుఁ డుదయిం ♦ పన్ బోవు నవ్వేళకున్
దరియన్ బోయెను శైలమార్గములగుం ♦ డన్ "గైలవారా"ధరన్! 1

సీ॥ జాము ప్రొద్దెక్కఁడు ♦ సమయంబునకు సలుం
బ్రాభర్త యెదిగి భూ ♦ పతి పదాబ్జ
ముల వ్రాలి "దేవ! వీ ♦ రలు ప్రమరులు; వీరు
చోండావతుల్; వీరు ♦ చోహాణ భటులు;
వీతఁడు శ్యామసిం; ♦ గితఁడు ఖేల్వాపతి;
బేద్లా-కొటేరియా ♦ విభులు వీరు;
తమతమ సైన్యశే ♦ షములు గొల్వంగ నీ
శ్రీపాద సేవఁ గాం ♦ క్షించి వచ్చి;
గీ॥ రాదరింపవె!" యనిన, సై ♦ న్యపతు లెల్ల
మ్రొక్కి నిలిచిరి; భిల్లులు ♦ ముందుఁ గొలువ
వందన మొనర్చె భీముచాం; ♦ దందఱఁ గని
కూరుచుండంగ నియమించి ♦ క్షోణివిభుఁడు, 2

-॥ { వీరస్వర్గమున కేగిన యనుచరులఁగూర్చి ప్రతాపసింహుఁడు విచారపడుట. } ॥-

చ॥ "మనమును నాలుగేండ్లుగ స ♦ మస్తవిధంబుల నాని పూని చే
సిన బహుళశ్రమంబు ఫల ♦ సిద్ధి వహింపక నేఁడు నిష్ఫలమో
జనముగ నయ్యె! నాటి నృప ♦ సత్త్రములన్ దలయెత్తి యెట్లు చూ
డ నగు! విధాత చెయ్ది మక ♦ టా వికటించెనె! యిట్లు నాడెనన్. 3

సీ॥ భూదేవతాళి క ♦ ప్పురపు హారతు లిచ్చి
మంత్రపుష్పము పెట్టు ♦ మహిత దేవ
పూజా గృహం బట్లు ♦ పొదలె నాసేనతో
నిన్న హల్దిఘాటు ♦ నికట సీమ!
గంట లిర్వదినాల్గు ♦ గడచి పోకయ మున్నె
పెండ్లికొడుకు లట్లు ♦ వెలయు శూరు
లెందఱు కన్నుల ♦ కందక చాలైరి!
పదునాల్గు వేలు స ♦ ద్భటులు గూలి!
గీ॥ "రక్కటా! కడుపున పాల ♦ హాలము పోయు
వసువునన్ దేహ మంతయు ♦ నుసుకు లెత్తె!
నమృతభాండము పలుప్రక్క ♦ లగుచు విరిసెఁ!
బెండ్లి చవికె గుభాలున ♦ విఱుఁగఁబడియె. 4

మ॥ అదయుల్ శత్రులు గ్వాలియర్ గొనిన, రా ♦ జ్యంబూడి చిత్తూరిలో
బదముల్ మోపినదాదిఁ, దండ్రివలె మే ♦ వాడ్ రాజ్యలక్ష్మీ పదం
బుఁ దలన్ నిల్పుచు, రామచంద్రనృపుఁ డే ♦ ప్తున్ భక్తి సేవించె; నా
సదయుసాంతు ఋణంబుఁ దీర్పఁగలనే ♦ జన్మాంతరం బందునన్! 5

శా॥ "ఆఱున్ బైఁ బదియేండ్ల ప్రాయమును బూ ♦ జ్యసాంతముక్ మన్మథా
కారం బొప్పెడు లేఁత కుఱ్ఱఁడు తురు ♦ ష్క శ్రేణులన్ దాఁకి, కం
గారై పాఱఁగఁజేసి శాశ్వత యశః ♦ కాయంబునన్ నిల్చె; ఖం
డేరావున్ బురుడింపు పోటరులఁ గం ♦ టే! యే యుగంబందునన్! 6

సీ॥ "తౌరుష్క విపుల వ ♦ రూధి వర్గము దూసి
యాశాంతముల కేఁగు ♦ నట్లు దోలె!
యౌవన బహుళ బ్ర ♦ హ్మాన్వాళి కాస్త్రిముల్
వేలకువేల్ పిండి ♦ పిండి లేపె!

రెండువేల్ భటులతో ♦ రెండులక్షలు తురు
ష్కుల లీలఁ దాఁకి గ ♦ ర్గోలు పఱచె!
నైదువందలు వీరు ♦ లదిమి చుట్టిన వ్రేటు
తనపైఁ బడకయుండ ♦ నని యొనర్చె!
తే॥ జగము పుట్టినదాది నీ ♦ క్షణముదాఁక
బదియు నేడేండ్ల ప్రాయంపు ♦ బాలుఁ డింత
శౌర్యముం జూప లేదని ♦ జనము వొగడఁ
దివిరె! నకట! సామాన్యుఁడే ♦ తేజసింగు! 7

సీ॥ "తనదేహ ధన జీవి ♦ తము లిచ్చి మాతృదే
శముఁ గొల్చు భక్తి వి ♦ జ్ఞాన మయుఁడు!
పదునాల్గు లోకముల్ ♦ గదిరినఁ దన పట్టు
వీడని పరమ గం ♦ భీర మూర్తి!
మృత్యుదేవత నైన ♦ మిత్రునియట్లు ప్రే
మించెడు వీర ల ♦ క్ష్మీప్రభుండు!
మత్పదం బేకాగ్ర ♦ మనమునఁ గొలుచు పూ
ర్ణస్వామిభక్తి ప ♦ రాయణుండు!
తే॥ "భారతమునకె కాక వి ♦ శ్వమున కెల్ల
యశముఁ జేకూర్పఁ జాలు మ ♦ హాబలాఢ్యుఁ!
డౌర! తాకోర్కులంబు ధ ♦ న్యతము మత్యుఁ!
దేజసిం హావతార సం ♦ యోజనమున! 8

తే॥ తండ్రివలె నేలె; మనసు మె ♦ త్తనిది!; వీర
సమర రంగాగ్ర సీమఁ బ్ర ♦ చండ భానుఁ!;
డకట! భానుసింహుఁడు గూలె!" ♦ ననుచు వగచు
నాప్రతాపునిఁ గని సలుం ♦ బ్రాధిపతియు! 9

చ॥ "అనిఁ బడు భానుసింహ వసు ♦ ధాధిపు సాద్రినృపాలుఁ డస్సై చెం
తను గల శైలగహ్వరము ♦ దాపునఁ జేర్చి సపర్య చేసి; నా
తనికి భయంబు లే"దనఁ బ్ర ♦ తాపుఁడు "కీతున మేలు గల్గె! దే
వుని కృప"యంచు నాత్మఁ దల ♦ పోయుచు మ్రొక్కి నిమీలితాక్షుఁడై.

—౹ ప్రతాపసింహుఁడు సేనాధిపతుల సత్కరించుట. ౹—

సీ॥ అల సలుంబ్రాధీశు, ♦ నవ్వల సాద్రీశుఁ,
బదపడి ఖేల్వార్నృ ♦ పాలుఁ, బిదప
బేంద్లా-కొఠేరియా ♦ పృథ్వినాయకులఁ జే
ర్మిని జూచి "మీరును ♦ మీరు మీరు
సంవర్త-సమవర్తి ♦ సదృశులై నిన్న హ
ల్దిఘాటు కనుమ న ♦ మోఘ ధాటిఁ
బరసేనఁ దాఁకి యు ♦ గ్ర రణంబు సాగించి
కొఱలేక రిపులను ♦ గూల్చినారు;
తే॥ స్వామిభక్తి పరాయణుల్ ♦ సరళ మతులు
మీయెడఁ గృతజ్ఞుఁడ" నటంచు ♦ సాయము విను
తించి వేజ్వేర సరసకుఁ ♦ దీసి వారి
వారికినిఁ గొన్ని ఫలములు ♦ పంచి విభుఁడు; 11

సీ॥ "యువరాజ మానసిం ♦ హుల యేన్గు చైతకా
శ్వము ధాటి కోర్వక ♦ పాఱు పిదప,
వేలు లక్షలు మొగల్ ♦ వీరులు నను ముట్టఁ
ద్వర వచ్చి నా రవి ♦ ధ్వజముఁ గొనుచుఁ,
దుఃఖకమూఁకలఁ జాల ♦ దూరంబుఁ జేర్చి నా
పైని యొత్తడి తద్దఁ ♦ బాయఁ జేసి
తొమ్మండ్రుగురు తన ♦ తోఁబుట్టువులఁ గూడి
స్వామిభక్తిని జూపి ♦ స్వర్గ మేగు;
తే॥ నా మనస్సింహునకును మే ♦ లేమి సేతు!
నతని యనుజుండు జ్ఞాతి యీ ♦ శ్యామసింహుఁ
బ్రిథనసీమల నాకుడి ♦ వంకఁ బోరు
నట్టి యధికార మిచ్చి యి ♦ ష్టాదరింతు. 12

సీ॥ ఇఁకమీఁద యుద్ధంబు ♦ లెసఁగుచో సాదిప్రభృ
పాలురే దినమణి ♦ ధ్వజము పట్టి

నన్నుఁ బాయక యె వెం ♦ టనె యుండెదరుగాక!
యాస్థానమును జేర ♦ నరుగు నపుడు
తద్దుందుభులు రాజ ♦ ధాని నాహర్మ్య సిం
హద్వారమును జేరు ♦ నంతదాఁక
మ్రోయుచుండెడుఁగాక! ♦ యీ యన్వయమున ని
ప్పటినుండి సాద్రిన్ప ♦ పాలమాళు
తే॥ లందఱును దమ నామధే ♦ యముల ముందు
రాజపద లాంఛనమ్ముగా ♦ రవపదమ్ముఁ
దాల్తురిగావుత వంశజుల్ ♦ తర తరముగ”
ననిన, “బళి” యనె నైకకం ♦ ఠ్యముగఁ గొలువు. 13

క॥ “దేవా! నీసేవను యీ
లావంశము ధన్యమైన ♦ లంగె” ననుచు శ్యా
మావనిపతి మ్రొక్కెను; సం
భావనమెయిఁ బతియు భిల్ల ♦ పతిఁ గన్గొనుచున్, 14

మ॥ “తరమే! నిన్ను నుతింప; నీ భుజమ యా ♦ ధారంబు నా కుగ్రసం
గరరంగంబుల; దేన నెట్టులు బహూ ♦ కారంబుఁ గావింతుఁ బ్రే
మ రసం బొప్పఁగ గౌఁగిలింతు నని సం ♦ భావించెఁ; నల్లే వడిన్
మొరసెన్ భేరులు; సూక్తుఁడున్ నిజబలం ♦ బుల్ గొల్వఁ గానంబడెన్

—॥ సూక్తసింహుఁడు ప్రతాపసింహుని జేర వచ్చుట. ॥—

ఉ॥ “నిన్న నితండు చేసిన ప ♦ నిన్ దని వొందక వైర మూని, నేఁ
డన్నను దాఁక వచ్చెఁ! దును ♦ మాడరె వీని” నటంచుఁ బల్కి యం
దున్న సమస్తవీరులు ము ♦ హోద్ధతి లేవఁ, బ్రతాపుఁ డంతఁ జే
సన్నను వారి నిల్పి “యొక ♦ సంగతి మీ కెఱిఁగింతు; నైపుడీ! 16

సీ॥ అందఱు గూర్చుండుఁ ♦ డని నిల్చ్పై నిన్న
గిరివెంట నే వచ్చు ♦ టెఱిఁగి, యంబ
టీసుండు ననుఁ గూల్ప ♦ నిరువుర వీరులఁ
బంపెఁ; వాఁడు పిఱుంద ♦ వచ్చి రంత!

సూక్తుఁడుఁ వారిఁ గూ ♦ ల్చుచు నన్నుఁగని మ్రొక్కెఁ
నతనినేఁ గనికరిం ♦ చితిని; బిదపఁ
జైతకం బిల వ్రాలి ♦ సమసెఁ; నిజాశ్వము
నా కిచ్చి తఱలి, యీ ♦ నాఁడు వచ్చెఁ;
తే॥ గలిగె నాకు హాల్దీఘాటు ♦ కదన మందు
నిన్న సోదరలాభ!'' మ ♦ టన్న హర్ష
మలర నందఱు నెమ్మోము ♦ లడరె నపుడు;
నవ వికసి తారవింద సం ♦ తతుల కరణి! 17

సీ॥ సూక్తుఁ డశ్వము డిగ్గి ♦ సూటిగఁ జని సలుం
బ్రాధీశునకు మ్రొక్కి ♦ యన్న కెఱగి
"దేవ! నీయొద్ద ఁ ♦ తిరి యనుమతిఁ గొని
చని మానసింహు ద ♦ ర్శనము చేసి,
యువనసేనాధినా ♦ యకులఁ గూల్చుట, నిన్నుఁ
గొలుచు టాదిగఁ, గార్య ♦ ములను దెలిపి
నన్ను సేవించు సై ♦ న్యము వెంటఁ గొనుచు మా
ర్గమున వచ్చుచు "భిల్సు ♦ రా" పురంబుఁ
తే॥ గాంచి యువనుల నోంచి దు ♦ ర్గము గ్రహించి
దాని గురుదక్షిణగ నీ ప ♦ ద ద్వయమున
నప్పగింపంగ వచ్చితి; ♦ నాదరించి
చేకొను'' మటన్న నవ్వి యా ♦ శీర్వదించి, 18

ఉ॥ ఎత్తి కవుంగిటఁ బొదివి ♦ యిప్డు కుమారక! నాకు నీమహో
దాత్తగుణంబు మిక్కిలి ము ♦ దం బొడగూర్చె; భవత్పరాక్రమో
పాత్తము భిల్సురానగర ♦ వర్యముఁ జేకొని నాకు మాఱుగా
నిత్తటి నేలు'' మంచు వచి ♦ యించి ప్రతాపుఁడు మిత్రకోటితో, 19

—॥ ప్రతాపసింహుఁ డనుచరులతోఁ గర్తవ్యము నాలోచించుట ॥—

సీ॥ "మనము హాల్దీఘాటు ♦ కనుమలోఁ జూపిన
త్యాగ-శౌర్యములు శ్లా ♦ ఘ్యములె! కాని,

గుటికి బెత్తెడుగఁ ద ♦ క్కువ యాట జయలక్ష్మి
యందని మ్రాని పం ♦ డై తనర్చె!
మన కపజయము గ ♦ ల్గిన దంచుఁ గుందకుఁ!
డపజయంబున దీక్ష ♦ యతిశయించు!
నెంత త్యాగం బున్న ♦ నంతగా దేవుని
వాత్సల్యమునకు స ♦ త్పాత్రము గద!
తే॥ యింక దాఁగల వేళల ♦ నేమి సేత!
మరి విజయ కాంక్ష విడువక ♦ యని యొనర్త
మనుచు మదిఁదోఁచె నాకు; మీ ♦ యంద ఱెట్టు
లాన తిచ్చెద"రన. సలుం ♦ బ్రాధిపతియు! 20

ఉ॥ "శ్రీలు తొలంగి గేహమునఁ ♦ జీఁకటి మూలల గోళ్లు మీఁటి వై
ద్యాలయమందు రోగుల క్రి ♦ యన్ శయనించెను మందమర్త్య కం
కాళము లెట్లు లోకహిత ♦ కార్యముఁ దీర్చెడు! విక్రమానల
జ్వాలలు నిన్నుఁబోలు పటు ♦ శౌర్యులు దీర్తురు గాక రాణ్మణీ! 21

సీ॥ ఆనాఁటి కొకమాట ♦ యీనాఁటి కొకమాట
పలుక నేర్చెనె సలుం ♦ బ్రావిభుండు!
నామాట యేమి! యసం ♦ దఱ భావ మెఱుఁగుదుఁ
ప్రాణంబు మేన ను ♦ న్నంత వఱకు
స్వాతంత్ర్య సమర దీ ♦ క్షావృత్తి సాఁగించి
మీ దివ్య చరణ స ♦ మీప సీమ
నాత్మార్పణ మొనర్చి ♦ యజరామర ఖ్యాతిఁ
జెంద సేవింపఁ గాం ♦ క్షింతు మెపుడు!
తే॥ ఋణము తడవు సేయకయె ర ♦ క్త మెఁగజల్లి
రణ మొనర్చుచు శత్రు మా ♦ రణ మొనర్తు;
మెత్తిన ధ్వజంబు దింప కా ♦ యత్త పడఁగ
వలయు"నన భీమచాందు భూ ♦ వరుని గాంచి, 22

సీ॥ "జనదుర్నిరీక్ష తే ♦ జశ్శాలి! భారత
ఖండ ప్రచండ మా ♦ ర్తాండమూర్తి!

నీ వుండుచోటనే ♦ నిఖిల ధర్మము లుండు;
సత్య ముండును; నిత్య ♦ జయము నుండు;
నా సూర్యభగవాను ♦ నట్టి వాఁడవు; దిన
దినమును నిన్నుఁ జూ ♦ చిననె చాలుఁ;
బావిత్ర్య గాంభీర్య ♦ భావముల్ క్రొత్తంద
వంబును దఱుఁగ వే ♦ నాఁడు గాని;
తే॥ పూర్ణ సాత్త్వి కానంద రూ ♦ పుఁడవు! రాజ
పుత్రసంస్థాన మేటికి ♦ భూ భువనము
లన్నిఁటి జయింపఁ గలుగు మ ♦ హాభుజుండ;
వనఘ! నీమైత్రి పరమ భా ♦ గ్యంబు గాదె! 23

క॥ మాజీవితములు నీపద
పూజకు విడిచితిమి; కొదవ ♦ పొడమ" దనఁగ ఖే
ల్వాజాని "సందియం బే
లా! జయ పెట్టంగ లోక ♦ మని సేయఁ దగుఁ. 24

సీ॥ రేఁగెడు సమర ఖే ♦ రీ ఝాంకృతుల్ విప్ర
వితతి నాందీవాద ♦ వేద రవము!
గళముల వ్రాలు వై ♦ రుల తీక్ష్ణ కరవాల
ధారలు కల్యాణ ♦ హార చయము!
పొగ రేఁగి క్రాఁగి గు ♦ ప్పునఁ బ్రేలు లోహ నా
ళాగ్నులు మంగళ ♦ హారతులును!
దస్యుల గళ గళ ♦ ద్రక్త పూరములు దే
హమున సోఁకిన వసం ♦ తముల రంగు!
తే॥ వైరి మధ్య స్థలంబు వి ♦ వాహ వేది!
మొగలు భట విదారణములు ♦ భూత బలులు!
గా విజృంభించి సమర రం ♦ గమునఁ బోరి
పెండ్లి యాడుదు మిఁక వీర ♦ విజయ లక్ష్మి" 25

తే॥ అనిన, బేడ్లా-కొఠేరియా ♦ మనుజ విభులు;
"మాతృదేశ విముక్తికై ♦ మా యఖిలము,

నించుకయు జాగుసేయ క ♦ ర్పించుకొనఁగ
సిద్ధముగ నుందు"మనఁ, గృష్ణ ♦ సింహ విభుఁడు, 26

సీ॥ "విన్నవించెద నొండు ♦ నిన్న హాల్దిఘాటు
కనుమలో ససము సం ♦ గరము నడపి,
వ్రాలిన వారు శా ♦ శ్వత యశస్సాంద్రు లౌ
దురు; కాని వారి కం ♦ దఱకుఁ దోడు
చైతకాశ్వము చిర ♦ స్మరణీయమై యొప్పు;
నది వ్రాలిన ప్రదేశ ♦ మందుఁ బెద్ద
యగుగును సద్దాని ♦ యాచునఁ గూప స
త్రములు ప్రతిష్ఠించి ♦ దాని పేరు
తే॥ నిలుప నెల వీయ దగు" నన్న ♦ నృపతి "యకట
దాని ఋణమును దీర్ప నా ♦ తరమె! మీరు
కోరి నటులు చేయింపుఁడు! ♦ కొఱత వలవ"
దని పలికి యందఱను గల ♦ యంగఁ జూచి, 27

ఉ॥ "పట్టిన పట్టు పట్టినదె; ♦ ప్రాణము దేహమునందు నుండ, నే
పట్టున మానఁగాదు; మన ♦ పై కరుదెంచు తురుష్కసేన లీ
గుట్టలు చొచ్చుటెల్ల యము ♦ కోఱలు చొచ్చుటయంచు గుండియల్
కొట్టుకొనన్ మెలంగవలె ♦ లోకులు కన్నులు విచ్చి చూడఁగన్. 28

సీ॥ యవన సంగ్రామ మ ♦ హానాటక ప్రద
ర్శనమున నిన్నఁటి ♦ దినమునందు
జరగు హాల్దిఘాటు ♦ సమరోత్సవంబు ప్ర
స్తావంబు చందమై ♦ సాఁగి యుండెఁ;
బ్రథమాంక మింకఁ బ్రా ♦ రంభంబు గానుండు;
నడుమ వ్యవధి తద్ద ♦ యడరఁ బోవ;
నెన్ని యంకంబు! లె ♦ న్నేండ్లాడవలయునో!
యెట్టులు ముగియునో! ♦ యెఱుఁగరాదు!
తే॥ మంగళాచరణము మొదల్ ♦ మంగళంబు
వఱకు నుత్తరోత్తర రస ♦ ప్రౌఢి వెలయఁ.

దేఁకువ వహించి వర్తించి ♦ తృప్తిఁ బడుప
వలయు నీ విశ్వ సభ్య ప్ర ♦ పంచకమును! 29

తే॥ చెలఁగె నొకభంగి మన పరి ♦ స్థితులు నేఁటి
వఱకు; "ముం దున్నది ముసళ్ల ♦ పండు" వనెడు
కరణి వచ్చు కాలము కష్ట ♦ గర్భిత మగు;
నేకలింగేశ్వరుండె తో ♦ డింక మనకు." 30

సీ॥ అనినఁ "గొండలు పిండి ♦ యైపడ వర్తింతు
మింక సందేహింప ♦ నేల! దూరము
నిలుపక సాఁగింప ♦ వలె" నంచుఁ బలికి రం
దఱు; "మంచి" దనుచుఁ బ్ర ♦ తాప విభుఁడు
హర్షాశ్రు కలిత నే ♦ త్రాంచలుఁ డయ్యె; వా
ధరిగిరి భూధర ♦ ప్రాంతములను;
వానకా రరుదెంచి ♦ భయద నీలాంభోధ
రము లాక సమ్మునఁ ♦ గ్రమ్మసాఁగె;

తే॥ వాన జడిపట్టి కురిసె; యా ♦ వన బలములు
గిరులఁ దిరుగఁ జాలక వెన్క ♦ కరిగె; సంత
తోష్ణబిడౌజున కబ్బె వి ♦ శ్రాంతి కొంత;
పెరిమ హేమంతముం బ్రస ♦ వించెఁ బ్రకృతి. 31

గీ॥ కాఱుమొగిళులతో వాన ♦ కారు దాఁటెఁ;
గాలి చలి ప్రకృతికి గిలి ♦ గింత లిడెనుఁ;
గానఁ గోనల షహాబాజు ♦ ఖాను గడచి
ఫౌజు హారావళీ సీమ ♦ పట్టుఁ జేర్చె. 32

సీ॥ అలసలుంబ్రాసీమ ♦ యందుండి పిడుగుల
గేరు వీరులఁ దెచ్చెఁ ♦ గృష్ణసింగు;
ఝాలూరిసేనల ♦ తో లేచి వచ్చె దు
ర్వార విక్రముఁ డైన ♦ భానుసింగు;
సాద్రి యందుండి ఝూ ♦ లాన్వవాయుల సేన
లన్ని దోడ్కొనివచ్చె ♦ శ్యామసింహు;

డా బుసేరా-షాపు ♦ రాక్షసులు శిశోది
యా వీరభటులతో ♦ నరుగు దెంచి;
తే॥ రింక బెంగ్లా-కొ ఫేరియా ♦ నృపులు వచ్చి;
రవల సూర్యమహలు నుండి ♦ యచటఁ జేరె
దుర్జయుఁడు; దుర్నివార బం ♦ ధురబలుండు
భిల్ల సేనలతో డాసె ♦ భీమచాంద. 33

—॥ రెండవ సంవత్సరము యుద్ధము ॥—

చ॥ తమపయి వచ్చు వైరులఁ బ్రి ♦ తాపమహీంద్రుఁడు మాఖ శుద్ధ పం
చమి నెదిరించె! శైలముల ♦ దండ, విశాల సమున్నత ప్రదే
శముల; దురంబు ఘోరముగ ♦ సాఁగెఁ; దురుష్కులు రాజపుత్రులున్
సమసిరి వేనవేలుగను ♦ నాఁటి మహా సమరాంగణంబునన్. 34

చ॥ యవనుల సేన సంఖ్యలకు ♦ నగ్గలమై జలరాశి పేచి పం
క్తివలెను బొంగి పైఁబడ ను ♦ దీర్ణ పరాక్రము లయ్యు నాప్రతా
ప విభుని రాజపుత్ర భట ♦ వర్యులు తజ్జ్వలనాస్త్ర ధాటి కో
ర్వ వలను లేక డీల్పడి ప ♦ రాజయ మొందఁగ సాఁగి రయ్యెడన్. 35

క॥ మఱుసటి సంవత్సరము
క్బరు మేవాడ్‌సీమఁ జొచ్చి ♦ స్వయముగ వసుధా
పరిపాలనాదికమ్ములు
స్థిరముగ నేర్పాటుచేసి ♦ చేరెన్ బురికిన్! 36

క॥ అల బహిరంగ సమిరాకం
బుల యవనుల నోర్వఁ గష్ట ♦ ముగఁ దోఁపగఁ సే
నలఁగొని ప్రతాపవిభుఁ డి
మ్ములఁ గుంభల్ మియరు దుర్గ ♦ మును జొరఁదలఁచెన్. 37

సీ॥ క్రమముగాఁ గైలవా ♦ రాసీమ దాటుఁచు,
నెత్తైన కొండల ♦ నెక్కి పోయి,
దట్టంబుగా నాగ ♦ దాళి మొల్చుటఁ గ్లిష్ట
మగు శైలమార్గంబు ♦ లందు నడచి,

కోలుత బహిర్ద్వార ♦ ములు రెండు గడచుచుఁ
జని హనుమ ద్ద్వార ♦ మునఁ గమించు
చును, విజయద్వార ♦ మునను శోణద్వార
మునను రామద్వార ♦ మునను జొచ్చి
తే॥ సేన లన్నియుఁ గోటలోఁ ♦ జేరుకొనియె;
నా ప్రతాప ప్రభూత్తంసుఁ ♦ డంబుదముల
నొరయుచు మహోన్నతమయి సుం ♦ దరము నైన
మేఘభవనంబులో విశ్ర ♦ మించె నపుడు. 38

—॥ కుంభల్మీయరు యుద్ధము. ॥—

ఉ॥ పుట్టలు పిప్పిలి చీమల గు ♦ ముల్ వెలికిన్ బరతెంచు క్రైవడిన్
దట్టములై వడిన్ మిడుత ♦ దండు గుముల్గొని దూఁకునట్లు పెం
గుట్టలలోఁ దురుష్కభట ♦ కోటి చొరంబడి నాల్గు దిక్కులన్
ముట్టడి వేసి దుర్గమును ♦ ముంచెను పెద్ద పిరంగి వ్రేటులన్. 39
సీ॥ విక్రమంబున కాది ♦ పీఠమైన ప్రతాపుఁ
డడరి నాల్కలు సాఁచు ♦ నగ్నిశిఖల
వంటి రాజస్థాన ♦ భటులఁ బ్రేరేప, నా
మడమ త్రిప్పని మేటి ♦ కడిమి కాండ్రు
గోడలు దిబ్బలు ♦ గోపురంబుల నెక్కి
పీడ కొక్కఁట శిలా ♦ వృష్టి గురియ,
భిల్లవీరులు లోక ♦ భీకరంబుగ ధను
ష్టంకార మొనరించి ♦ శాత శర ప!
తే॥ రంపరలఁ జిత్త జల్లుగా ♦ నింపు చుండ
యముఁడు నాల్క సాఁచిన యట్లు ♦ యవనసేన
దిన దినము గంట గంటకుఁ ♦ జేకువ నెడి
బలము తఱిఁగి యంతంతకుఁ ♦ బలుచ నయ్యె! 40
తే॥ ప్రళయమార్తాండువలెఁ బ్రతా ♦ ప ప్రభుండు
వహ్ని గురియింప మొగలాయి ♦ భటులు కోట

వైపు చూడలే రైరి; షా ♦ భాజుఖాను
రాతి గుండియలోఁ బెద్ద ♦ బీతు దవిలె! 41

సీ॥ గుదులు గుదుల్ బాణ ♦ కోటు లాయుధములు
కుంభవృష్టిగఁ బెల్లు ♦ కురియు కతన
యవనవీరులు తల ♦ లవిసి సంధులు వ్రీలి
గాత్రముల్ రక్తసి ♦ క్తంబు గాఁగ
రణరంగ లక్ష్మియు ♦ రక్తాభిషేకంబు
చేసిన చందమై ♦ చెదరె సేన;
క్షణములు బలిసి యు ♦ గంబులై నిలిచె; షా
భాజుఖా నేమొన ♦ ర్పంగఁ దోప
తే॥ కడలు నొంది యాబూ పర్వ ♦ తాధికారి
నాప్తుని బ్రతాపఘరు దేవ ♦ రాధిపతిని
ధన కనక వస్తు వాహన ♦ తతుల తోడ
నరిగి, త న్నుద్ధరింపు మం ♦ చాశ్రయించె! 42

ఉ॥ క్రచ్చఱఁ గోటఁ జొచ్చి నడు ♦ రాతిరి య న్నరరూపదానవుం
డచ్చఁపుఁ జీకటిన్ "నవగు" ♦ నాఖ్య రహించెడు కూపమందునన్
బెచ్చు విసంబు పోసి కలి ♦ పెన్ నెన రించుక యైన లేక; హా
పచ్చని యింటఁ జిచ్చు నిడు ♦ పాపుల కేవని చేయఁ రానిదా! 43

తే॥ కోటలో నది యొక్కఁడే ♦ కూప మగుట,
నంద ఱా నీరమును గ్రోలి; ♦ రం దనేకు
లసువులను వీడి; రిది చూచి ♦ యాప్రతాప
నరపతిని భానుసింహుండు ♦ దరియ నేగి, 44

సీ॥ "జలముల విసమును ♦ ♦ గలిసి దేవరవతి
తడిగుడ్డ గొంతుకల్ ♦ తఱిగినాఁడు;
నెలలుగా మొగలు సే ♦ నలు పోరినను నేఁడు
గలిగిన నష్టంబు ♦ గలుగ లేదు;
నటఁ దడవున్న ని ♦ ర్హేతుకంబుగ సంఘు
మృతి గల్గుటయు ధ్రువం; ♦ బీవు కృష్ణ

సింహాదులను గూడి ♦ శీఘ్రముంబె దుర్గంబు
దాఁటిపోవుట మేలు; ♦ తనువు లందుఁ
తే॥ ప్రాణములు గల్గుదాఁక మ ♦ ద్భటులు నేను
కోట మొగలాయి బలము చే ♦ కొనకయుండ
నని యొనర్తుము; మాఱు మా ♦ టాడకేగు;
మద్దుకొనువాఁడఁ గనుల నీ ♦ యడుగుదోయి" 45

క॥ అని వినయంబునఁ బ్రార్థిం
చిన నందఱు నట్లె యొత్తి ♦ చెప్పుకొనఁ బ్రతా
ప నృపతి సమయ మెఱుంగుచు
మనమును నోడఁబఱచె నొక్క ♦ మాదిరిగాఁగన్. 46

—॥ ప్రతాపసింహుఁడు 'చేవందా' దుర్గమునఁ జేరుకొనుట. ॥—

క॥ క్రందుగ మేవాణ్ణిరృతి ది
శందగు చప్పన్నసీమ ♦ శబరుల దేశం
బం దరిగి ప్రతాపుఁడు "చే
వందా"దుర్గంబుఁ జేరె ♦ బలములతోడన్. 47

సీ॥ "మునుపటివలె దుర్గ ♦ మునునుండి పోరాడఁ
బూనిన విషజలం ♦ బులను ద్రావి
పూటకేనును సైన్య ♦ ములును మ్రగ్గుట ధ్రువం;
బిహాపరంబులు రెంటి ♦ కిదియు దూర;
మెటులైనఁ దప్పదు ♦ మృతి; యట్లుగాన దు
ర్గ బహిర్గతుఁడనై య ♦ రాతిసేనఁ
జిచ్చఱ పిడుగట్లు ♦ చీలిచి చెండాడి
చిందర వందర ♦ చేయనె తగు"
తే॥ ననుచుఁ దలపోసి తనదు సై ♦ న్యమ్ముఁ గొనుచు
ముందుగల హనుమద్ద్వార ♦ మును దెఱచుచు
హరుని ఫాలనేత్ర జ్వాల ♦ ననుకరించి
భానుసింహుండు వైరుల ♦ పైన బ్రాలె. 48

—॥ చంద్రభట్టారకుఁడు భానుసింహునకుఁ దోడు పడుట. ॥—

తే॥ అసిలుఁ దనలంబునకును దో ♦ డైన యట్లు
సిద్ధహస్తులు విక్రమ ♦ శుద్ధులైన
సద్భటులఁగొంచుఁ గవిరాజు ♦ చంద్రభట్టు
భానుసింహునకును సాయ ♦ పడియె నపుడు. 49

ఉ॥ మండెను వహ్నికుండముల ♦ మాడ్కి విలోకన విస్ఫులింగముల్
నిండ, హయవ్రజంబుఁ గద ♦ లించుచు భూరి ఖురాగ్ర ఘట్టనా
ఖండ ధరా పరాగముల ♦ క్రందున గాఢ తమంబుఁ గూర్చి యు
ద్దండత రాజపుత్ర భట ♦ తండము దాఁకె నరాతి కాండముల్! 50

తే॥ వీరకేసరులను బోలు ♦ భిల్ల భటుల
కర కలిత కార్ముక కదంబ ♦ కములనుండి
పక్షితతి మాడ్కి శితబాణ ♦ పటలి లేచి
తురక మూకల శిరముల ♦ నతికి వైచె. 51

ఉ॥ అంతఁ దురుష్కసేనల మ ♦ హాహవ శౌర్య విలాసరేఖ సా
యంతన మొందుచుండ, నలి ♦ నాప్తుఁడు పశ్చిమవార్ధి డాసి సా
యంతనముల్ బొనర్చెను! ర ♦ యమ్మున నాసపుఖాను సేనతోఁ
జెంతఁ గనంబడన్ యవన ♦ సేనలు పొంగె సముద్రముల్ బలెన్. 57

చ॥ యముని కరాళజిహ్వక క్రి ♦ యన్ జెలరేఁగుచు భానుసింహుఁడున్
సమర మొనర్చుచున్ మొగలు ♦ సైన్యముఖంబును వచ్చి చొచ్చి గ
ర్భమునను దూఱి వైరుల శి ♦ రంబులు రాసులు పోసి పోసి ప్రా
ణమును త్యజించె నబ్బురము ♦ నన్ రిపులున్ దను మెచ్చి యార్వఁగన్

మ॥ కవిరా జాదినరాజు వోలెఁ గర ము ♦ గ్రస్ఫార తేజంబుతో
నివముల్ మాపెడునట్లు వైరిగణముల్ ♦ హింసించి మందేహ దై
త్య వితానంబులలోనఁబోలె రిపుసం ♦ తానమ్మునన్ జిక్కి, గా
యవడెన్; నిర్గత రక్తధారలు తిరం ♦ బై పాతెఁ బెన్నాల్వలై. 54

సీ॥ బ్రహ్మవంశంబు పా ♦ వనమై పొదల బృహ
స్పత్యంశమునఁ బుట్టు ♦ బ్రహ్మవేత్త!

పికరాజువోలె గొం ♦ తుకయెత్తి మధుర గీ
తికలు పాడిన మేటి ♦ సుకవిరాజు,
క్రమత హల్దిఘాటు ♦ రణమునం దరికోటి
దోమ లట్టులు ♦ దోలు భీమసేనుఁ,
డజరామరఖ్యాతి ♦ నవనిపై నిలుపంగఁ
గలుగు శతాధిక ♦ గ్రంథకర్త,
ఆ॥ వీర రసము వెల్లి ♦ విరియఁ గుంభల్‌మియర్
రణము నడపు విలయ ♦ రౌద్రమూర్తి;
చంద్రభట్టు చొచ్చె ♦ పవిత్ర మండలి, నమా
వాస్యగాఁగ నాత్మ ♦ పక్షమునకు. 55

మ॥ వనధిన్ జేరు మహా నదీజలము స ♦ ర్వం బందునన్ లీనమై
చను చందంబున రాజపుత్రులు తురు ♦ ష్కశ్రేణులన్ జీల్చుచున్
జని నిశ్శేషముగాఁగఁ గూలి; రటుపై ♦ షాభాజుఖాన్ సేనలన్
గొని మొగల్‌ధ్వజ మెత్తి చేరికొనియెన్ ♦ గుంభల్‌మియర్ దుర్గమున్!

—॥ మానసింహుఁడు ధర్మేతి-గోకుండా దుర్గములఁ జేకొనుట. ॥—

శా॥ నిండెన్ గొండలలోన మొగలు భటా ♦ నీకంబు లందంద; ను
ద్దండప్రాభవ శౌర్య ధైర్య రతుఁ డా ♦ "ధర్మేతి" దుర్గంబు "గో
కుండా" దుర్గము మానసింహుఁడును జే ♦ కొంచున్ మొగల్‌సేన లం
దుండన్ జేయుచు ఢిల్లికిన్ జనియె న ♦ త్యుత్సాహ మేపారఁగన్. 57

తే॥ ప్రళయకాలాగ్ని శిఖమాడ్కిఁ ♦ బ్రజ్వరిల్లి
శత్రు సైన్యాటవులఁ గాల్చి ♦ జాలు యోధ
శేఖరుఁడు మహాబత్ఖాను ♦ సేన తోడ
నుదయపుర మాక్రమించి యుం ♦ దుండ సాఁగె. 58

ఉ॥ "స్థాణుఁడో విష్ణుఁడో మఱి ప్ర ♦ తాపుని మానవమాత్రు సంగర
క్షోణిని గెల్వ నెట్లు కౌతు ♦ కం బడ నేటికి! నేఁడు నాదు న
క్షీణబలంబు లోకములు ♦ కీర్తన సేయఁగ వానిఁ దాఁకి స
ప్రాణునిగాఁగఁ బట్టుకొని ♦ వచ్చెద"నంచుఁ బ్రతిజ్ఞ చేయుచున్, 59

—౹ ఫరీదుఖాను ప్రతాపసింహునితోఁ జేయు యుద్ధము. ౹—

సీ॥ ఆఫరీద్ ఖాను సై ♦ న్యముల నద్రుల నిండ
నెక్కించి; నందుపై ♦ నొక్కనాఁడు
రాణాయు వెడలి దు ♦ ర్గ బహిఃప్రదేశంబు
లను జరించుచునుండె ♦ నను చుఁ దెలిసి
చమువుల నాల్గు భా ♦ గములుగా విడఁదీసి
యనుమాన మున్న చో ♦ ట్లాక్రమించి
వేఁగు జామైన రా ♦ ణాగారు చిక్కుదు
రిది తప్ప దని నమ్మి ♦ నిదుర వోయె;
తే॥ నర్థరాత్రిమ్ముౕన మహాగ్ని ♦ యదిరిఁ దోఁచె;
నది ఫరీదు దవానలం ♦ బని తలంచె;
రాజపుత్రసేనలు గొల్వ ♦ రాజ గురుఁడు
ముందు నైపునఁ దాఁకె న ♦ మ్ముగ్గలుసేన. 60
ఆ॥ అంటరాని మంట ♦ యాసలుం బ్రాప్వమి
యుక్కుతునియ లట్టి ♦ యోధులఁ గొని
యవను లున్న లోయ ♦ యవ్వలి దెస నెల్ల
ముట్టడించి త్రోవ ♦ మూసి వైచె. 61
ఉ॥ కాకులువోలె వైరులు వి ♦ కావికలై యడవంగఁ జుట్టి ద
ర్వీకర భీకరంబులగు ♦ పెద్ద కటారుల నెత్తి స్వాంతమం
దేకడ జంకు లేక వధి ♦ యించి ప్రతాపుఁడు కృష్ణసింహుఁ డు
గ్రాకృతిఁ దోఁపఁ జేసిరి ర ♦ ణావని మోదుగు పూచి నట్లుగన్. 62
తే॥ పదియు నైదువేల్ భటులు వెం ♦ బడిని గొలువ
రాయసింగుదయపురిఁ జే ♦ రంగ నెంచి
బొబ్బ లార్పులు గర్జనం ♦ బులు దసర్ప
వ్యాఘ్ర శైలంబు డాయంగ ♦ వచ్చె నపుడు! 63
ఉ॥ వచ్చుట తా నెఱింగి శర ♦ వర్షము గుప్పుచు భిల్లసేన కా
ర్చిచ్చునుబోలి గుట్టలను ♦ జెట్టుల పుట్టలనుండి గుంపులై

వచ్చి హఠాత్తుగాఁ బొదివి ♦ పాయలు పాయలుగాఁగఁ గ్రొచ్చఁగా
విచ్చి వితాకుఁ గాకు వడి ♦ బెగ్గిలి పాఱెఁ దురుష్క సైన్యముల్. 64

ఆ॥ బ్రహ్మపుత్రనుండి ♦ పంజాబుదాఁకఁ గ
న్యాకుమారియును హి ♦ మాద్రి నడుమ
మెఱసెఁ బరమశాంతిఁ ♦ మేవాడ యొక్కండె
కదనలక్ష్మి కయ్యెఁ ♦ గాపురమ్ము! 65

క॥ మెల్లగ 'మండలగృహ' ము
బ్దుల్లాఖాఁ మాత్స్యదుర్గ ♦ మును నా"షేరో
నెల్లా"ధరఁ గలదానిని
బల్లిదుఁడగు మానసింగు ♦ పట్టెరి వరుసన్. 66

తే॥ శ్రావణమురాకఁ గొంత వి ♦ శ్రాంతిఁ గొనుచు
మార్గశీర్షమ్ముతోడఁ గ్ర ♦ మ్మఱఁ దురుష్క
విసరములు రేఁగ, నిసుమంత ♦ విసుగు పడక
రణము సాగించుచుండె నా ♦ రాజ గురుఁడు. 67

సీ॥ ఏఁటేఁట నెలనెలఁ ♦ గృశియించె దేహంబు!
నవసిపోసాఁగె సే ♦ నా బలంబు!
దుర్గంబులెల్ల శ ♦ త్రుగతంబు గాఁజొచ్చె!
ద్రవ్యసంపత్తి త ♦ ద్దయును దఱిఁగె!
భారమ్ముగాఁ గుటుం ♦ బము వృద్ధి యగుచుండె!
ననుదినం బాపద ♦ లతిశయిల్లె!
నానాఁట నెదిరి సే ♦ నల పెంపు లావయ్యెఁ!
దలఁదాఁచుకొను చోటు ♦ తక్కువయ్యెఁ!

తే॥ జెట్టులను బుట్టలను బ్రాపు ♦ చేసికొనుచుఁ
గడుపు నించుచుఁ బూటలు ♦ గడుప వలసె!
గడియ గడియ కరుల్ వచ్చు ♦ కతన నిజ ని
వాసముల బెక్కుమార్లు మా ♦ ర్పంగ వలసె. 68

—॥ { అక్బరు సైన్యము నంపి కైలవారాసీమలోని ఫలవృక్షములఁ గొట్టించుట. } ॥—

సీ॥ "పురములు మార్చి కా ♦ పురముల నెత్తించి
పదివేల పల్లెలు ♦ పాడు వెట్టె!
యవరేఖ యంతైన ♦ నవని దున్నుటయు లే!
దోకగింజయును ధాన్య ♦ మొదవఁ బోదు!
కైలవారామహా ♦ గహనంబు ఫలముల
దినమున కొక్కఁడుగాఁ ♦ దినుచుఁ బ్రదుకు!
నెన్ని యత్నంబుల ♦ నే నొనర్చినను లోఁ
బడఁ! దంత కంతకుఁ ♦ బటిమఁ బెంచుఁ!

గీ॥ గావునను మీరు కైలవా ♦ రా విపినము
చేరి ఫలవృక్షముల నెల్లఁ ♦ జెండి వైచి
యాప్రతాపేంద్రు వెదకి వె ♦ న్నంటి వేఁట
లాడుఁ"డని పాదుశాహి సై ♦ న్యముల నంపె. 69

క॥ పాడవును వెడలుపు పెక్కా
మడలగు నాకైలవార ♦ మహియందుఁ జొరం
బడి యవనులు ఫలతరువులు
పుడమిఁ బడఁ గొట్టి రన్ని ♦ పొలివోవుచటుల్! 70

క॥ కొందఱు భటులను వృషభము
లం దన వెంబడిని గొని ఫ ♦ లంబులకై తో
పుం దరిసి శ్యామసింహుం
డందుఁ బడిన చెట్లు చూచి ♦ యూర్పుల గనుచున్; 71

క॥ "మన తిండి చెఱచి యవనులు
చనుచుండిరి; వారిఁ గదిసి ♦ సమయింతము రం"
డని రేఁపి యహితసైన్యం
బును దొంపరి యగుచు వెన్ను ♦ ముట్టఁగఁ దాఁకెన్. 72

క॥ అనుచరులఁ బద పదండని
తనముంగలఁ దఱిమి తురక ♦ దళవాయి వడిన్
దన పిక్కబలముఁ జూపఁగ
వెను దిరుగుచు శ్యామసింహ ♦ విభుఁ డరుదెంచెన్! 73

క॥ స్థితిగతులెల్ల సలుంబ్రా
పతి కెఱిఁగింపఁగ నతండు ♦ స్వామిని గని "దే
వ! తురుష్కులు ఫల విటపి
ప్రతతి నఱికి రనచు నేఁడు ♦ వార్తలు వచ్చెన్. 74

చ॥ దినమున కొక్కపండు మఱి ♦ త్రియుని తీర్థము నొక్కచేరెఁడున్
గొని మునిరాజవృత్తిమెయి ♦ గొబ్బునఁ గాలము పుచ్చుచున్న నీ
కును రమఁబోలు సీలలన ♦ కున్ మదనోపమ మంజులాంగులౌ
తనయుల కక్కటా! చెనఁటి ♦ దైవము తిండికిఁ గర్వు చేసెనే! 75

గీ॥ పౌరుషం బున్న సంగ్రామ ♦ వీర రంగ
ముల మనలఁదాఁకి దర్పించి ♦ గెలువ వచ్చుఁ!
గట్ట! పూచి కాచిన చెట్లు ♦ గొట్టుటయును
గౌరవమొ! వట్టి కటికత మొ ♦ క్కలము గాక! 76

సీ॥ అడుఁగులకును మ్రొక్కి ♦ యర్థించి కొనివచ్చి,
యమృతాభిషేచనం ♦ బాచరించి,
బంగారు జిలుఁగు దు ♦ వ్వలువలు గట్టించి,
నవరత్నమయ భూష ♦ ణములు దొడిగి,
కర్పూరమిళిత సు ♦ గంధచర్చ లలంది,
పరిమళపత్ర పు ♦ ష్పము లొసంగి,
నవపాయసాహార ♦ నైవేద్య మిచ్చి, భ
క్తిమెయి నాత్మప్రద ♦ క్షిణము చేసి,

గీ॥ కొలువఁదగు దేవుఁడవు నాకుఁ; ♦ గొంతకాల
మారఁబండిన పండు లా ♦ హారమిడుట
కై పగలఁ బొక్కుచుంటి; నేఁ ♦ డవియు లేక
యధికదుర్దశ వచ్చె; నే ♦ మని తపింతు" 77

క॥ అని కనుజాలిమెయి వచిం
చిన సచివప్రవరుఁ జూచి ♦ చిఱునగవు ముఖం
బున మొనయఁగ "దండ్రీ! యెం
తని నీప్రేమంబు మహిమ ♦ నగ్గింపఁగనౌ! 78

గీ॥ కంచె చుట్టును నెలకొల్పి ♦ కాపు పెట్టి
జలము పాటించి పండించి ♦ ఫలము లెల్ల
బండ్లపైఁ దోలి మన కిచ్చు ♦ భంగి నైన
శుభ మొకఁడ! యేది పగ తురు ♦ ష్కులకు మనకు! 79

క॥ తలయెత్తుటాది విమతుల
సిల్కుఁగుల నిను మీఁకు వగవఁ ♦ జెల్లునె! మనముల్
వలగొని రాల్ ఋవ్విన వా
రలు పువ్వులు రువ్వఁబోదు ♦ రా! యెందైనన్. 80

సీ॥ శైలవాటా మహా ♦ గహనంబు సువిశాల!
మ డ్డొకింతయు లేని ♦ యార బయలు
ప్రకృతి యచ్చటఁ బెద్ద ♦ పండ్లతోఁపును బెంచె!
రాక పోకలకు మా ♦ ర్గములు గలవు!
చనుదెంచి యెవరు గో ♦ సిన వద్దనవు చెట్టు!
లఖిల జనాకర్ష ♦ మచటి ఫలము!
లందఱు కందెడు ♦ నా తోటపై జీవి
తమ్ములు మోపి యా ♦ ధారపడుట

గీ॥ మనది తప్పగు! రిపుల నే ♦ మనుట కుండు!
బగను సాధించి మనలఁ లోఁ ♦ బఱచు కొనఁగ
నింత కన్న పీలగు మార్గ ♦ మేది గలదు!
మనమె యాహారమును మార్చు ♦ కొనుట యొప్పు! 81

సీ॥ ఇందు నం దనకుండ ♦ నెందైనఁ గలదిగ!
జిక్కింత లేక చేఁ ♦ జిక్కు నదిగ.
నెండకు వానకు ♦ నింత వాడనిదిగ!
గాల భేదము లేక ♦ కాపులు నదిగ!
బాదుషాగాదు దే ♦ వతలెల్ల వచ్చి వా
సరవార మాస వ ♦ త్సరము లేల
శాంతి నొందక పెక్కు ♦ బ్రహ్మకల్పములు క
ష్టించిన నిసుమంత ♦ చెడని యదిగ!

గీ॥ బారలును గుద్దలులు వట్టి ♦ పని నడిపిన
మూఁడు జాముల లోపల ♦ మొదటికన్నఁ
దట్టిమి విమతుల వీపులఁ ♦ బెరుగునదిగ
వెలయు నాహారమును గను ♦ పెట్టువాఁడ! 82

సీ॥ పిణ్యాకమడలదాఁక ♦ వెడలుపు పొదవునై
హారావళీ శైల ♦ మలరుచుండు!
నూదిమోపఁగ సందు ♦ సుంతలే కిచ్చోటఁ
బెరుగు "మో" లనియెడి ♦ బీడు గట్టి!
దీని రుచి యెకింత ♦ తీయనై యుండుఁ! బ్రొ
ద్దుట వెళ్లి మన భటుల్ ♦ దోకి తెత్తు!
రవి రుబ్బి రొట్టెల ♦ ననువున్నెఁ జేయించి
ముందుకాలము పొట్ట ♦ పోసి కొంద!
గీ॥ నకట! యిది కష్టమని మది ♦ నడఁలరాదు!
కొంచె మలవాటు పడిన రు ♦ చించి తీఱు!
నాకలి నడంప నేతిండి ♦ యెంతఁ జాలు!
గార్య గౌరవమున రుచిఁ ♦ గనని దేది; 83

మ॥ తినఁగాఁ దిండి యెకండె యేటికిఁక! నా ♦ దేహంబుల్ జీవముల్
జనెడుల్ గాక మనుష్యమాత్రునకు శి ♦ క్షం జెప్పుచుల్ వంచఁబో
వను; జేనెండగు పొట్టకూటికయి ద్రై ♦ వప్రాయమ్మౌ కీర్తిమో
సిన స్వాతంత్ర్యము నమ్మివేయఁగల దు ♦ శ్శీలుండు టుంతవ్వఁడే! 84

క॥ ఈగడ్డిరొట్టె తిండికిఁ
ద్యాగము స్వాతంత్ర్యయోగ ♦ ధర్మంబును నో
డై గెలుతు! మరులు కను మే
లాగున విరిగెదరో మన బ ♦ లమ్ముల ప్రేమోల్. 85

క॥ ఇది సంతసింప నదనగు
నెద వగవకు" మనుచు బినకు ♦ తేశ్వరు! మన "మే
లిది యాచరణీయము, సా
ఖ్యదమని యాకృష్టసింగు ♦ హర్షము పొంగన్; 86

మ॥ "ఫలవృక్షంబులఁ గూల్చి సంతటనె య ♦ భ్రం బంతయున్ బ్రీలుచున్
దలపై బ్రాలు నటంచుఁ గుంది తమచెం ♦ తన్ జేరి దాసోహమన్
పలుకుల్ పల్కెదమంచు నెంచి రహితుల్! ♦ పంచాంగముల్ చించి చు
క్కలు లేవంచు వచించు వీఱిడుల జో ♦ కల్ గావె యీకార్యముల్!

క॥ కానిం డియ్యది యొకగతి
గా నున్నది! భటుల బీసు ♦ గడ్డిని దెండం
చానతి యిచ్చెద నేఁ"డని
యా నూత్నాహార నియతి ♦ నారంభించెన్. 88

గీ॥ అంతనుండియు నాప్రితా ♦ పావనీశు
నకుఁ గుటుంబమునకు భటు ♦ లకును "మోలు"
గడ్డిరొట్టెలె గతి యయ్యెఁ; ♦ గాలుచున్న
కడుపునకు మండు గంజియున్ ♦ వడువు గాఁగ! 89

మ॥ ఒకనాఁ డాసఫుఖాను సైన్యములతో ♦ నుగ్రాటవిన్ జొచ్చి ముం
దుకు నేతేరఁ బ్రతాపుఁ డాత్మబలమున్ ♦ దోడ్కొంచు నావిద్విష
త్ప్రకరంబున్ నలుమూలలన్ బెదరి పా ♦ ఱన్ ఘోర మర్దించి వె
న్కకు నేతెంచి నివాసభూమి దరియం ♦ గా నేగె మధ్యాహ్నమున్. 90

—: ప్రతాపసింహుఁ డనుచరులకు "దోనా" పంచి పెట్టుట. :—

మ॥ ఒక దర్భాసనమందు రాజమణి కూ ♦ ర్చుండంగ సామంతు లిం
చుక దూరమ్మున నోసరిల్లి కరముల్ ♦ జోడించుచున్ నిల్వ; గా
నికటాద్రీంద్ర బిలంబునుండియును గా ♦ క్షీరత్న మవ్వేళ సే
వకుఁడో నంపెను బండ్లు రొట్టెలు బ్రతా ♦ పస్వామి కర్పింపగన్. 91

మ॥ ఫల మొక్కొంచుక త్రుంచి చేకొనుచు, నా ♦ పై రొట్టెనొక్కింతు ము
క్కలుగాఁ జేసి యొకింత నోర నిడుచున్ ♦ గన్పన్న నందున్న వా
రల సామంతులఁ బిల్చె; డగ్గఱి సఖుం ♦ డ్రాభర్త కేల్మోడ్చినన్
ఫలమున్ రొట్టియ ముక్కఁ జేసి డెఁ బ్రతా ♦ పస్వామి దీవించుచున్ 92

సీ॥ సాష్టాంగ మెఱఁగి మ ♦ హా ప్రసాదంబని
చేదోయి యొగ్గి దో ♦ సిట గ్రహించి

తులకించు భక్తిఁ గ ♦ న్నుల నద్దుకొని వెన్కఁ
జనుచు యథాస్థాన ♦ మున వసించె;
నటుపైన సూక్తసిం ♦ గంత ఝాల్యావతి,
బేఁడ్లా-కొఠేరియా ♦ విభులు, పిదప
నా షాపురా-బునే ♦ రానీశుఁ లవల ను
ద్జయసింహుఁడును నట్లె ♦ సంగ్రహించె.
తే॥ పరమ భగవత్ప్రసాదంబు ♦ భంగిఁ జూచి
యాజగద్గురు చంద్రముం ♦ డారగించు
పిదపఁ దామెల్ల భుజియింప ♦ వేఁచియుండి
రధికభక్తి నర్ధనిమీలి ♦ తాక్షు లగుచు 93
సీ॥ కడుపునిండుగఁ గూడు ♦ కట్టఁ జేసెడు గుడ్డ,
తలదాఁచుకొన సుంత ♦ నెలవు లేక
పరమదారిద్ర్య దే ♦ వతలట్టు లుండు నా
పటు వీరలోకైక ♦ పట్టభద్రు
లాదికాలమున న ♦ మ్మహైశ్వర్య భోగభా
గ్యములలో స్వర్గ సా ♦ ధముల లోన
నెంతటి మర్యాద, ♦ యెంతటి విశ్వాస,
మెంత మనశ్శుద్ధి. ♦ యెంతభక్తి,
తే॥ యెంత యుత్తమ క్రమదీక్ష ♦ యంతకన్న
శతగుణము లెక్కుడుగఁ దండ్రి ♦ సరణిఁ జూచి
యాప్రతాపుసిఁ గొలుచు దృ ♦ శ్యంబుఁ గనఁగ
గనులు వేయైనఁ దక్కువే ♦ యనుచుఁ దోఁచు. 94

—॥ యవనసైన్యములు మేవాడపై నెత్తివచ్చుట. ॥—

ఉ॥ వైభవసాంద్రుఁడై యవన ♦ వాహిని చుట్టును గొల్వ నొక్క భ
ద్రేభము నెక్కి యామడ లొ ♦ కేగతిఁ దీవ్రత వచ్చు కాల రు
ద్రాభుని మానసింహుఁ గని ♦ యచ్చట నుండిన వార లున్న య
న్నె భుజియింప మాని వడి ♦ నేగిరి మోగలు సేన మీఁదికిన్. 95

ఉ॥ సేనలు రెండునున్ దగిలెఁ! ♦ జేతి కటారులు పూలమాలలై
మేనుల వ్రాలు చుండె! బలి ♦ మిన్ వల చుట్టిన వేటకాండ్రి ర
మ్యాననరేఖ యాయవను ♦ లందును, గృధ్రమృగేంద్రరేఖ తా
సైనికు లందుఁ దోఁచె; రవి ♦ జారఁగ నిల్చిరి పోరు మొగలుల్. 96

— యవనులు రాజపుత్రుల దుర్గములను గొనుట. —

సీ॥ అవ్వల యవన సే ♦ నాధీశ్వరులు మూఁగి
ముట్టడించిరి దుర్గ ♦ ములను గొన్ని;
నజమీరు దుర్గంబు ♦ నందె ఖాసింఖాన్; ప
రీదుఖానుఁ డచల ♦ గృహముఁ గొనియెఁ;
దోడరమల్లు తో ♦ డ్తోఁబట్టెఁ "జేవంద!"
నింతలోపల "నమా ♦ యిఁత" గిరింద్ర
దుర్గంబుఁ దవిలె న ♦ బ్దుల్లా; శిశోదియా
వీరులు మార్కొని ♦ పోరి; రిట్లు
తే॥ నెల జరిగె పోరు; కోట మో ♦ గలుల కయ్యె;
నా"మదేరియా" ప్రాంతమ్ము ♦ నందు "రాతి
కోట" యను దుర్గమును బట్టు ♦ కొని ఫరీదు
యవనసేనా సమూహంబు ♦ నచట నిలిపె. 97

క॥ అంతట ఖాసింఖాను "వ
సంతా" దుర్గంబుఁ బట్టి ♦ సైన్యము నిడి యా
చెంతఁగల "ఛత్రకోట" న
నంత చమూతతులు గొలువ ♦ నరికట్టు కొనెన్. 98

మ॥ యవనుల్ నాలుగు వైపులన్ గదిసి దా ♦ వాగ్నిక్రియన్ గాల్పఁగా
భువనాతీత పరాక్రమాంకుఁడు ప్రతా ♦ పుం డట్లు నాయంతనం
బవుదాఁకన్ రిపు కంఠ రక్తపుఁ బ్రవా ♦ హం బూఢ్చి చల్లార్చి యా
రవి క్రుంకంగఁ గుటుంబ ముంచు గూహఁ జే ♦ రన్ బోయె విశ్రాంతికై!

— దేవేరీ యుద్ధము —

సీ॥ వఱువాత లేచి దై ♦ వ ప్రార్థనము చేసి,
వినతినొ నుదిత భా ♦ నునకు మ్రొక్కి,

కలయఁ గన్గొనిన మో ♦ గలు దండు గుంపులై
మెల్లదిక్కులఁ గొండ ♦ లీని నట్లు
పరిసర గహన గ ♦ ర్భము లాక్రమించి ని
ద్రింపఁ గాంచి ప్రతాప ♦ దేవుఁ డంత
నా బుసేరా-షాపు ♦ రాధీశ్వరుల, సలుం
బ్రాభర్త, ఝేల్వా నృ ♦ పాలు సూస్తు
తే॥ దుర్జయుని గొంచు వైరులఁ ♦ దొడర సరిగె;
శ్యామసింహుఁ గుటుంబ ర ♦ క్షణకు నిలిపి!
యుభయ సైన్యంబులకు నయ్యె ♦ యుద్ధ మమిత
తీవ్ర భంగి "దేవేరి" ♦ ప్రదేశ మందు! 100

సీ॥ శైల నిర్ఝరమట్లు ♦ సరభసమ్ముగ సలుం
బ్రా మహీపతి దాఁకె ♦ రాయసింగు!
ప్రజ్వలజ్జ్వాలల ♦ వలె బుసేరా-షాపు
రాధీశ్వరులు ముట్టె ♦ రసపుఖానుఁ;
ప్రబల దంభోళి సం ♦ రంభంబు వెలయ ఖే
ల్వాపతి తగిలె షా ♦ బాజుఖానుఁ;
ప్రకట ప్రభంజన ♦ ప్రతిమానుఁడై యెది
రించె దుర్జయుఁడు ఫ ♦ రీదుఖాను;
తే॥ దండధరుఁ డట్లు దాఁకెఁ బ్ర తాప విభుఁడు
ముందుఁ గలుగు నబ్దుల్లా చ ♦ మూ చయమునుఁ!
భిల్లగణ మెల్లఁ గొలువ నా ♦ భీమచాఁదు
కడు విజృంభించి ఖాసిము ♦ ఖానుఁ దాఁకె. 101

క॥ పుడమి యద్రువ యమరాజుల
వడువునఁ జెలరేఁగు నాత్మ ♦ భటు లందఱు వెం
బడి రాఁగ మృత్యువ వటు సూ
క్తుఁడు మహాబత్ఖానుఁ దగులు ♦ కొనె ఘోరముగన్. 102

ఉ॥ ఆఁకలిగొన్న సింహ నిచ ♦ యంబు విధాన మహాశిశోదియా
నీకిని బిట్టురేఁగి రణ ♦ నిష్ఠుర వీర తురుష్క కోటులన్

దాఁకి ప్రతాపసింహుని మ ♦ నం బలరారఁగ సుంత సందు వో
నీక శిరంబులన్ నఱికి ♦ యేఱులు పార్చిరి వేడిర క్తముల్. 103

ఉ॥ అంతటిలోఁ దురుష్కభటు ♦ లాసపుఖానుని గూడి లోక దు
ర్దాంత పరాక్రమంబున న ♦ రాతులఁ దాకుఁచు సాపురా వనీ
కాంతుని సేన వెన్క కరు ♦ గన్ విదళించి యజాండకర్పరం
బంతయు ముక్కలై పడఁగ ♦ నార్చిరి వీర రణోత్సవంబునన్. 104

ఉ॥ ఆధ్వని నాలకించి సుభ ♦ టాళులఁ గొంచుఁ బ్రతాపసింగు సూ
ర్యధ్వజ మెత్తి ముం దఱిమి ♦ యాసపుఖానుని దాఁకి, తత్తురు
ష్కధ్వజినిన్ జొరంబడుచు ♦ సర్వము నాశనముల్ బొనర్చె. ద
శాధ్వర హార్యమైన నిట ♦ లాక్షుఁడు వోలె వెలింగె నయ్యెడన్. 105

ఉ॥ మూదుఁ గలట్టి వైరిబల ♦ ముల్ ధనుఁ గాంచి తలంకుచుండ, ను
ద్వృందిన చండభానుని క్రి ♦ యన్ జెలరేగుచుఁ గృష్ణసింహుఁ డం
దంద విహారముల్ సలిపి, ♦ యందఱు ముందఱ విచ్చి పాఱుచున్
సం దొనరింప; శౌర్య రథ ♦ సమ్మునఁ బోరె భయానకమ్ముగన్. 106

తే॥ రాయసింహు సేనా విస ♦ రమును దాఁకి
చేను గోసిన చందానఁ ♦ జెండి వైచు
కృష్ణసింహేంద్రు నుగ్రము ♦ ద్రిసి గనంగ
వీరులకు నైన గుండె కం ♦ పించి పోవు. 107

గీ॥ ప్రళయ కాల దవానల ♦ జ్వాలయును ఫ
రీదుఖాన్ దుర్జయుని మించి ♦ రేఁగి దాఁటి
రాజపుత్ర సైన్యంబుపైఁ ♦ గ్రమ్ముకొనుచు
రక్త కీలాలనిధిఁ జేసె ♦ రణ తలంబు. 108

మ॥ తనదర్పోద్ధతి కోర్వలేక మహాబ ♦ త్ఖాన్ సైన్యముల్ దిక్కులన్
గని యుద్వేత్తుగఁ బాఱుచుండఁగ, ఫరీ ♦ ద్ఖాన్ కాలరుద్రోండ్రాకో
యన వెన్వెంటనె వచ్చె; సూర్యుఁడు ప్రతా ♦ పాధీశు పేరెత్తి యు
గ్ర నృసింహాకృతిఁ బెంచి తాఁకెను ఫరీ ♦ ద్ఖాన్ మహాళి నుగ్గై పడన్. 109

శా॥ ఆసూర్యాన్వయ కాననేశ్వర మహా ♦ వ్యాఘ్రంబు దుర్వార బా
హా సంరంభ విజృంభణంబుఁ గని ధై ♦ ర్యం బూడుచున్ భీతి హె

చ్చి సైరింపఁగలేక యయ్యవన సై ♦ న్యం బంతయున్ విచ్చి చన్
దూసెన్ దత్పతియూ ఫరీదు కల లం ♦ దున్ మర్వ లేకుండఁగన్. 110

సీ॥ లక్షలు సేనాబ ♦ లంబున్న నంతటి
యాశ్విక దళ మున్న ♦ హస్తి చయము
లెన్నికకును మీఱి ♦ యున్నను, లఘు బృహ
న్నాళాస్త్రములు వేన ♦ వేల కున్న
సైన్యాధిపులు పోడ ♦ శ శతంబు పైనున్న,
రాసులు రాసులు ♦ ద్రవ్య మున్న,
వలసిన యన్ని సం ♦ బారమ్ము లున్నను,
సమర మేండ్ల కొలంది ♦ సాగు చున్నఁ,
తే॥ దలను బూ వాడకుండఁ బ్ర ♦ తాపుఁ డుండె
ననుచుఁ బాదుషా వగవ, ధై ♦ ర్యంబు చెప్పి
యవనిఁ దలక్రిందుగాఁ జేతు ♦ ననుచు వచ్చి
కడకు నిశ్చైతి ననుచు సం ♦ కటము నొంది, 111

ఉ॥ ఖాసిముఖానుఁ డుగ్ర భుజ ♦ గప్రభు మాడ్కిసి ముండి లోకసం
త్రాసకర ప్రతాపుని బ్ర ♦ తాపుని దాఁకఁ దలంప, భిల్ల సే
నా సముదాయ మడ్డుపడి ♦ నన్ రణ ముగ్రముగాఁగ సాఁగె; నా
గాసురహర్తఁబోలె శబ ♦ రాధిపుఁ డయ్యరులన్ బొరిన్ గొనెన్. 112

తే॥ తురకదొరల సైన్యంబులు ♦ తురగములును
పదులు నూఱులుగా గుదుల్ ♦ గుదులు గాఁగ
బలి యగుచు నుండె భిల్లభూ ♦ పతి భుజంబు
నెక్కి నర్తించు పెను పుట్టై ♦ డుక్కు గదకు. 113

చ॥ స్థిరతర రాజపుత్ర భట ♦ తీక్ష్ణ భుజాబల ధాటి కాగలే
క ఱచి మహమ్మదీయ భటు ♦ లందఱు మారుతధాటి నిల్వలే
కొరుగుచు వ్రాలు పైరుగతి ♦ నోజ దొలంగి కలంగువేళ ని
ష్ఠుర బలశాలి వీరబలుఁ ♦ డున్ బరతెంచె భటాళి గొల్వఁగన్. 114

ఆ॥ వడదాఁకి సోలెడు ♦ వారిపై నమృత వ
ర్షము జాఱు రీతిఁ గ ♦ ర్కశ తురుష్క

చమువు లన్నియు రణో ♦ త్సాహంబుతో సము
దగ్రము లట్లు పొంగి యా ♦ రాజపుత్ర
సేనలపైఁ గవి ♦ సెను; బ్రతాపుని దెస
యోధులు పోరాడి ♦ రుగ్రభంగి;
నపుడు చూపిన శౌర్య ♦ మప్పటి సాహసం
బమరలోక శ్లాఘ్య ♦ మై తనర్చెఁ!

తే॥ దురకమూకలు ముందు ముం ♦ దునకుఁ బొంగి
యొత్తుకొని వచ్చు నొత్తడి ♦ నోప లేక
యా ప్రతాపుని వీర సై ♦ న్యంబు లెల్ల
వెనుకకును మొగ్గతిలు నేమొ ♦ యనుచుఁ దోఁచె 115

క॥ కాలాహికరాగ్రులు నిజ
ఝాలావీరులును బంచ ♦ శతసంఖ్యగఁ ద
న్నోలి భజింపఁగ ఝాలామన్న
పాలుండు ప్రతాపుఁ జేరి ♦ వైరులఁ దాఁకెన్! 116

తే॥ శంఖరవములు సింహాగ ♦ ర్జారవంబు
లతిశయిల రాజపుత్ర సై ♦ న్యంబు లెల్ల
నుబికి యుంకించి యురలించి ♦ యూడిఁ దాఁక
విరిగిపడి వైరిబలము ని ♦ వ్వెఱ గలంగె! 117

తే॥ సూర్యభగవానుఁ డపరాబ్ధిఁ ♦ జొచ్చె; యవన
గణము పులి నాకి విడిచిన ♦ కండ యగుచు
గడ్డి కఱచెను; భిల్లులు ♦ క్రమ్ముకొనిరి
కడల ముసి ముని చీఁకటుల్ ♦ గదియు కరణి! 118

శా॥ నూఱుల్ మించిన రాజపుత్రకుల దం ♦ డుల్ వేలకుల్ మించి యు
గ్రారాతుల్ యవనుల్ పఱుల్ బడఁ బ్రతా ♦ పాధీశుఁ డయ్యెందఱుల్
బాఱుల్ దోలుచుఁ బుష్పవర్షము సురల్ ♦ వర్షింప వర్తించె; "ఇదీ
వేరీయుద్ధ మపూర్వ" మన్ననుడి ప ♦ ర్వెల్ లోక విఖ్యాతమై. 119

— ప్రతాపసింహుఁడు యుద్ధరంగమునుండి శైలగుహ కరుదెంచుట. —

సీ॥ "ఈనాఁడు మొగలులఁ ♦ జోనీక కడతేర్తు!
మిచ్చట మీరుండ ♦ నేల! యతఁడె
శ్యామసింహుఁడు గూడఁ ♦ జనుదెంచెఁ! సల్లి పా
టేశ్వరీదేవియు ♦ నేకతంబ
పిల్లలతో శైల ♦ బిలమున నున్న; దా
వంతయుఁ బలుకుఁ దో ♦ డైన లేక!
యీనాఁటి పోరాట ♦ మెప్పుడు ముగియునో!
యెపుడు రా నొదవునో ♦ నొంటుఁగ నేర!
తే॥ మనుచరుల తోడ మీరేగుఁ'' ♦ డనుచుఁ గృష్ణ
సింహుఁడును భీమచాందును ♦ జెప్పుకొనఁగ
భిల్లు నొకనిఁ బ్రతాపుఁడు ♦ వెంట గొనుచు
శీఘ్రముగ శైలగుహయందుఁ ♦ జేరుకొనియె! 120

తే॥ కడుపు మలమలమాఁడు నాఁ ♦ కటికి వెక్కి
వెక్కియేడ్చి నిద్రించిరి ♦ బిడ్డ లెల్ల;
విభుఁడు-పాటేశ్వరీదేవి- ♦ భిల్ల భటుఁడు
గంగ మ్రింగక యారేయి ♦ గడుప వలసె! 121

సీ॥ లలిత సౌదామనీ ♦ లతికలు చుట్టు మూ
గిన ముగ్ధ గోప కా ♦ మినులుగాఁగ,
రణగణ చ్చారు గ ♦ ర్జానినాదము మనో
జ్ఞమ్మైన వేణు నా ♦ దమ్ము గాఁగ
నంచుల మెఱయు సం ♦ ధ్యారాగ పటలమ్ము
రమణీయ పీతాంబ ♦ రమ్ము గాఁగ,
నృత్య న్మయూర వి ♦ స్తృత కలాపము శిర
స్సందాని తావతం ♦ సమ్ము గాఁగ,
తే॥ నతి విశాలమా నంతరి ♦ క్షాంగణమ్ము
చెలువ మమరు బృందావన ♦ సీమ గాఁగ,
బూని విహరించె విశ్వర ♦ క్షాని రూఢిఁ
బ్రావృ డంభోద బాల గో ♦ పాల మూర్తి! 122

ఉ॥ అమలకాభమై చినుకు ♦ లంతకు సంతకు నేక ధారలై
పాములు వ్రేలఁ దీయు గతిఁ ♦ బర్వుచు, నేనుఁగుఁదొండ మంతలై,
భూమి జలార్ణవం బయిన ♦ పోలిక నిండుచుఁ, గుండపోత గ
ర్జా ముఖరంబులై కురియ ♦ సాఁగె నభం బవియంగ మేఘముల్! 123

సీ॥ కనులుమూసినఁ జీల్చు ♦ కొని లోనరుగు ధగ
ద్ధగ లీను నిబిడ సౌ ♦ దామనులును,
నొక్కొక్కఁడు జగంబు ♦ వ్రక్కలు వ్రక్కలై
చనఁ జేయు మేఘ గ ♦ ర్జా రవములు,
కొండ లొండొంటిపైఁ ♦ గూలి బ్రహ్మాండంబు
నగలించు ప్రళయ ఝం ♦ ఝూ నిలములు,
క్షణమున విశ్వలో ♦ క ప్రాణితతిఁ గూల్చు
గతి జాలు భయద ని ♦ ర్ఘాతములును,
తే॥ నంత కంతకు జృంభించి ♦ యావరించి
ప్రళయములు కోటి యొకనాఁడె ♦ గలిగి నట్లు
ప్రకృతి కాయువు నిండిన ♦ పగిది, నూపి
రాడ నీక గాలియు వాన ♦ యలము కొనియెం. 124

తే॥ కోటి కొకఁడైన నిలువక ♦ గుదులు గుదులు
తరు-మృగ-విహంగములు గూలె ♦ ధాత్రి! విశ్వ
గర్భనిర్భేదక మగు నా ♦ కాళరాత్రిఁ
దలఁచు మాత్రాన నిలువెల్ల ♦ జలదరించు! 125

తే॥ ఏఱు లింతబంతిగ మ్రోఁత ♦ లెత్తి పాటి
కలిసి యుప్పొంగి యొకదాట్టి ♦ కొలఁది మీఱి
కొండలును-లోయలును-వనుల్- ♦ గుహలు నిండి
నిఖిల మేకార్ణవముగ ఘూ ♦ ర్ణిల్లె నపుడు! 126

మ॥ అకటా! గాలియు వాన గూడి నిబిడం ♦ బై రేఁగఁగా రాత్రి చ
ల్వకుఁ గొన్నెత్తురు ముద్ద గట్టుకొని పి ♦ ల్లల్ మంచుగడ్డల్ వలెన్
నిక టోర్వన్ శయనించి కప్పుకొనఁ గా ♦ నీ! జేనెడున్ గుడ్డ, క్రిం
దినికిన్ లేకయు నాఁటిరాత్రి శివరా ♦ త్రిన్ బోలె నెట్లీడ్చిరో! 127

—౹ ప్రభాతము ౹—

ఆ॥ వేఁగుఁజుక్క లేదు! ♦ వెల్లఁబాఱదు తూర్పు!
కొండ గోళ్ల గుములు ♦ గూయ వెచట!
రవి జనింపఁ; డెట్లొ ♦ ప్రాభాత మయ్యె! వ
ర్షంబు బల మొకింత ♦ సన్నగిల్లె! 128

క. తడి యాఱని గడ్డిని శబ
రుఁడు గొనిరా, రాణి దుబ్బి ♦ రొట్టెలు చేసెఁ;
గడనుండి బిడ్డలందఱ
కిడి పదపడి నొక్కరొట్టె ♦ సిడెఁ బతి యొసఁగెఁ. 129

సీ॥ పద్మాసనమున నై ♦ వ ధ్యాన నియతి నే
త్రయుగంబు మూసెఁ బ్ర ♦ తాపదేవుఁ;
డంత నొక్క బిడాల ♦ మా గుహకడ నాడు
కొనెడు బిడ్డకొఱడలు ♦ గోళ్ల గిరి
చేతిరొట్టెను నాఁచి ♦ శీఘ్రంబె యొక్క శా
ఖని నెక్కి చనె! బిడ్డ ♦ కెవ్వు మనుచు
నఱచి భూమిని వ్రాలె! ♦ నాధ్వని కదలి పా
టేశ్వరి చని బిడ్డ ♦ నెత్తి కొనియెఁ!

గీ॥ తనయు నేడ్పునఁ జెవులు చీఁ ♦ దఱలువోవఁ
గనుదెఱచి యామ్మొగమ్ము ర ♦ క్తంబుఁ గనుట
వజ్రపంజర కల్ప మ ♦ ప్పార్థివేంద్రు
వీరహృదయమ్ము చెదరి ద్ర ♦ వించి పాఱె! 130

సీ॥ "పదియుఁబండ్రెండు సం ♦ వత్సరంబులు సంఘ
టించు పోరులకుఁ జిం ♦ తించ లేదు;
జగము మ్రింగు నసాధ్య ♦ శత్రు వక్బరు రేఁగి
పగవట్టె నని సుంత ♦ వగపు లేదు;
కోటలు సేనలు ♦ కోశంబు దేశంబు
బలము తగ్గె నటంచు ♦ భయము లేదు;

కడు దీర్ఘకాలంబు ♦ గడచినఁ గూడ జ
యము గల్గదని విచా ♦ రమును గలుగఁ

తే॥ దాపదల కోర్చుటకె వీరుఁ ♦ డవతరించు
నని విపత్కోటి నెదిరి ధై ♦ ర్యమున నషతుఁ;
గాని యీనోరులేని ర ♦ క్తంపుసొత్తు
లనుభవించు కష్టము చూడ ♦ నలవిగాదు. 131

తే॥ దాసదాసీ సహస్రముల్ ♦ తమ్ముఁ గొలువఁ
బమర భాగ్యోదధిని దేల ♦ వలయువారు
కూడు లేకుండ మలమల ♦ మాడు చుండ్రు!
తుద కొకండే సదృష్టవం ♦ తుండు గాఁడె! 132

తే॥ అంతిపురి లేదు; తూఁగు టు ♦ య్యాల లేదు;
కొండలను గుట్టలను జీఁకు ♦ గుహాలయందు
గాలి వాన యెండలఁ జిక్కి ♦ కరకు రాలఁ
బఱచుకొన లేక పడియుండ ♦ వలసె నకట! 133

ఆ॥ నా యనంతరమున ♦ నీయఖండక్షోణి
నంత యేలవలయు ♦ "నమరసింహుఁ"
డిట్లు లిడుమ పడెను! ♦ నిది యెట్టి కాలమో!
కొఱ్ఱిలుపులియుఁ బిల్లి ♦ కూన యయ్యె! 134

సీ॥ మాతృభవించుమ ♦ త్పూర్వ పుణ్యఫలంబు!
మామక హృదయ సా ♦ మ్రాజ్యలక్ష్మి!
పావిత్ర్య మందిరో ♦ పరి పూర్ణ కలశంబు!
తనువు ధరించు సౌం ♦ దర్యధనము!
శాశ్వత శాంతి మ ♦ హైశ్వర్యదేవత!
ప్రకట సౌభాగ్య ప ♦ ర్యాయపదము!
కష్టాపనుద మహా ♦ కల్పధాత్రీజంబు!
నిరుపమ వరవర్ణి ♦ నీ మతల్లి!

తే॥ ప్రియతమం బైన మత్ప్రేమ ♦ విగ్రహంబు!
నృప మకుట రత్న రోచిః ప ♦ రీత చరణ!

ర్యైన పాటేశ్వరీదేవి ♦ యకట! యిట్లు
పరమ దారిద్ర్యమున మున్గ ♦ వలసె నేఁడు! 135

క॥ దినమంతటి కొకఫలమును
గొని తీరని యుద్ధములఁ ద ♦ గుల్కొని కండల్
దునిసి యెముక పట్టెను మే;
నిను నైన సి కొంతకాల ♦ మిఁక నిలిచెనునో! 136

ఆ॥ హీన కాల మందు ♦ వణఁకుచుఁ దలదాఁపఁ
గూటి పేదకైన ♦ గుడిసె యుండుఁ;
జక్రవర్తినయ్యు ♦ సంతాన మిటు శైల
గుహల నిలిచి గోడు ♦ గుడువ వలసె. 137

ఆ॥ బిడ్డయురము నుండి ♦ వెడలు రక్తముఁ జూచ
మనసు చెడియె నాకు! ♦ మఱలఁ దిండి
యొదవు టెపుడొ! వైరు ♦ లేదు రాదు రింత! కీ
కడుపు గోతయెట్లు ♦ పడఁగనేర్తు" 138

చ॥ అని వగనొంది భూరమణుఁ ♦ డాకును గంటముఁ దీసి వ్రాసి చెం
తనుగల భిల్లుచేత నిడి ♦ దానిని బాదుశహా "కొసంగు మం
చనిపి యొకింత కన్మొగిచి ♦ ధ్యానసమాధి మునింగె! రాజ్ఞి యొ
య్యన జనుదెంచి యాత్మవిభు ♦ నాతని చెంగటి రొట్టెఁ, గాంచుచున్

గీ॥ "రాజయోగ సమాధి నే ♦ త్రములు మూసి
యూర! యీమహాభాగుఁడు ♦ కూరుచుండె!
సహజ గంభీర వదనంబు ♦ సౌరు దక్కి
యలఁతి యలఁతి చింతారేఖ ♦ లలవరించె!" 140

మ॥ అని డెందంబునఁ జింతనొందుచుఁ బ్రతా ♦ పాధీశు నాస్యంబుపై
నను జూడ్కుల్ నిగుడించి యుండె నిలిచెన్! ♦ క్ష్మానాయకోత్తంసుఁడున్
దన నేత్రంబులు విచ్చె! నాక్షణమె యా ♦ నారీ వతంసంబు వి
చ్చిననెమ్మోమున నాథుడాయుచు వచిం ♦ చెన్ భక్తిపూర్వంబుగన్! 141

మ॥ చిననాఁడున్ నవరత్నరంజిత మహా ♦ సింహాసనం బెక్కి మ
న్ననభూమండల మేలునప్పుడును నీ ♦ వాడీమహారణ్య సీ

మను బాలించెడునప్డు సుంతయుఁ జలిం ♦ పక బోని మీామోముపై
నను నేఁడేటికొ త్రోఁచుచున్నయవి చిం ♦ తారేఖ లల్లల్లనన్. 142

సీ॥ ప్రాణేశ! నీయుద ♦ రము నంటు నాఁకలి
నీక్షణంబుల నాశ్ర ♦ యించు నిద్ర
మోమునందుఁ బ్రిసాద ♦ మును గాంతినిరతి చి
త్తములోని దుర్గమ ♦ ధైర్యగరిమ
మెట్టి దుర్ఘటకార్య ♦ మిపుడు మీాయెడనుండి
దొంగలించి యొకింత ♦ తొలఁగఁజేసె!
దృష్టిమార్పక యొక్క ♦ దిక్కుగాఁ జూపులు
క్షితిపై నిగుడ్చి వీ ♦ క్షింతు రేల?
గీ॥ మీామది నొకింతయును జింత ♦ మేకొనంగ
నెఱుఁగ నెన్నఁడు మిమ్ము నే ♦ నెఱుఁగుఁగూడ!
నిదియ తొలుసారి! వగనొంద ♦ నేమి హేతు
వెఱుఁగఁజెప్పుఁడు! మానసం ♦ బెరియసాఁగె! 142

చ॥ మలయ సమీారణంబునకు ♦ మాంద్యము బాలశశాంక మాళికిన్
గళమునఁ గప్పు—చంద్రునకుఁ ♦ గందు స్వభావము తాను! రాజరా
ట్తిలకుఁడు వామనోహరుఁడు ♦ దీర్ఘగుణుండు ప్రకృత్యతీత చి
ద్బలుఁడు ప్రతాపదేవుఁడని ♦ పల్కుటు నే మది నుబ్బిపోవుదున్! 144
గీ॥ వైరు లెదిరింప వెన్నిచ్చి ♦ పాఱ వెపుడు!
పాఱువైరులఁ దఱిమిచం ♦ పగఁబోవు!
కలిమిలేముల మనసు మా ♦ ర్పులను బొంద
విటుల యోజింపఁ గారణ ♦ మేమి నాథ! 145

మ॥ ధరణిన్ ముంచు విపత్పరంపరఁ గడున్ ♦ ధైర్యంబు వోనోర్చు శౌ
ర్యరతుం డన్నను లోకమెల్ల మిముఁ దా ♦ ర్కాణంబుగాఁ జూపు! దు
ర్భర చింతారతి హేతువున్ దెలుప న ♦ ర్హంబైన మీాపాద పం
కరుహ ద్వంద్వముఁ గొల్తు! మన్నన వెలుం ♦ గన్ నా కెఱింగింపుఁడీ 146

మ॥ అనుపల్కుల్ చెవిసోఁకు మాత్రనఁ బ్రతా ♦ పాధీశు డెందంబు వి
చ్చెను! నెమ్మోమును విచ్చె! సారస దళ ♦ శ్రీలన్ బిసాళించు లో

చనయుగ్మంబును విచ్చె! విచ్చిన సరో ♦ జాతంబునందుండి పె
ల్చనఁ దోఁతెంచెడు పూవుఁదేనియ వలెన్ ♦ జాల్వారె నీవాక్యముల్! 147

మ॥ జననంబందిననాఁటి నుండియు రహ ♦ స్యంబొండు నేనెన్నఁడే
నను బాటించి యెఱుంగ నింతవఱకున్ ♦ నాయర్ధదేహంబవై
చను నీతోడ వచింపరాని దొక యం ♦ శం బుండునే! యింతకున్
మును పే తెల్పకపోతినే యని మనం ♦ బున్ జింతచేఁ గ్రాఁగెడిన్. 148

సీ॥ ప్రాకార వలయిత ♦ ప్రాసాదముల యందు!
శశికాంతమయ చతు ♦ శ్శాల లందు
ననుపమంబైన శు ♦ ద్ధాంత సీమల యందు!
మిగుల నెత్తగుగాలి ♦ మేడ లందుఁ!
బరమ సుఖప్రద ♦ ప్రమదావనము లందు
బన్నీటి కాల్వల ♦ పట్టు లందు!
సారాంబుపూర కా ♦ సార తీరము లందు!
మోదంబుఁ గొలుపు పూ ♦ పొదల యందు!

గీ॥ దాసదాసీ సహస్రముల్ ♦ దళము కొనుచు
గన్నుసన్న మెలఁగ నెండ ♦ కన్నెఱుఁగక
యలరఁ దగు మహారాజు భా ♦ ర్యవుగ నుండి
యిడుమ పడుచుంటి నాదుర ♦ దృష్ట వశత! 149

సీ॥ ఎవ్వాని నామము ♦ కించుక చెవిసోఁక
భీరుఁడైనను జగ ♦ ద్వీరుఁడగునొ!
యట్టి రాణాప్రతా ♦ పాధిపు నర్ధాంగి
వై సౌఖ్యమొందు భా ♦ గ్యములు లేక
తలఁదాప నంకణం ♦ బిలు లేక తినఁ గట్టు
లేక పుట్టెడు పిల్ల ♦ లాఁకలిఁ గొనఁ
గ్రోతులు పిల్లుల ♦ భాతిఁ గాపురము మా
ర్చుచు గుట్ట గుట్టయుఁ ♦ జుట్టుచుట్టి

గీ॥ యన్నమిడి యాఁకలిని మాయు ♦ నను వు లేక
యకట! నోరులు మూసి యూ ♦ రార్చవలసె!

నిట్టి దినదిన గండంబు ♦ లెల్లఁ జూచి
మొటు విరియకుండు మానసం ♦ బిందువదన! 150

క॥ తల్లి యొకతె సుక ముండినఁ
బిల్లలవే మంది నైనఁ ♦ బెంపఁ గలుగు! నా
తల్లియొ యిడుమల బడలినఁ
బిల్లలు పెంపొందఁ గలుగు ♦ వెరవుం జెపు నే? 151

సీ॥ పండ్లుగాఁ బిల్లలు ♦ నీవు తపింప వీ
క్షించి ధైర్యమున స ♦ హించి యుంటి!
దినమంత మలమల ♦ తిండిలేక తపించు
బిడ్డనోరును గొట్టి ♦ పిల్లి గీర
బొమ్ముపైఁ గ్రమ్మర ♦ క్తమ్ము నీక్షించి, కె
వ్వనివేయు కేకను ♦ వినుటఁ జేసి
సముదార వజ్ర పం ♦ జర సన్నిభంబు నా
స్వాంతంబు క్షణము దు ♦ ర్బలత నొంది

గీ॥ "యాఱుమాసముల్ విశ్రాంతి ♦ యవసర మని
తోఁచె! నేడవ నెలరాఁగ ♦ దూరము సేయ
సిద్ధముగ నుందునని చిన్న ♦ చీటి వ్రాసి
భిల్లుచేఁ బాదుషాకుఁ బం ♦ పించి నాఁడ. 152

మ॥ వ్రాసితిఁ గాని కమ్మ! యది ♦ వ్రాసిన దాది నరుంతుద వ్యథా
యాసితమై మనంబు వెను ♦ కాడుచు నున్నది! సూర్యవంశ వి
శ్వాసములేని క్రొత్తయల ♦ వాటున కాస్పద మయ్యె నేఁడు! నా
వాసి తొలంగె! నేమిటికి ♦ వ్రాసితి నంచు నుదిర్ దపించునుర్!" 153

చ॥ అనుచుఁ బ్రతాపసింహవసు ♦ ధాధిపసింహుఁ డొకింత చింతనే
ననిమెడు పల్కులన్ విని న ♦ వాంబురుహాయత నేత్ర విస్మయం
బెనయ ముఖాబ్జమెత్తి హృద ♦ యేశుని గన్గొని దేవ! "యెన్నడున్
వినఁబడనట్టి వాక్యములు ♦ వింతగ నేఁడు వినంగ వచ్చెడిన్! 154

శా॥ ఏ యల్పంబగు కార్యమేనియును మీ ♦ రిన్నాళ్లు మున్నాళ్లు మా
ర్గా యా సాధక బాధకంబులను బ ♦ ర్యాలోచనన్ సేయకే

చేయఁబోవరు! నేఁడిటూత్రిపదుటల్ ♦ చిత్రింబె! మీాయీాయభి
ప్రాయం బిప్డు విమర్శచేయఁగలయ ♦ ద్దాత్వంబు నాకున్నదే! 155

మ॥ వ్యవధిన్ జెందఁగఁగోరి తాఁబునెల!లా ♦ పైయుద్ధముల్ సిద్ధమే
యవ్వుచో లాభమదేమి యీా గడువుచే! ♦ నాయుస్సు హెచ్చించి న
ట్లవు! నేఁడీపదనైన నీదుకరవా ♦ లానాఁటి కిట్లుండునో
యవనవ్రాత శిరో విదారణ పటు ♦ వ్యాపార పారీణమై! 156

సీ॥ క్షణకాలమైన వి ♦ శ్రాంతి నొందగఁబోక,
తనియ నూపిరి పుచ్చు ♦ కొనఁగఁబోక,
సంతత ధ్యాన ని ♦ ష్ఠ యెలర్పఁ గార్యసా
ధకుఁడు శేఁబవలును ♦ దత్పరుఁడవు
తనరంగ వలయు! స్వ ♦ తంత్ర్య మహాత్మును
కార్యనిర్వహణంబుఁ ♦ గాంతు చేసి
సర్వార్పణ మొనర్చి ♦ జంకక పనిచేయు
భువనైక వీరపుం ♦ గవుఁడ వీవు!
గీ॥ పౌరుషోద్యోగ జలద ప్ర ♦ భంజనముగు
శ్రాంతి నెటుకోరి! తాఁబు మా ♦ సములు నూరు
చున్నయట్టి నిర్వ్యాపారుఁ ♦ డౌన్ని జన్మ
ములు కడచనేని పనిచేయఁ ♦ గలఁడెనుటల 157

సీ॥ భువన ముద్భవ మొందు ♦ మొదలుగా నెవ్వరూ
హించి కల్పించి సా ♦ గించి యెఱుఁగ
నట్టిస్వాతంత్ర్య మ ♦ హాయోగదీక్ష నా
రంభించితివి మహా ♦ గ్రివ్రిస్రత్ని!
నీ యనంత త్యాగ ♦ నియతియును నఖండ
దేశభక్తిరతి ను ♦ తించె జగము!
లాయిజాండ కటాహ ♦ మావరించిన జ్యోత్స్న
వలె నీయశంబు వి ♦ శ్వమున నిండె!
గీ॥ ధరణి నాచంద్రతార కా ♦ స్థాయిగాఁగ
నీదు పావన నామంబు ♦ నెగడు నట్లు

మెలఁగు చుంటివి! లోపముల్ ♦ గలుగఁ గలవె!
ధన్యులగు వారిలో ధన్య ♦ తముఁడ వీవు. 158

సీ॥ గతిచెడి యఖిల భా ♦ రతలక్ష్మి యవనుల
పాలయి కడగండ్లు ♦ పడుచు నుండఁ!
గన్న సంతానంబు ♦ కన్న మిన్నఁగ నెంచు
ప్రజ దాపులేక చే ♦ డ్పడుచునుండ!
గల్యాణ నిలయ దు ♦ ర్గము లెన్నియో కూలి
పడి బీడుపడి కాడు ♦ పడుచునుండ!
హైందవాచార మా ♦ ర్యస్త్రీల పావిత్ర్య
మడుగంటి మంటి పా ♦ లగుచు నుండ

గీ॥ భారతీయ స్వతంత్రత ♦ పట్టు దప్పి
వీఁగి నానాఁటి కుట్టూఁత ♦ లూఁగుచుండ!
దన కుటుంబముపై నాస ♦ ననిఁదొలంగ
నోపునే! వీరరాణా ప్ర ♦ తాపమూర్తి! 159

గీ॥ అధిప! యొకశంక యుండు! మి ♦ మ్మడిగి తెలియ
వలయు ననియుంటి! నక్కఱ ♦ గలిగె నేఁడు!
పరమ కృపతోడ నాసతి ♦ వలయు! భార్య
యెక్కుడగునో! భారత దేశ ♦ మెక్కుడగునో! 160

గీ॥ అతులితాత్మాధిపత్యంబు ♦ నందె దేని,
నదియు తెమ్ము విశ్వాధిప ♦ త్య ప్రశస్తి!
క్షితిని నెలకొన్న కోటి దు ♦ ష్కృతము లందు
శాంతిఁ బోలిన ఘోర దో ♦ షంబు లేదు! 161

గీ॥ పాసఁ దీర్చిన కొలఁది వ ♦ ర్ధింపు మిక్కు,
తెఱచిన కొలంది మంచి గం ♦ ధంపుఁ జెక్కు,
యిడుమ లందిన కొలఁది లో ♦ కైకవీరుఁ
డును బ్రకాశించు రన నెఱుం ♦ గనిదె మీకు! 162

సీ॥ అఖిల లోకాధీశుఁ ♦ డైన సర్వేశు నం
తర్యాగ మొనరించి ♦ త్యాగ మెంచి,

యాత్మనివేదనం ♦ బాచరించిన మహా
రాజర్షి మాళివా ♦ ప్రభుఁడ వీవు!
పనియందు నద్దాని ♦ పరిణామమందు లో
లత కూడ దనుచుఁబ ♦ ల్కుటను నాకుఁ
దెలుపు చుందువుగదా! ♦ జలధరంబులు సభం
బలమి నట్టులు వి ♦ పత్తులు గలంచి
గీ॥ దిక్కుదోఁచని విషమ సం ♦ దిగ్ధదశల
నాథ! నీవొక్క చిఱునవ్వు ♦ నవ్వ దేని
విఱిగి రవిరశ్మికిని మంచు ♦ విరియు నట్లు
కోటి యాపద లైనను ♦ గ్రుంగి పోవె! 163
సీ॥ కోటలన్నియు శత్రు ♦ కోటి చేకొనెనంచు,
సేనాబలంబు కృ ♦ శించె ననుచు,
జయ మింతవఱకు ద ♦ ర్శనమీయ లేదంచు,
నాపదల్ మెడబంటి ♦ యయ్యెననుచు,
జనె నేండ్లు పూండ్లును ♦ దినఁ దిండి లేదంచు,
బసికూన లగచాట్లు ♦ పడుదురనుచు,
మదిఁ గుందవలవ! దీ ♦ మాఱు వైరులరాఁగ
గవచ ఖడ్గము లూని ♦ కాసెఁ గట్టి!
గీ॥ యద్వితీయ బలుని నిన్ను ♦ నీ ద్వితీయ
నైన నేను రణక్షోణి ♦ ననుసరించి
శత్రు సంహార మొనరింతు! ♦ శంక వేల!
యిరుపురము నిల్వ జగమెల్ల ♦ నెదురఁ గలదె! 164
సీ॥ అరులచే, నున్న సై ♦ న్యాధిపుల్ మడిసిన,
సామంత నృపులెల్ల ♦ సమసి చనిన,
భటుఁడొకండును లేక ♦ బలమెల్లఁ దొలఁగిన
నాపదల్ వేన వే ♦ లలము కొనిన,
నేను బిడ్డలు గూడ ♦ నిశిత ఖడ్గములూని
రణము చేయుదు మిరు ♦ ప్రక్క నిలిచి!

కొండలోఁ జివరయం ♦ గుళమైన రణము లే
కక్బరు సుఖముగా ♦ నందరాజు!
గీ॥ మనకుఁ గలిగిన బిడ్డలం ♦ దునఁ గడపటి
నిసువు గళమునఁ గొనయూపి ♦ రెసఁగియుండ
దైవసముఁడ పీ విడిన స్వా ♦ తంత్ర్య సమర
మజ హాదాదు లెదిర్చిన ♦ నాఁగ రాదు! 165

ఉ॥ సంచలనం బొకించుక యెసం ♦ గని దుర్దమ చిత్తవృత్తితో
వంచనలేని బుద్ధి భగవం ♦ తుని యందలి నమ్మకంబు జో
డించి ప్రయత్నమూనిన ఘ ♦ టిల్లని కార్య మదొక్కఁడేని గ
న్పించదు: సర్వలాభములు ♦ నీవశమై నినుఁ బాయకుండెడిన్! 166

ఉ॥ ద్వేషమువంకఁ బోవని ప ♦ విత్రి మనంబు రహించునిత్య సం
తోషివి! నేఁడు నిన్నలము ♦ దుర్బలతన్ వడిఁ బాఱఁదోలి వి
ద్వేషుల మాఱ్కొనన్ జనుము! దేవుని నమ్మిన వారికిన్ మన
స్తోషము కాని మోటమియు ♦ దుఃఖము కల్గఁగఁబో వొకింతయున్. 167

మ॥ కొఱనొక్కింతయు లేదు లోకమున నా ♦ కున్ బ్రహ్మకల్పంబుగా
ధర జీవించెడు వారులే రెపుడు! మం ♦ దస్మేరముల్ మీముఖాం
బురుహం బందునఁ దాండవించుచు ముదం ♦ బున్ బెంచుఁ గా కంచు నీ
శ్వరుఁ బ్రార్థించెద"నన్నఁ బత్నికిఁ బ్రతా ♦ పస్వామి హర్షంబునన్, 168

సీ॥ అనిచేసి మరలి వ ♦ చ్చినవేళ మొదలంట
శ్రమఁదీర్చు మధుర వి ♦ శ్రాంతి సీమ
తలఁగిపోవని యాప ♦ దలు ముట్టి నపుడు ధై
ర్యంబియఁగల యంట ♦ రాని కోట!
కష్టాంధ తమసంబు ♦ గప్పి తోఁచని యప్డు
త్రోవఁ జక్కఁగఁ జూపు ♦ దొడ్డ జ్యోతి!
పదికి వేయుగ వైరి ♦ భటులు పైఁబడినప్పు
డసమాన బల మిచ్చు ♦ నమృత ఘుటిక!
గీ॥ యన్ని వేళల సౌఖ్యంబు ♦ నలవరింప
నందనోద్యానమనుచు నెం ♦ దమునఁ దలతు

నీమధుర ధీర గంభీర ♦ నిబిడ ఫణితిఁ
దల్చఁచి పాటేశ్వరి! వని ♦ తా మతల్లి! 169

మ॥ వర సౌశీల్యము నాభిజాత్యమును సౌ ♦ భాగ్యంబు శ్రీయుక్ మనో
హర శాంతి స్థిరధీరతల్ దనరు ని ♦ న్నర్ధాంగిఁగానిచ్చి యు
ర్వర నాకిప్పు డనన్య దుర్లభ మహా ♦ భాగ్యంబు సంధించె నీ
శ్వరుఁ డంచున్ మదినెంచి పాయని కృత ♦ జ్ఞత్వంబునన్ మ్రొక్కెదన్

సీ॥ నేనెఱుంగకయున్న ♦ నిరతంబు నన్నుఁగాచి,
నాకోప మంపశమ ♦ నమ్ము చేసి
మధురస్వభావ సం ♦ పదచే నున్నుకు తీర్చి
యలఘు శాంతతఁగూర్చి ♦ కలత మాన్చి
యూరించి లాలించి ♦ యుపచరించి కణంచి
యలరించి మించి ధై ♦ ర్యంబు నించి
మది హరించెదు గుణ ♦ మాధుర్యమున రూప
మాధుర్యమును బెంచి ♦ మనుతి నించి

గీ॥ యండ బాయక నీవుండు ♦ నంత దాఁక
వనిత! కోటానఁ గోటు లా ♦ పదలు వచ్చి
తలఁబడిన నంగుళంబు ప్ర ♦ తాప విభుఁడు
దారి తప్పునె! స్వాతంత్ర్య ♦ ధర్మ నిరతి! 171

మ॥ సరళౌ దార్యముచేఁ గృపా నిరతి చే ♦ సౌజన్య సంపత్తి చే
ధరణిన్ నూత్న వివాహ మండపము చం ♦ దంబార నానంద మిం
దిరమున్ జేయఁగఁ బుట్టు వొందిరిసుమీ ♦ స్త్రీరత్నముల్! వారికిన్
సురలోకంబున దేవదూతికల కై ♦ చ్ఛో సామ్యముల్ గల్గునే!'' 172

గీ॥ అనుచు వచియింపఁగా భాగ్య ♦ మూరొ నాకుఁ!
ప్రాణనాథ! ప్రసాదంబు ♦ నారగింపు''
మనెడి పాటేశ్వరీదేవి ♦ ప్రార్థనమున
జనవరేణ్యుండు లేచి బో ♦ జనము చేసె. 173

—॥ { రాజపుత్ర సైన్యములు యవనుల నోడించి ప్రతాపసింహుని జేరవచ్చుట. } ॥—

క॥ ఆలోన సమీపంబున
శైల గుహా భూరి కుహర ♦ సంతతు లెల్లన్
ప్రీలఁగ భిల్లేశ్వరు నా
భీల మహా శంఖ రవము ♦ వీతెంచె వడిన్! 174

మ॥ ఆకల్యాణ మహారవంబు మధురం ♦ బై వీచి శ్రోత్రేంద్రియ
వ్యాకోచత్వము సంఘటింపఁగఁ బ్రతా ♦ పస్వామి లేచెన్ సలుం
బ్రాకృష్ణాదులు వచ్చి స్వామి చరణ ♦ ద్వంద్వంబుపై వ్రాలుచున్
సాకల్యంబుగ నాఁటి సంగర విశే ♦ షంబుల్ నివేదించినన్. 175

క॥ విని యానందించెను! యా
వనసేనలు దినదినంబు ♦ పైఁబడ సమరం
బొనరించుచు గెల్చుచు వె
న్కను బడుచును గొన్నినాళ్లు ♦ గడిపెన్ విభుఁడున్. 176

—॥ భిల్లుఁడు ఢిల్లీపురమున కరుగుట. ॥—

క॥ వనముల లభించు ఫలములు
తినుచును వాల్గామడలుగ ♦ దినము ప్రయాణం
బొనరించుచు భిల్లుఁడు కనుఁ
గొనె ఢిల్లీపురము కనక ♦ గోపురవరమున్. 177

సీ॥ అంజనాచలముల ♦ ననుకరించెడు దంతి
సముదాయము రహించు ♦ శాల లొకట!
నుచ్చైశ్శ్రవము మేలు ♦ మెచ్చని యవనాశ్వ
సంఘంబు లలరారు ♦ శాల లొకట!
స్ఫటికంపు బొమ్మల ♦ భంగి వెలుంగు ప
రంగు లుండెడు మంది ♦ రంబు లొకట!
నిబిడ బాహాటోప ♦ నిరతులై దీపించు
యవనుల్ వసించు గే ♦ హంబు లొకట!

గీ॥ గోపురంబున రెండు ది ♦ క్కులను భువన
విలయమును గూర్పఁగాఁ జాలి ♦ భీతిఁ గొలుపు

పెను పిరంగుల తండముల్ ♦ గనుపడంగఁ
జూపులకు వింతఁ గొలుపు డి ♦ ల్లీపురంబు. 177

గీ॥ హైందవులు గొల్చు శివకేశ ♦ వాలయములు
భూరి యావనప్రార్థనా ♦ గారవితతు
లాపుర సరోవరమునఁ బె ♦ ల్లలమి వెలయుఁ
గలయ విరిసిన పుండరీ ♦ కముల కరణి! 178

ఆ॥ సందులందు నడచి ♦ గొందుల విడిచి వీ
థులను రాజమార్గ ♦ ములను గడచి
వీరి వారి నడిగి ♦ భిల్ల వార్తాహారి
పురము మధ్య భాగ ♦ మునకుఁ బోయి. 179

క॥ లక్షలు కోట్లు ధనంబిడి
లక్షలు పనివాండ్రను వరశి ♦ లాతతిఁ బెక్కేం
డ్లక్షయముగఁ గట్టిన హ
ర్మ్యక్షద్వారాంగణంబు ♦ నాతఁడు డాసెఁ. 180

క॥ ద్వారము రక్షించు ప్రతీ
హారులు కరవాలధరు లు ♦ దార బలాఢ్యుల్
'రారా'దని వారించుచు
దూరమునకుఁ ద్రోయ నతఁడు ♦ తొలఁగుచు నిలిచెన్. 181

సీ॥ అలఘు లక్షణ భూష ♦ ణాంచిత మగు పట్ట
వంబారి యేన్గుపై ♦ నధివసించి,
చామర గ్రాహిణీ ♦ సముదయంబు మనోజ్ఞ
కరములఁ గనక చా ♦ మరము లిడఁగ,
నాణిముత్తెపు సరు ♦ లలరు విశాల సి
తాతపత్రంబు చా ♦ యల మునింగి,
బహుళ సేనాధీశ ♦ పటలంబు యవనాశ్వ
ముల నెక్కి చుట్టును ♦ మూఁగి కొలువఁ
గీ॥ జెలులు కనకపుష్పములు లా ♦ జలను జల్ల,
భువనమోహన దరహాస ♦ మూర్తి యలర,

నిలిచి మ్రొక్కు పౌరులదెసఁ ♦ గలయఁజూచు
చక్కరీశ్వరుఁ డాత్రోవ ♦ నరుగు దెంచె. 182

గీ॥ అఱఁగి ముమ్మాఱులు సలాము ♦ లలవరించి
ద్వారపాలక తతి బరా ♦ బరు లొనర్ప,
భిల్లుఁడును సార్వభౌముని ♦ ద్వారదము దెసఁ
దరలి జాబున్న తనదు హ ♦ స్తంబు సాఁచె. 183

మ॥ "ఎదురన్ జేరకు ప్రక్కకున్ దొలఁగు"మం ♦ చెత్తైత్తి దౌవారికుల్
వదరన్ భిల్లుఁడు నిల్చె బొమ్మవలె; న ♦ క్బర్ నేత "యేకార్య ము
న్నది! నీ వెవ్వఁడ!" వన్న భిల్లుఁడును "రా ♦ ణాగారు నీకిమ్మటం
చిదె యీ కమ్మను బంపి" రన్న విభుఁ డ ♦ య్యేన్గున్ దిగన్ బొలుచున్

క॥ "వా రే కొండలలో సం
చార మొనర్చెదరు! వారి ♦ సంతానము దే
వేరియు సేమముతో ను
న్నా రే! యెఱుఁగంగఁ బల్కు ♦ నాతో" ననినన్, 185

సీ॥ "అందఱు సేమ మే" ♦ యని కమ్మ నందిచ్చె;
నక్బరు పాదుషా ♦ యాదరమున
నంజలి పట్టుచు ♦ నద్దానిఁ జేకొని
సంభ్రమంబున సంతఁ ♦ జదువఁ దొడఁగె!
నక్షియుగము విచ్చె; ♦ నాస్యంబు వికసించెఁ;
జిత్తమందు ముదంబు ♦ చిందు లాడె;
వ్యాకోచ పంకేరు ♦ హ స్యంది మధుధార
లన మోద బాష్పంబు ♦ లతిశయిల్లెఁ;
గీ॥ జేష్టలం దింత తొందర ♦ చెలఁగఁ జొచ్చె;
నొడల నొకవింత రకమైన ♦ హాయిలు పుట్టె;
నంత నంగరేకునఁ గమ్మ ♦ సంతరించి
చనియె భిల్లుఁ డొడ్డాని లోని ♦ సౌధమునకు! 186

గీ॥ ఐదువేల్ రాణివాసంపు ♦ టబ్జముఖులు
వారివారి నెచ్చెలులతో ♦ వచ్చి చేరి

లలిత దరహాస మధుర వి ♦ లాస మలర
భిల్లమూర్తినిఁ గని సంత ♦ సిల్లి రపుడు. 187

—॥ అక్బరు చక్రవర్తి ఢిల్లీపురంబు నలంకరింపఁ జేయుట. ॥—

సీ॥ పురిని నూతులు వేలు ♦ మొగలు టెక్కెములు విం
తగు రంగులను గుల్కి ♦ యెగుర సాగెఁ!
బ్రతి గృహాంగణము స్తం ♦ భములందుఁ దగుతా సం
భా స్తంభ నివహంబు ♦ ప్రభలు గొలిపె!
నల బహిర్ద్వార సీ ♦ మలను బచ్చని మామి
డాకు తోరణము ల ♦ ల్లాడఁ దొడఁగ;
రత్నసంతతిఁ గూర్చి ♦ రచియించు ముత్యాల
రంగవల్లికలు హో ♦ రంగు నెఱపెఁ;
గీ॥ జలువ పందిరుల్ పానీయ ♦ శాల లెన్ని
మొదలనో నెలకొల్పఁగాఁ ♦ బడి తనర్చె;
విరులు పునుగు జవాది య ♦ త్తరువుచేతఁ
బురము సిరి నించి సౌరభం ♦ బులను విసరె. 188

మ॥ అరుగన్ జొచ్చిరి వీధి వీధి జవనా ♦ శ్వారూఢు లుద్యోగు లెం
దఱో "యాస్థానమునందుఁ గొల్వమరు మ ♦ ధ్యాహ్నంబుపై నక్బరీ
శ్వరుడున్; గాన నమాత్యులున్ నృపతులున్ ♦ సైన్యాధిపుల్ పౌరులం
దఱు నాస్థానముఁ జేర రం" డనుచు వా ♦ ర్తన్ దెల్పఁ బోత్సాహులై.

సీ॥ ఈశ్వరేశ్వరుఁ గూర్చి ♦ యెల్ల మసీదులం
దును భక్తి వెలయఁ బ్రా ♦ ర్థనలు జరిగె;
వైదిక మంత్రపు ♦ ష్పములు మంగళహార
తులు సాగె నెల్లదే ♦ వళము లందుఁ;
గూటిపేదలు మొదల్ ♦ కోటీశ్వరుల దాఁకఁ
బురజనుల్ మృష్టాన్న ♦ ములు భుజించి
నూతనవస్త్రసం ♦ దోహముల్ దాలిచి
బహు విధాలంకార ♦ ములు ధరించి

గీ॥ రాఁకలినిగొన్న బీదల ♦ కందఱకును
బంచ భక్ష్య భోజ్యంబులు ♦ పంచఁబడియె;
సీదులేని సౌఖ్యాబ్ధి నో ♦ లాడి, నాఁడు
ఢిల్లిపురి స్వర్గపురి మేలు ♦ డిందు పఱిచె! 190

— అక్బరు సార్వభౌముని సభాభవనము. —

గీ॥ శకటముల పైన యానవా ♦ శ్వముల పైనఁ
బల్లకీలపై నేన్గుటం ♦ బారి పైనఁ
జెల్లుబడి కల్గు దొడ్డవా ♦ రెల్ల వచ్చి
కొలువు సింగంపు వాకిఁట ♦ నిలిచి రపుడు, 191

గీ॥ విలువ దుస్తులు ధరియించు ♦ వేత్రి ధరులు
వంగి వంగి సలాములు ♦ ప్రేచుర పఱచి
తత్తదర్హస్థలమ్ములం ♦ దఱకుఁ జూపి
సమతఁ గూర్చుండఁ జేసిరి ♦ క్రమిత నెఱపి. 192

గీ॥ హేమ రుచిర మహాద్వార ♦ సీమ నుండి
యాసభా ప్రాజ్య వజ్రసిం ♦ హాసనంబు
చూపఱకుఁ దోఁచు నొకచిన్న ♦ చుక్క మాడ్కి
నసిన, భవన వైశాల్య మే ♦ మనఁగ వచ్చు! 193

సీ॥ పలు చిత్తరువులు బే ♦ బరు నాఁటి యుద్ధని
శేషముల్ గోడలఁ ♦ జెలఁగుచుండఁ,
బలు రకంబుల యద్ద ♦ ముల గవాక్షములలో
రవిరశ్మి వింత షో ♦ రంగు నెఱప,
మెఱుఁగారు లోహ ని ♦ ర్మిత కుంద మందార
మాల లందందును ♦ వ్రేలుచుండ,
నొక్కొక్కఁడును వేయి ♦ దిక్కులఁ బ్రతిఫలిం
చెడు కాచ దీపంబు ♦ లమరుచుండ,
గీ॥ నేల యొఁకింతయేని గ ♦ న్పింపకుండ
మహిత కాశ్మీర రత్నకం ♦ బళము లమర.

నందుపై రెండువేలు ది ♦ వ్యాసనములు
దనరఁ దనరారె నక్బ రా ♦ స్థాన వాటి. 195

గీ॥ దాని చివర విశాల వి ♦ తర్ది యమరెఁ;
గ్రింద మొకమాలు పైన జ ♦ రీ పని గల
పట్టు గుడ్డ వెలుంగొందెఁ; ♦ బైననుండి
వివిధ ముక్తా గుచ్ఛముల్ ♦ వ్రేలు చుండె. 196

సీ॥ ఆవితర్దికకు మ ♦ ధ్యమున వెల్గెను మనో
హార నూత్న కనక సిం ♦ హాసనంబు;
నద్దాని చివరలం ♦ దష్టదిక్కుల యందుఁ
దనరారె హాటక ♦ స్తంభ వితతి;
వైడూర్య మాణిక్య ♦ వజ్ర సంస్థగితమై
కాంతు లీనెను స్తంభ ♦ గర్భ సమితి;
యా స్తంభముల పైన ♦ నవరంజి పైకప్పు
రేకులు రేకుపై ♦ ప్రియముఁ గూర్చె;

గీ॥ నెత్తమున చుట్టుగోడల ♦ శోభ మొప్ప
సింహ గజ పక్షి శిరము ల ♦ చ్చెరువు నింపెఁ;
బరమ భాగ్యాంకమగు నాస ♦ భా భవనము
తగె మఘవు సుధర్మాస్థాన ♦ తలముఁ గేరి. 197

గీ॥ మంత్రు లుద్యోగు లాప్త సా ♦ మంత మణులు
పదియు నాఱునూఱులు సైన్య ♦ పతులు గాయ
కులును బందుగుల్ నిండిరి; ♦ కొలువు దనరెఁ
దరగ బారులఁ దూఁగు సా ♦ గరము కరణి. 198

క॥ కనకపు సింహాసనమున
కును గుడిదెస నగ్రపీఠిఁ ♦ గొమరొందెను శో
భన వైభవపరుఁడు 'సలీ'
మనఘుఁడు యువరాజు భార ♦ తావని కెల్లన్. 199

సీ॥ బైరాముఖాన్ చమూ ♦ పతి పూర్వజన్మత
పో మహీజాతంబు ♦ పూర్ణఫలము!

యవన సంగతభార ♦ తాఖండబహుళ సా
మ్రాజ్య మేలెడు మహా ♦ మంత్రివాళి!
విశ్వోన్నతైశ్వర్య ♦ విభవ సాంద్రుం డైన
యక్బరీశ్వరుని వి ♦ ఖ్యాల సురభి!
పరిసియన్ భాష జే ♦ బరు నృపేంద్రు చరిత్ర
మనువదించిన యట్టి ♦ యగ్ర సుకవి!

ఆ॥ కులము గాదు దొడ్డ ♦ గుణమె ముఖ్యంబంచుఁ
జాటు సజ్జనుండు! ♦ సరళ హృదయుఁ!
డాష్ట వర్తనాంకుఁ! ♦ డబ్దురు రహీమానుఁ
డధివసించి యుండె ♦ నవలి పీఠి. 200

సీ॥ ధరణీతలం బెల్ల ♦ దాన మిచ్చినను వేఁ
లుంచి తాఁకని రాజ ♦ యోగివాళి,
వసుధాంతమున కైన ♦ వాహనం బెక్కక
శ్రమచేసి నడచు ని ♦ ష్పాపకుండు,
జైన ధర్మగ్రంథ ♦ సార మాస్వాదించి
ఖ్యాతి వహించు జ ♦ గద్గురుండు,
బందిఁ బడినవారిఁ ♦ బశువుల విడిపించి
పసుహింస మాన్పు కృ ♦ పానిరతుఁడు,

గీ॥ యాత్రికుల పన్ను గోవధ ♦ మణఁచి నైన
సార్వభౌము బోధించు వి ♦ జ్ఞానరాశి,
"హరివిజయసూరి" భువన వి ♦ ఖ్యాగురుండు
వేట్పస్నొక్క యపరంజి ♦ పీట నుండె. 201

మ॥ పగిలించెన్ రిపుకోటి గుండియలు; న ♦ క్బర్ పాదుషా కిచ్చె ముం
దుగ నాత్మీయ తనూజ; సైన్యపతులం ♦ దున్ జూడఁగా నింతవాఁ
డగుపింపం డనఁ బొల్చు నంబరువిభుం ♦ డౌ న్నృద్ధహార్యత్ మా
"భగవాన్‌దాసు" వసించెఁ జెంతఁగల భా ♦ స్వత్స్వర్ణ పీఠమ్మునన్ 202

సీ॥ "కచ్వహా"న్వయము లో ♦ కప్రసిద్ధ మొనర్ప
నవతార మందిన మ ♦ హా భుజుండు!

రక్తాబ్ధినుండి బ ♦ ర్హాదాఁకఁ దనకత్తి
కెదురు లేక జయించు ♦ పృథు బలాఢ్యుఁ!
డప్రతిహతముగా ♦ నర్ధ శతాబ్ద మం
బరుదేశ మేలు నృ ♦ పాలచంద్రుఁ!
డాఖ్య కక్బరె కాని ♦ యఖిలంబున కితండె
యనఁగ వర్తించు స ♦ ర్వాధికారి!
గీ॥ జగము పుట్టుటాదిగ నింత ♦ శౌర్యరేఖ
యింతటి మహోన్నతౌద్ధత్య ♦ మింత మాట
బలిమి గల సైన్యపతి యొందుఁ ♦ గలుగఁ డనెడు
మానసింగ ధిష్ఠించెఁ బ్ర ♦ ధాన పీఠి. 203

సీ॥ మతసహనంబు శా ♦ శ్వత ధర్మమని యధీ
శ్వరునకు నేర్పు పా ♦ వనగుణుండు,
చతుర చతుస్సహ ♦ స్ర హయాధిపతి యాచు
నక్బరుఁ గొలిచిన ♦ యలఘు బలుఁడు,
తనమాట విభుఁడు వే ♦ దంబచు మన్నించి
తలదాల్ప మెలఁగిన ♦ ధన్యమూర్తి,
తనదు కాలంబునం ♦ దలి చరిత్రలు పెక్కు
వ్రాసిన యుత్తము ♦ గ్రంథకర్త,
గీ॥ యకలుషోదార వర్తనుం ♦ డగు ఘనుండు,
దినము పదివీసియుల తిండి ♦ తినెడు దొడ్డ
తిండికాఁ 'డబుల్ ఫజ'లను ♦ పండిత మణి
యలరె ముందట నొక్క స్వ ♦ ర్ణాసనమున. 204

సీ॥ లాహిరీపుర నృపా ♦ లకవంశ ముద్ధరిం
ప జనించినట్టి పా ♦ వన గుణుండు,
హైందవాచార మ ♦ ర్యాద లామూలాగ్ర
మెఱిఁగి యనుష్ఠించు ♦ గురు మనీషి,
ఘోరాహవంబున ♦ ఘూర్జరేశ్వరు గుండె
లవియంగ దాఁకిన ♦ యలఘు శౌర్యుఁ

డక్బరీశ్వరుని పై ♦ న్యాయాధీశులందు న
గ్రస్థాన మొందు వీ ♦ ర ప్రభుండు,
గీ॥ తన గోలుసు క్రింద భారతా ♦ వనిని గొలిచి
సిస్తులు విధించు నేర్పాట్లు ♦ చేయుటందుఁ
గలియుగమున వీని సముండు ♦ గలుగఁడనఁగ
వెలయు 'తోడరమ' ల్లొక్క ♦ పీఠి నుండె. 205

సీ॥ ధనసేనుఁడనెడు మం ♦ దస్మితమూర్తి ముం
దొక్క పీఠముపైన ♦ నుండె; నితఁడు
రీవామహీంద్రు కూ ♦ రిమి గాయకుఁడు; రాగ
మాలాపనము చేయ ♦ యామున జల
ములు మున్గె; రెండుగం ♦ టలపైనఁ బోగ వేచి
బుగ్గలు పుట్టె; "వి ♦ ప్రుండు పాడెనె"
నని యక్బరను, వల ♦ లుడరించి జాలరుల్
పట్టి తెచ్చిరి; కార్య ♦ భంగమునకుఁ
గీ॥ గనలి హిందోళ-మేఘ రా ♦ గములు రెండు
గానమునకు నిషిద్ధమౌఁ ♦ గాక యనుచు
శాప మిచ్చిన గాయక ♦ సార్వభౌము!
డితని కీతఁడె సాటి యీ ♦ క్షితి తలమున. 206

సీ॥ పరమ శిశోదియా ♦ న్వయ ముద్ధరించు పృ
థ్వీనాయకుల కూర్మి ♦ పెండ్లి కొడుకు,
త్రిసహస్ర గంధర్వ ♦ విసరాధిపతి యయ్యు
వాహినీ పతులందుఁ ♦ బ్రథమగణ్యుఁ,
డకలంకవర్తన ♦ నక్బరు సభ యెల్ల
దలఁదాల్చు దివ్యమం ♦ దారమాల,
కవిరాజ బిరుద సం ♦ కలితుఁడై యనుపమ
గ్రంథముల్ వ్రాసిన ♦ కవివరుండు,
గీ॥ ధరణి క్రుంగిన నభమెల్ల ♦ విఱిగిపడిన,
నడ రొకించుక లేక సత్యంబు పలుకు

పృథ్వీరాజాఖ్య రాఠోడు ♦ వీర మూర్తి
యలరె ముందున్న యొకయున్న ♦ తాపసమున. 207

సీ॥ కాలంజరీ సమ ♦ గ్రక్ష్మాతలం బెల్లఁ
పాలించుచుండు పా ♦ వన గుణుండు,
ప్రభువతంసుఁడు భగ ♦ వాఁదాసు సేవించి
గౌరవం బందు వి ♦ ఖ్యాతకీర్తి,
యక్బరు హృదయ ర ♦ హస్యంబు లెఱుఁగంగ
నేర్చి వర్తిలు చిర ♦ స్నేహితుండు,
కవి గాయకుఁడు కథా ♦ కథకుఁడై వక్తయై
సభ నలరించు ప్ర ♦ జ్ఞారతుండు,

గీ॥ తనదు ప్రతిభా నిరూఢి కీ ♦ ధరణి జనుల
వదనములు కాపురంబుండు ♦ సదనములుగఁ
జతుర సరసోక్తు లాడు సం ♦ స్తుత మనీషి,
వీరబలుఁ డుండె నొక దొడ్డ ♦ పీఠ మందు 208

గీ॥ అలఘు లీలావతీ గణి ♦ తానువాద
కుఁడు, నలచరిత్ర వ్రాసిన ♦ గొప్పసుకవి,
యా 'ఫయాజి' ముందున్న హే ♦ మాసనంబు
నందుఁ గూర్చుండె నవిరళా ♦ నంద మూర్తి. 209

ఆ॥ పారసీక భాష ♦ భారత రామాయ
ణములు వ్రాసె; నిజ మ ♦ తమున దురభి
మానశాలి యా బ ♦ దోనీ కవీశ్వరుం
డవలి స్వర్ణపీఠి ♦ నాక్రమించె. 210

సీ॥ బికనీరు రాజ్యపా ♦ లకుఁడై చతుస్సహ
స్రహయాధి పతియైన ♦ 'రాయసింగు!'
మాళ్వదేశాధీశ ♦ మణి గాయకవిభుండు
సౌజన్యరాశి 'బా ♦ జబహదూరు!'
బహుదేశ చరితముల్ ♦ వ్రాసి దిగంత య
శస్సాంద్రుఁడగు "ఫెరి ♦ స్తా" మనీషి!

యల తులసీదాసు ♦ తుల యీతఁ డగునన
వాసి గాంచిన "సూరి ♦ దా"స సుకవి!

గీ॥ యట్టి గసగస గింజపై ♦ నా ఖొరాను
ద్వాదశాధిక శతతమా ♦ ధ్యాయ మెల్లఁ
బూర్ణముగ వ్రాసినట్టి "య ♦ బ్దూ స్సమాదుఁ"
డధి వసించిరి యాణి ♦ ముత్యాల పీట.

గీ॥ 'షేక్ ముబారక్' మొగల్ బుధ ♦ శేఖరుండు,
నా 'హకీం హుమా' మక్బరు ♦ నాప్తమిత్రుఁ
డిరువు రొక చోటఁ బీఠంబు ♦ లెక్కి యుండి
రవిర ళానందమున నస్మి ♦ తాస్యు లగుచు. 212

క॥ విరియు వివిధ కుసుమంబులఁ
బరిమళములు నించు పుష్ప ♦ వాటిక సొబగుల్
బురుడించి సభాభవనము
దొర లందఱు గొలువ నలరెఁ ♦ దోరపుఁ గళలన్. 213

—( అక్బరుసార్వభౌముఁడు కొలువుఁగూటమునకు వచ్చుట. )—

గీ॥ సకల కల్యాణ భూషణ ♦ సహిత మైన
చారు లక్షణ భద్రి కుం ♦ జరము నెక్కి
యక్బరు సభా భవనమున ♦ కరుగుదెంచె
భిల్లుఁడును పల్లకీ నెక్కి ♦ వెంట రాఁగ. 214

ఉ॥ అంతటఁ దూర్యముల్ మొరసె! ♦ నక్బరు భిల్లునితోడ డిగ్గి య
భ్యంతరమందుఁ జొచ్చె! దొర ♦ లందఱు లేచి నమస్కరించి! రం
తంతనె వారి వందనము ♦ లందుచుఁ జేరెను సింహపీఠి; దు
ర్దాంతరవం బెలర్పఁగ బి ♦ రంగు లనేకము ప్రేలె నయ్యెడన్. 215

గీ॥ దుద్దుఁగంబడి బుజముల, ♦ దుడ్డు గఱ్ఱ
కరమున, నెసంగు గంభీర ♦ కాలమూర్తి!
భిల్లుఁడు వసించె నొక దొడ్డ ♦ పీఠ మైన
వేదికాంతమం దక్బరు ♦ విభుఁడు చూడ. 216

క॥ చుక్కలలోఁ జంద్రునివలె
నక్కజముగ వెలిఁగె నక్బ; ◆ రందఱు దొరలున్
గ్రిక్కిరియుచుఁ గూర్చుండిరి;
చక్కఁగ సభదెసను జూడ ◆ సాకనుఁగొనుచున్, 217

సీ॥ "అఖిలసేనాధీశు ◆ లార! సామంత నృ
పోత్తంసులార! యు ◆ ద్యోగులార!
యిది మహా సుదినమా! ◆ నిపు డనంతానంద
ములరించు దొడ్డ కా ◆ ర్యంబు జరిగె;
నా మహాదివ్య హా ◆ ర్షాంశంబుఁ దెలుప మి
మ్మందఱ రమ్మంటి ◆ నాదరమున;
నా జీవితమున నిం ◆ తటి యమూల్య సువార్త
నింతవఱకుఁ జెల్పి ◆ యే నెఱుంగ;
గీ॥ నందఱును వాలకించి యా ◆ నంద మొందుఁ"
డనుచు నంగ రేకునను దా ◆ టాకుఁ దీసి
యిందలి పవిత్రవార్తల ◆ నిపుడె చదువు"
మనుచు లేఖఁ బృథ్వీరాజు ◆ నందఁ జేసె. 218

మ॥ వినయం బేర్పడ జాబు దోసిటను బృ ◆ థ్వీరాజు చేకొంచు దా
నిని వీక్షించుచు రాతిబొమ్మ కరణిన్ ◆ నిల్చుండె; నక్బర్విభుం
డనురాగోత్సుక చిత్తుఁడై "సుకవిరా ◆ జా! యేటి కట్లుంటివో!
వినిపింపన్ దగు గాదె! లేఖ" యనఁ బృ ◆ థ్వీరాజు మోమెత్తుచున్,

గీ॥ "ఆస్థాన వాటియం ◆ దను గిడినది మొన
లారోగ్య మొకరీతి ◆ ననువు పడదు;
కన్నులు పచ్చనై ◆ కానరా! వీ తాళ
పత్రి మించుక కానఁ ◆ బడును; కాని
యక్షరం బొకఁడైన ◆ నగపడ; దిట్టి దు
స్థితి నివేదింపంగ ◆ సిగ్గు దోఁచె"
నన "శ్రమ మేటికి! ◆ ననువుగాఁ గూర్చుండి
కొంతకుఁ గొంత వి ◆ శ్రాంతి నొందుఁ"

గీ॥ దని వచించి యక్బ ♦ 'రబ్బారు రహిమాను'
వదనసీమ దృష్టి ♦ పఱపి "మీరు
జాబు నందఱు వినఁ ♦ జదువుం" డనఁగ దాని
నతఁడు గొనుచు నిలిచె! ♦ యవనపతియు, 220

క॥ "మీరును జదువఁగఁ దొరకొన!
రూఱక యేమిటికి నిలిచి ♦ యుండెద! రిపుడే
ప్రారంభింపుం" డన, న
బ్బారహిమానుండు వినయ ♦ భూషణుఁడగుచున్, 221

సీ "పదినాళ్లుగా జ్వర ♦ బాధచే నారోగ్య
మనువుగా నుండలే; ♦ దైన, నీదు
నాజ్ఞ యనుల్లంఘ్య ♦ మగుట నెట్టులొ కష్ట
పడి సభాస్థలికి నే ♦ వచ్చినాఁడఁ;
గొంచెము కాలంబు ♦ కూడ నిల్వఁగ నాకు
శక్తి లేకున్నది; ♦ సత్య మిపుడు
దేవరకడ నివే ♦ దించితి'' నని విన్న
వింపఁ నక్బరు నేత ♦ వెత వహించి

గీ॥ యేల ముందె తెల్పక పోతి ♦ రీ విధంబు!
నుఱక సభకు రప్పింపక ♦ యుండి యుందు!
నైన నిపుడేమి! చతురంత ♦ యాన మెక్కి
యింటి కరుగుఁడు! శ్రమ మంద ♦ నేల యిచట! 222

ఆ॥ త్వరగ వెడలుఁ డనఁ బ్ర ♦ ధానమంత్రియు "నిప్పు
డింటి కరుగఁజాల! ♦ నిందె కొంత
సేపు విశ్రమింపఁ ♦ దాపంబు తగ్గు! వి
చారపడకుఁ" డనుచుఁ ♦ గూర్చు చుండె. 223

క॥ అనఘుం డక్బరు తనకర
మున లేఖను గొనుచు ముఖము ♦ ప్రొల్లంబుగ హం
బును గేర మధుర కంఠ
స్వనమున "వినుఁ" డనుచు సభను ♦ జదువఁగఁ దొడఁగెన్!

"అక్బరు నృపాలకా!
స్వస్తి! ♦ యవధరింపు!
మొడతెఱపి లేని యుద్ధంబు ♦ లెసఁగె; రుజకుఁ
దనువు పాల్పడె! విశ్రాంతిఁ ♦ గొనఁ దలంతు;
నోడఁబడుదు వేని యార్నెలల్ ♦ గడువు చాలు;
వైరి వయ్యు నుదారభా ♦ వమ్ము గలవు;
నన్నెఱుంగుదు! నెఱుగుదు ♦ నైతికమ్ము!
హితము యోజించి, నీమతం ♦ బెట్లొ తెలుపు!
తప్పక మెలంగు నట్లు............
ప్ర ♦ తాపసింగు."

సీ॥ అనుచు విశ్వములోని ♦ యవనీశ్వరుల యందు
నగ్రగణ్యస్థాన ♦ మాక్రమించు
నా పవిత్ర శిశోది ♦ యాన్వయాంభోరాశి
రాకా సుధాకర ♦ ప్రచురమూర్తి,
ధన్యుండు రాణా ప్ర ♦ తాపసింహ నృపేంద్రుఁ
డాఱు మాసంబులు ♦ వ్యవధిఁ గోర;
నతని ప్రస్తుత పరి ♦ స్థితులెల్ల విషమమై
పరిణమించిన యట్టి ♦ సరణి తోఁచె;
గీ॥ నచిరకాలమునకు ♦ నా మహాభాగుండు
సంధి కరుగుదెంచు ♦ జాడ తోఁచు;
నంబరీశు మేటి ♦ యసను ప్రయత్న మీ
యానుకూల్యమునకు ♦ నాస్పదంబు. 226

సీ॥ అకలుషానంద దా ♦ యకమైన కల్యాణ
వార్తను మీకుఁ దె ♦ ల్పంగఁ గోరి.
యందఱు నీదిన ♦ మాస్థానమునకును
జేర్చితి'' ననుచు వ ♦ చించు నంత
"సంధియుఁ దప్పక ♦ జరగుఁ బో''మ్మని కొంద,
''అతఁడు లోఁబడు సత్య'' ♦ మనుచుఁ గొంద

"ఔరా 'జలాలుద్దీను' ♦ హరిహరాదులు గూడ
నాపంగ నేర్తురే!" ♦ యనుచుఁ గొంద

గీ॥ "ఆప్రతాపుని దశ సహా ♦ ప్రాశ్వపతిగఁ
జేయుఁ" డని కొందఱెత్తుగాఁ ♦ జేతు లెత్తి!
యా సభాభవనములోన ♦ నన్ని కడల
లోకులును మిన్నుముట్టంగఁ ♦ గేక లిడిరి. 227

గీ॥ అంత నక్బరు నృపవరాళి ♦ "యవును! వారు
మైత్రి పాటింతు రని తోఁచె ♦ మా"కటంచుఁ
బృథ్వీరాజుఁ "జూచుచు "నేటి ♦ కిట్లు నిల్తు
రేల కూర్చుండ!" రని పల్కఁ ♦ బృథ్వీరాజు, 228

-॥ { అక్బరు సార్వభౌమునితో లేఖ ప్రతాపసింహునిది గాదని పృథ్వీరాజు నివేదించుట. } ॥-

గీ॥ "సేవకుఁడ నేను; నాస్వామి ♦ వీవు; నాకుఁ
దెలిసి నంత నీకడ నివే ♦ దించుటయును
ధర్మ వగు! విన్న వింతుఁ; బ్ర ♦ తాపసింహ
కర లిఖిత లేఖ యిది కాదు! ♦ కాదు! కాదు! 229

గీ॥ అమల కైలాసశైల శృం ♦ గమున కన్న
రమ్యతరమైన యామహా ♦ రాజు కీర్తి
నైనఁ జాలని యాగర్భ ♦ శత్రుఁ డెవఁడొ
యిట్లు కల్పించి లిఖియించె ♦ నిది నిజంబు! 320

సీ॥ ప్రాణప్రతిష్ఠ స ♦ ద్భక్తితో నొనరించి,
యమృతాభిషేకంబు ♦ నలవరించి,
కోటి కొక్కఁడు తెచ్చు ♦ కుసుమంబు లర్పించి,
సాంబ్రాణి వాసనల్ ♦ సంతరించి,
పూర్ణ నైవేద్యంబు ♦ ముందుంచి యర్చించి,
కర్పూరపు టారతుల్ ♦ కాన్క లొసఁగి,
మంత్రపుష్పము పెట్టి ♦ మమత నాత్మప్రద
క్షిణ నమస్కార స ♦ త్క్రియలు దీర్చి,

గీ॥ భక్తుఁ డెట్టులు నాత్మదై ♦ వతముఁ గొలుచు
నట్లు స్వాతంత్ర్యమును గొల్చు ♦ నా ప్రతాపు!
డతని గళమునఁ గొనయూపి ♦ రాడు చున్న
నీకు లోఁబడు ననుమాట ♦ నీళ్ల మూట. 231

సీ॥ బ్రహ్మ విద్యా మహా ♦ తత్త్వ రహస్య మెఱిఁగిన
యుత్తమోత్తమ రాజ ♦ యోగి ప్రకాశి,
హరిహర బ్రహ్మదు ♦ లడ్డువచ్చిన నుంత
వెనుకోని భువనైక ♦ వీరమూర్తి,
పదునాల్గులోకముల్ ♦ ప్రతిఘటించినఁ బట్టు
దల మానని భగీర ♦ థ ప్రభుండు,
తవిలి మార్కొన్న మే ♦ రువునైనఁ బాదుతోఁ
పెకలించు దుర్దమ ♦ పృథు బలుండు,
గీ॥ చంద్రసూర్యులు గతిదప్పి ♦ చనిన నాత్మ
వైభవముఁ గోలుపోని యా ♦ భానుకులుఁడు
శ్రీఁదొలఁగి తానుగా నీదు ♦ చెలిమి కోర
నిలయుఁ గ్రుంగెన! యంభోధు ♦ లింకి చనెనె! 232

గీ॥ ఢిల్లితో మొగల్ సామ్రాజ్య ♦ మెల్లఁ గొనుచు
స్వయముగా నీవు పోయి త ♦ చ్చరణ యుగళ
మును భుజించెద నంచు మొ ♦ క్కినను గాని
తగులఁ డాతండు వామ పా ♦ దమున నేని. 233

సీ॥ తొరుష్క నృప మహా ♦ స్థానవాటికలోన
నిందఱు దొరలు నేఁ ♦ డిట్లు చేరి
తనకమ్మఁ బరికించి ♦ తగునంచు నీ పట్టి
వగలిట్లభిప్రాయ ♦ పడి రటంచుఁ
దెలిసెనేని ప్రతాప ♦ దేవుని కోమల
దివ్యచిత్తం బెన్ని ♦ దిశల నొగిలి
జాలినొందునో తెల్పఁ జాల; ♦ నక్బ రటన్న
నతనికిఁ గొంత మ ♦ ర్యాద యుండె;

గీ॥ సక్కట పరేంగితజ్ఞాన ♦ మణువు గూడ
లేదె! విపరీత వర్తనుల్ ♦ వీర టంచు
నమ్మహాత్ముండు తలపోయు; ♦ నతని మదిని
నున్న మర్యాదయును గూడ ♦ నూడి పోవు," 234

ఆ॥ అని వచింప నతని ♦ యంబుద గంభీర
భాషణములు విని స ♦ భా జనంబు
లబ్బురంబు నొందె; ♦ రక్బరు నవమంద
హాస రోచి యగుచు ♦ నతనిఁ జూచి, 235

అక్బరుసార్వభౌముఁడు పృథ్వీరాజునకు బదులు చెప్పుట. —

సీ॥ "ఆ మహామహుఁడు పు ♦ ణ్య స్వరూపుఁ డటంచు,
భువనైక వీరపుం ♦ గవుఁ డటంచు,
సర్వవంశనృపాల ♦ కావతంసం బంచు,
ననుపమ శుద్ధవ ♦ ర్తనుఁ డటంచుఁ,
గొలఁదిమీఱిన పట్టు ♦ దల గలవాఁడంచు,
నసమాన ధైర్యహే ♦ ♦ మాద్రి యనుచు
నాశ లేని యమాను ♦ షానంద పరుఁ డంచుఁ,
బ్రతిలేని యీశ్వర ♦ భక్తుఁ డనుచుఁ,
గీ॥ గ్రమ్ముకొను బహుళాపదా ♦ ర్ణవము లందుఁ
గడిమి తగ్గని నెఱయీఁత ♦ కాఁ డటంచు,
నే నొకఁడ నేల! యీదేశ ♦ మెల్ల భువన
మెఱిఁగి యెఱిఁగి వేనోళుల ♦ నెపుడు మెచ్చు! 236

గీ॥ సర్వమంగళోదార ప్ర ♦ శస్త మూర్తి
శ్రీప్రతాపు స్వాతంత్ర్య ల ♦ క్ష్మీ స్వరూప!
తల్లి పాశేశ్వరీదేవి ♦ ధైర్య మహిమ
శిశువు లాటలలోఁ బ్రశం ♦ సించు చుండ్రు! 237

గీ॥ ఆమహీంద్రుపై నెంత మ ♦ ర్యాద గలదొ
పల్లకీ నెక్కివచ్చి స ♦ భా స్థలమున

వేదిపై హోమ పీఠిపై ♦ వెలసి యున్న
వన నివాసియగా యీభిల్ల ♦ వరుఁడు సాక్షి! 238

క॥ వీరకుటుంబం బగును మ
హారాణాగారి దనుచు ♦ నొందల యూఁపఁగ
నేరని వాఁ డిలపై మన
నేరని వాఁడందు; నిజము ♦ నిజ మిది యెందుఁగ. 239

క॥ ఉన్న దిదె తాఁటియాఁ; కిం
దున్నది నృపగురుని వ్రాత; ♦ యున్నది తుది వ్రా;
లున్నాఁడు భటుఁడు; పని యే
మున్నది లేదనఁగ, లేని ♦ దున్న దనంగన్! 240

గీ॥ తన్ననిపె మహారాణాప్ర ♦ తాపసింగు
జాబు నాకియ్య ననుచు నో ♦ సంగె దీని!
బొంకనఁగ నెట్టిదో దాని ♦ పుట్టుఁగని
మంచి మనసున్న యీభిల్ల ♦ మధుర మూర్తి. 241

క॥ "ఇందు నసత్యం బుండదు!
సందేహము వాయ దేని ♦ శబరభటుని నీ
రిందఱిలో నడుగుం" డన
సందియ్యక పృథ్వీరాజు ♦ "శ్రమ మేమిటికిన్! 243

క॥ ఈలేఖ క్రిందఁ దవిలిన
వ్రాలునకును సత్యమైన ♦ వ్రాలున కెంతో
పోలిక గల! దంతియు; నీ
వ్రాలును నృపగురుని దనుచుఁ ♦ బలుకఁగఁజాలన్. 244

క॥ వివరం బిది; యీభిల్లుని
నెవఁడేసియుఁ బంపియుండు! ♦ నీకాలమునం
దివి క్రొత్తలె! ధన మున్నను
భువనంబులు మార్పవచ్చుఁ ♦ బో! నిమిషమునన్. 244

గీ॥ అంత యేటికి! దేవర ♦ యనుమతింపఁ
బరమ విశ్వాసియైన సే ♦ వకునిఁ బంపి

యరయువాఁడ నిందలి సత్య; ♦ మంతేదాఁకఁ
గమ్మ నమ్మక యుందురు ♦ గాక మీరు.” 245

—॥ మానసింహుఁడు ప్రతాపసింహునిఁగూర్చి తేలికగా మాటాడుట. ॥—

క॥ అని బలము నిగుడ వచియిం
చిన వదనం బెత్తి మాన ♦ సింహుండు “ప్రతా
పనృపతియెడ నాకును దీ
రని వైరంబుంట యంద ♦ఱకు విదితంబే! 246

క॥ అతఁ డతిలోక బలోన్నతుఁ
డతులిత విక్రమ నిధానుఁ ♦ డలఘు త్యాగా
ని తుఁడనుట సూర్యదేవుం
డతితర తేజస్స్వరూపుఁ ♦ డనుటయు కాదే! 247

క॥ ఇనచంద్రులు గతి దప్పినఁ
దన స్వాతంత్ర్యంబు విడక ♦ స్థైర్యంబున డీ
కొని కోటి విపత్తులు గో
టను మీఱెను ధీరుఁడని దృ ♦ ఢమ్ముగ నెంతుఁ‌. 248

గీ॥ ధైర్యశౌర్యాది గుణ సను ♦ దాయమునకుఁ
దగ్గనిది పెంకెతన మా ప్ర ♦ తాపు నందుఁ!
గానిచో నంద ఱట్లు సౌ ♦ ఖ్యమున మనక
యూపి రాడని రణముల ♦ నేపు చెడునె! 249

సీ॥ “అఖిల దేశాధీశు ♦ డగు మహాన్మ్లజలా
లుద్దీను సాహాయ్య ♦ మొదవి యుండ,
నుదయ పర్వతము నం ♦ దుండి యాస్త్రాద్రి మే
రకుఁ గల్గు సకల గో ♦ త్రాధరంబు
నెదిరి లేకుండ జ ♦ యించిన నావంటి
పటు పరాక్రమశాలి ♦ ప్రణతిఁ గొలువ,
మానవమాత్రు లే ♦ దైన నింతటి చిన్న
నిమిషంబు తలయెత్తి ♦ నిలువఁ జాలు;

గీ॥ రిడకే పాదుషాగారి ♦ తోడి పోరు
తలమునుక లౌచుఁ బడియెఁ బ్ర ♦ తాపు మీఁద;
నాతఁ డెంతకాలము యింక ♦ నని యొనర్పఁ
బూనఁ; డీయాస మఱి కల ♦ లోని బాస. 250

సీ॥ మేవాడరాజ్య ల ♦ క్ష్మి యనాథ యయ్యె! దు
ర్గమ దుర్గ నివహముల్ ♦ గాలిఁ గలిసె!
భాండారములు పటా ♦ పంచలై చెడి పోయె;
సేనాబలం బెల్ల ♦ శిథిల మయ్యె!
సామంతనృపు లన్య ♦ సీమల కేగిరి!
బంధు సంతానంబు ♦ పలుచ నయ్యెఁ!
దల దాఁచుకొన నింత ♦ నెలవును గఱవయ్యెఁ!
గట్టు గుడ్డలు పేలి ♦ కలుగఁ జిరిగెఁ!
గీ॥ గడుపు మలమల మాడెఁ! బిం ♦ కంబు లూడెఁ!
బలము సుడిసె! స్వాతంత్ర్య పి ♦ పాస లెడసె!
నిట్టి నిరుపేద యని సేయ ♦ నెంచ నేని
యతని సంరంభ మెల్ల స ♦ న్న్యాసి పెండ్లి. 251

చ॥ అడిగెను నేఁటి కీ వ్యవధి ♦ ప్రాణము వోవక; నాఱుమాసముల్
గడువవు చూతుఁ డీ గడువు ♦ కాలము దాఁటకమున్నె పాదుషా
యడుగుల వ్రాలి తా నవిన ♦ యం బొనరించిన జాడఁ జెప్పి ప్రము
క్కడి; నివి లోకమందుఁ బరి ♦ కించిన చర్యలె; నేఁడు క్రొత్తలే!" 252

క॥ అను మానసింహు మాటలు
విని నంత నొకింత వంత ♦ పెరుఁగఁగ స్వాంతం
బునఁ బృథ్వీరా జడఁపం
గనులేక సభాజనంబుఁ ♦ గలయఁగఁ గనుచున్, 253

—(పృథ్వీరాజు మానసింహుని మాటలను ఖండించుట.)—

శా॥ "ఏమో! నాకటువంటి భావము రవం ♦ తేనిన్ మదిన్ లేదు! వి
శ్వామేయ ప్రకట ప్రతాపుఁడు ప్రతా ♦ పాధీశుఁ డాబూగిరి

స్వామిఁ గా కోరు మొక్కఁ డెప్డు! శతల ♦ క్షల్ వీరయోధుల్ సమి
ద్భూమిఁ ముట్టినఁ గెంజివ్రుళ్లటు శిరం ♦ బుల్ గిల్లివైచుఁ జుమీ! 254

సీ॥ గోచిపాఁతయు లేని ♦ కుంభసంభవుఁడు స
ముద్రముల్ ద్రావె నా ♦ పోశనముగ;
బడుగయ్యు మఱి వసి ♦ ష్ఠుఁడు గాధిసుతు సేన
బ్రహ్మ దండమున లో ♦ వలకఁ గొనఁడె!
బ్రహ్మోదుఁ డైదేండ్ల ♦ ప్రాయంపు వాఁడయ్యు
విశ్వంబు నెల్ల స్తం ♦ భింపఁ జేసె;
సంగముల్ లేనివాఁ ♦ డయ్యుఁ బంచశరుండు
పూర్వు టమ్మున లోక ♦ ములు జయించెఁ;
గీ॥ నాత్మబలము ప్రధానమ్మై ♦ యలరుఁ గాని
యుపకరణములఁ బనిలేమి ♦ యుత్తములకు!
లేమి యున్న, సాయంబేమి ♦ లేక యున్న,
నాప్రతాపుఁ డభ్యాత్మ స ♦ త్వప్రభుండు. 255

గీ॥ అకట! యతఁ డేడ! నీ వేడ! ♦ యక్క రేడ!
యమరగిరి కణువున కున్న ♦ యంతరంబు;
జగము తలక్రిందయినఁగాని ♦ జరుగఁబోవ
దాప్రతాపుఁడు లొంగుట" ♦ యని వచించె. 256

గీ॥ పులకిత శరీరులౌచు నాఁ ♦ దఃల నూఁపు
దారల తలల రుమాలులు ♦ వఱలె నపుడు;
కమ్మతెమ్మెర గ్రిమ్మ వ్ర ♦ తుమ్ముల తుదల
గునిసి యాడెను క్రొవ్విరి ♦ గుత్తులట్లు. 257

సీ॥ "మానసింహాన్నపాల! ♦ మనము పృథ్వీరాజు
విన్నపంబును ద్రోసి ♦ వేయఁ బోలఁ;
దిటు నుండు వారిలో ♦ నితఁ డొక్కఁడే సుభా
గానాప్రతాపుఁ గా ♦ రాపుఁబుట్టు;
మితెఁ డప్పు డప్పుడా ♦ యినకుల స్వామి ద
ర్శన మొనరించిన ♦ చనువు కలిమిఁ

నానుమానముల భావ ♦ మున్న యంశంబుల
యెడ నెక్కుడగు రీతి ♦ నెఱిఁగి యుందు;
గీ॥ నింత కీతఁడు తొందర మాని ♦ యెల్ల కార్య
గతుల దీర్ఘ మాలోచింపఁ ♦ గాఁ దగు ననె;
మనకు మాత్ర మిప్పటికి మిం ♦ చినది గలదె
విదియఁ దోఁపని చంద్రుండు ♦ తదియఁ దోఁచు! 558
గీ॥ ఎదిరి వాదమ్మునకుఁ దగు ♦ నెన్ని వసతు
లన్నియు నొసంగి సత్యంబు ♦ నరయు ముచిత!
మాత్ర మేమిటి కిపు" డని ♦ యవన నృపతి
దృష్టి మార్చి పృథ్వీరాజు ♦ దెసను గాంచి, 559
ఉ॥ "నీవు వచించుమాట గణ ♦ నీయము! యట్టులె నీకు నిష్టసా
కైవడి నమ్మ నేర్చిన యొ ♦ కానొక సేవకుఁ బంపి, యా జగ
త్పావన వర్తనుండగు ప్ర ♦ తాపుని భావ మెఱింగి, మాకు నా
యా వివరంబులన్ దెలుపు ♦ మందలి సత్యము రూఢ మేర్పడన్. 260
గీ॥ 'అంతదాఁక మేవాడపై ♦ నరుగ రాదు
మొగలు సైన్యంబు' లని నేను ♦ మొదల సేతుఁ;
బనులు చాలింత మిపు"డని ♦ పలికి లేచి
సభ ముగియఁ జేసె; నంత దుం ♦ దుభులు మ్రోసె! 261

— పృథ్వీరాజు భిల్లుని దోడ్కొని తన యింటి కరుగుట. —

సీ॥ కుండంబునుండి ది ♦ క్కులసంద నగ్ని క
ణంబులు చెదరు చం ♦ దంబు దోఁప,
సైన్యాధినాథు లా ♦ స్థానరంగము వీడి
యాత్మ మందిరముల ♦ కరిగి రపుడు;
రాజమార్గమున న ♦ గ్రస్థానమున నిజ
గృహము జేరఁగఁ బోయెఁ ♦ బృథ్వీరాజు;
ద్వారసీమ కతని ♦ భార్య జోషీబాయి
స్వర్ణ కుంభంబున ♦ జలము దెచ్చి

ఆ॥ పాదయుగము గడిగి ♦ పైఁ జెఱంగునఁ దడి
యార్చె; లోని కిరువు ♦ రరిగి రపుడు;
పావ నానురాగ ♦ బద్ధ శోభన రాజ
హంస దంపతులను ♦ ననుకరించి. 262

గీ॥ "అఱుమాసముల్ విశ్రాంతి ♦ యవసర మని
పాదుషా కడ కీభిల్ల ♦ భటుని బంపె
నా ప్రతాపదేవుం" డని ♦ యతనిఁ జూపెఁ
బృథ్వి రాజు; జోషీబాయి ♦ వెతఁ గలంగె. 263

సీ॥ "ఏమంచు సేకిచ్చె ♦ నీకమ్మ! రాణా ప్ర
తాపేశ్వరుం" డంచు ♦ ధవుఁడు నుడువ,
"వ్రాయు నప్పుడు కమ్మ ♦ వ్రాయుప్పైఁ దద్భావ
మెట్టు లుండె!" నటంచు ♦ సింతి యనుగు;
"నామహామహు ముఖం ♦ బంత నొచ్చినయట్లు
కనుపించెనే!" యంచుఁ ♦ గాంతుఁ డనఁగ;
"శాంతేశ్వరీమాత ♦ ప్రభుఁడు లేఖ లిఖించు
కత మెఱుంగునె!" యంచు ♦ సతివ పలుకు;
గీ॥ "భక్తమణి సలుంబ్రాస్వామి ♦ సాయ కెపుడు
విభుని గొల్చునె" యని భర్త ♦ పృచ్ఛసేయఁ,
"గసరు మొగ్గలు మాతల్లి ♦ కాన్పు లడవి
కాకలకు సుక్కురో" యంచుఁ ♦ గాంత యనుగు! 264

ఉ॥ "చెప్పుము చిత్తమిచ్చి యిదె ♦ శ్రీనృపలోక జగద్గురుండు మా
యప్ప ప్రతాపదేవుని ము ♦ ఖాంబురుహంబునఁ జంద్రబింబ ముం
దాప్పెడి వెన్నెల ట్లలరు ♦ నుత్తముసా దరహాసరేఖ తా
నెప్పటి యట్ల పాయక ర ♦ హించును నుండునె! భిల్లశేఖరా!" 265

క॥ అని మఱియు మఱియు నయ్యం
గనయును బతి నొత్తి యనుగఁ ♦ గా భిల్లుండున్
దనమది కుదురు పఱచి క
ల్గిన సంగతు లెల్లవారి ♦ కిన్ వినిపించెన్. 266

సీ॥ "తొలిదినంబునఁ జీక ♦ టులు క్రమ్ముపఱకాజి
విడక రేఁగె" నటన్న ♦ వెత వహించు;
"దినరాత్రములు రెండు ♦ తిండిలేక కుటుంబ
మలసిపోయె" నటన్నఁ ♦ గళవళించు;
"గాలియు వాన జ ♦ గత్ప్రళయము రేఁప
నుబికె'' నన్నను మది ♦ నుస్సురించుఁ;
"బిల్లి రొట్టెను నాఁచి ♦ బిడ్డ ఱొమ్మను జీల్చి
పోయె''నంచు వచింపఁ ♦ బొక్కి పోవు;
గీ॥ ''రాజగురు సార్వభౌము వ ♦ జ్రంపు గుండె
కలుకు సెడి మొత్త వడి వ్రాసెఁ ♦ గమ్మ''యనిన
వేఁడి నిట్టూర్పు పుచ్చి యా ♦ పృథ్వీరాజు
లేమ కన్నీటి మున్నీటి ♦ లో మునింగె. 267

సీ॥ "తపనీయ ఘటిత సుం ♦ దర మందిరము లున్నఁ,
బలు రకంబుల నుప ♦ వనము లున్నఁ,
మదనోపమానుఁడై ♦ మన్నించు మగఁ డున్న,
దాసీజనంబు నం ♦ దలుగ నున్నఁ,
బెన్నిధులను మీఱు ♦ విత్త సంపద యున్నఁ
గరమరుదైన భో ♦ గంబు లున్న,
పలువేలు నగలు రా ♦ సులు రాసులుగ నున్నఁ,
దమ మాట వేదమై ♦ తనరు చున్న
గీ॥ మాటవినఁ గష్ట మిప్పటి ♦ మానవతులు;
తినఁగఁ గట్టఁగ లేక కా ♦ ననము వెంట
నాథు దేవుని వలెఁ గొల్చు ♦ నాదు పెద్ద
తల్లిఁ బోలిన సాధ్వి మ ♦ తల్లి గలదె! 268

గీ॥ జగములోని వీరులను రా ♦ జన్య వరుల
గొలువ విశ్వోన్నతుండునై ♦ యలర వలయు
తండ్రి వసుపాట్ల కకట! యం ♦ తంబె లేదె!"
యని కలంగి జోషీబాయి ♦ యడలు వడియె. 269

గీ॥ తనకుల సుధాంబురాశి పూ ♦ తమ్ము సేయ
నవతరించిన పద్మాల ♦ యావతార
యలఘు సాధ్వి జోషీబాయి ♦ యడలు చూడ
రాదనుచు సూర్యుఁ డపరవా ♦ రాశి డాసె! 270

సీ॥ పలురంగు లీను పు ♦ ష్పములచే నలరి మంది
రము వెన్క నొక్క యా ♦ రామ మలరు;
నా రామమున వట్టి ♦ వేరులతోఁ గప్పఁ
బడి యొక్క చలువ చ ♦ ప్పరము దనరు;
నద్దాని నడుమఁ గ ♦ మ్రాసనములు కొన్ని
వాని నడుమ నొక్క ♦ బల్ల యుండెఁ;
జొకమాలు వలువ సొం ♦ పులు గుల్కఁ బైనఁ బ్రాఁ
తకుఁదగ్గ యున్ని సా ♦ ధనము లుండెఁ;

గీ॥ నంతఁ బృథ్వీరా జొక విశా ♦ లాసనమున
బల్లముందుఁ గూర్చుండి ని ♦ త్యేల్ల దీర్ఘ
యోజనల మున్గి కొంతసే ♦ పుండి పిదపఁ
గరమునను గాగితంబును ♦ గలముఁ గొనియె. 272

—( ప్రధానమంత్రి యబ్దూరహిమాను పృథ్వీరాజును దర్శింప వచ్చుట. )—

గీ॥ అంత సేవకుఁ డరుదెంచి ♦ "యగ్ర మంత్రి
గారు విచ్చేసి"రన వెళ్లి ♦ గారవించి
ప్రక్కవాఁకిటఁ జలువ చ ♦ ప్పరము నందుఁ
జేర్చి తానును జెంత నా ♦ సీనుఁ డయ్యె; 273

క॥ "పదినాళ్లుగ నారోగ్యము
కుదురుగ లే దనుచు మీరు ♦ కొలువునఁ దెలుపన్
మదిఁ జింత వడితి; నెటు లు
న్నది! యి"ప్డని పృథ్వీరా జ ♦ నంగ సచివుఁ డనున్, 274

సీ॥ "అచటి విశేషంబు ♦ లన్ని మీ కెఱిఁగింప
వలె ననియే యిట్లు ♦ వచ్చినాఁడ;

భానుకులస్వామి ♦ వ్రాసిన యాలేఖ
నవలోకనము చేయు ♦ నంత మాత్ర
నామహామహుఁడు లో ♦ కైకాగ్రపీఠంబు
డిగ్గి యక్బరుకుఁ జే ♦ యొగ్గు నట్టి
దుస్థితి యేర్పడెఁ ♦ ద్రోవ యించుక లేదె
యని నాకు మనసులో ♦ మనసు లేదు;
గీ॥ కమ్మఁ జదువఁగ మది జాలి ♦ క్రిమ్ముకొనుచుఁ
'బదినంబులు బాధించె ♦ జ్వర'మటంచుఁ
బలికి తప్పుకొంటిని! గాని ♦ బాధ గలుగ;
జెప్ప టట్లు నాకారోగ్య ♦ మొసఁగి యుండు. 274
సీ॥ పుట్టినప్పటి నుండి ♦ బొంకన్న నెట్టిదో
దాని రూప మొకింత ♦ యే నెఱుంగ;
నామహారాజు వ్రా ♦ యఁగ లేక వ్రాయు నా
కష్టగర్భిత లేకఁ ♦ గాంచి నపుడు
నాసత్య మెట్లు పా ♦ డై సమసిన మాన్నె,
ననృతంబు పలికి నే ♦ నాచరించు
ద్రోహంబు లేదని ♦ తోఁచి, మొట్టులో కష్ట
మున 'జ్వరం'బని నేను ♦ బొంకినాఁడ;
గీ॥ ననృతదోషంబునైన ధై ♦ ర్యమున నోర్తు;
నామహాభాగు మదిని దై ♦ న్యమున కోర్వ
లే'నటంచు నబ్బూరహి ♦ మానుఁ డనఁగఁ
బ్రీతి యుట్టిపడుఁగ, నా ♦ పృథ్వీరాజు, 275
సీ॥ "ఆనందమయ్యె మీ ♦ యారోగ్యవార్తకు;
నాకమ్మ సభను నే ♦ నంది చూడఁ
బదములక్రింద భూ ♦ భాగ మట్టులె క్రుంగి
పాతాళమున కేగు ♦ పదిగిఁ దోఁచె;
వీరాధివీర-ని ♦ త్యారాధ్య దేవతా
క్షత్రతేజోమయు ♦ స్వర్ణమూర్తి

యువనిని బోరలునే ♦ యని, పెండ్లి పందిరి
కుప్పఁగూరఁగ ధాత్రిఁ ♦ గూలునె యని,
గీ॥ దేవ! నాపరితాపంబు ♦ దేవుఁ డెఱుఁగుఁ;
గమ్మఁ బరికింప దగ్గుత్తి ♦ కయి జనించి
యింత మాట రాదయ్యె; నే ♦ నేమి సేయ
రామి, నడు నిల్చిపోతి, నా ♦ ప్రతిమ భాతి. 276

ఉ॥ అమ్మహనీయ గౌరవము ♦ నంతయు నింతయు తగ్గఁ జేయు నా
కమ్మ నొకింతయుఁ జదువఁ ♦ గా మన సించుక లేక "నాదు నే
త్రమ్ములు పచ్చనయ్యె; లిఖి ♦ తమ్ముఁ గనుంగొన లే' నటం చస
త్యమ్మొకఁ డడ్డు వెట్టి యెటొ ♦ తప్పుకొనంగను గంటిఁ గొల్వునన్" 277

క॥ అన, లేనగ వొకయందము
ననువుపఱుప నెమ్మొగమున ♦ కబ్బా రహిఁ మా
నును "జిట్టచివరఁ జక్కని
పని చేసితి రందఱును నె ♦ బాసని మెచ్చన్. 278

ఉ॥ 'ఈకడఁ గమ్ము బొం' కనుచు ♦ నేర్పడ దెల్పి నిజాప్తభృత్యులో
నైకగురూత్తమున్ దరియ ♦ నంపఁగ నక్బరునేత సమ్మతిన్
గైకొని వచ్చి గొప్ప యువ ♦ కాశమునఁ గూర్చితి రిద్దు; విస్మయై
కాకరమైన నీదు సమ ♦ య స్ఫురణంబు నుతింప నొప్పెనున్. 279

సీ॥ అవిరళ త్యాగంబు ♦ నకలంక వర్తన
స్వాతంత్ర్య రక్తి దే ♦ శమున భక్తి
సౌజన్యయుక్తి నా ♦ జన పాలకులవాళి
సకలభారతయోగి ♦ చక్రవర్తి;
కసవు రొట్టెలు స్ఫటి ♦ కంపు నీరమునఁ గొంచుఁ
గామధేనువు భంగిఁ ♦ గ్రాలు; నతని
నాదర్శమూని యో ♦ గ్యతఁ బెంప నాగు నీ
రన కందఱకును బా ♦ ధ్యత యొసంగు;
గీ॥ హ్లాదమయమున వీరరస మున్న ♦ నెవ్వఁడైన
దేవ పూజాగ్రహమున నా ♦ నీకు విగ్ర

హము నిలిపి మూఁడువేళల ♦ నర్చ సేయు
టర్హ మను సూక్తియందు లే ♦ దతిశయోక్తి. 280

గీ॥ ఆ శిశోదియా వంశ దు ♦ గ్ధాబ్ధి చంద్రు
చరణములు పూజ సేయ వి ♦ జ్ఞప్తి వ్రాసి
తీసికొని వచ్చినాఁడ నే; ♦ దీనిఁ జదివి
వలయు మార్పులు గావింప ♦ వలయు" ననిన, 281

గీ॥ "అయ్య! నీకమ్ము కన్నుల ♦ నద్దు కొనుచుఁ
జదివి హర్షింపఁగల యదృ ♦ ష్టంబె చాలు;
గమ్మతావుల వీఁచు నీ ♦ కవనమునకు
మెఱుఁగులను గూర్పఁజాలు నే ♦ర్పరులు గలరె!" 282

గీ॥ అనుచుఁ బృథ్వీరాజు విశేష ♦ హర్ష మునుఁగ
సచివు విజ్ఞప్తి పత్రంబు ♦ చక్క విప్పి
విడి విడిగ ముత్తియము లట్లు ♦ వెలయు చున్న
కవ్య యందలి ప్రత్యక్ష ♦ రమ్ము చదివె. 283

సీ॥ తూఁచియుంచిన మాడ్కిఁ ♦ దోఁచు శబ్దంబులు
హాయికి మదిలోన ♦ నలరి యలరి,
సరస స్వభావ పే ♦ శల మనోభావంబు
లచ్చొత్తి నట్లుండ ♦ మెచ్చి మెచ్చి,
యాత్మావబోధ ర ♦ హస్యాంశములు నిండి
యుబుకుటఁ గని తల ♦ యూఁచి యూఁచి
ప్రసరించి నిలువెల్ల ♦ రస ముట్టి పడు నట్టి
ఘట్టంబులను జూచి ♦ కరఁగి కరఁగి,

గీ॥ భారతీయ గౌరవము గా ♦ పాడు నునుచు
భక్తి వెదచల్లుచో మోద ♦ బాష్పతతులు
వెల్లు వలు గట్టి దూఁక, నా ♦ పృథ్వీరాజు
హర్ష జలరాశిఁ దేలి నీ ♦ రై స్రవించె. 284

ఉ॥ "ఎంత మహానుభావులరో! ♦ యెంత తపం బొనరించినారొ! దు
ర్దాంత పరాక్రమాంకుఁడు ప్ర ♦ తాప మహీంద్రు పదాబ్జయుగ్మ మం

దెంతటి భక్తిభావము వ ♦ హింతువొ! వేయును నేల! లేఖ యా
ద్యంతము సద్రస స్ఫురణ ♦ మంది సుధన్ గురియించు చుండెడిన్. 286

ఉ॥ ఈరచనా విశేషమును ♦ నిందలి త్యాగము వీరపూజయున్
గూరుచునట్టి మోదమున ♦ కున్ గలిగించెడు దేశభక్తికిన్
బారము లేదు; నిక్కముగ ♦ భారత దేశ చరిత్రమం దలం
కార విశేష మౌచుఁ ద్రిజ ♦ గంబులు మెచ్చి నుతింప నొప్పెడిన్. 287

గీ॥ ఒక్క వ్రాలున్న నిది దేవ ♦ యోగ్య మగుచు
వెలయు' నని పృథ్వీరా జనఁ ♦ బ్రెగ్గడయును
"ననఘ! యాలోపమును దీర్చు ♦ నట్టి భార
మిప్పుడు మీపైన నుండు; వ్రా ♦ లిడఁగ వలయు" 288

మ॥ అని పల్కన్ విని పృథ్వీరాజు "సచివేం ♦ ద్రా! నీమనోవీధి సం
జననంబౌ మృదుభావ సంపదలు ను ♦ త్సాహమ్మునన్ జేర్చి కూ
ర్చిన యీయుత్తమ లేఖకున్ జివర మీ ♦ శ్రీ నామధేయంబు నుం
చినచో శీర్షముపైఁ గిరీట మిడు నా ♦ చెల్వంబు దీపించెడున్. 289

క॥ అమలమయి, లోకవిఖ్యా
తము నౌచు, గురుత్వ మందు ♦ త్వన్నామ సువ
ర్ణ మయాక్షరముల లేఖాం
తమునన్ శోభిల్ల జేయు ♦ ధన్య ప్రవరా!" 290

చ॥ అని వచియించు నంత వద ♦ నాంబురుహంబున వింత భావముల్
మునుకొని తోఁప, నా సచివ ♦ ముఖ్యుఁడు మోమును వాల్చి లోకపా
వన సుచరిత్రుఁ డైన యల ♦ భాను కులేంద్రు కటాక్ష వీక్షణా
"బున కిసుమంత పాత్రమగు ♦ సోఁడిమి గల్గునె నన్ను బోంట్లకున్! 291

సీ॥ ఇనకులేశ్వరుఁడు నే ♦ నెవ్వఁడ ననుమాట
గూడ నెఱుంగని ♦ క్రొత్త వాఁడ;
నాత్మమత స్థిరు ♦ డైన మహమ్మదీ
యు కులంబునను జన్మ ♦ మంది నాఁడ;
భారతదేశంబు ♦ వాఁడఁ గాను; బ్రతాప
భూ రమణునకును ♦ దూర గుండఁ;

బైన మీయాజ్ఞ నెంచి నా ♦ స్వాంత మిపుడు
వ్రాసి లిడుటె యుక్తమంచు ని ♦ ర్ణయ మొనర్చె." 301

గీ॥ అనుచు, వ్రాలుంచెఁ; బృథ్వీరా ♦ జట్లు చేసి,
దాని సదికించి "రాణాప్ర ♦ తాపసింహ
దేవునకుఁ, శైలవారాప్ర ♦ దేశ" మనుచుఁ
బైన లిఖియించి, యాభిల్ల ♦ భటున కిచ్చె. 302

—: భిల్లుఁడు ఢిల్లీపురము వీడి వచ్చుట. :—

ఆ॥ పలు రకముల తిండి ♦ బండారముల తోడఁ,
గంబళమునఁ గట్టు ♦ కమ్మ తోడఁ,
బైనఁ గురియు చుండు ♦ పలు దీవనల తోడఁ,
వరలె భిల్లుఁ డురుము ♦ దంబు తోడ. 303

ఆ॥ "అల్లవాఁడె భిల్లు ♦ డంట; యక్బరు షాహి
యోలగమునఁ గూడ ♦ చుండె నంట;
నాప్రతాపు దూత ♦ యఁట యితం"డని, పేర
లెక్కి-నిక్కి- చూచి ♦ రింతు లెల్ల. 304

క॥ శ్రావణమాసము ముదిరెను!
మేవాడ్దేశమున నభము ♦ మేఘాకీర్ణం
బై వాన లలముకొనె! షా
రావళి విడి ఢిల్లిఁ జేర ♦ నరిగిరి యవనుల్. 305

శా॥ అంతన్ రాఁగ మెలర్చు భిల్లపతి డా ♦ యన్ వచ్చి "మాతావనీ
ప్రాంతారణ్యము వీడి రయ్యరులు! సం ♦ గ్రామంబునన్ నిల్చె! వి
శ్రాంతిన్ జెందఁగ నాదు కూడెమునకున్ ♦ ర"మ్మంచుఁ గొంపోయె మొదు
ద్దాంతప్రాభవు నాప్రతాపుని సభా ♦ ర్యాపుత్ర సైన్యంబుగన్. 306

సీ॥ రచ్చపట్టునఁ బెను రచ్చ ♦ మ్రాని క్రింద
శబర పతి కృష్ణసింగు పా ♦ ర్శ్వముల నుండ
దుర్జయుఁడు లోనుగాఁ గల్గు ♦ దొరలు చుట్టు
గొలువఁగఁ బ్రతాపుఁ డొకనాఁడు ♦ కొలువు చేసె. 307

గీ॥ ఆమడయు నొక్కయడుగుగా ♦ నరుగుదెంచి
మోము ముసిముసి నగవుల ♦ మురువు గులుక
భిల్లుఁ డిధిపులకును బ్రణా ♦ మిల్లి భక్తి
దనరఁ గమ్నఁ బ్రితాపు పా ♦ దముల నుంచి, 308

సీ॥ "ఎకిమీఁడ! పాదుషా ♦ కిచ్చితిఁ గమ్న! యూ
తని యరుసం బింత ♦ యనఁగఁ జెల్లు!
దూరు సింగారించె! ♦ నొడఁగూర్చె నొక పెద్ద
సభ! కమ్న నందిచ్చె ♦ చదువు మనియెఁ!
బృథ్విరా జది చూచి ♦ వెనుక కిచ్చెను! పెద్ద
మంత్రి గొని చదువ ♦ మానెఁ! దురక
ఱేఁడు తానె చదివెఁ! ♦ బృథ్విరాజు "ప్రితాప
నృపుఁ డిట్లువ్రాయఁ బోఁ! ♦ డిది యెవరిదో"

గీ॥ యని పలికె! నక్బ "రొక బంటు ♦ నంపి నిజము
నరయు" మనెఁ! బృథ్విరాజును ♦ నగ్రిమంత్రి
యిరువు రేకాంతముగఁ గూడి ♦ యిట్లు జాబు
వ్రాసి శ్రీపాదములు చేరఁ ♦ బంచినారు" 309

ఆ॥ అనుచు మ్రొక్కి నిలిచె! ♦ నందఱు మౌన ము
ద్రా విముద్రితాస్యు ♦ లై వెలింగి!
రా ప్రితాపుఁ డంత ♦ నా సలుంబ్రిస్వామిఁ
గాంచెఁ! గృష్ణసింగు ♦ కమ్నఁ దీసి, 310

— ప్రితాపసింహునకు ఢిల్లీ నుండి వచ్చిన లేఖ —

సీ॥ మేవాడ రాజ్యల ♦ క్ష్మీ భార ధౌరేయ
పరిణాహి దక్షిణ ♦ బాహుదండ!
కమలబాంధవ వంశ ♦ కలశ పారావార
సంపూర్ణ రాకా తు ♦ షారకిరణ!
బప్పరా యాన్వయా ♦ భరణ! దుర్మద వైరి
తామిస్ర చండ మా ♦ ర్తాండమూర్తి!

స్వాతంత్ర్య పూజ్య రా ♦ జ్యరమా స్వయంవరా
స్థాన సింహాసన ♦ సార్వభౌమ!

సీ॥ భవ్య భారతదేశ సం ♦ భావనీయ
సన్నుత స్థాప నాచార్య ♦ సకల బిరుద!
స్థిరతర పరాక్రమ క్రమా ♦ జేయ విమత
భూప గజరాజ సింహ! ప్ర ♦ తాపసింహ! 311

సీ॥ శ్రీలఁ దనరారు విశ్వ దే ♦ వాలయమున
నలఘు మేవాడ గర్భాల ♦ యంబు లోన
వెలయు నర్ధేందుకోటీర ♦ విగ్రహంబ
వనఘ! నీపాదములకు జో ♦ హారు లివిగొ! 312

సీ॥ గజము చర్మంబుఁ జిచ్చుటె ♦ కన్నుఁ బూప
చందురునిరేక నైక లాస ♦ మందు విడిచి
భరత ఖండంబు నుద్ధరిం ♦ పఁగ జనించు
ధూర్జటివి నీవు; రాజమా ♦ త్రుఁడవు గావు. 313

సీ॥ సత్వ భరితుండనైన నిత్య ♦ సత్యమూర్తి
వగుచు ననవర తాత్మోప ♦ హారములను
సంగి స్వాతంత్ర్యమును గొల్చు ♦ జ్ఞానరాశి!
నీవు దైవ స్వరూప మ ♦ వే! నిజంబు. 314

సీ॥ జగము గొనియాడు స్వాతంత్ర్య ♦ సౌధమునకు
వజ్ర సోపాన పంక్తులు ♦ పఱచు చున్న
నీ యశో వైభవముల వ ♦ ర్ణింత్రు సిగ్గ
రాంగనలు స్వర్ణమయ వీణ ♦ లాలపించి. 315

ఉ॥ తావక ధర్మయుక్తియు ను ♦ దార యశంబును దేశభక్తి హా
రావళి యొందుగాక భర ♦ తావని యొక్కఁడుగాక యింక నీ
స్థావర జంగ మాత్మకము ♦ సర్వజగంబును వేయి నోళ్ళ సం
భావన సేయుటల్ చెవుల ♦ పండువుగా వినుచుందు నెప్పుడున్. 316

సీ॥ పుష్పరాశినిఁ బడు వహ్ని ♦ పోల్కిఁ, బాలఁ
బడిన విసముట్లు, కంటిలోఁ ♦ బడిన ముల్లు

నటు, హఠాత్తుగ నీకమ్మ ♦ యట్టె వచ్చి
స్వాంతములు వ్రచ్చెఁ; గొండంత ♦ వగపు దెచ్చె. 317

మ॥ ఘనసౌభాగ్యము లూడి భారత మహా ♦ ఖండంబు దాస్యాంధ కా
ర నిమగ్నంబయి యుండ 'లోకముల దౌ ♦ ర్భాగ్యంబులన్ దీర్పఁ నేఁ
డని హర్షింపఁ బ్రతాపభానుఁ డుదయం ♦ బై యుండెఁ; మా దుష్కృతం
బున లేమబ్బులు సోఁకి చాటుపడునే ♦ మో యంచు నొచ్చెన్ మదుల్.

సీ॥ "సప్తపారావార ♦ సంవృతాఖిల మహీ
వలయ మేల" నటంచు ♦ వగవ వెపుడు!
"ధనధాన్య వసన వా ♦ హనకోటి బొత్తుగా
లే" దంచు మదిలోనఁ ♦ గ్లేశ పడవు!
పార్వతీ సతిఁబోలు ♦ పాటేశ్వరీ దేవి
పడు కష్టములఁగన్న ♦ యడలఁ బోవు!
బాల చంద్రకళల ♦ వంటి బిడ్డలు తినఁ
గూడు లేదని వంతఁ ♦ గుంద వెవ్వ!

గీ॥ దనఘ! వాతాంబు పర్ణాశి ♦ వయ్యు నిఖిల
భువనములు గెల్వఁదగు వీర ♦ మూర్తి వీవు!
కటకటా! నీవు పంపిన ♦ కమ్మలోని
జాలియగు పల్కు విని గుండె ♦ ప్రీలె మాకు. 319

క॥ "తొలఁగెను విభవము; రాజ్యము
తొలగెను; సిరి తొలఁగె; హితులు ♦ దొలఁగి" రటంచున్
గలఁగకుమీ! దేవుని దయ
నెలకొన్నను విశ్వమెల్ల ♦ నీయదె సుమ్మీ, 320

గీ॥ తెగని కష్టంబు లలము నీ ♦ దేశమందు
వెలికి యుబికి నీ సత్త్వమే ♦ వెలుఁగుఁ గొంత!
కనులు గుట్టు మబ్బులు గప్పు ♦ కాళరాత్రిఁ
దళుకు తళుకని మెఱయు సౌ ♦ దామిని వలె. 321

గీ॥ క్షత్రధర్మంబు కుర్రింగి నా ♦ శనము నొందె;
బీరుపోయె వర్ణాశ్రమా ♦ చార విధులు

సృష్టి దుర్గమశక్తి ♦ యెటనుండి వచ్చెనీ
కని జగం బెల్లప్పు ♦ డమగు చుండు;

తే॥ నసి గాంచెఁడెఁ ద్రోవ నీడ నీ ♦ కద్వితీయ
స్థైర్యసారంబె నీపాలి ♦ దైవ మనుచు
హర్ష బాష్పంబు లురల మా ♦ యట్టి వార
లాడుకొను మాట లగునో ని ♦ రర్థకములు! 328

తే॥ స్త్రీలఁ బురుషుల రాజ్యంబు ♦ దేశ మెల్ల
పిలుచు నీ యక్బరను గొప్ప ♦ విలువ కాఁదు;
బ్రహ్మ కల్పంబుగా ధాత్రి ♦ బ్రదుకఁ; దంద
అపుడు పునరుద్ధరింప ని ♦ న్నాశ్రయింత్రు. 329

తే॥ కులము గుణమును చూడక ♦ క్షోణి జనుల
కలుషము లడంచి సత్య ని ♦ ర్మలతఁ బెంచు
జాహ్నవియుఁ బోలె యవన సం ♦ సర్గ దోష
ముడఁచి పునరుద్ధరింప యో ♦ గ్యుఁడవు నీవు! 330

సీ॥ కాసును మొదలు ల ♦ క్షలుఁ గోట్లు రాసులు
రాసులై పెరిగిన ♦ ద్రవ్యములును,
పూరి గుడిసె మొదల్ ♦ గా రమ్య నవరత్న
భర్మ నిర్మిత మహా ♦ భవనములును,
బంటు మొదలు సర్వ ♦ పార్థివ వర్గముల్
పదము గొల్చెడు సార్వ ♦ భౌమ పదవి,
బక్క గుఱ్ఱము మొదల్ ♦ ప్రబ లాజి సాధన
సన్నద్ధ చతురంగ ♦ సైన్యములును,

గీ॥ గాల వాహినిలోఁ బడి ♦ కడలిఁ గలియుఁ;
బేదవడి బెండుదేలియుఁ ♦ బెంపు సెడని
కర్మయోగుని స్వాతంత్ర్య ♦ ధర్మ రతుని
యశ మొకఁడె శాశ్వత జ్యోతి ♦ యై వెలుంగు! 331

ఆ॥ నూఁది బెజ్జ మండు ♦ గుండాలముల దంపు
నోఁచి వలికిఁ బాఱి ♦ వచ్చు నేమొ!

భాగ్య భోగ రతుఁడు ♦ పరమేశ్వరుని కూర్మి
నొంద లేఁడు; సౌఖ్య ♦ మంద లేఁడు. 332

గీ॥ మొగిలు మేసెడు కొండ కా ♦ పురము! శిలలు
సింహ పీఠముల్! పులులు నె ♦ చ్చెలుల పిండు!
లారఁబండిన పండు లా ♦ హార! మిట్టు
లేది యెటు లున్నను గొఱంత ♦ యేది నీకు! 333

సీ॥ "శ్రీమించు నీదు ద ♦ క్షిణ బాహుదండమే
దిక్కింక భారత ♦ దేశ మునకు;
నమృత మొలుకు నీక ♦ టాక్షమే యింక నీ
హైందవులకు జీవ ♦ నౌషధమ్ము;
బెద రెఱుంగని నీదు ♦ హృదయమే భారత
స్వాతంత్ర్య లక్ష్మి కా ♦ స్థాన వాటి;
తావకనామమే ♦ దాస్యాంధ కారమ్ముఁ
బోఁదట్టు దివ్య భా ♦ నూదయంబు;
గీ॥ నీ స్వరూపంబె పరదేవ ♦ తా స్వరూప"
మనుచు జగమెల్ల నినుఁగొని ♦ యాడి కొలుచు!
నీవె విశ్రాంతిఁ గోరుచుఁ ♦ జే విడిచిన
నున్నదే! త్రోవ, భారతా ♦ భ్యుదయమునకు! 334

సీ॥ తలచూప రాక వా ♦ నలు ముంచుకొని నట్లు
యౌవన ప్రళయంబు ♦ లాక్రమింప
స్త్రీల పాతివ్రత్య ♦ దీక్ష పూరుషుల క్షా
త్ర మడంగ శశిసూర్య ♦ ధామ మట్లు!
ఏకార్ణవంబైన ♦ యీ విపత్సముదయమం
దీ విశ్వమున కెల్ల ♦ నీ వొకఁడవె
ప్రళయంబు సోఁకక ♦ వటపత్ర శాయి కా
పురుషోత్తముని రీతి ♦ స్థిరత నిలిచి!
గీ॥ యిపుడు నసిచెడ్డ సకల భా ♦ రతీశ హృదయ
వాటి స్వాతంత్ర్య బీజముల్ ♦ నాటెద వని

యనఘ! మాకుండె బ్రహ్మాండ ♦ మంత యాస!
కట్ట! యొనరింతె నట్టేటి ♦ పుట్టి మునుక! 335

గీ॥ బరువు పడ కిన్ని యేండ్లు కా ♦ పాడినాఁడ
వనఘ! స్వాతంత్ర్య కనక గ ♦ ర్భాలయమునఁ
బ్రజ్వరిల్లు నఖండ దీ ♦ పమ్ము; నిపుడు
కొండ యెక్కింతువే! కను ♦ కూర్కి దేవ! 336

గీ॥ పొడమి తోడనె యడఁగు బు ♦ ద్బుదము వోలె
నరుని జీవితము క్షణభం ♦ గురము గాదె!
శ్రీను కడలి దేశ మంధ కూ ♦ పమునఁ ద్రోయు
పాప మొడిగట్టుకొనకు వ్రి ♦ తాప దేవ! 337

ఉ॥ చాలని కాలమై చరణ ♦ సన్నిధిఁ జేరి వచింప లేని మా
జాలిని దేవుఁడే యెఱుఁగుఁ; ♦ జక్కఁగ విప్పి వచింప లేము; నీ
కాలను ముల్లు గ్రుచ్చినను ♦ గంటను గ్రుచ్చిన యట్లు నొప్పితోఁ
దూలి యొనర్చు విన్నపముఁ ♦ ద్రోయకు! పాయకు వీరమార్గముఁ! 338

సీ॥ కడలెల్ల నిండఁ జు ♦ క్కలు రాలఁగా లేదు;
కులశైల శిఖరముల్ ♦ కూల లేదు;
గ్రహకోటి సంచార ♦ గతులు మాఱఁగ లేదు;
గగనంబు బ్రద్దలై ♦ పగుల లేదు;
భూదేవి పాతాళ ♦ మునకుఁ గ్రుంగను లే;
దేదు సముద్రంబు ♦ లింక లేదు;
పవమాన శక్తి స్తం ♦ భన మొందఁగా లేదు;
వహ్ని తేజము చల్లఁ ♦ బడఁగ లేదు;

గీ॥ విరిసి బ్రహ్మాండ భాండంబు ♦ ప్రేల లేదు;
భువన మేకార్ణవం బయి ♦ మునుఁగ లేదు!
ధైర్య హేమాద్రి రాణాప్ర ♦ తాప దేవుఁ
డాఱు మాసముల్ విశ్రాంతి ♦ గోర నేల! 339

గీ॥ నీ యశోగానమునఁ జొక్కి ♦ నిఖిల జగము
చొక్కె; నానంద మందిరి ♦ సురలు గూడ;

సత్ప్రయత్నంబు! క్షణము వి ♦ శ్రాంతి వలదు!
తండ్రి! మ్రోయింపు విడక స్వా ♦ తంత్ర్య భేరి! 340

గీ॥ ఉదయ గిరిపైన రవి కూరు ♦ చుండు నట్టు
లల్ల హారావళీ పర్వ ♦ తాగ్ర సీమఁ
గొలువు దీఱెదు నీమూర్తిఁ ♦ గొలుచు జగము;
నీకు స్వాతంత్ర్య రాజ్యాభి ♦ షేక మగుత. 341

గీ॥ సంగర తరంగ సంక్షుభి ♦ తాంగ మగుచు
నలము కొనియున్న బహువిప ♦ దబ్ధి యందుఁ
జెక్కు చెదరక చిక్కక ♦ సేన మునను
నడచెదును గాక యుష్మ దా ♦ నంద నౌక, 342

సీ॥ నీకటాక్ష విలాస ♦ నియతి యీ క్షితికిఁ గ
ల్యాణ తోరణ రాజి ♦ యగును గాక!
ముందు రాఁగల కాల ♦ మందు "స్వాతంత్ర్య దై
వత" మంచు నీ పేరు ♦ వఱలు గాక!
మూఁడు వేళల జగం ♦ బున వీరులందు నీ
కగ్ర పూజాస్థాన ♦ మలరుఁ గాక!
భారతీయులు హృద ♦ బ్జములందు నీమూర్తిఁ
జేర్చి యెల్లపుడు పూ ♦ జింత్రు గాక!

గీ॥ మాత పాటేశ్వరి చిరసు ♦ మంగళి యయి
యచల రాజాత్మజ విధాన ♦ నలరు గాక!
యతులి తారోగ్య భోగ భా ♦ గ్యముల తోడ
నర్కకుల దీప! నీకు బ్ర ♦ హ్మాయు వగుత! 343

గీ॥ భవ దుదాత్త వృత్తము త్యాగ ♦ వైభవంబు
మామదిని గొల్పు భక్తి, యీ ♦ మాడ్కి యవన
నృపు ఋణముఁ గూడ మఱపించి ♦ నిన్నుఁ గొలువఁ
బురికొలిపె; సాహస మని త ♦ ప్పగయ కయ్య! 344

ఆ॥ నీపదాబ్జ యుగము ♦ నిరతంబుఁ గొలుచును
భక్తి గల విధేయ ♦ వర్గనమున

నలరు వార; మిట్లు ♦ 'లబ్బూరు రహిమాను
పృథ్వీరాజు' లనఁ జ ♦ రింతు మెపుడు." 345

క॥ అని చదివి సలుంబ్రాపతి
మనమునఁ నుదయించు భక్తి ♦ మాహాత్మ్యమునన్,
గనుఁదోయి నొత్తుకొని లే
ఖను విభు పాదములు సోఁకఁ ♦ గా నిడి మ్రొక్కెన్. 346

క॥ అచ్చటి యందఱు మనములు
విచ్చి ముఖాబ్జముల నిండ ♦ వింతగు మోదం
బచ్చుపడి హర్ష బాష్పము
లెచ్చంగఁ బ్రతాపదేవుఁ ♦ డెల్లరఁ గనుచున్. 347

మ॥ "నెల దాటఁగను జొచ్చె నక్బరునకున్ ♦ నే లేఖ నంపించి; యీ
నెలగా నక్కట! సూర్యవంశము దెసన్ ♦ నేరంబుఁ గావించి నిం
దలపాలైతి నటంచుఁ బల్మఱును జిం ♦ తన్ గుందితిన్; గాని యీ
కలఁతల్ సర్వము దీర్చి హర్షభరమున్ ♦ గల్గించె నీ లేఖయున్. 348

గీ॥ శత్రు పురమున యావనా ♦ స్థాన సీమ
నింత నిష్పాక్షిక మనస్కు ♦ లింత సుగుణ
భరితు లుండుట యిప్పుడే ♦ యెఱిఁగి, యింత
వఱకెఱుఁగనైతి నే! యంచు ♦ వగచుచుంటి. 349

మ॥ తన సత్కీర్తికి భంగమౌ గతిని స్వా ♦ తంత్ర్యంబుఁ బోనాడి బ్రాం
తినిఁ గాంక్షించెఁ బ్రతాపుఁడంచు వగ సం ♦ ధిల్లంగ నా పృథ్వీరా
జును నబ్బూరహిమానుఁ డియ్యరువు రి ♦ చ్చో జ్ఞానదీపంబు పెం
పునఁ నజ్ఞానతమంబుఁ బాపుచు యశం ♦ బున్ బెంచి రెంతేనియున్ 350

మ॥ 'స్మరణీయంబగు వారి సాయము; కృత ♦ జ్ఞత్వంబుఁ బాటించి త
చ్చరితంబుల్ స్మరియింపకున్న ఋణ మీ ♦ జన్మంబునన్ దీఱు; దా
హారభట్టారకు పేరు వెక్కఁ గడు పు ♦ ణ్యాత్ముండతో వీరి యి
ద్దర నామంబులె యుత్తమోత్తమ పదం ♦ బున్ బొందె వాసిన్ గనున్

క॥ మఱవఁ దగదు; వీరు చిర
స్మరణీయు'' లటంచుఁ బలుక ♦ సంతోషము పొం

పిరివోవ సలుంబ్రా ధీ
శ్వరుఁడును మది భక్తి భావ ♦ వైభవ మలరన్, 352

—। సలుంబ్రా కృష్ణసింహుఁడు ఢిల్లీ లేఖను గొని చూచుట. ।—

క॥ పరు నుద్యోగులు, మనకో
దుర మొనరింపంగ వలయు ♦ ద్రోగ లయ్యును, న
శ్వరు వీడి మిమ్ముఁ గొలిచిరి!
గురుతుల్యు లటంచు నెంచు ♦ కొంచనము మాకున్. 353

క॥ ద్యుతిమంతమును జగద్వం
దితమయి యీదివ్యలేఖ ♦ దేవార్హ్య హా
చితమగు కర్పూరపు హా
రతివోలెఁ బవిత్రమై వి ♦ రాజిలు చుండెన్. 354

క॥ హృద్యములై, యనుభవ సం
పాద్యములై, సరళ నరస ♦ పాక కళా సం
వేద్యములై, లేఖను గల
పద్యములు పదార్థ గౌర ♦ వంబునఁ దనరున్. 355

క॥ మావంటి సేవకులు సం
భావించి పఠించి దినము ♦ పారాయణమున్
గావింపఁ దగినవై కడుఁ
బావనమై వెలుఁగు నిచటి ♦ పద్య చయంబుల్. 356

చ॥ పదిలముగాఁగ నీదు పద ♦ పంకజ భక్తి మనంబు లోపలన్
మెదలెడి వారిలోన నను ♦ మించిన భక్తుఁడు లేఁడటంచు నా
మొదలిటి నుండియున్ గరువ ♦ ముల్ మది నుండెను; నిప్పు "డొంగనో
గదరె మహానుభావు' లను ♦ కైవడి నా కెఱుఁగంగ నయ్యెడిన్. 357

క॥ విజ్ఞాపన మిద్దానిని
నాజ్ఞా పత్రముగ నన్ను ♦ దాదులు గొని మా
యజ్ఞాన ముడిపెదము ప్ర
హ్లాజమణీ! దీని నొసఁగి ♦ మమ్మేలఁ గదే!" 358

క॥ అనుచుండ భిల్లపతి యా
తనిఁ గాంచుచు "భక్తియోగ ♦ ధర్మ రహస్యం
బును మిమ్ముఁ బోలె నెఱిఁగిన
మనుజుఁడు లేఁ"డనుచు రాజ ♦ మణిఁ గన్గొనుచున్, 359

సీ॥ బాధ్యత గల గొప్ప ♦ పదవి తౌరుష్క సా
మ్రాజ్య లక్షిత మహా ♦ మాత్య ముద్ర!
యది యొకఁడే గాక ♦ యక్బరీశ్వరుతోడి
వియ్యంబు నెయ్యంబుఁ ♦ బేర్మి పెంపుఁ
దృణముగాఁ జూచుచు ♦ గుణము కోరుచు నిన్నుఁ
దనతేని గర్భ శా ♦ త్రవుని గొలిచి
యే విపత్తులనైనఁ ♦ నెదిరింప సమకట్టె
నబ్దారు రహిమానుఁ ♦ డనఘ గుణుఁడు!

గీ॥ కమ్మఁ జదువఁగాఁ జదువఁగాఁ ♦ గడ కతండు
పరమభక్తి ని న్నేకల ♦ వ్య ప్రకార
శిష్యుఁడై కొల్చి మమ్ము గె ♦ ల్చెనని తోఁచెఁ"
ననిన నందఱు దెసఁ గల ♦ యంగఁ జూచి, 360

ఉ॥ "కమ్మ నదెట్లొ వ్రాసితిని; ♦ గమ్మను బంపిన దాదిగా నన
గ్రమ్మగు శాంతి యేల వల ♦ దం చనిపించి తపించుచుంటి; నీ
కమ్మయు నాకుఁ దోడుపడెఁ! ♦ గష్టమొ సౌఖ్యమొ నెత్తిఁ బడ్డ భా
రమ్ముఁ దొలంగఁ ద్రోయఁగను ♦ రాదు; రణంబె శరణ్య మెప్పుడున్" 361

గీ॥ కమ్మ వినినంత మద్భుజా ♦ స్కంధ మందుఁ
దోఁచెఁ బదివేల వీరుల ♦ దోర్బలమ్ము;
రణ మొనర్పంగఁ గోర్కు లు ♦ గ్రముగ రేఁగె!
వీర విహరణ మొనరింప ♦ వెడల వలయు, 362

సీ॥ లోకముల్ తలక్రిందు ♦ లుగఁ జేసి భారత
స్వాతంత్ర్యమును నిల్పఁ ♦ జాలుదు రని
యందఱు కొండంత ♦ యాసతో మన వైపు
చూపులు వఱపిన ♦ చొప్పు దోఁచె!

నే హేతువున నైన ♦ నిపుడు స్వధర్మ ని
ర్వహణంబు నందు దు ♦ ర్బలుల మైన
మేవాడ కేగాక ♦ యీ విశ్వమందలి
ప్రజకెల్లఁ దప్పిన ♦ వార మగుదు!
గీ॥ మస్థిరపు జీవితముల పై ♦ నాస మాని
భారతత్రాణ దీక్షా ని ♦ బద్ధుల మయి
దేవ దానవ కోటి నె ♦ దిర్చి యైనఁ
గార్య సాఫల్య మొందఁగాఁ ♦ గడఁగ వలయు. 363

చ॥ పొడమి యధర్మముల్ పొదలి ♦ పొంగుచు దాస్యము వీరధర్మముల్
ముడివడె! మాతృదేశము వి ♦ ముక్తికి నాదు శరీరమందునన్
గడపటి రక్తబిందువును ♦ గాని మిగుల్చు కొనంగఁబోన నే
దడిపెద నేని యీధరణి ♦ ధన్యుఁడ నయ్యెద నీభవంబునన్. 364

మ॥ దినమాత్రమైనను రేయియైనఁ ద్రుటి శ్రాం ♦ తిన్ బొందఁ గాంక్షింప; నా
హవ రంగంబె నివాసమందిరము చే ♦ యన్ బోయెదన్; ప్రాణవా
యువు లీదేహమునందు నుండు వఱ కే ♦ ట్లో పూని స్వాతంత్ర్య లే
శ వికాసంబును బోవ నీనని ప్రతి ♦ జ్ఞన్ జేతు మీముందరన్" 365

గీ॥ అని విభుండనె! భిల్లేశుఁ ♦ "డట్లె యగుత!
మీవు చెప్పినంత యొనర్చు ♦ టే నిజంబు!
పిలిచి పిలిచి యైన రణంబు ♦ సలుప వలయు!
వలచి వలచి యాపదల నో ♦ ర్వంగ వలయు! 366

గీ॥ అఖిల భిల్లరాజ్యము మంత్రి ♦ కప్పగించి
పులులఁబోలె వేనవేలు లెం ♦ కలను గొనుచు
నినుని మేషంబు వచ్చి ♦ నీయండ నుందు;
నామహాభుజ మున్న ♦ నీకేమి కొఱఁత! 367

క॥ గళమునఁ బ్రాణము లుండఁగఁ
దలపూ వాడంగనీక ♦ త్వత్పాదాబ్జం
బులుఁ దల నిడి ముల్లోకం
బులు దాఁకిన సుంత ముల్లు ♦ మోవఁగ నీయన్" 368

క॥ అని యెల్గెత్తి వచించెను!
విని యందఱు హర్ష మనుభ ♦ వింప, సలుంబ్రా
వనిపతి "దేవా! విక్రము
♦ మన నీసొమ్మనుచు జగము ♦ లభినందించెన్. 369

క॥ నీవెంట మాతృదేశము
సేవించి విపక్షకోటిఁ ♦ జెండాడఁగ మా
జీవితము లుపకరించిన
నీ విశ్వమునందుఁ గొదవ ♦ యేదీ మాకున్! 370

క॥ తారాగృహా మాది, సలుం
బ్రా రాజ్యాంతంబు దాఁకఁ ♦ బ్రజలును శ్రీమ
న్నారాయణమూర్తివిగాఁ
జేరి భజించెదరు నీదు ♦ శ్రీపాదములన్! 371

గీ॥ ఆగ్రహానల దీప్త ము ♦ ఖోగ్రమైన
రణ మహాదుర్గ నట్టిక ♦ ర్ణ ద్వయంబుఁ
బట్టి యాడింపఁ గలరు నీ ♦ పాద భక్తు"
లనఁ బ్రతాప ప్రభూత్తంసుఁ ♦ డాస్య మెత్తి, 372

మ॥ "అమితోగ్రంబుగ యుద్ధముల్ జరుగు; నా ♦ వంతైన విశ్రాంతి నొం
దము: మీకున్న యమూల్య వస్తువుల వెం ♦ టన్ గొంచు నీనాఁడె సూ
ర్యమహాల్ దుర్గముఁ జేరఁబోవలె" నటం ♦ చాజ్ఞప్తిఁ బాలించె; శీ
ఘ్రమె సేనాపతు లెల్లఁ జేరి దరియాం ♦ గా నేఁగి రాదుర్గమున్. 373

ఉ॥ "మీరలు నాకు వంద్యులరు; ♦ మీకృతమున్ మఱవన్; రణంబె నేఁ
గోరుదు! శాంతి నించుకయుఁ ♦ గోర" నటంచని పృథ్వీరాజు న
బ్దారహిమానుఁ గూర్చి తలఁ ♦ పున్ బ్రకటించెఁ బ్రతాపసింహుఁ; డ
వ్వారను నక్బరీశునకు ♦ వార్తలు దెల్పిరి సత్య మేర్పడన్. 374

గద్య:— ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణాకటాక్ష వీక్షా సమాసాదిత నవ నవత్కావ్య నిర్మాణ చాతురీ ధురీణ, సుగుణగణ పారీణ, "దుర్భాక" వంశ దుగ్ధాంభోరాశి రాకా కైరవమిత్ర, శాలంకాయన గోత్ర పవిత్ర, సుజనానుగ్రహ పాత్ర, వెంకటరామార్యపుత్ర కవిసార్వభౌమ - సాహిత్యాద్వైత ప్రతాపాది వింశత్యధిక బిరుద విఖ్యాత సుకవి రాజశేఖర "రాజశేఖరకవి" ప్రణీతంబయిన "రాణా ప్రతాపసింహ చరిత్రం"బను పద్యకావ్యమునందుఁ జతుర్థాశ్వాసము



శ్రీ

రామేశ్వరాయ నమః

# రాణాప్రతాపసింహచరిత్ర

## పంచమాశ్వాసము.



### — ॥ వసంతము. ॥ —

సీ॥ నునుపారి మెఱుఁగు దీ ♦ గిన గుజ్జుతే మావి
చిగురాకు బాకులు ♦ చిటిలి చేసి,
నన లాసి వగరు కె ♦ ల్లునఁ గికారించు కో
యిల హాలహాయిల నా ♦ యితము చేసి,
నిలువెల్ల విచ్చి తా ♦ వులు చిమ్ము దాసాని
పూలతో నెత్తు జెం ♦ డాల నెత్తి,
యురవిచ్చు కేతుఁదా ♦ మర తుపాకులఁ దేటి
గమి యుక్కుగుండ్ల న ♦ గాదు చేసి,
గీ॥ పరువపు వసంతుఁడను దొడ్డ ♦ తురకతేఁడు
కలయువనపాళి పసదన ♦ మ్ములఁ గఱంచి,
లలిత రాజాతపత్రము ♦ డలము బెరయ
దళముకొని చిల్కసింహముతో ♦ దాడు వెడలె.

### — యవనులు రాజపుత్రుల దుర్గములను గొనుట. —

క॥ ఈమాఱు ప్రతాపుఁడు తన
దా మానము నిలుపుకొనుట ♦ యరుదని యక్బర్
భూమీశు సైన్యపతు ల
చ్చో మూఁగిరి బలముతెల్లఁ ♦ జుట్టును గొలువన్.

—( "సూర్యమహాల్" దుర్గ యుద్ధము. )—

మ॥ సమదేభేంద్ర సమాన వీరభటు లు ♦ త్సాహంబుతోఁ గొల్వ, ద
ర్పము శోభిల్ల మహమ్మదీయభటులం ♦ బిన్ నుండి మర్వాడు దే
శమునందుండియు వచ్చి యెల్ల దిశలన్ ♦ శైలంబు లంటెక్కి సూ
ర్యమహాల్ దుర్గము చుట్టు మూఁగిరి సమ ♦ గ్రాటోప మేపారఁగన్. 11

మ॥ వితత కరాళ మృత్యుసమ ♦ భీకర విక్రము లైన యూత్మ యో
ధతతులనెల్లఁ బూన్చుచుఁ బ్ర ♦ తాపుఁ డరాతులఁ దాఁకి సంగర
క్షితిని దదీయ శీర్షములఁ ♦ జిందర వందర చేయుచుండె; నీ
గతి నొకమాసముల్ గడువఁ ♦ గా యవనుల్ కనఁ జింత మున్గుచున్,

సీ॥ కోటిలో నొక్క ని ♦ గూఢమార్గ మెఱింగి
గుమిగూడి పోయి ద్వా ♦ రమును దెఱచి
యర్ధరాత్రము లోని ♦ కరుగంగఁ బూని; రా
సడి మెట్లొ యెఱిఁగి దు ♦ ర్జయుఁడు వచ్చి
యడ్డగించెను; యుద్ధ ♦ మతి భయంకరముగాఁ
జెలఁగె; మొఁగలులు ద్రో ♦ సికొని లోనఁ
జొరఁ బూనిరి! రది చూచి ♦ చోండావతుల్ దవా
గ్నిజ్వాల లటులు క్రి ♦ క్కిరిసి తాఁకి;
గీ॥ రర్కుఁ డుదయించు సరికిఁ బో ♦ రగ్గమయ్యె;
నంత భిల్సురాపురి నుండి ♦ యరుగుదెంచి
సూక్తసింహుండు తురకల ♦ నుక్కఁ జేసి
సరభసముగ దుర్గ ప్రవే ♦ శం బానర్చె! 13

ఉ॥ ఘోరముగా రణం బెదిగెఁ; ♦ గొన్ని దినంబులు దాఁటెనంత, నా
హారపదార్థముల్ దఱిగె; ♦ నంతట నొక్కయెడన్ బ్రతాప ధా
త్రీరమణేంద్రుఁ జేరఁజని ♦ "దేవ! నిగూఢ కవాటమునన్
దూఱుచుఁబోయి 'భీమగడ' ♦ దుర్గముఁ జేరఁగ యోగ్య మయ్యెడన్.

క॥ చాలన్ గాలము నిలువఁగఁ
జాలదు దుర్గంబు; తిండి ♦ సంబారములున్

జాలవు; నీరిపు డరుగుట
యే లగ్గగు నాకుఁజూడ ♦ నిందుండి వడిన్" 15

మ॥ అని పాదంబుల చెంత వ్రాలుచు సలుం ♦ బ్రాధీశుఁ డర్థింప, న
జననాథాగ్రణి భీమదుర్గమునకున్ ♦ సైన్యంబులన్ గూడి పో
యెను; శేషించిన సైన్యముల్ భుజబలం ♦ బేపారగాఁ బోరె; సై
న నెలన్ దాఁటకమున్న దుర్గమును జెం ♦ దన్ గల్గి రామోగలుల్. 16

మ॥ బలమెల్లన్ గృశియింపఁ జొచ్చినఁ బ్రతా ♦ పస్వామి జాంబూనదా
చలమున్ బోలి పరాక్రమక్రమత స్వ ♦ చ్ఛందముగా నిల్చె; బి
డ్డల భార్యన్ జెఱఁబట్ట నాతఁ డగచా ♦ ట్లన్ మున్గనం చెంచి సే
నలతో ముట్టిరి భీమదురము నసుం ♦ దస్థైర్యులై శాత్రవుల్. 17

—( యవనులు భీమదుర్గమును ముట్టడించుట )—

సీ॥ యవనులదెస ముఖ్య ♦ మై ప్రకాశించె న
త్యాలఘు బృహన్నాళి ♦ కాస్త్ర వహ్ని;
రాజపుత్రుల దెస ♦ రాజిల్లఁ దొడఁగె బ్ర
భూనమై బాహాస్త్ర ♦ తాప వహ్ని;
యగ్నిచూర్ణము ధాటి ♦ కాకోట నట నట
గండశిలలు కొన్ని ♦ పిండి యయ్యె;
క్షణమునకు క్షణంబు ♦ గడియకు గడియ యూ
వన చమూ ప్రపతతిని ♦ బలము తఱిగె;
గీ॥ నిప్పు లుమిసెడు నారక్త ♦ నేత్రములును
మండుచుండెడు భయదాస్య ♦ మండలములు
రక్తసిక్తపరిచ్ఛద ♦ రాజి వెలయ
రాజపుత్రుల పోరు దు ♦ ర్వార మయ్యె. 18

క॥ నెల దాఁటుఁదాక యవనులఁ
గలనఁ గలఁచి నృపగురుండు ♦ కాపురముఁ దగన్
దలఁగించి బోయపల్లియ
నిలిపి వదిలి పఱచి మఱల ♦ నెక్కొనె ననికిన్. 19

మ॥ పరమప్రీతిని భిల్లలోకపతి యా ♦ పాటేశ్వరీ పాదపం
కరుహద్వంద్వముఁ గొల్చి తోడుకొని యా ♦ 'కావా'ఖనిన్ జేర్చె; నా
కరుణాసాంద్ర మనస్కు యత్తఱిని భూ ♦ గర్భమునన్ జేరు నా
ధరణీనందన మాడ్కిఁ బెంపెసఁగె నా ♦ దార్ఢ్యంబు దీపింపఁగన్. 20

గీ॥ గాఢవాసంబు భిల్ల రా ♦ ష్ట్రింబుఁ జేరు
టెఱిఁగి మహాబతుఖాన్ సేన ♦ నురవడి మొగి
దఱిమె; దుర్గమ వనముల ♦ నరుగలేక
గరళమున్ దిన్న వేఁదుఱు ♦ గతిఁ గలంగె. 21

గీ॥ విచ్చె మొగులులు; గగనంబు ♦ విమల మయ్యెఁ;
గాపురముతోడ ననుచర ♦ గణముతోడఁ
గదలి బోయగూడెము వీడి ♦ శైలవార
సీమలకుఁ జేరె వీరల ♦ క్ష్మాప్రభుండు. 22

గీ॥ విడిదిమార్పులు పగర రా ♦ యిడుల కూర్పు
లాత్మబలము తగ్గెడునూర్పు, ♦ లలజడిఁ గొనఁ
దొడరి, తలఁకును మగటిమి ♦ త్రోపులాడ
వెనుక చూడక నృపుఁడు ము ♦ న్కొని పెసంగె. 23

గీ॥ ఒక్కమాయి రేయుఁబవలును ♦ గ్రుక్కగొనక
జయము దవ్వైనకొలఁది ను ♦ త్సాహశక్తి
రవులుకొల్పుచు నడిపె సం ♦ గ్రామదీక్ష;
విమతులకుఁ జిక్కఁ గడమ దు ♦ ర్గములు గూడ. 24

సీ॥ మిట్ట మధ్యాహ్నంబు! ♦ మిహిరుఁ డుగ్రుండయి
చెలరేఁగె; నొకచోటఁ ♦ జెట్టు నీడ
బోయ గడ్డిని దెచ్చి ♦ యీయఁ బాటేశ్వరి
రుబ్బ కాల్చుచు నుండె ♦ రొట్టె యలను;
బిడుగు పాటున వచ్చి ♦ పడియె నంబరు దిక్కు
నుండి పరీక్షాను ♦ దండుఁ గొనుచు;
మనుజేశ్వరుండు కొ ♦ మ్మలు వంచి బుట్టల,
బిడ్డల భార్యను ♦ బెట్టి విడిచెఁ;

గీ॥ ననుచరులఁ గూడి యవన సైన్యంబుఁ దాఁకి
పదులు నూఱులుగాఁ దలల్ చిదిమి వైచె;
నంత భిల్లులు వనసీమ నాక్రమించి
పిల్లలను రాణిఁ జేర్చిరి భిల్లవాటి. 25

సీ॥ షాబాజుఖాన్ గొప్ప సైన్యంబు తనవెంటఁ
గొలువంగ లోయ లోపలికిఁ జొచ్చె;
శైలసాంకేతిక సాహాయ్య మూఁది ప్ర
తాపుఁడు భటులఁ గొందఱను గూర్చి
యాకస్మికమ్ముగా నరిసేనపై మారి
మసఁగిన గతిఁ గ్రమ్మి మట్ట సాఁగె;
నీయవస్థను ఖానుఁ డెఱిఁగి సైన్యము వెన్క-
మొగముయై పరవఁగా మొదల వెట్టెఁ;

గీ॥ దురకభటు లల్ల నల్లన మరలి చూచి
రాజమణిఁ గానమికి నబ్బురమ్ము పడిరి!
యాతఁ డవ్వలిదెస లోయ నరి బలమ్ము
బిట్టు దట్టించెఁ గ్రిక్కిఱిఁ ది ప్పికొన నీక. 26

మ॥ మఱలన్ వైరులు వెన్కకున్ దిరిగి; రీ మార్గున్ బ్రతాపావనీ
శ్వరుఁ డవ్వారికిఁ గానరాక యెటనో శైలంబు లందుండి ముం
దఱఁ బోటొడ్డిన శత్రుసేనలఁ బ్రచం డస్ఫూర్తి వైఁ దాఁకి కొం
దఱ నాత్మీయ కృపాణ ధారలను మ్రిం దన్ జేసె నత్యుగ్రుఁడై. 27

క॥ "కనఁబడఁ డెట్టులు వెదకినఁ;
గనఁబడినను బట్టు వడఁడు; కట్టా! యిఁక నే
మొనరింతు" ననుచు ఖానుఁడు
తనసేనను గొనుచు గిరులు దాటుకొని చనెన్. 28

క॥ ఖాసింఖాను మహాసే
నా సంవృతుఁడగుచు నవలి నాఁ డరుదేరం
గా, నడి గని యాతని ని
ట్లె సిలుగులఁ బెట్టి యినకులేంద్రుఁడు కలఁచెన్. 29

క॥ అటవీ మృగములవలెఁ బో
చుటయును బైఁబడుట చీలు ♦ చుట కఱచుటయున్,
విటతాటనమ్ము చేయుట
తుత్రిటిలోఁ జాటగుట నృపతి ♦ స్వాభ్జటి నేర్చెన్. 30

క॥ పులి నివసించెడు గుహలో
పలి కరిగెడు హరిణవితతి ♦ వలె, యూవన వీ
రులు రాఁగ దినదినము వం
దలుగఁ బ్రతాపుఁడు కలంచి ♦ తనువ్రులు సించెన్. 31

గీ॥ అవిరళాజ్యాహుతుల రేఁగు ♦ నగ్నిహోత్రి
మన, సలుంబ్రాధిపతి శాత్రి ♦ వాటవి నటు
భస్మమొనరింప, నటు ప్రతా ♦ ప ప్రభుండు
దనరె సమరాభ్రసీమ మా ♦ ర్తాండు వగిది. 32

క॥ ఒకపాలు సైన్యములు కొం
డ కనుమను బ్రతాపుఁ డాఁకి ♦ నలిసేయుచు వే
ఱొకపాలు భిల్లదేశము
నికటమునఁ జరించె రాణి ♦ సిన్ జెనఁబట్టెన్. 33

క॥ "ముల్లోకము లెదరించిన
ముల్లెనను మోవసీక ♦ ఘ్రాసిక ముఖు వా
భిల్లులఁ గలచెద" నని యా
బ్దుల్లాఖానెగ సైన్య ♦ ములఁ దోడ్కొనుచున్. 34

ఆ॥ శైల పంక్తినడుమ ♦ జాన్పురా తగరపు
గనులలోన రాణి ♦ గారి నుంచి
వేయుఁగనులతోడ ♦ వేయుఁ జేతులతోడఁ
బ్రీతిఁ గాచుచుండె ♦ భీమ చాందు. 35

క॥ అనుచరుఁ డొకడిన ముదయం
బునఁ దగరపుగనులు చేరఁ ♦ బోయి మహారా
జ్ఞిని గాంచి భక్తిఁ దత్పద
వనజములకు మ్రొక్కి నిలువఁ ♦ బాటుశ్వరియున్. 36

—♦ పాలేశ్వరీదేవి భిల్లునితోఁ దన భర్తనుగూర్చి యడుగుట ♦—

మ॥ "దరహాసోజ్జ్వల కాంతి కాంతముఖు, యు ♦ ద్యత్పద్మపత్రాభ సుం
దర నేత్రద్వయమై, పరాక్రమ కళా ♦ ధారేయుఁడై, సత్కృపా
భరితంబై, రమణీయమై, భువన సే ♦ వ్యం బైన, నా జీవితే
శ్వరు నెమ్మోమును గాంచి నేఁటి కొకమా ♦ సం బయ్యె భిల్లాగ్రణీ 37

క॥ వైరులసైన్యము లెంత య
పారముగాఁ జుట్టుకొనెనో! ♦ నా రేయెడ ను
న్నారో! సమయమునకు నా
హారము దొరికెడునో! మాకు ♦ నై వగతునో! 38

మ॥ అకటా! వైరులబాడి తగ్గదని వా ♦ రాయాసమున్ జెందఁబో
రు కదా! యెప్పటి యట్లు నవ్వుచు నె పో ♦ రున్ దీర్తురా! రాజపు
త్రకు లుత్సాహము వీడరే కద! పలుం ♦ బ్రా భర్త సహాంగ ర
క్షకుఁడై భక్తి నెలర్పఁ బ్రాణవిభు ప ♦ జ్జన్ గొల్చి యుండున్ గదా! 39

సీ॥ శ్యామసింహుండు సా ♦ గ్యమున వర్తించునే!
సామంతు లందఱు ♦ సరస నుండ్రె!
స్వాతంత్ర్య సమర దీ ♦ క్షా మహోపన్యాస
ములు తొంటిచందాన ♦ నొలుకు చున్నె!
వ్యాకోచ పుష్పంబు ♦ వలె నాథు మోమున
నానంద దరహాస ♦ మలరు చున్నె!
నాయాస మెప్పుడే ♦ నంది కుందఁడుగదా!
యారోగ్య సౌభాగ్య ♦ మనువగుఁ గద!
గీ॥ యూర్జితోత్సాహ కళలతో ♦ నొప్పెడుఁగద!
తెలిమి బిక్కల దెస మది ♦ మఱలదు గద!
విమతులకు నెల్ల గర్భని ♦ ర్భేదకముగఁ
దీవ్ర కరవాల ధార స ♦ ర్తించెడుఁ గద! 40

మ॥ "ప్రమదం బొప్ప రణాంగణంబులఁ బ్రతా ♦ పస్వామి స్వాతంత్ర్య యో
గము సాగింపఁ దదాత్మజాతుఁడు భుజా ♦ గర్వంబుఁ బోనాడి యో

రమునన్ డాఁగెదు నెట్లు! వైరుల తలల్ ♦ రాల్పంగ నన్నాజ్ఞ సే
యు" మటంచుఁ జెప్పఁడు పోరు నియ్యనురసిం ♦ హుల్ బట్టనేరన్ గదా! 41

మ॥ చులుకత్తుల్ గొని చెట్లపై నురికి "క్రము ♦ చ్చన్ వోలె మా మాతృదే
శ రమున్ గొల్లలుగొట్టు నీయవనులన్ ♦ శాసింతు మిల్లంచుఁ జిం
దరగాఁ జీల్చెద రీ యనుంగు నిసువుల్ ♦ నా కన్న సంతానము; సే
కరణిన్ దంష్ట్రికి దవ్వుగా నిలుప శ ♦ క్యంబౌను నాకెట్టిదిన్! 42

ఆ॥ విశ్వ మెల్లఁ బొగడ ♦ భిల్ల రాజ్యం బేలు
సత్ప్రభుండు భీము ♦ చాందు వోదయుఁ
దాద్రివోలెఁ గాచుఁ; ♦ దత్కృప నునుఁ జేను
పోక; దెట్టి కొఱఁత ♦ మాకు లేదు. 43

క॥ కాని ప్రతాప ధరిత్రీ
జాని పదాబ్జాత దివ్య ♦ సందర్శన సే
వానంద మందఁగోరుచు
మానస మొక్కింత వంత ♦ మునఁగి కరఁగెడిన్ 44

క॥ ఒకమాఱు దర్శనము సే
సికొనన్ వలె నంటి నని వ ♦ చింపు" మనఁగఁ గం
చుకి పాటీశ్వరి పాదము
లకు మ్రొక్కుచు వెడలె వనము ♦ లన్ బడి పోవన్, 45

గీ॥ అవల నొక్కనాఁడు ప్రతాపుఁ ♦ డరుగు దెంచె;
బోయదొర స్వాగతం బిచ్చి ♦ పూజ చేసెఁ;
బిల్లలను భార్యఁ జూచి పృ ♦ థ్వీ విభుండు
కతిపయ దినంబు లచ్చోటఁ ♦ గడపి వేడ్క 46

ఉ॥ అంతట నొక్కనాఁడు శబ ♦ రాలయమున్ విడి యాప్రతాప భూ
కాంతుఁడు వీరయోధులును ♦ గాంతయు బిడ్డలు వెంటరా, సహా
ర్యాంతర సీమలం దరిగి ♦ యచ్చట మొగలుసేనఁ జూచి క
ల్పాంతకుఁ డట్లు దాఁకి సమ ♦ రావనిఁ బెక్కురఁద్రుంచె నుగ్రుఁడై 47

క॥ సమరము ముగిసిన సాయం
సమయమునకు శైలసీమఁ ♦ జల్లని పటవృ

తమము క్రింద వసించెఁ బ్రతా
ప మహీంద్రుం డచట నా వి ♦ భావరిఁ గడపన్. 48

క॥ ఆరాత్రి కొంత కడచనఁ
ధారా పథమందు నిబిడ ♦ ధారాధరముల్
ధారాపాతోల్కరణి న
పారమ్ముగ రేఁగి ఘోర ♦ వర్షము గురిసెన్. 49

గీ॥ మాటి మాటికి హెచ్చె ♦ జ్వాటు వాన;
వర్షమున కన్న రేఁగె బ్రభంజనంబు;
నిలువ నెలవైన తరువ్రాతి ♦ కలయ నూఁగి
తల నొఱగునో యనెడి శంక ♦ దవ్వులఁ జేసె. 50

గీ॥ చలికి గాలి కాఁకలికి వ ♦ ర్షమున కడలి
బిడ్డ లేడ్వ సాఁగిరి; కట్టు ♦ గుడ్డ లెల్లఁ
దడిసె; నిసుఁగులు తనచుట్టు ♦ వడఁకు చుండ
తెప్ప వాల్పక రాణి యా ♦ రేయి గడపె. 51

సీ॥ ఉదయంబె గిరినుండి ♦ కదలిరి! మబ్బుతె
రల్ వాసి నభము ని ♦ ర్మలతఁ దాల్చె!
నట వలీఖాను సై ♦ న్యముతోడ డాసెఁ! బ్రి
తాపుఁడు జృంభించి ♦ తాఁకె నతనిఁ!
బూర్వాహ్ణమున నని ♦ ముగిసె! వెన్కకు వచ్చు
తెజీని మధ్యాహ్నర్కు ♦ కిరణ దీప్తిఁ
జిన్నవాఁడొకఁడు శో ♦ షిలె! వానిఁ దేర్ప నొం
డొకఁడు మూర్ఛిలె! వాని ♦ నుపచరించి,

గీ॥ రవి కెరగి, "రిపుల్ నేఁడిఁక ♦ గవిసి రేనిఁ
దొలఁగి పోద! నెండకు పిసుం ♦ గులు బడలిరి!
కొంతవడి శీతలచ్ఛాయ ♦ శ్రాంతి నొంద
వలయు"నని రాజ్ఞి యర్థించెఁ ♦ బ్రాణవిభుని. 52

సీ॥ చేరువఁగల జమ్మి ♦ చెట్టు నీడలను బి
ల్లలతోడ వెల్లి ని ♦ ల్వకయ మున్నె

క॥ పున్నమ సన్నని వెన్నెల
మున్నీటను దేలు దొడ్డ ♦ పూమొగ్గలు ల
త్యున్నత సిత గోపుర సం
పన్నంబగు నేకలింగ ♦ పతి కోవెలయున్. 61

గీ॥ తళుకుఁ బటికంపు శిలలు గో ♦ డలును గోపు
రములు ప్రాకారములు నాల ♦ యములు గల్గి
దేవళంబెల్ల ధవళ కాం ♦ తి ప్రశస్తిఁ
బాలసంద్రంబు చందానఁ ♦ బరఁగవిల్లు 62

క॥ మురువగు చెవులును, మెఱసెడి
గోరిజలు బెడఁగారు కనులు ♦ కొమ్ములు, ననుసో
శిరమున నిక్కంపు వృషభము
పరిమాణంబంది నంది ♦ వఱలును నుగ్రస్థున్. 63

గీ॥ నందికేశ్వరు దరిఁజేరి ♦ వందనములు
చేసి గర్భాలయముఁ బ్రవే ♦ శించి పన్న
గేంద్ర పరివేష్టి తైకలిం ♦ గేశ్వరునకు
బూర్ణభక్తిఁ బ్రతాపుఁడు ♦ పూజ సేసె. 64

సీ॥ అందఱును గూడివచ్చి గ ♦ ర్భాలయంబు
సరస నొక మండపమున ని ♦ స్తార వేది
కాంతరమ్మునఁ గూర్చుండి; ♦ రఖిల సైన్య
నాయకులఁ గాంచి రాజ నా ♦ రాయణుండు, 65

॥ ప్రతాపసింహుఁడు దేశత్యాగముఁ జేయుదునని యనుచరులకుఁ దెలుపుట. ॥

గీ॥ "భరతఖండంబు నెపుడు ము ♦ ంపంగ వచ్చు
యవనసైన్య ప్రవాహమ్ము ♦ నడ్డగించి
పర్వతమువోలె నిలిచి మే ♦ వాడ లక్ష్మి
శాశ్వతమ్ముగ విజయంబు ♦ సంతరించె. 66

సీ॥ భానువంశము వైభ ♦ వ ప్రాభవంబులు
తిర మొనర్చెను శిలా ♦ దిత్య నృపతి;

సత్య సంస్థాపనా ♦ చార్యుఁడై రాజ మం
డనుఁడయ్యె గనకసే ♦ న ప్రభుండుఁ!
నీలాబ్ధినుండి కా ♦ బూలుదాఁకఁ దురుష్క
పతుల నెల్ల జయించె ♦ బప్పరావు!
వసుధాతలంబెల్ల ♦ వడవడ వడకించెఁ
బురుషసింహుఁడు కాల ♦ భోజరాజు;
గీ॥ మఱియుఁ గోమనసింహాది ♦ మనుజపతులు
సకల దిగ్దేశ విశ్రాంత ♦ సాంద్రయశులు;
ప్రాణములు మాతృభూమి క ♦ ర్పణము చేసి
భారతోద్ధారకఖ్యాతి ♦ బడసి చనిరి. 67
సీ॥ భరతఖండము నభో ♦ భాగ మార్తాండుండు!
రాజపుత్ర కులైక ♦ రాజరత్న!
మా పృథాదేవీ హృ ♦ దబ్జ మేలెడు దిన
స్వామి! పృథ్వీసార్వ ♦ భౌము బావ!
మేవాడ రాజ్యల ♦ క్ష్మీ ప్రాణనాథుండు!
కల్యాణసింహుని ♦ గన్నతండ్రి!
కగ్గార్ నదీ రణాం ♦ గణ వార్ధి బడబాగ్ని!
ఘోరీమహమ్మదు ♦ కుంజర హరి!
గీ॥ వసుధ వ్యాపించు యావన ♦ ప్రళయ ముడుప
నవతరించిన యాదినా ♦ రాయణుండు!
సమరసింహ కుమారనాథు ♦ సదృశులైన
ప్రభువు లుందురె! యెన్ని క ♦ ల్పములనైన. 68
సీ॥ రఘుపతిసింహు శౌ ♦ ర్యం బెంతనఁగవచ్చు!
మాహామీరుఁడు నృప ♦ మాత్రుఁ డగునె!
లఘురాజు దేశమే ♦ లాగు వృద్ధి నొనర్చెఁ!
జంఘుఁబోల్ ధర్మవీ ♦ రుండు గలఁడె!
కుంభేంద్రుఁ గని రణ ♦ క్షోణి నెవ్వఁడు నిల్చుఁ!
బృథ్వీశు సాహసం ♦ బెవరు గొల్తు!

సంగ్రామ శౌర్యాదీ ♦ క్షాత్రతి యెట్టిది!
రత్నసింహుని పరా ♦ క్రమ మలంతియె!

గీ॥ భానుకులమునఁగాక వి ♦ శ్వప్రపంచ
మందు నేవంశమున జన్మ ♦ మందినార!
లిట్టి భువనైక వంద్యులౌ ♦ నృపు బలాఢ్యు
లిట్టి ధర్మ సంస్థాపకు! ♦ లిట్టి ఘనులు! 69

సీ॥ చూడనొప్పై యుండు ♦ నేడుకోటలతో! ను
హాబ్దీఘాల్ సప్తఖే ♦ యములతోడ!
స్రభంబు సోఁకు జ ♦ యస్తంభ తతులతోఁ!
గలువపూట్టికో ♦ నెలలతోడ!
వెలయు నెన్బదినాల్గు ♦ విఫణిమార్గములతో!
సముదార రాజమా ♦ ర్గములతోడ!
సంఖ్యకు మీఱు ప్రా ♦ సాద సంతతులతో!
జలపూర్ణ బహుసర ♦ స్సమితితోడఁ!

గీ॥ బెక్కులక్షల జనులతో! ♦ వేలు యొంట్ల
యువనులకు గుండెగాలమై, ♦ రవికులంబు
గుత్తగొను క్షేత్రరాజమై. ♦ కొమరు మిగులు
చిత్తూరునుబోలు నగర మీ ♦ క్షితిని గలదె! 70

గీ॥ మహిత మేవాడ రాజ్య ర ♦ మా సమగ్ర
విభవభాగ్యముల్ చూడ్కికి ♦ వ్రేఁగుగొలుప
వాహినులఁగొంచుఁ బెక్క- సం ♦ వత్సరములు
మొగలుపతి "యలాయుద్దీను" ♦ ముట్టడించె. 71

గీ॥ వ్రేటుదీటి యొకింత దె ♦ ప్పిజకమున్న
ఘూర్జరమునుండి "బహదూరు" ♦ క్రూరుఁడగుచుఁ
బచ్చివిసమును గ్రక్కుచు ♦ వచ్చి లగ్గ
పట్టెఁ; జిత్తూరు పురలక్ష్మి ♦ కుట్టు వట్టె. 72

సీ॥ వైరివిశ్వంభరా ♦ పతి దుర్నిరీక్షంబు!
యవన భూపాల కా ♦ రాలయంబు!

భాగ్యలక్ష్మి వసించు ♦ పద్మాకర వరంబు!
రాజపుత్రుల మంది ♦ ర ప్రవరము!
భారతఖండ భాగ్య ♦ తారా వతంసంబు!
భువన శౌర్యమునకుఁ ♦ బుట్టినిల్లు!

గీ॥ లలిత మేవాడలక్ష్మీ వి ♦ లాస తిలక
మయి సహస్రాబ్దములనుండి ♦ యశముఁ గనిన
పురవరేణ్యంబుఁ చిత్తూరుఁ ♦ బూడిఁగలిపెఁ;
దండు గొనివచ్చి యక్బరు ♦ దండధరుఁడు! 73

సీ॥ రాజసేవితము సూ ♦ ర్య ద్వార రాజంబు
ప్రేలి ముక్కలుగాఁగ ♦ నేల రాలెఁ;
ఘన శిఖరము మాళ్వ ♦ మునఁ దోఁచు కుంభ జ
యస్తంభ మూఁటాడి ♦ యవని మ్రొగ్గె;
హారతుల్ వేదముం ♦ తార్రావముల నొప్పు
కోవెల లన్నియుఁ ♦ గూలి పోయె;
వీరసంహారు లు ♦ ర్విని బాసి పోవుట
భవ్య మందిరములు ♦ పాడు వడియె;

గీ॥ నలుచుఁ జెవి దిమ్ముపట్టఁగా ♦ నడవి రిళ్ళు;
బలిసి యెల్లెడ ముండ్లచె ♦ ట్లలము కొనియె;
విడక బుసబుసలాడె ద ♦ ర్వీకరములు:
వనమృగంబులు మీఱె; గూ ♦ బలును జేరె. 74

చ॥ ఇరువది యైదువత్సరము ♦ లిప్పటి కిప్పుడొ దాఁటిపోయెఁ జి
త్తురురమ మోముకుంకుమము ♦ తోఁగను పున్నెము దీఱె; రేయి ని
ద్దుర పవ లన్నముల్ విడిచి ♦ దుర్దమ దీక్షను నిన్ని యేండ్లు సం
గర మొనరించినన్ జయము ♦ గల్గదు; కల్గదు కల్గు నాసయున్. 75

గీ॥ పట్టభద్రుఁడనైన యీ ♦ ప్పటి విభవము
సంపదయు మూఁడునాళ్ళ ము ♦ చ్చటగ జాఱె;
మునుపటి మహోన్నతులు గల్గు ♦ నను తలఁపులు
మెఱపు లెండమావులు గాలి ♦ మేడలయ్యె. 76

గీ॥ నందనోద్యానభాగంబు ♦ నఱ మెలంగు
కామధేను సంతానము ♦ కరణి నెపుడు
పిల్లలును మేము బయలఁ జీ ♦ వింపవలసె!
మానవుల కర్హమగు తిండి ♦ మఱచిపోయి! 83

ఆ॥ కాళ్ళనిండ గుడ్డ, ♦ కడుపు నిండుగఁ దిండి,
కంటినిండ నిద్ర, ♦ గాన కెపుడు
బిచ్చగాండ్రకన్న ♦ బీదలమై యుంటి;
మింక నెంతకాల ♦ మిట్లు కడచు! 84

మ॥ తఱితో నక్బరుసార్వభౌముఁడు నితాం ♦ త ప్రాభవోపేతుఁడై
ధరణీచక్రము నేలు వేళను దరి ♦ ద్రత్వంబు దిక్కౌడి యు
ర్వరఁ దా నుండఁగఁ జోటుగానక మహా ♦ రాణాప్రతాపావనీ
శ్వరు సంసారము నాశ్రయించినది; యీ ♦ పాపంబు నేమందునో! 85

శా॥ భీతిన్ గొల్పు కరాళనక్రముల వే ♦ వేగన్ జరావ్యాఘ్రము న్నా
నా తారుణ్యము మ్రింగఁగాఁ దివిరెఁ జెం ♦ తన్ బొంచి లేడిన్ బలెన్!
జేతస్స్థైర్యముఁగూడ సన్నగిలె! నా ♦ సెన్ సుంత యుత్సాహ! మే
రీతిన్ గార్యముఁ దీర్తు! నేపగిది నా ♦ తృప్తిప్రతి సంధించెదన్! 86

గీ॥ గాలి వాన విధాన న ♦ గ్రహల నేఁగు
కష్టముల కెత్తువడి డస్సి ♦ కడిమి తగ్గి
హృదయకోశంబు తన నైజ ♦ వృత్తి విడక
యాడునో! యూఁగునో! తెలి ♦ యంగరాదు. 87

మ॥ చనఁగాఁ జొచ్చెను నిర్వదేఁదులు మహా ♦ స్వాతంత్ర్యయుద్ధంబుఁ జే
యను నే దీక్ష వహించి నేఁటికి; భవి ♦ ష్యత్కాల తారాపథం
బున దూరమ్మునన్నైనఁ గొంత విజయం ♦ పున్ గాంతిరేఖల్ మిను
క్కని చూపట్టవ! యే భగీరథుఁడు దా ♦ యన్ దెచ్చునో జాహ్నవిన్!

సీ॥ సంతత తౌరుష్క ♦ సంగ్రామవహ్నిచేఁ
గాలఁగా మిగిలిన ♦ కట్టెనైతి;
నలిగొట్టి కుక్కయై ♦ నక్కమూల్గెడు నక్క
పైఁ దాఁటిపం డూడి ♦ పడినయట్లు

రక్త మేదో మాంస ♦ రాశి తగ్గి యకాల
 వృద్ధత్వ మిపుడు పై ♦ కెక్కె నాకు;
నింక నెంతయొ కాల ♦ మీ శరీరం బిట్లె
 యనువుగా నుండు నం ♦ చాస లేదు;
గీ॥ ప్రాణపదమైన మేవాడ ♦ రాజ్య పావ
నాధిపత్యంబు 'నాబూ'మ ♦ హాచలాధి
పత్యమును నావి గావని ♦ వదలి యవలఁ
జనెడు కాలంబు వచ్చె; సం ♦ శయము లేదు. 89

చ॥ చెలులను బిడ్డలన్ సుతుల ♦ స్నేహితులన్ గులబంధులన్ గృహాం
బుల ధనధాన్యవస్తుచయ ♦ మున్ విడి కేవలభక్తి నాపదం
బులు మఱి దేశమాతృపద ♦ ముల్ భజియించిన మాకు నేటికిన్
గలుగదె సుంతయేనియు మ ♦ నఃపరితృప్తి యొకింత దీప్తియున్! 90

చ॥ శ్రమములకుఁ జిక్కిచిక్కి యని ♦ శంబును గంపలఁబడ్డ యట్టి కా
కములకుఁ బోలె ముందుఁ జనఁ ♦ గాఁ దెరవింతయు లేదు! గెల్చు పు
ణ్యా మదియు నంతయే! కులస ♦ నాతన కీర్తిని నిల్పలేని య
ల్పమతులు మాతృభూమిపయిఁ ♦ బాదము మోపి వసింప నర్హులే 91

సీ॥ అకట! మాసూర్యాన్వ ♦ య ప్రభాత నృపాలు
 రప్రతిహతముగా ♦ నధ్వరములు
సలుపుచు బ్రాహ్మణ ♦ సంతర్పణంబుల
 నొనరింప మిగులఁ బా ♦ వనములైన
దుర్గంబులం దెల్లఁ ♦ దురకమూకలు చేరి
 సలుపరాని యకార్య ♦ ముల నొనర్చెఁ;
గటకటా! నాకుఁ బ ♦ ల్కంగ నోరు రాకుండెఁ;
 బరదేవతా స్వరూ ♦ పము లటంచుఁ
గీ॥ పసుపుఁ గుంకుము లర్పించి ♦ పాదయుగముఁ
గరము భక్తిని సేవించు ♦ గంగగోవు
లను గృపనుపేడి వధియింతు ♦ రనుదినంబు;
నిదికనుంగొని జీవించి ♦ యేమి ఫలము! 92

గీ॥ ఉండి యీఘోరకృతిఁ జూచు ♦ చుండలేము;
తివిరి రిపుఁ గెల్చి జయము సా ♦ ధింపలేము!
కడకు మనయున్కి యిచట నే ♦ కమొడచన్ను
లవల నడఁక త్రిలోకఁ బోక ♦ యట్టు లయ్యె! 93

సీ॥ పలుమాఱు విశ్వసా ♦ భాగ్యంబు దేశక
ల్యాణంబు నిలకొల్ప ♦ నభిలషించి
మనము చేసిన త్యాగ ♦ మును మనకన్ని బూదిఁ
బోసిన యాజ్యంబు ♦ పోల్కినయ్యె;
మన నేత్రముల మ్రోల ♦ మన మాతృదేశంబు
పరుల యధీనమై ♦ ప్రజలు దాస్య
జలరాశిలోన ము ♦ న్కలు వెట్టుటలు గాంచి
యించుకయును సహి ♦ యింపఁజాలఁ;

గీ॥ గటకటా! పూర్వపుల ర ♦ క్తములఁ దోఁడఁ
దడిసి మనరక్తములఁ బుని ♦ తంబునైన
కీర్తిరాశి మేవాడ ల ♦ క్ష్మికిసు మనకుఁ
దీఱినట్టులె యింక నీ ♦ దినము ఋణము. 94

గీ॥ ఉత్తరాయణ పుణ్యము ♦ హూర్తమెంచి
యంప సెజ్జఁ బండిన భీష్ము ♦ ననుసరించి
వగచి వరుగై వటించి మే ♦ వాడ మాత
కనుఁగొనలఁ బ్రాణముల నిల్పి ♦ కొని పరుండె! 95

గీ॥ ఇరువదేండ్లు రణమొనర్చి ♦ యెట్టి ఫలము
నేని మనమెల్ల సాధింప ♦ లేని చోట
నకట! భూమికి బరువుచే ♦ సై మనంగ
నేల! వరువేల! యభిమాన ♦ మేల! యింక! 96

శా॥ పావిత్ర్యంబున కాటపట్టయిన యీ ♦ పంజాబుకో పర్షియా
కో వెళ్ళన్ దలతున్; స్వతంత్రముగ నె ♦ క్కాల్పన్ దగున్ రాజ్యముల్!
నా వెంటన్ జనుదేరఁ గోరినను స ♦ న్నాహంబుఁ గావించి వా
రో వీరో! మఱి యీందఱో ♦ కదలి రా ♦ రో! యింక మున్నాళ్ళకున్ 97

గీ॥ యవనసంసర్గమును వీడి ♦ యవలి కేగు
టే శుభంబని యెంతు; మీ ♦ కెట్లు తోఁచు;
నెమ్మి మెయిఁ దెల్పుఁ డిపుడు; మీ ♦ నిర్ణయమును
దాల్తు శిరమున మందార ♦ దామ మట్లు" 98

సలు:గ్రా కృష్ణసింహుఁడు పరితాపసింహు ననుసరింతునని నివేదించుకొనుట

మ॥ అని వాక్రుచ్చియు నిల్చినంతట సలుం ♦ బాధీశుఁడున్ లేచి భ
క్తిని హస్తంబులు మోడ్చి "భారతధరి ♦ శ్రీ దాస్యనిర్మూలనం
బున దేశోద్ధరణమ్మునందు హృదయం ♦ బున్ నిల్పి యెంతెంత సే
యను సాధ్యంబగు నంత చేసితివి నీ ♦ వత్యంత దీక్షాపరతన్. 99

సీ॥ వేనవేల్ రిపుల నొ ♦ ప్పించు పట్టునఁ గర్జ
పేయమై విందు నీ ♦ వీరగర్జఁ;
దలఁ ద్రుంచు బహుళాప ♦ దలు చుట్టినప్పుడు
చెవియొగ్గి హుంకార ♦ రవము విందుఁ;
దిండిలేక తపించు ♦ దినముల. విధిఁ జూచి
పెడబొబ్బ వెట్టు చ ♦ ప్పుడుల విందు;
స్వాతంత్ర్య సమర దీ ♦ క్షకుఁ బూన్చి నీ యుప
న్యాసంబులను జెవు ♦ లార విందుఁ;
గీ॥ గాని కొండంత నొప్పితో ♦ గాసిపడుచుఁ
బిడుగు పడినట్లు హృదయముల్ ♦ వ్రీలఁ జేసి
విన్ననై దీనమగు వాక్కు ♦ విని యెఱుంగ;
ననలమున వ్రేల్చునట్లు నా ♦ మనసు పొగిలె. 100

గీ॥ నీహృదయపద్మపీఠ ని ♦ ర్వ్యాజ మెక్కి
యలరి స్వాతంత్ర్యలక్ష్మి స ♦ హస్రభాను
కాంతులను వెల్గెఁ; దన్మహా ♦ ఖండదీప్తి
కడలుకొని ఫిర్గి మొగలుల ♦ కనులు గుట్టె. 101

సీ॥ పురము రాజ్యము మాని ♦ మూడేండ్లు శ్రీహరి
శ్చంద్రుండు పడిన క ♦ ష్టముల నెఱిఁగి.

పదునాలు గబ్దముల్ ♦ వనవాసమున రామ
చంద్రుండు పడిన క ♦ ష్టముల నెఱిఁగి,
పదియు మూఁడేండ్లుగాఁ ♦ బాండవుల్ గహనాంత
రములలోఁ బడిన క ♦ ష్టముల నెఱిఁగి,
యిరువది మూఁడేడు ♦ లీ ప్రీ వనులఁ గుటుం
బముతోఁడఁ బడిన క ♦ ష్టముల నెఱిఁగి
గీ॥ తారతమ్యంబుఁ దూఁచిన ♦ వారి యిడుమ
లత్యగాధాపదావర్త ♦ మైన నీదు
చరితమున నొక్కపుట కొక్క ♦ చరణమునకు
సాటి గావని గొంతెత్తి ♦ చాట నేర్తు! 102

సీ॥ అట్టి చూచిన దోసె ♦ డంతైన లేదు మే
వాడరాజ్యము; సైన్య ♦ బలము గూడఁ
జాలనిదే! యుద్ధ ♦ సన్నాహ మల్పంబె!
యటులున్న నేఁబది ♦ యైదు లక్ష
లగు కాల్బలము, పదు ♦ నైదు లక్షలగు గు
ఱ్ఱముదండు విస్తార ♦ రాజ్యలక్ష్మి
యేనుంగులు పిరంగు ♦ లెన్నెనిఁ గలుగు వి
శ్వంభరాధీశుఁ డ ♦ క్బరు నృపాలుఁ
గీ॥ డట్టి యుఱ్ఱూఁత లూఁగి తూఁ ♦ గాడి పడఁగఁ
దాఁకఁగలిగితి; వెన్నిసా ♦ ధనము లున్న
నిన్నొకని గెల్వఁజాలక ♦ తన్ను కొనెడి
ననుచు హాస్యాస్పదం బయ్యె ♦ నతని బ్రతుకు. 103
గీ॥ క్షణము విడక సైన్యము లంపి ♦ రణముసేయ
నీపయికి నక్బ రంపించు ♦ నిరత ధాటిఁ
బరిషయన్ సేన 'గ్రీసు' పైఁ ♦ బరవ లేదు;
యవనులు 'జరూసలెమ్ము' పై ♦ నరుగలేరు. 104
శా॥ ఈ విశ్వంభర పుట్టుటల్ మొదలుగా ♦ నిందాఁక నే దేశమం
దే వంశమ్మునసైనఁ గష్టముల నెం ♦ తే నాత్మబంధుల్ వలెన్

భావంబందుఁ దలంచుచున్ వలచుచున్ ♦ స్వాతంత్ర్యముం గొల్చితే!
నీ వొక్కండవు దక్కఁ శాంతి నిరతిన్ ♦ నిర్నిద్ర తేజోనిధీ! 105

ఆ॥ ఇట్టి దేశబంధుఁ ♦ డిట్టి శూరోత్తముఁ
డిట్టి రాజయోగి ♦ యిట్టి త్యాగి
లేఁడు లేఁడటంచు ♦ మూఁడు లోకంబుల
మ్రోఁత లీనెఁ; గురిసెఁ ♦ బూలవాన. 106

సీ॥ అక్బరువిశ్వంభ ♦ రాధీశమాళిది
ధన సేవ; నీయది ♦ దైవసేవ;
యాతని దెల్లనృ ♦ పాత్మవైభవము; నీ
యది నిరంతరము నా ♦ త్మావబోధ;
నతని కుండిన దెల్ల ♦ నైహికబలము; ని
న్నాశ్రయించిన దెల్ల ♦ నాత్మబలము;
నతని దండఁ జిక్కు ♦ లలరించు భోగంబు;
నీది జగము మెచ్చు ♦ నిండు త్యాగ;
ఆ॥ నతఁడు జగము గెలిచె; ♦ నాత్మ గెల్చితివి నీ;
వాతఁ డితరజనుల ♦ నాశ్రయించు;
నీవు స్వాశ్రయుఁడవు; ♦ నీకు నాతని కెన
లేదు; జగము క్రిందు ♦ మీఁదు లయిన. 107

గీ॥ కష్టమే మనపాలిటి ♦ కల్పతరువు;
దుఃఖ మెఱుఁగని హృదయముల్ ♦ దుర్బలమ్ము;
లతి పరిమితంబయిన శక్తి ♦ యలరు నరుల
కపజయంబులు బలవర్ధ ♦ కౌషధములు! 108

మ॥ ధర సృష్టించిన బ్రహ్మ, ఫాలమున నే ♦ త్రంబుండు శంభుండు, న
ప్పురుషోత్తముఁడు శౌరియున్, నరులుగాఁ ♦ బుట్టొంది యేనూఱులో
తరముల్ పోరినఁగాని నీ కరణి స్వా ♦ తంత్ర్యంబు నిట్లింత దు
ర్భర నిష్ఠారతిఁ గొల్వ లేరని వచిం ♦ పన్ నేర్తు వేనోళులన్. 109

గీ॥ శక్తి దాఁపక యాత్మవం ♦ చనము లేక
నీయడుగునీడఁ దలఁదాల్చి ♦ నిన్నుఁ గొలిచి

త్యాగమించుక యొకేఁగితి ♦ నను యశంబు
సంతరించితి నర్హత ♦ చాల కున్న. 110

గీ॥ వాసుదేవుని చరణ పూ ♦ జా సుమ మటు
నిరత మాదలఁ దాల్తు నీ ♦ నిర్ణయమ్ము;
నీడ మేవాడ నున్న నే ♦ వాడ నున్న
నేను నీవాఁడ ననువాఁడ! ♦ నెపుడు గూడ. 111

క॥ మూన్నాళ్ళ గడువులోనన
సన్నాహ మొనర్చి మేము ♦ సంసారములన్
నిన్నుఁ గొలువంగ వత్తు" ము
టన్న "నటులె చేతు" మనుచు ♦ నంద ఱరుగుచున్; 112

మ॥ పరివారంబుల వెంటఁదోడ్కొని సలుం ♦ బ్రా కృష్ణసింహాది భూ
వరు లందుండియు నాత్మసీమలకుఁ బో ♦ వన్ భీమచాం దైదు వే
వుర నాకోవెల చుట్టు భిల్లులను గా ♦ పున్ బెట్టి తానున్ ధను
ర్ధరుఁడై కావలిఁ గాచె నయ్యెడ బహి ♦ ర్ద్వారమ్మునన్ నిల్చుచున్. 113

గీ॥ ధన కనక వస్తు వాహన ♦ తతుల నెల్ల
బండ్లపైఁ ద్రోవ పట్టించి ♦ పంపి రాజ
పుత్రవీరులు మఱల నా ♦ బూ గిరీంద్ర
మునకు వచ్చిరి ప్రభుభక్తి ♦ యినుమడింప! 114

గీ॥ మెఱుఁగు బంగారు పూలు వోల్ ♦ కిరణతతులు
బాలభానుండు ప్రకృతి కి ♦ భలను వెంప
నల సలుంబ్రాధిపతిఁ జూచి ♦ యాంప్రతాపు
"డేకలింగేశునకు మ్రొక్కి ♦ యిపుడె వత్తు! 115

గీ॥ అంతలోన మీరందఱు ♦ ననుచరులను
బయన మొనరింప నాయత్త ♦ పఱచుఁ" డనుచుఁ
బలికి గర్భాలయంబు లో ♦ పలికిఁ జనియె!
వగలఁ బొగులుచు నాసలుం ♦ బ్రా విభుండు, 116

సీ॥ వదలన్న సామ్రాజ్య ♦ పట్టాభిషేకంబు
నలిపితి భువన మా ♦ శ్చర్యపడఁగ!

బయటికి వెడలుచో ♦ వనిలోన ముండ్లను
రాల్ దీసి త్రోవ శు ♦ భ్రముగఁ జేతు!
"నాహేరియా" వేఁట ♦ కరుదెంచునపు డెల్ల
నన్నిసామగ్రులా ♦ యత్తపఱతుఁ;
శాత్రవు లెదురైన ♦ క్షణమున సకల సై
న్యముఁ దీర్చి యనకి సి ♦ ద్ధముగ నుంతుఁ!
గీ॥ గాని, గుండెలు బరువెక్కఁ ♦ గా స్వదేశ
మట్టె విడనాడిపోవుచో ♦ ననుచరులను
సర్వసన్నాహమునఁ బూన్చి ♦ జాలి మాలి
నట్టి కార్యముచేయుటె ♦ ట్టైన నెఱుఁగ. 117

మ॥ అదిరా! దేవుని కన్నుమిన్న యని భ ♦ క్త్యావేశముల్ బెంచి యి
ర్వదిమైదేండ్లుగ దేశమాతకు సప ♦ ర్యల్ చేసి శుష్కించి క
ష్టదశల్ గుందిన విశ్వవీరునకు దే ♦ శత్యాగముల్ జేయు దుః
ఖదశల్ దెచ్చితె! దుష్టదైవమ! మహో ♦ గ్రం బయ్యె నీచెయ్దముల్!

సీ॥ ఎత్తిన చేయి యిం ♦ తేని డింపక రణా
గ్రముల శాత్రవుల శి ♦ క్షములు తఱిగె!
విశ్వవిశాలమై ♦ విలసిల్లు హృదయంబు
స్వాతంత్ర్య లక్ష్మి కా ♦ స్థాన మిచ్చె!
దనదు సర్వస్వ మ ♦ ర్పనచేసి మాతృదే
శారాధనమునఁ బు ♦ ణ్యతముఁ డయ్యెఁ!
ద్యాగానురక్తి ధ ♦ ర్మాసక్తి విశోన్న
త స్థానమంది త ♦ ద్దయును వెలిఁగెఁ!
గీ॥ జతు రుదధి సంవృతావనీ ♦ సార్వభౌమ
పదవి రానున్న మాతృభూ ♦ పాద సేవ
విడని రాజర్షి చంద్రుండు ♦ వెడలవలసెఁ
దనదు సీమలోఁ దలదాఁచు ♦ తాఁవు లేక. 119

సీ॥ త్రిభువనాదర్శ వం ♦ దిత పరమోత్కృష్ట
సద్గుణ గణ రత్న ♦ సలిలరాశి
రాణాప్రతాప వీ ♦ రప్రభు వదన మం
డలరాజు నవ మంద ♦ హాస రేఖ
జీవనౌషధముగఁ ♦ ద్రావి యెట్టెట్టులో
దినములు గడఁద్రోసి ♦ కొనుచు నుంటి!
నా యభాగ్యము మీఱి ♦ నాస్వామి తఱితప్పి
యక్కటా! దైవోప ♦ హతుఁడు నయ్యెఁ!

గీ॥ నట్టి! దరహాస శూన్యమై ♦ కాంతిలేని
యీమహారాజు ముఖము నే ♦ నెట్లు చూతు!
నెట్లు భరియింతు! నేటు నుందు! ♦ నేమి యందు!
ముందు మాకుండు డిందెను ♦ చంద మున్నె?" 120

గీ॥ అని యఱిగి కొండయంత దై ♦ న్యమునఁ గుంది
యనుచరుల నశ్వముల నెక్క ♦ నాజ్ఞ చేసె!
నల్ల నల్లన గర్భాల ♦ యంబు విడిచి
వాకిటిని దాఁటి రాజలో ♦ కైక గురుఁడు, 121

గీ॥ వచ్చి యశ్వంబుపైఁ జేయి ♦ వైచి నిలిచి
యఖిలభువన ప్రపూజ్యమా ♦ నా గిరీంద్ర
సమతలమునుండి చుట్టు దే ♦ శంబువైపు
చూపమర్చి క్రేఁగంటి యం ♦ చులఁ జెమర్ప. 122

మ॥ "అకటా! చేసిన యన్నియత్నములు వ ♦ మ్మై గెల్పు సుంతైనఁ జే
రక దైవోపహతుండనై యిదె మహా ♦ రాణాప్రతాపుండు శా
వక కల్యాణ పదాంబుజాత యుగ సే ♦ వా భాగ్యముల్ వీడి నూ
లికిఁ గొల్వేజను నన్యసీమలకుఁ; ద ♦ ల్లీ! వీని నెట్లోర్తువో! 123

శా॥ వ్యోమం బంటెడు నీదు శైలశిఖరం ♦ బుల్ మంజులమ్మైన యా
రామశ్యామలసీమలుల్ ప్రబల దు ♦ ర్గశ్రేణులుల్ సారవ
ద్భూముల్ నీ సముదార భాగ్యవిభవం ♦ బుల్ వీడిపో నుంటిఁ; ద
ల్లీ! మేవాడ సతీమతల్లి! మదిలోఁ ♦ గ్లేశంబు రా నీకుమీ! 124

గీ॥ ఇరువదేండ్లుగ నుత్తమ ♦ పరికరములఁ
భక్తిఁ గూర్చి నా పావన ♦ స్వాంత మందుఁ
దల్లి! నేఁ గట్టుకొనిన స్వా ♦ తంత్ర్య వజ్ర
భవనరాజంబు కన్నీటి ♦ వఱద మునిఁగె. 125

శా॥ నా మేనన్ గల రక్త మాంసములనున్ ♦ నా శల్యముల్ ప్రాణమున్
నీ మేల్గోరిచి ధారపోయుటకు సం ♦ దేహంబు సుంతేని లే!
దే మేల్గూర్పఁగలేని వ్యర్థమతినై ♦ యిందుండి జీవింప నే
ధీమంతుల్ సహియింతురే! నా వ్యసన మా ♦ దేవుం డెఱుంగున్ జుమీ 126

మ॥ అతిభీమంబుగఁ బెల్లు రేఁగి నిబిడం ♦ బై మ్రోఁగి యీ సర్వ భా
రతదేశంబును ముంచివైచిన మహో ♦ గ్రంబైన దాస్యాంధ కా
రతతిన్ దేవుని దృష్టి గూడ నణుమా ♦ త్రంబున్ జొరన్ బోని దు
స్థితి సంధించెడు పాపికాల మరు దెం ♦ చెన్; జూచి యెట్లోర్తునో! 127

సీ॥ విశ్వపావనమైన ♦ వృత్తి వర్తించు గో
బ్రాహ్మణులకుఁ దగ్గు ♦ పాటు గలిగె;
ధాతృనిభుల్ మునుల్ ♦ స్థాపించు వర్ణాశ్ర
మాచారవిధు లడు ♦ గంటి పోయెఁ;
బెట్టని కోటలై ♦ వెలసి నిర్గొల్చు వీ
రుల పౌరుషము గంగఁ ♦ గలిసి పోయె;
మంగళలక్ష్మి స ♦ మానతా సాధ్వుల
సౌశీల్యగరిమ కా ♦ ర్శ్యంబు నొందె;
గీ॥ వేయునేండ్లుగ వ్రేటుపై ♦ వ్రేటు దగిలి
చిక్కి ససిదక్కి స్రుక్కి కృ ♦ శించి నాదు
పాలనమున మంచముపట్టి ♦ డీలు వడఁగఁ
జాలుపడితివె! తల్లి! మే ♦ వాడ లక్ష్మి! 128

సీ॥ మాతృదేశము శుద్ధ ♦ మతిఁ గొల్వఁగాఁ జాలు
సుతుఁడును లోకవం ♦ దితుఁ డటంచు,
భౌతికసుఖము స ♦ ర్వము సన్న్యసించి ధ
ర్మైకవర్తనుఁడనై ♦ యిన్ని నాళ్లు

రక్తమేదో మాంస ♦ రాజి నూడ్చుచు నిన్ను
నుద్ధరించి కృతకృ ♦ త్యుండ నగుదు
నని కృషి చేసితి; ♦ నకట! నాపాపి హ
స్తము లా భాగ్య ♦ మంద లేదు!
గీ॥ పూర్వ వైభవమున నీవు ♦ పొదలు చున్న
నాకలుష నేత్రములఁ జూడ ♦ లేక పోతి!
నాశ లడుగంటెఁ! బ్రాణంబు ♦ లవిసి పోయెఁ;
బ్రతుకె వృథ యయ్యెఁ! దల్లి! మే ♦ వాడ లక్ష్మి! 129

సీ॥ పసితనమ్మున లేడి ♦ వలె లాఘవమ్మున
నడవుల కేగఁ బ్రాకి ♦ నట్టి చోట్లు!
పట్టాభిషేక సం ♦ పద్విభూషితుఁడనై
యధికృతి నెఱపిన ♦ యట్టి చోట్లు!
కవచ ఖడ్గము లూని ♦ కదనరంగముల ఘో
రారులఁ గడ తేర్చి ♦ నట్టి చోట్లు!
నొకఁడనై శత్రుల ♦ నడిఁకించి జగమెన్న
నపజయంబు వహించి ♦ నట్టి చోట్లు!
గీ॥ కట్టు బట్టయుఁ దినఁ గూడు ♦ గానకున్న
నచల భక్తిని సేవించి ♦ నట్టి చోట్లు!
హృదయ ఫలకమ్మునందు ము ♦ ద్రితము లయ్యె;
మఱువలే నమ్మ! నను నేను ♦ మఱచు దాక! 130

గీ॥ వీరు లాత్మీయు లాప్తులు ♦ పృథ్వివరులు
బంధువులు నీ గిరిందరి గ ♦ హ్వముల నొఱుఁగఁ
బిరికి దొంగనుగా నిన్నుఁ ♦ దొఱఁగి జాఱ,
వ్రాసె నాతల ధాత! మే ♦ వాడ మాత! 131

గీ॥ తలఁ దఱుగనోపు బహు విప ♦ ద్దశలనైనఁ
గాంతి యించుక చెడని నా ♦ కన్ను దోయి
నశ్రుకణములు వొడమె; నీ ♦ యడుగు దోయి
నమ్మ! ముక్తాభిషేకంబు ♦ నాచరింతు. 132

శా॥ నేనేగాక మఱొక్క ధీరుఁ డెవఁడే ♦ నిన్ నిన్ను సేవింప నెం
తేనిన్ బూనిన, వాని పుణ్యమున నే ♦ నిన్ దల్లి! మేవాడ ల
క్ష్మీ! నిత్యోత్సవ నిత్య మంగళ జయ ♦ శ్రీ నిత్య సౌభాగ్యరే
ఖా నిత్యప్రభ లెల్ల నీకుఁ గలుగున్ ♦ గాకంచుఁ గాంక్షించెదన్. 133

సీ॥ హా రావళీశైల ♦ మనుపమ స్వాతంత్ర్య
వీర దుందుభుల శ ♦ బ్దించుఁ గాక;
గుట్టలు పుట్టలు ♦ గుహాలు స్వధర్మత
త్పరుల యశంబు మా ♦ ర్పలుకుఁ గాక;
మేవాడ రాజ్య ల ♦ క్ష్మీ పరాక్రమ మెల్ల
వేళల భువిఁ దాండ ♦ వించుఁ గాక;
త్యాగైకధనుల స ♦ త్య స్వరూపులచే ర
హించి నీకడుపు ఫ ♦ లించుఁ గాక;
గీ॥ భానుకుల గౌరవంబు ని ♦ ల్పంగ నోడి
త్యాగమునఁ గుంటువడి నీప ♦ దములఁ గొలుచు
పున్నెములు లేక దూర భూ ♦ ములకు నేగు
మమ్ము మాపేళ్ళ లోకంబు ♦ మఱచుఁ గాక." 134

గీ॥ అనుచు భక్తిని జూపి వం ♦ దన మొనర్చి
మఱువఁజాలక చేరెడు ♦ మట్టి దీసి
కనుల నద్ది రుమాలునఁ ♦ గట్టి యూర్చి
యాప్రతాపుఁ డశ్వంబుపై ♦ నధి వసించె. 135

క॥ ఈకృతి దూరమునుండి త
దేక ధ్యానంబుతోడ ♦ వీక్షించి సలుం
బ్రా కృష్ణసింహవిభుఁ డతి
లోక మహాద్భుత విలాస ♦ లోలాత్ముఁడై. 136

మ॥ "అరరే! యీభువనంబులెల్లఁ దలక్రిం ♦ దై పోవు బల్ విస్మయా
కర దృశ్యంబిటు సాఁగె నేఁడిచట! లో ♦ కం బుద్భవం బంది వ
త్సర సాహస్రములెన్ని దాఁటెనొ! మహా ♦ శ్చర్యాస్పదం బిట్టి బం
ధుర కార్యంబును జూచియున్ వినియు నెం ♦ దున్ గాన రెవ్వారలున్ 137

సీ॥ విశ్వంబు తనకనుల్ ♦ విచ్చుటాదిగ దేశ
భక్తులెందఱో మాతృ ♦ భక్తి పరత
సర్వస్వ మర్పించి ♦ శ్రమచేసి కడకు స్వా
తంత్ర్యంబు నిల్పెను ♦ దారి నేనుము
నాత్మరాష్ట్రము వీడి ♦ యరిగి యుండఁగ వచ్చుఁ!
గాని నా దేవుఁడు ♦ కట్టకడకు
మేవాడ విడనాడి ♦ పోవుచు మాతృవం
దన మాచరించియుఁ ♦ దనివి సనక

గీ॥ మొదటికిని దాను వెల్లిన ♦ నదటఁగూడ
మాతృదేశ మారాధించు ♦ మమతఁ బెంచి
తల్లి నేలను గల మట్టి ♦ నల్లనఁగొని
పైరుమాలు చెంగునదానిఁ ♦ బదిల పఱచె! 138

సీ॥ పరిషియా చేరి సు ♦ స్థిరవాస మేర్పడు
తఱి నిష్ఠ గొనిన యా ♦ తల్లి మట్టి
దేవతార్చనమున ♦ సౌవర్ణ పేటికా
భ్యంతరంబున నుంచి ♦ యహరహంబు
ధూప దీపాది ని ♦ త్యోపచారములు గా
వించి పూజించి సే ♦ వించు నిజము!
అద్దిరా! యీతని ♦ యాత్మదేశము నెడ
భక్త్యభిమాన మి ♦ బ్భంగి దనుచు

గీ॥ భువనముల విస్మయాంభోధి ♦ ముంచి తేల్చు
నీ మహా కార్య మొక్కఁడే ♦ యెఱుక చేయు!
నప్రతిమ దేశభక్తికిఁ ♦ ద్యాగ దీక్ష
కీతఁ డధిదేవత యటన్న ♦ నిది ధ్రువంబు! 139

సీ॥ ఇందు కిర్వదియు మూ ♦ డేండ్లకుఁ బూర్వ మిం
ర్వదిరెండు వేల్నంది ♦ ప్రతినఁ బట్టి
యప్రతిహత దీక్ష ♦ నాత్మదేశ స్వతం
త్రతఁ గష్టించి ర ♦ క్తంబు మాంస

మూఁడిచి కడకు దై ♦ వోప హతుల మాచు
దేశంబు విడనాడఁ ♦ దివిరి యుంటి!
మందలు మదుల దే ♦ శారాధ నాసక్తి
త్యాగ దీక్ష! సమాన ♦ మగును! గాని,

గీ॥ తల్లి మట్టి చేకొను బుద్ధి ♦ తదితరులకు
నేరికిని దోఁప! దితఁడె లో ♦ కైక పూజ్య
దేశభక్తాగ్ర గణ్యుం! డు ♦ దీర్ణహృదయుఁ!
డితఁడే దేవతామూర్తి! ♦ యితఁడె గురుఁడు! 140

మ॥ అనయంబీతనికున్న యంత నిబిడం ♦ బై దేశపుం భక్తి మా
మనసుల్ నిండిన నెట్టు లియ్యది స్ఫురిం ♦ పఁ జాల! దీకారణం
బున నేఁడొక్క ప్రతాపదేవుఁడె జగం ♦ బుల్ దాటు భక్తుండు! త
క్కిన వారందఱు తక్కువాఁడులె! వితి ♦ ర్కింపంగ నొండుండునే! 141

సీ॥ అఖిల లోకాతీత ♦ మైన యీఘను మహో
న్నత దీప్తి మెఱుఁగ కి ♦ న్నాళ్ళు నేను
పొరవడి పలుమాఱు ♦ దరియుఁచు బలుకరిం
చుచుఁ దాకుచును గొల్చు ♦ చును దిరిగితి!
నిది తలంపఁగ నిప్పు ♦ డెడఁద జలదరించు!
నాకును నీమహా ♦ నాయకునకు
నత్తకు సత్తుకు ♦ నక్కకు నాకలో
కమున కున్నంత దూ ♦ రము రహించు!

గీ॥ దూరమున నిల్చి యితని పా ♦ దారవింద
ములకు మ్రొక్కుచు నాజ్ఞ నొఁ ♦ దలను దాల్తు!
నితఁడె నాతను ప్రాణంబు ♦ లేలు కొనెడు
ప్రభువు! పరమగురుఁడు! పర ♦ బ్రహ్మమూర్తి! 142

సీ॥ డెబ్బదియేండ్లు దాఁ ♦ టినవి! భార్యా పుత్ర
కులు సలుంబ్రి మహా ♦ క్షోణి రాజ్య
మణువంత నాకుఁ బ్రి ♦ యంబులు గావు! నా
జీవిత శేష మీ ♦ పావనాత్ము

చరణారవిందముల్ ♦ పరమ భక్త్యావేశ
మలరారఁ గొలిచి ధ ♦ న్యత వహింతు!
నిది సత్వరాశ్రిత్య! ♦ మిది తరణోపాయ!
మిది సదారాధ్యమౌ ♦ నేఁడు గడయుఁ;
గీ॥ గంటిఁ గంటి నేను విముక్తిఁ ♦ గాంచు ప్రోవ!
యని చివాలున లేచి వం ♦ దన మొనర్చి
తల్లిమట్టి పెకల్చి శు ♦ స్త్రమునఁ దాల్చి
వడి వడిగ వెళ్లి యుత్తమా ♦ శ్వంబు నెక్కె! 143
క॥ ఆరీతి వీరు లందఱు
చేరెడు చేరెడుగ మట్టి ♦ చేకొని తలలన్
జేరిచి మ్రొక్కుచుఁ బయనం
బారంభించిరి ప్రతాపుఁ ♦ డందఱ నడుమన్. 144
గీ॥ ఆత్మదేశంబు విడనాడ ♦ నడరు పాదము
గుండె బరువెక్కె; నెలుఁగు డ ♦ గ్గుత్తికఁ బడె;
నచలరంగంబు వదలి వా ♦ యవ్య దిశకుఁ
దరలి రందఱు మౌనము ♦ ద్రలు వహించి. 145
సీ॥ తానెల్ల యపుడు డక్షి ♦ ణప్రతి వత్తి న్నై
తిరిసి బెంచి గురుఁడంచు ♦ దేవుఁ డంచుఁ
దద్దయుఁ గొలుచు ప్ర ♦ తాపుఁడు దేశంబు
విడిపోవు నను వార్త ♦ విని న మొదలు
స్వాంత మెంతయు నొచ్చి ♦ వచ్చి పుండ్లై లోనఁ
గుమిలి కుమిలి ప్రేలి ♦ కూలు కతనఁ
దొలి దినంబున నుండి ♦ పలు కొందు రాక యా
కసము పై వ్రాలిన ♦ కరణి మౌన
గీ॥ ముద్ర వహియించి యెడఁబాసి ♦ పోవఁ గాళ్ళు
రాక, మది రాక వెంట దూ ♦ రమ్ము నడచి
తుది నమస్కార మొనరించి ♦ యొదిగి నిలిచి
భిల్లగూడెంబు దెస మళ్లె ♦ భీమ చాంద! 146

గీ॥ ఒకరి నొక్కరు పల్కరిం ♦ పకయె యశ్రు
ధారలఁ దోఁగి దైన్యము ♦ ద్రలను దూఁగి
యాప్రతాప పురోగము ♦ లగుచు నెల్ల
వార లరిగిరి గిరిపాలి ♦ మేరఁ జేర! 147

— భామాసాహి మేవాడకు వచ్చుట —

సీ॥ ముడుతలు వడ్డ మో ♦ మునఁ బ్రౌఢవర్తనం,
బఱుత జందెంబు బ్రా ♦ హ్మణతఁ దెలుప,
నిండార నెరసి పం ♦ డిన శిరోజమ్ములు
కమియ మాఁగిన వయో ♦ గరిమఁ దెలుప,
వ్రాలిన బొమల వె ♦ ల్వడు వాఁడి నునుఁజూపు
లెదిరి డెందముఁ జొచ్చు ♦ పదను దెలుప,
నధరంబుపై నంటి ♦ యంటని చిఱునవ్వు
తొలకని సత్య సం ♦ తుష్టిఁ దెలుప,
గీ॥ బుజమునను బైరవాసము, ♦ మొగమునందు
బ్రహ్మవర్చస ముదితమై ♦ పరిఢవిల్ల,
నుఱుకుఁ దునుకఁబోలిన యశ్వ ♦ మెక్కి యొక్క
శాంతమూర్తి బ్రాహ్మణుఁడు సా ♦ క్షాత్కరించె. 148

సీ॥ ఆగుంపునకు నెల్ల ♦ నగ్రభాగమున వ
ర్తించు ప్రతాపేంద్రు ♦ దెసను జూచి
యావృద్ధభూసురుం ♦ డశ్వంబు నిలిపి "యో
వీరపుంగవ! నేను ♦ దూరదేశ
మందుండి వచ్చితి ♦ నయ్య! యే కొండల
యందుఁ బ్రతాపేంద్రుఁ ♦ డధివసించు!
నెఱుఁగుదురే? కద! ♦ యెయ్యది త్రోవ! నా
కెఱిఁగింతురే కృప ♦ వహించి" యనిన
గీ॥ నాత్మదేశంబు విడువఁ గొం ♦ డంత వగపు
దోఁపఁ దలయెత్తకరుగు ప్ర ♦ తాపదేవుఁ

డామహీదేవు దివ్యవా ♦ క్యమ్ము లపుడు
విని వినక తన త్రోవను ♦ జనుచు నుండె! 149

శా॥ "యేమయ్యా; దయయుంచి యిట్లు కనుగొ ♦ న్మీ! వృద్ధుడన్ దూరపున్
సీమల్ దాఁటుచుఁ బెక్కు కష్టముల గా ♦ సిన్ బొంది నే వచ్చితిన్
భూమీశుండు ప్రతాపుఁ డీ గిరుల నెం ♦ దున్ గాపురం బుండు! నెం
దే మీ రాతనిఁ జూచియున్న సెలవిం ♦ డీ'' ష్టంచు బ్రార్థించినన్ 150

క॥ కనులెత్తి రాజమణి వి
ప్రుని వదనముఁ గాంచి యశ్వ ♦ మును నిలుపుచు "నో
యనఘా! మీరెవ! రెందులఁ
జనుదెంచితి" రన ద్విజన్మ ♦ సత్తముఁ డంతన్, 151

సీ॥ "పరిషియానుండి నే ♦ వత్తు; భామాసాహి
నా పే'రనినఁ దత్త ♦ ణము ప్రతాపుఁ
డాస్యంబు వికసింప ♦ నశ్వంబు డిగి భక్తి
తాత్పర్య విహిత ప్ర ♦ దక్షిణంబుఁ
జేయుచు నల్లనఁ ♦ జేతులు జోడించి
"నిరతంబు నీపాద ♦ నీరజములు
భజియించు నీదు సే ♦ వకుఁడు రాణాప్రతా
పుఁడు మ్రొక్కుచుండె నీ ♦ యడుగు లోయి"

గీ॥ నని నిలువ, నంద అనుచరు ♦ లబ్బురమున
నశ్వములనుండి దిగిరి! భ ♦ రాము రోత్తి
ముఁదు తురంగము డిగ్గి య ♦ ప్పుడమి భర్తఁ
గౌఁగిటను జేర్చి హార్దాబ్ధిఁ ♦ దోఁగి నిలిచి, 152

శా॥ "నా విశ్వోన్నత దివ్యకల్ప తరువున్ ♦ నా వజ్ర కోటీరమున్
నా విస్తార మనోంబుజాత తరణిన్ ♦ నాకీర్తి నిక్షేపమున్
నా వేల్పున్ మణి నాదు రాజధనమున్ ♦ నా స్వామి దర్శించి నా
సేవన్ గూర్పఁగ వచ్చినాఁడఁ; గృప వీ ♦ క్షింపంగదే! భృత్యునిన్! 153

క॥ పరిశుభ్రతర సుధాసా
గర వీచిక లట్లు నీదు ♦ ఘనకీర్తి కళల్

మెఱసె దెసల; నీయంతటి
వరమోత్తమ ధర్మవీర ♦ వరుఁ డుండెడునే! 154

సీ॥ స్తిమితమై తుదల వి ♦ చ్చి యుదార గంభీర
కాంతు లీను వెడంద ♦ కనుల తోడఁ;
బరువంపు బుగ్గల ♦ పైన రెక్కొ...ను మీస
ల వెలుఁగు మోము వా ♦ లకముతోడ;
వీర మహాలక్ష్మి ♦ విహరించు దుర్గమై
విరిసిన బలితంపు ♦ టురముతోడఁ;
దలయెత్తు వాఁడి కుం ♦ తముఁ గేల నూఁదిధీ
రత యుట్టిపడ నిల్చు ♦ రాణతోడ;
గీ॥ నొదలఁ దురాయి, వీరతే ♦ జో దురీక్ష
వదనమునఁ గుంకుమపు బొట్టు ♦ వజ్రవర్మ
మొడల వెలుగొంద నలరు నీ ♦ పొడవుఁ గంటి,
నెంత కళ గల తండ్రి వో ♦ యీ! ప్రతాప! 155

సీ॥ సత్వబుద్ధిని రిపు ♦ షడ్వర్గము నెదిర్చి
గెల్చినా! వరులను ♦ గూల్చి నావు!
తులలేని దేశ భ ♦ క్తులయందు మేటివై
హెచ్చినావు! యశంబుఁ ♦ దెచ్చి నావు!
ఇరువదేండ్లుగఁ బైన ♦ నోఱగు నాపదలెల్ల
నోర్చినావు! జయింప ♦ నేర్చినావు!
కుల సనాతన ధర్మ ♦ ములను సుస్థిరముగా
విరచినావు! ప్రబోధ ♦ మించినావు!
గీ॥ నొక్కపరి నిన్నుఁ గననెంచి ♦ యుంటి! నిదిగొ
తరుణ మనుకొంటి! నీదివ్య ♦ ధవళ యశము
నెంచు కొనుచుంటి! నితరుల ♦ కిది యలభ్య
మంటి! నూఱేండ్లు నీకు దీ ♦ ర్ఘాయు వంటి! 156

క॥ అని యాశీర్వాద మొస
ర్చిన విప్రోత్తముని జూచి ♦ నృపగురుఁడును "దే

పునియట్లు చేరవచ్చిన
నినుఁ గని ధన్యుండ నైతి ♦ నే నియ్యెడలన్. 158

మ॥ మును చాణక్య యుగంధర ప్రముఖులన్ ♦ బోలెన్ మహానీతి వి
ద్యను మేవాడనృపాళికిన్ గఱపి రా ♦ జ్యం బూర్జితంబై వినూ
తన కల్యాణ జయోదయాదికము లం ♦ దన్ జేసి మాభక్తి కె
ప్పును బాత్రమ్మగు నీదు దివ్యచరణం ♦ బుల్ గంటి నీనాఁటికిన్. 159

మ॥ భవదత్యుత్తమనామ మెల్లపుడు మే ♦ వాడ్దేశమందెల్ల గౌ
రవధామంబయి యొప్పుఁ; గట్టకడ కు ♦ గ్రామంబులందున్ బ్రజా
నివహం బద్దమరేయి మాటవరుసన్ ♦ నీపేరు విన్నంత భ
క్తివిరాజిల్ల నమస్కృతుల్ సలిపి నిన్ ♦ గీర్తించు నోసద్గురూ! 160

గీ॥ పరిసియూ కేగుదెంచి నీ ♦ చరణపూజ
సలుప వలెనంచు నెన్నిమా ♦ ఱులో తలఁచితి;
నిమిష మూపిరి వోని యు ♦ ద్యముల ముసిఁగి
కాలు గదలింపలేక యిూ ♦ లీల నుంటి" 161

గీ॥ అనుచు వచియించి నంత హ ♦ ర్షాంబురాశిఁ
దేలి భూదేవమణియు "నో ♦ దేవ! నేను
నిల్లె యనుకొని యనుకొని ♦ యెట్లొ నేఁడు
కాలు గదలించుకొనుచు రాఁ ♦ గలిగి నాఁడ. 162

గీ॥ అనయ మేఁ గొల్చు పూర్వము ♦ హా మహీంద్ర
శుభ తపః ఫలమును నిన్నుఁ ♦ జూచు కతన
జన్మ చరితార్థ మయ్యె; నె ♦ చ్చటికి నేఁటి
పయన మోయన్న" యనఁ బ్రతా ♦ ప ప్రభుండు; 163

గీ॥ "స్వామి! నీదివ్యచరణాంబు ♦ జములు గొలువ
పరిసియూ చేర నిటునేఁడు ♦ వచ్చుచుంటి?
వెదుకఁ బోయిన తీవయే ♦ యెదుర వడిమె
నడఁగ నిందె నీ దివ్య ద ♦ ర్శనము గలిగె! 163

గీ॥ మేరువును బెల్లగించి కో ♦ టీర మిడుదు
నుదయు పురలక్ష్మి కని లోక ♦ మురలఁ దాఁకి

ఇరువదేండ్లు పోరితి; నాయ ♦ దృష్ట మెల్లఁ
జెడియె నీవిధమున నేమి ♦ చేయువాఁడ." 164

—। భామాసాహి ప్రతాపసింహుని దండించుట. ।—

సీ॥ అని దైన్య మడరఁ బ ♦ ల్కినను భామాసాహి
విని విన్నవోయి యా ♦ ననము వంచి
"శ్రీహరీ! నాదుర ♦ దృష్ట మేమందు! నీ
వలన నింతటి వేఁడి ♦ వలుకు వింటి;
నీ వార్త విని ప్రీల ♦ దే! హృదయము శిలా
ఫలకమో! లోహమో! ♦ వజ్రమొక్కొ!
నూటాముడల దూర ♦ నీరీతి వచ్చు ను
త్సాహంబు నుడిసి వి ♦ ధ్వస్త మయ్యె!
గీ॥ నకట! నామేనఁ గొనయూపి ♦ రాడు చుండఁ
బరమపుణ్య స్వరూప మే ♦ వాడ లక్ష్మి,
వైభవ ప్రాభవాంకంబు ♦ భాను కులము.
చెడిన నోర్తునె! విధి వ్రాలు ♦ తుడుతుఁ గాక. 165

మ॥ అకటా! యుత్తమ భారతీయుఁడవు ఘో ♦ రాప త్సమూహంబు నిం
చుక లెక్కింపని విశ్వవీరుఁడ వటం ♦ చుః నిన్ను లోక ప్రజా
నికరం బెప్పుడు సంస్తుతుల్ సలుపఁగా ♦ నీవే స్వకృత్యంబు నూఁ
దక పోనాడిన ధర్మమెట్లు కొమరొం ♦ దః నేర్చు లోకమ్మునః! 166

గీ॥ నడి యెఱుంగని కర్మ వీ ♦ రుఁడవు నీవు;
నీకు జయమైన నదియు లో ♦ కైక జయము;
నపజయంబైన నదియు లో ♦ కాప జయము
నై ప్రపంచాప జయము నౌ ♦ ననఁగ వలయు! 167

గీ। పెక్కువేల్ మైళ్ళ పైనున్న ♦ వింద నెపుడు
నీదు పరిపాలనముఁ గూర్చి ♦ నీ యఖండ
కదన దీక్షను గూర్చి త్యా ♦ గంబుఁ గూర్చి
సాహసముఁ గూర్చి కర్ణర ♦ సాయనముగ. 168

సీ॥ మాపూర్వు లెప్పుడు ♦ మీ పూర్వ నరపాల
వరాళుల చెంగట ♦ మంత్రు లగుచు
వెలలేని భక్తితోఁ ♦ గొలిచిరి; నిరుపమ
సాహసాంకుండైన ♦ చండుఁడును బ్ర
ధానప్రధాన వ ♦ దము నొందు పిదప రెం
డవ మూఁడవ ప్రధాను ♦ లగుచు నాదు
పితరులు నేను సే ♦ వించుచుంటిమి; నల్వ
దేండ్లయ్యెఁ బరిషియా ♦ కేగి నేను!
గీ॥ పరమ ధార్మికులైన మే ♦ వాడ నృపుల
నెమ్మది స్మరింపక యె యీ ది ♦ నమ్ము దాఁక
దేవ! పిడికె డాహారముఁ ♦ దిని యెఱుఁగము;
నాశరీరంబె మీఁది! పా ♦ ణంబె మీఁది. 169

మ॥ వితత ప్రేమను నేను గొల్చెదు మహీ ♦ భృద్వంశ మందిట్టి ద
ర్పిత శౌర్యాంకుడు నిన్నుఁ బోలిన మహా ♦ వీరుండు జన్మించె నం
చతి హర్షమ్మున మందు వేసవి నుద ♦ గ్రాయాస భారంబు నో
ర్చితి; దూర మ్మిటు లేగుదెంచితి; భవ ♦ చ్ఛ్రీ పాదముల్ గొల్చితిన్ 170

క॥ కడు వృద్ధుఁడ; మేవాడ్ భ
క్తుఁడ; సచివుఁడ; భూమిసురుఁడఁ; ♦ దోఁచిన మాటల్
నుడివెద; విని నీ తోఁచిన
వడువున మెలఁగంగవచ్చు ♦ వలదనను నృపా! 171

సీ॥ మేవాడ విడిచి యిం ♦ కే వాడలకునైనఁ
బరువెత్తి పోవుట ♦ భావ్య మగునె!
పాదరసము వోలెఁ ♦ బగిపరి విధములఁ
జాటిపోయిన దాన ♦ ఫలము గలదె!
నిలువుము; ధైర్యంబు ♦ నిలిపి నీ యిప్పటి
స్థితులెల్లఁ జక్క దో ♦ జించు కొనుము!
ఆత్రమేటికి? శాంతి ♦ నందుము; నీ నుండి
నీవెప్డు దూరంబు ♦ పోవ గలవె!

గీ॥ చక్రవాళాచలము దాఁటి ♦ చనినఁ గాని
వనధి సప్తకమున మునిం ♦ గినను గాని
కడ కెచటి కేగినను బ్రతా ♦ పుఁడవు గాక
మాఱి మఱియొక్కరుఁడ వగు ♦ మాద్రి గలదె! 172

గీ॥ చనదు కృషి నిరసింపఁగా ♦ సాధకునకు!
నదియ యన్నిఁట నరుని యో ♦ గ్యతను బెంచుఁ;
గృషిని రోయు వానికిఁ జోటు ♦ క్షితిని లేదు;
వసుధ కెల్ల శుభం బట్టి ♦ వాని పోక. 173

గీ॥ అలజడిని మున్గినపుడె స ♦ త్యము జయించు;
నపజయంబుల నది పెంచు ♦ నాత్మశక్తి!
యనుపమ త్యాగమును సత్య ♦ మాప్త మిత్రు
లందురి స్వాతంత్ర్య తత్త్వజ్ఞు ♦ లైన బుధులు. 174

గీ॥ అఖిలదిశ లందు నాపద ♦ లలము కొనుచు
దిక్కు దోఁపని విషమ సం ♦ దిగ్ధ దశల
ధైర్యమును జిక్కపట్టక ♦ తలఁగె దేని
నీ బలము చాలదనినను నే ♦ నిగ్గ యింతు! 175

గీ॥ ప్రాణమున కెక్కుడైన మే ♦ వాడ వీడి
వెడలిపోఁగాదు; పోఁగాదు; ♦ వినుఁడు నాదు
ప్రార్థనము! కాదు కూడ ద ♦ టంచుఁ బోవఁ
దలఁతు రేనియుఁ బోనీక ♦ నిలువరింతు. 176

ఉ॥ "పూవులు రాలె; నాకులును ♦ బోయెను; మండ్లును మోడు నిల్చెఁ; నీ
వీవిధిఁ గేతకిన్ విడువ ♦ కేటికిఁ జుట్టె"! దనన్ "వసంత ల
క్ష్మీ విభవంబు సోఁకినఁ జి ♦ గిర్చి తరుల్ కుసుమించు నన్న యా
శావసరంబుచే నిలుతు" ♦ నంచు వచించుఁ గుమార భృంగముల్" 177

గీ॥ అని వచియింపఁ బ్రతాపుని
కనులను ముత్తెంపు టశ్రు ♦ కణములు జాలువా
రిన విప్రసచివుఁ గని "యే
మని నీవాత్సల్య గరిమ ♦ నభినందింతున్! 178

చ॥ పరిమితశక్తిఁ దొల్కెడ వి ♦ పర్యయవేళ స్వధర్మ మార్గముల్
దొలఁగునయేని వత్సలతఁ ♦ దోఁచి మహాపురుషాకృతిన్ బరా
త్పరుఁడు ప్రబోధ మిచ్చుచు న ♦ పాయముఁ గాచి పథంబుఁ జూఁపునం
చెఱుఁగుదు మిమ్ము వంటి విబు ♦ ధేంద్రుల మూలమునన్ గురూత్తమా!

గీ॥ స్వామి! నాపైనఁ బరమ వా ♦ త్సల్య వశత
నింత దూరము వేంచేసి ♦ యిటు లపార
పురుషకారము నేర్పు న ♦ మూల్య హితము
దైవ నిర్మాల్య మటు శిర ♦ సా వహింతు. 180

గీ॥ అఖిల భువనావనంబు నీ ♦ యమృత కీర్తి!
నాహృదయ తంత్రులను మీటి ♦ నను గఱాచె;
హారగురు పదంబు లటు నీప ♦ దాంబుజమ్ము
లనఘ! యనవరతమ్ము సే ♦ వ్యములు నాకు. 181

సీ॥ అభిలషించినరీతి ♦ నాజ్ఞసేయుచు దేవ!
పనిగొను"మని పలిం ♦ పంగ, విప్ర
సత్తముండను "క్షణ ♦ క్షణ మమూల్యం బిప్డు;
కాలంబు వృథసేయఁ ♦ గాదు మనకుఁ,
జర్చింపఁ దగిన వి ♦ షయము కొంచెము; నిమే
షము మాటలాడినఁ ♦ జాలు! ప్రకృతి
మనుసరింతము! లేదు ♦ వ్యవధి! జాగేటికి!
రమ్ము నల్ల నింబ వృ ♦ క్షమ్ము దరికి;
గీ॥ మఱియు నొకమాట వినుతు! నీ ♦ మంత్రివర్యు
యనుభవజ్ఞుండు! స్వామి భ ♦ క్తాగ్రగణ్యుఁ;
డల సలుంబ్రాధిపతిఁ బిల్వ; ♦ మాయనఘుఁడు
లేని మంత్రాంగము మనకు ♦ లేని పూజ." 182

మ॥ అని బోధింపఁ బ్రతాపసింహుఁడు సలుం ♦ బ్రాధీశు నెమ్మోముఁ గాం
చిన, నాథన్యుఁడు చేరఁగా నరిగి "మీ ♦ శ్రీపాదరాజీవ ద
ర్శనముల్ జేసెడి యీవిధేయుఁడె సలుం ♦ బ్రాకృష్ణసింహుం"డటం
చని సాష్టాంగ నమస్కృతుల్ సలుప న ♦ య్యాచార్యుడున్ బ్రీతుఁడై

—( భామాసాహీ-పరితాపసింహునకు రాజనీతి నుపదేశించుట. )—

క॥ లెమ్మనె; జని మువ్వురు వృ
ద్ధుమ్మదరిఁ జేరి; రధిక • సంతోషము చి
త్తమ్మున వెలయఁగ నృపు నా
స్యమ్మును గని "యవధరింపు • మవధానముతో! 184

సీ॥ స్వామ్యమాత్య సుహృత్కోశ • సైన్య దుర్గ
రాష్ట్రములు నను నివి యేడు • ప్రకృతు లంద్రు;
ప్రకృతి బల మున్న నే కాని • పార్థివునకు
నించుకేనియు నాస్తిక్య • మెసగఁ బోదు.. 185

గీ॥ ఇన్నిటను నెన్నియున్నవో • యెంచి చూత;
ముత్తను కులీనతయు మహో • దాత్త వీర
వర్తనము సత్యసంధత • వఱలు నీకు
రాజరాజుగ నుండ స • ర్వార్హతయు కలదు. 186

మ॥ సువిశాల స్థిరబుద్ధియై యనుభవ • జ్ఞుండై కడుఁ స్వామి భ
క్తి వికాస స్ఫురితుండు నౌ నృపతిసీ • తిజ్ఞుండు నుత్సాహ వై
భవుఁడే మంత్రిగ నుండ నర్హుఁడు; సలుం • బాక్రిష్ణసింహేంద్రు వం
టి విశేషజ్ఞు గడింపఁగా నగునె! మం • త్రిత్వంబు సంధింపఁగన్. 187

మ॥ బలవంతుం డనురాగ వంతుఁడును శో • భావంతుఁడున్ వాహిసీ
బలవంతుండును ద్యాగవంతుఁడును శు • భ్రసాన్వంతుఁడౌ ధీరునిన్
దలపన్ బోలు సుహృద్వరుండని! కిరా • తస్వామి నీ భీమచాం
దలఘుసాన్వంతుఁడు; వాని మించిన వయ • స్యశ్రేష్ఠుఁడే లేఁడుపో. 188

గీ॥ ధన-చమూ-దుర్గ-రాష్ట్ర సం • తతుల లోనఁ
బ్రథమమే యగ్రగణ్యమై • వాసిఁ గాంచు!
నది ప్రపంచైక సార స • ర్వాత్మకంబు;
దానిఁ బట్టి తక్కిన మూఁడు • తనరు చుండు. 189

ఆ॥ ద్రవ్యబలము గలుగఁ • దనరు సైన్య బలంబు;
ధన-చమూ బలములు • దనర, దుర్గ-

రాష్ట్రబలము లలరు; ♦ ద్రవ్య మన్నిఁట మేటి;
యదియు నీకు లోప ♦ మాది నుండి! 190

గీ॥ ఆశ్ర-యాసన-విగ్రహ- ♦ యాన-భేద-
సంధులను నాఱు షడ్గుణ ♦ సమితి యందు;
రిపు డెటులు వీని నడపు కీ ♦ లెఱిఁగి నట్టి
ధాత్రిపతి యన్నిరీతుల ♦ ధన్యతముఁడు. 191

గీ॥ అవసరమ్మైన శక్తి త్ర ♦ యమ్ములోన
నతులితోత్సాహశక్తి నీ ♦ కలదుఁ; గాని
మంత్రశక్తిఁ బ్రయోగించు ♦ మాత్రి లేదు
మఱియుఁ బ్రభుశక్తి మొదలంట ♦ మాసియుండె. 192

సీ॥ స్థిరతర ధైర్యోత్స ♦ జీవివై జంకక,
వెనుబోక, తగ్గక ♦ విసుగుపడక,
కష్టంబులకును జి ♦ క్కక, ప్రపంచోన్నత
ప్రబల విరోధితోఁ ♦ బ్రతిఘటించి
సంగ్రామ మిన్నేండ్లు ♦ సాగించి యుంటివి;
నిన్నెఱుంగని వారు ♦ నీ యహితులు
భవ దుదార యశము ♦ వర్ణించెదరు; కాని
కోశ-సైన్యబలముల్ ♦ కొఱత గాఁగ

గీ॥ నెన్నికల్పంబు లని చేసి ♦ యేమి లాభ!
మెటు జయము గల్గు! నీ కక్బ ♦ రెటుల లోఁగు!
'నిర్వదేండ్లుగ నాకాల ♦ మిట్లె వ్యర్థగఁ
జెల్లె'నని మాత్ర మిపుడు చిం ♦ తిల్లఁ బోకు! 193

ఆ॥ అదియు నాత్మశిక్ష ♦ కై చెల్లె ననుకొను;
మింక నిట్లె కాల ♦ మేఁగ నీకు;
దేశ ముద్ధరింపఁ ♦ దివురు; మొండొక మాట;
వినుతు; వలవ దనక ♦ పని యొనర్పు. 194

మ॥ పరమప్రీతిని దేశమాతృపద సే ♦ వాభాగ్యముం గోరి నా
వరసల్ గల్గు ధనంబు నీదు చరణా ♦ బ్జాతంబు లందుంతు; సం

బర మొప్పారఁ బరిగ్రహింపఁదగు; మే ♦ వాడ్ దేశముఁ గొల్చి య
క్బరు సాధించి యపార వైభవమునన్ ♦ వర్ధిల్లు రాజోత్తమా! 195

క॥ నెనరుంచి నాదు ప్రార్థన
విని దేశము నోము" మనుచు ♦ విప్రుండన, నా
తనిఁ గని జనపతి "నీవం
పున సలుపుదుఁగాక; త్రోసి ♦ పుత్త్రుని యెపుడున్. 196

మ॥ అనఘా! జేనెడు మేర యేనియును రా ♦ జ్యం బొక్కఁ గానేనియున్
ధనమున్ దొల్తటినుండి లేకయు దరి ♦ ద్రత్వంబునన్ వెళ్ళఁబో
యనె లోకమ్మునఁ బుట్టు వొందిన యభా ♦ గ్య చ్ఛత్ర సంపన్ను, నన్
ధనికున్ జేసి కృతార్థుఁ జేయఁ గరుణన్ ♦ దైవంబవై తోఁచితే! 197

చ॥ ధనము నొసంగి, వస్త్ర సము ♦ దాయము నొసంగి యనర్ఘ రత్న మం
డనము నొసంగి, బ్రాహ్మణుల ♦ నారవివంశజు లెల్లఁ దొల్లి యా
ర్చన మొనరించుచుందు; రది ♦ సవ్యము! భూసుర మౌళివైన నీ
ధన మిపు డేను గైకొనుట ♦ ధర్మువు గాదని తోఁచె నామదిన్." 198

క॥ అని జంకుచు సంకోచిం
చిన భామాసాహి "మిమ్ము ♦ సేవించి గడిం
చిన ధన మిత్తఱి మీ క
ర్పన మొనరించుటయ పరమ ♦ భాగ్యము నాకున్. 199

క॥ మేవాడదేశ ధనమే
మావాడల నుండు; దాని ♦ మాతృపద శ్రీ
సేవావిధి కర్పింపని
జీవన మేమిటికి! వట్టి ♦ సిరి యేమిటికిన్!

క॥ మనసార నిత్తుఁ జేకొను;
వినుము కలిగి నపుడు మఱల ♦ వృద్ధియు మూలం
బు నొసంగుము! కొనెదను; వల
దనకుము; నామాట చూడు; ♦ మగును శుభంబుల్. 201

మ॥ తడవున్ జేయక బోయెపాళెమునకున్ ♦ ద్రవ్యంబు నంపింతు! న
క్కడకున్ మీరును బోయి యాశిబిరలో ♦ కస్వామి దర్శించి యొ

క్కుడుగా సేనలుఁ జేర్చుకొ౦ఁ; డిచట నా ♦ కర్ణ నిల్వఁగాఁ దీర; ది
ప్పుడె నేఁబోవుదు"నంచు లేచి తురగం ♦ బుఁ డాసి పై నెక్కె-చుఁ, 202

క॥ తనకభి ముఖముగ నిలుచుం
డిన సేనాధీశ్వరులను ♦ నిఖిల సుభటులన్
గని వీర రసోత్సాహం
బున భామాసాహిమంత్రి ♦ పుంగవుఁ డంతన్. 203

—। భామాసాహి రాజపుత్రులను బురికొలుపుట. ।—

సీ॥ "సిరికిఁ దానకమైన ♦ చిత్తూరు పురలక్ష్మి
యనదయై పాడఱి ♦ వనట మునుఁగ!
నుర్వియంతయు మెచ్చు ♦ నుదయపుర విభూతి
బూది పాలగు హోమ ♦ ముగఁ జెడంగ!
గోటలన్నిఁటిలోన ♦ మేటి 'కుంభల్ మియార్'
యవనులచేఁ బడి ♦ నవసి పోవ!
బావనోన్నత మేఘ ♦ భవనంబు తురక లె
క్కములు గాడ్పులు పోకి ♦ కీసు వహఁగ!
గీ॥ నట్టి హారావళీపర్వ ♦ తాంతరముల
నిరువదేండ్లని చేయు పెం ♦ పెల్లఁ బొలియఁ!
గడుపుఁకూటికై వంశ వి ♦ క్రమము మఱచి
వెడలుచున్నారె! మేవాడ ♦ వీరులార! 204

సీ॥ శార్దూలరాజ భు ♦ జాపీఠ స్వారి చే
యఁగఁజాలు ఝాలా భ ♦ టాళు లుండ,
బాలురై రిపుసమ ♦ వర్తులై ఖండించు
ప్రబలచౌండావన్య ♦ పాలు రుండ,
విమతదాడ్గర్భ ని ♦ ర్భేదక ప్రౌఢి దీ
పించు రాథోడ్కుల ♦ వీరు లుండ,
ముజ్జగంబులనైన ♦ ముం జేతఁ గొఁదోయఁ
గలిగిన చోహాణ ♦ బలములుండ,

గీ॥ మా ప్రతాపుఁడు బ్రదికినే ♦ మమున నుండఁ
గృష్ణసింహు నోడల నూపి ♦ రెసఁగి యుండఁ
గులసనాతన వీర్యంబు ♦ గుంటఁ బెట్టి
పాఱుచున్నారె! మేవాడ ♦ వీరులార! 205

సీ॥ రాజ్యంబు పోయినఁ, ♦ శ్రీధనం బూడిన,
సకల భాగ్యంబులు ♦ సన్న మైన,
బలమెల్ల జెడినఁ, గో ♦ టలు పోయినను, సారె
కపజయంబులు క్రిమ్మి ♦ యొడ లొదవిన,
గడ్డి యాహారమ్ము ♦ గాఁ, జెట్లనీడలు
నెళవుగా, మృగములె ♦ స్నేహితులుగ,
నిల్లాలి నెడఁబాసి ♦ పిల్లల విడనాడి
కట్టుగుడ్డలు లేక ♦ గాసి పడియు
గీ॥ విడక స్వాతంత్ర్యమును గొల్చు ♦ వీరు లనెడి
యశముఁ బోఁద్రోసి యాభిజా ♦ త్యంబు రోసి
కటకటా! దేశ మరుల క ♦ గ్గంబు చేసి
విడుచు చున్నారె! మేవాడ ♦ వీరులార! 206

సీ॥ తెఱవల విమల పా ♦ తివ్రత్య మహిమంబు
సన్నగిల్లినఁ గనుల్ ♦ చల్ల వడెనొ!
సకల దిగ్దేశ రా ♦ జన్య ప్రతాపాగ్ని
చల్లార హృదయముల్ ♦ శాంతిఁ గనెనొ!
భరతఖండమున గో ♦ వధలు సాఁగినఁ జూచి
యంతరాత్మకు సౌఖ్య ♦ మలవడియెనొ!
దాస్యాంధకారంబు ♦ దశదిశల్ గవియ దే
హముల నాప్యాయనం ♦ బలము కానెనొ!
గీ॥ కనులు తిరిగెనొ! బాహువి ♦ క్రాంతి చెడెనొ!
బుద్ధి తఱిఁగెనొ! చెడువేళ ♦ ముసురు కొనెనొ!
కానిచో మాతృదేశంబు ♦ మాని పోవు
వెఱ్ఱి యొటు గల్గె మేవాడ ♦ వీరులార! 207

సీ॥ యవన గజేంద్రసిం ♦ హాఖ్యాతిఁ గాంచిన
బప్పరాయనిఁ గన్న ♦ భవ్య మాత!
జీవితం బరికోటిఁ ♦ జెండ నర్పించు హ
మీరసింహుని గన్న ♦ మేటి తల్లి!
భానువంశ క్షమా ♦ పతిపాళి యన నొప్పు
సమరసింహునిఁ గన్న ♦ చల్ల నమ్మ!
యతి దీక్షతో మొగల్ ♦ యాగముఁ దీర్చు సం
గ్రామసింహునిఁ గన్న ♦ రాజ జనని!
గీ॥ యందఱను మిమ్ముఁ బెంచిన ♦ యసమ ధాత్రి!
తల్లి దండ్రియు గురువునై ♦ తనరు సీమ!
యకటకట! స్వర్గమున కన్న ♦ నధికమైన
మాతృదేశంబు విడరాదు ♦ మఱల రయ్య! 208
సీ॥ కడుపు కక్కుఱితి కీ ♦ గతిఁ జేయఁగా రాదు;
తినినఁ దినకయున్నఁ ♦ జనును గాల;
మక్కటా! ప్రాణంబు ♦ లంత తీపైయున్నె!
పిడికి పంద లటన్న ♦ పేరు రాదె!
బవరం బనిన నొడల్ ♦ వడఁకెనే మీకు! భా
ర్యా పుత్రులం దంత ♦ యాస తగునె!
చిరకాల మహకీర్తి ♦ చేరదే! హృదయాభి
మాన ధనంబెల్ల ♦ మాసి పోదె!
గీ॥ తగదు పయనింప! వెనుకకుఁ ♦ దరల రయ్య!
బలముఁ గొనరయ్య! కోటలు ♦ గెలువ రయ్య!
యరుగవలె నాకు సెలవియ్య ♦ రయ్య;'' యనుచు
నశ్వమును ద్రిప్పి వెనుకకు ♦ నరుగఁ దొడఁగె. 209
గీ॥ విరిసి విరితేనె వాఁక జొ ♦ బ్బిలిన యట్లు
వీరరసము పొంగి పొరల ♦ వీరు లెల్ల
వెడలి పోవుచునున్న యా ♦ విప్రుచరణ
సరసిజములకు మ్రొక్కి యా ♦ శ్వముల నెక్కి! 210

క॥ పరివారమ్ములఁ దోడ్కొని
త్వరమై నశ్వముల నెక్కి ♦ తరలెదు తఱి నా
ధరణీపతి పలుంబ్రాఙ్ధీ
శ్వరుఁగని సంభ్రమము వెలుఁగు ♦ సందడి గొనఁగన్. 211

సీ॥ "ఎన్నేండ్లు పూర్వమో ♦ యిచట మంత్రిగనుండి
నుపకార వేతన ♦ మొంది యొదిగె!
విప్రు! డంతర్ముఖ! ♦ వేదరాశి! విదేశ
ములనుండి యిర్వది ♦ మూఁడువత్స
రములుగా జెప్ప మా ♦ గ్రుని దృష్టి మన మహో
ద్యమము శోధించి లో ♦ పములు గాంచి!
యెంత కోర్చుచు శత ♦ వృద్ధయ్యు నూతా మ
హలువచ్చి హితబోధ ♦ మొలుకఁ జేసె!

గీ॥ నాఁగ! నేవాడ యసిన ని ♦ య్యనఘ మూర్తి
కెంత యభిమాన మున్నదో ♦ యిపుడు తెలిసె!
దేశభక్తి పురూప మొం ♦ దినటు తోఁచె!
నితని కడనిల్వ మనకు యో ♦ గ్యతయుఁ గలదె! 212

సీ॥ మన మహారాష్ట్ర ♦ మును నఖండ త్యాగ
మునుజూపి దేశమా ♦ తను గొలిచితి
మని యుబ్బుచుంటి! మీ ♦ యఖిలైక పూజ్యుఁ డే
తెంచి యించుక విమ ♦ ర్శించి నంతఁ
జిటికెల పందిరి ♦ యటు గాజుటిలు మాడ్కి
మనకృషి వృథయైన ♦ మాద్రి తోఁచె!
నిరుపది మూఁడేండ్ల ♦ యీ మహోద్యమము గా
ఢాంధకార నిమగ్న ♦ మగుచుఁ జెడెను!

గీ॥ బ్రాహ్మ రూపంబుతోడ, వి ♦ శ్వము నగల్చ
క్షాత్ర తేజోమహాగ్నిని ♦ జల్లు నవ్వు
డాస్యమును గాంచి మాటాడ ♦ ట్టు లుండ
నలుత నిలుచుంటకే నాకు ♦ వెఱపు తోఁచె! 213

మ॥ మనుపా యక్బరు సార్వభౌమునకు జా ♦ బుల్ వ్రాసి పంపించిన
ప్డును నేఁడీగతి దేశమున్ విడుచు న ♦ ప్డున్ నేను గొండంత త
ప్పునె కావించితి! నిక్క! మాధరణి దే ♦ వుం డెంత గాసిల్లె! మె
త్తని మాటాడఁగ నోఁచనైతిని మన ♦ స్తాపంబు చల్లారఁగన్ 214

మ॥ అతిభక్తి స్థితిఁ దానుగొల్చిన ప్రపం ♦ చాతీత తేజో బలో
ద్ధతసూర్యాన్వయ మందునన్ బొడమి యీ ♦ తం డిట్లు లాత్మాన్వయో
న్నతిఁ బాటింపక యీడె దేశమును సం ♦ తాపాగ్నిచేఁ గోప ఘూ
ర్ణితుఁడై నాపయి కెత్తి వచ్చుచునరే ♦ నిన్ బాడిగా దందురే! 215

ఆ॥ ఆమహానుభావు ♦ నకుతన నేనెంత! నా
త్యాగ మెంత! బుద్ధి ♦ దార్ఢ్య మెంత;
యఁబువునను శతాంశ ♦ మైనను గానంచు
గర్వ మొదలి నమ్ర ♦ గతి వహింతు;" 216

మ॥ అని వాక్రుచ్చినఁ గృష్ణసింహ విభుఁ "డ ♦ య్యాచార్యుఁడున్ నేర్పి పో
యిన బోధం బది వేదతుల్యము! పరా ♦ కింతేని లేకుండ నేఁ
డనువర్తించి బలంబుఁ జేకొని విప ♦ క్షానీకమున్ గెల్చి క్ర
క్కున స్వాతంత్ర్యము మాతృదేశమున నె ♦ క్కొల్పంగ నర్హం బగున్.

క॥ కనికరము వెల్లి విరిసెడు
మనమున నరుదెంచి దేశ ♦ మాతృ క్షేమం
బును మన సేమముఁ జూపెను
మనోరథములెల్లఁ దీఱ ♦ మార్గముఁ జూపెన్. 218

క॥ మన యత్నము నను లోపము
కనపడకుండంగఁ గడఁగి ♦ కార్యా చరణం
బొనరింత! మాలసింపఁగఁ
జనదిఁక'' నని తాను నృపుఁడు ♦ సైనికు లెల్లన్, 219

— రాజపుత్రులు వెనుదిరిగి భీమచాందు నివాసమునకు వచ్చుట. —

మ॥ త్వరమై నద్దమరేయికిన్ హితకిరా ♦ తస్వామి గూడెంబులన్
దరియన్ బోయి బహిః ప్రదేశము కడన్ ♦ ధాత్రీనభోభాగముల్

గీ॥ శ్యామసింహుఁడు చనుదెంచె ♦ పాద్రినుండి
భిల్లురానుండి సూర్యుండు ♦ వెడలె! దేవ
గృహమునుండి దూడాసింహుఁ ♦ డేగుదెంచె!
దుర్జయుఁడు వచ్చెఁ జోంఝావ ♦ తులను గూడి! 225

గీ॥ అంత నొకనాఁడు సేవకుం ♦ డరుగుదెంచి
భిల్ల పరివృతుఁడగు నృప ♦ తల్లజుఁగని
"స్వామి! మంత్రి భామాసాహి ♦ బాన్లు వచ్చి
నిలిచెఁ! జూతురుగా"కంచుఁ ♦ బలికి కొలిచె! 226

గీ॥ భిల్లనృపతి ప్రతాపుఁడు ♦ వెడలి పాద్రి
వైపునను రెండుకోసుల ♦ వఱకు నిలుచు
భటులు నాల్గు వేల్కంది ద్ర ♦ వ్యంబు గలుగు
బండ్లు వేయును గని హర్ష ♦ భరితులైరి! 227

గీ॥ నెలకు నైదును బదిరూప్య ♦ ముల కొలంది
పదియు రెండేండ్లదాఁక ని ♦ ర్వదియు నైదు
వేల భటులకు భృతినీయఁ ♦ జాలుననుచు
భిల్లమణి రాజమణి లెక్క ♦ వేసి రప్పుడు! 228

— ప్రతాపసింహుఁడు యుద్ధసన్నద్ధుఁ డగుట —

క॥ "కనఁబడె దివి నింద్ర శరా
సన! మిది రణమునకు మంచి ♦ శకునంబ"ని భి
ల్ల నృపాలుఁ డనఁగ జనపతి
యని కాయత్తం బొనర్చె ♦ నాత్మ చమువులన్! 229

క॥ ఎలనవ్వు వెలయఁగా న
ర్మిలి బిడ్డల నక్కుఁజేర్చి ♦ మేను నిమిరి చుం
చులు దువ్వి ముచ్చటలు ము
ద్దులజడి గుఱియించెఁ గూర్మి ♦ దొంతరకట్టన్! 230

మ॥ పరమ ప్రేమమునన్ ప్రతాపవిభుఁడున్ ♦ బాలేశ్వరిన్ జేరి "యూ
పరిపంథి ప్రకరంబులన్ దవిలి నే స్వా ♦ తంత్ర్య సంగ్రామమున్

జరపన్ గోరి ప్రయాణమాడు నిపుడే! ♦ సంపూర్ణ చిత్తంబుతో
న్నరవిందేక్షణ! సమ్మతింపుము శుభ ♦ ప్రారంభ యాత్రారతిన్. 231

గీ॥ నీ సుధాస్వాదు లజ్జా వి ♦ లాసరేఖ
చిత్తమున హత్తి మెఱయుచు ♦ స్మృతికిఁ దెచ్చు!
మనకుఁ గలయిక నెలకొక్క ♦ మాఱు గలుగుఁ!
బరమ సంతోషమున నన్నుఁ ♦ బంపు మిపుడు. 232

గీ॥ నీవు బిడ్డలు కొన్నాళ్లు ♦ నిలువుఁ డిందు!
భిల్లు లేవేళ మిమ్ముఁ గ ♦ న్పట్టి యుంద్రు!
భీమచాందుగా రిపుడు నా ♦ వెంట వత్తు"
రనినఁ బాటేశ్వరీదేవి ♦ యాస్య మెత్తి, 233

—॥ పాటేశ్వరీదేవి ప్రతాపసింహుని విజయయాత్రకుఁ బంపుట. ॥—

ఆ॥ స్మితకళా మరీచి ♦ మీమోమునం దోఁచె!
నింతకన్న భాగ్య ♦ మేమినాకు!
శైలతలము నిండ ♦ సైన్యముల్ చెలరేఁగ!
వెడలి విజయలక్ష్మి ♦ వెంట రండు 234

గీ॥ సిద్ధసంకల్ప భరితమా ♦ చిత్తమందు
వలదు చోటీయ నాకుఁ బి ♦ ల్లలకు'' నంచు
వెడఁదకనుల ముత్తెఁపుజాయ ♦ విరియఁ దుదలఁ
గప్పు ఱెప్పల నాసతోఁ ♦ గాంతుఁ గనియె 235

మ॥ "నినుఁ బ్రార్థించుచు నన్నిరోజులు గడచెన్ ♦ నేఁడైన మాతండ్రి వె
న్కను గాంభుష్కులఁదాఁకి పోఁగ నను ♦ జన్ గూర్చి పాలింప మొ
క్క నిమేషంబిట నిల్వ లే"నని కలం ♦ గన్ బాఱు నీపుత్రి వెం
టను గొన్పోఁడు! మహాగ్నికల్పు నితనిన్ ♦ వారింప నాసాధ్యమే!" 236

మ॥ అని పాటేశ్వరి పల్కుచుండఁగఁ బ్రతా ♦ పాధీశ్వరుం డయ్యెడన్
దనపాదంబుల వ్రాలు నందను సమం ♦ దప్రీతిమై 'వత్సలె'
మ్మని మన్నించె! నతండుతోడని సలుం ♦ బ్రాధీశ్వరున్ డాసి భ
క్తి నమస్కార మొనర్చి గౌరవము నొం ♦ దెన్ సేన కధ్యక్షుఁడై. 237

సీ॥ విజయ సూచకముగా ♦ భిల్లభటులు చుట్టు
మూఁగుచు కైవార ♦ ముల నొనర్ప!
బోయగుబ్బెతలు గుం ♦ పులుగట్టి చిఱునగ
వలరు మోములఁ బాడి ♦ యాడు చుండఁ!
బాణేశ్వరి దేవి ♦ వజ్రమ్ములు ప్రవాళ
ములును మాణిక్యముల్ ♦ ముత్తియములు
హాటక పాత్రంబు ♦ లందుఁ గైకొని నిజే
శ్వరునకు మేల్మిని ♦ వాళి దీర్చి,
గీ॥ రాగమలరఁ గప్పురపు హా ♦ రతు లొసంగి
నిరుపమామోదమున నెత్తి ♦ నీళ్ళు దీసి
"జరగుఁ గావుతఁ గల్యాణ ♦ జైత్రయాత్ర"
యనుచు శ్రీపాదములు నుదు ♦ రంట మ్రొక్కి, 238

సీ॥ జంభదైత్యేంద్రుని ♦ సమయింప నరిగెడు
నపుడు బిడౌజున ♦ కైన జయము!
ఖరదూషణాది ర ♦ క్షశ్శ్రేణిపై నేగు
నపుడు శ్రీరామున ♦ కైన జయము!
నరకాసురునితో ర ♦ ణంబు సేయఁగఁ జను
నపుడు శ్రీకృష్ణున ♦ కైన జయము!
కాలకేయాదుల ♦ గసిమసంగఁగఁ బోవు
నపుడు కిరీటికి ♦ నైన జయము!
గీ॥ సకల శాత్రవ జయము, శా ♦ శ్వత జయంబు,
భువన జయమును, నిరుపమా ♦ మోద జయము,
వెల యెఱుంగని జయమును ♦ సులభ జయము
జయమ్ముపై నీకు జయములు ♦ జరుగుఁ గాక. 239

క॥ అని తననాథు మహోద్యమ
మున కభినందనముఁ దెలిపి ♦ పూర్ణోత్సాహం
బున నమరసింహు దరియఁ
జని కడు వాత్సల్య భరము ♦ సంపడి గొనఁగఁ 240

గీ॥ అమర సేనాధిపత్య ప ♦ ట్టాభిషేక
మగుచుఁ గ్రౌంచాద్రి భేదింప ♦ నరుగు నపుడు
మాఁకుమారున కట్టులు ♦ నాఁకుమార!
యమరసింహ! నీ కగుత లో ♦ కైక జయము!" 241

గీ॥ అనుచు నిండారు మనమున ♦ హస్తయుగము
నెత్తి యాశీర్వదింపఁగా ♦ నృప గురుండు
నగవు మొలకెత్తు చూపుల ♦ మగువ సెలవు
నంది యచ్చోటు విడిచె! సై ♦ న్యములు నడిచె! 242

గీ॥ గూఁడెముల నిండ్ల కోఁపులఁ ♦ గొండ పేఁటు
లందు, గండోపలము లందు ♦ నధివసించి
శబర సతులెల్లఁ బూలు లా ♦ జలును జల్లి
రా ప్రతాపుని పైన, సై ♦ న్యముల పైన! 243

క॥ ఈరీతి చైత్రయాత్రా
ప్రారంభము చేసి యర్ధ ♦ రాత్రమునకు ధా
త్రీ రమణుం డరిగెను దే
వేరీ దుర్గము కవాట ♦ వీథిన్ జేరన్. 244

—। దేవేరి ద్వితీయ యుద్ధము ।—

మ॥ "బలముల్ లేని కదుర్ కృశాంగుఁడు ప్రతా ♦ పస్వామి మాధాటికిన్
గలఁగన్ జాలెను! గోటకున్ భయము గ ♦ ల్గన్ బోవ"దం చెంచి యో
మ్ములపైఁ జేయిడి, యోజ్ల యావన బలం ♦ బుల్ వాయి నిద్రించె! వా
కిటులం బెందును మన్న పేరుకొని యె ♦ క్కెన్ మూరెఁ డంతెత్తుగన్ 245

క॥ అలకోట గవను దెఱచిన
పాలకుఁ గని సకల రాజ ♦ పుత్ర చమూనా
థులు చొరఁబడఁ గడఁగిన వా
రలను 'నిలుఁడు పోఁకుఁ' డనుచు ♦ రాణా యంతన్! 246

సీ॥ "తురకల బలము ని ♦ ద్దురఁ బోవుచుండు! నీ
స్థలమెల్ల మిగుల ని ♦ శ్శబ్ద మయ్యె!

నిదుర వోయెడువారిఁ ♦ గదిసి చంపుట క్షాత్ర
మహితుల యందు ధ ♦ ర్మంబు గాదు!
బహు శతాబ్దంబు ల ♦ ప్రతిహత శక్తితో
నీకోట మాపూర్వు ♦ లేలినారు!
దొంగపోటున దూఱి ♦ దుర్గంబుఁ బట్టుట
నాకు నచ్చిన వర్త ♦ నమ్ము గాదు!
గీ॥ పౌరుషముననె దీనిఁ జే ♦ పట్టుద"మని
యుఱుము తెఱఁగునఁ దనశంఖ ♦ మొత్తె! నమర
సింహుఁడును సింహనాదంబు ♦ చేసె! భీమ
చాందు బూరగ మ్రోయించె ♦ శైల మదరఁ! 247

ఉ॥ కంపము నొందె ధారిణి! జ ♦ గద్గురుఁ డంతట 'దుర్గమున్ బ్రవే
శింపు; డనంగ నయ్యమర ♦ సింహుఁడు గుఱ్ఱముఁ దోల్తులోన దూఁ
కింపగ సూక్తునశ్వమును ♦ గ్రొల్లురికెన్! వడిఁ గృష్ణసింగు గ
ర్జింపుచు దూఁకె! గంతులిడె ♦ సేనలు భూపతి వెంట నంటుచున్ 248

సీ॥ ఆరాజపుత్రసే ♦ నా రణోద్భట విజృం
భణ మహారవము షా ♦ బాజు ఖానుఁ
డాతని పదివేలు ♦ యవన భటుల్ విని
యదరు పాటున గుండె ♦ బెదరి చెదరఁ
దబ్బిబ్బుపడుచుఁ దొం ♦ దరగ రణోచిత
వివిధ సాధనములు ♦ వెదకు చుండఁ
దనసేనకన్న ముం ♦ దఱఁ బ్రతాపుఁడు సింహ
మటు వారి యెదురఁ బ్ర ♦ త్యక్షమయ్యె!
గీ॥ నలముకొని యున్న శత్రుసై ♦ న్యముల, విలయ
దండధరుఁ బోలు రాణాప్ర ♦ తాపుఁ జూచి,
తురకలు పలాయనము చేయు ♦ తెలివు లేక
పెనఁగిరి రణంబొ మరణమో ♦ యని తెగించి! 249

గీ॥ కాఱు చీకట్లు క్రమ్మిన ♦ కాళరాత్రి!
దుర్గమునఁ జో టలంతి! యు ♦ ద్ధురతఁ బోరు

భటు లలుపదైదు వేగురు! ♦ భయముఁ గొలుపు
నాఁటి రణధాటి యీపాటి ♦ నాఁగ వశమె! 250

గీ॥ యవనులని రాజపుత్రకు ♦ లని తెలియక
యుభయ సైన్యముల్ తలపడె ♦ నుగ్ర రీతి!
నెవరివారల వారె యీ ♦ హవము నందుఁ
దఱిగిపోసిరి వేఁడి నె ♦ త్తురులు దొరఁగ! 251

సీ॥ భిల్లభటు లేరితెచ్చి రా ♦ పిడుల రగులఁ
బెట్టు కట్టెల దివటీల ♦ వెలుఁగునఁ గను
పట్టెఁ బొలికల నొకచోట ♦ పట్టపగిది!
నచటి బలములు కొఱవి ద ♦ య్యముల పోల్కి! 252

గీ॥ అంటఁగారాని భయద దా ♦ వాగ్నికీల
యతిబలాటోప దుర్దాంతు ♦ డమరసింహుఁ
డొచట రణ మతిభీమమగా ♦ నచటఁ జేర
దాఁట్లుకొనిపోయి శత్రుమ ♦ ధ్యమునఁ దూఁకు. 253

మ॥ నగముల్ వెల్గెడు భానుబింబము పతా ♦ కం బొక్కచేనుండ, దు
స్సర ఖడ్గంబు మఱొక్కహస్తమున నో ♦ ప్పన్ శ్యామసింహుండు, కే
సరి మాతంగ సమాజముల్ దగులు నో ♦ జన్ యాతుతామాత్రు భీ
కరుఁడై బొబ్బలువెట్టి వైరులు వడం ♦ కన్ మట్టె నత్యుగ్రుఁడై. 254

మ॥ ప్రళయాంభోధరముల్ హసించుచు సలుం ♦ బ్రాభర్త చెంతన్ మహా
చల శృంగంబులు వ్రీలి కూలఁ బటుగ ♦ ర్జారావమొప్పన్ దురు
ష్కుల సైన్యంబులఁదాఁకి నుగ్గుపదులం ♦ చున్ లెక్కకున్ రాని తీ
ఱల శీర్షంబులు కుప్పతెప్పలుగ రా ♦ ల్పన్ సాఁగె నత్యుద్ధతిన్! 255

గీ॥ ఆగ్రహాదగ్ర భయద దీ ♦ ప్తాస్యుఁ డగుచుఁ
దన ద్విధారా కృపాణ దు ♦ ర్దాంతధార
నృపగురుఁడు చీల్చ రిపులెల్ల ♦ నేలఁబడిరి
మిడుత గమి చిచ్చుఁ బడి మ్రగ్గు ♦ వడువు తోఁప. 356

కం॥ హరిదాసుఁ డాగ్రహమ్మున
హరి రక్షశ్శ్రేణి నొంచు ♦ నట్టుల యవనో

త్కరముల పైఁబడి నఱకెను
శిరములు రాథోడులెల్లఁ ♦ జిక్కఁగఁ గొలువన్. 257

క॥ ఝాలా భూపతిసింహుఁడు
సాలములన్ బోలెఁ దురక ♦ సైన్యము మేనుల్
జీలిచె! మేకొని సూక్ష్ముఁడు
కాలాహి విధాన శత్రు ♦ గర్వముఁ జొచ్చెన్, 258

గీ॥ దేవగృహదుర్గ సీమలఁ ♦ దిరుగు వ్యాఘ్ర
ముగ్రమూర్తి దూడాసింగు ♦ యుద్ధమందు!
దేరిచూడఁగ రానట్లు ♦ దీప్తి మెఱసి
దోమలను బోలెఁ గూల్చె శ ♦ త్రువులఁ దాఁకి. 259

సీ॥ గుణరాశి రాథోణ్ము ♦ కుంద దాసుఁడు షాపు
రా బునేరా ప్రభుల్ ♦ ప్రకట బలులు
మఱియు బేడ్లారాజ ♦ సాళ్ళి కేశవదాసుఁ
డింకఁ గొటేరియా ♦ నృప వరుండు
తక్కిన రాజపు ♦ త్ర చమూపతుల్ వారి
వారి శౌర్యంబుల ♦ పగిది రిపులఁ
బట్టి నిర్జింపంగ ♦ బగ్గము పాడొచు
నొగిలి పగుల సాగె ♦ మొగలు తెగలు!

గీ॥ సమధి కోద్దండ దోర్దండ ♦ చాపముక్త
భీకరాశుగులై భిల్ల ♦ వీరులెల్ల
నట్టహాసంబు లొనరింప ♦ నా శరములు
నాలుకలు గ్రోయుచున్ వ్రాల ♦ గూలి దరుల- 260

ఉ॥ వీరులలోన మేటియగు ♦ వీరుఁడు భిల్లనృపాల వరాళియున్
బోరున రాశియై యడవి ♦ పక్షుల కొత్తసి యీఁకలన్ గరుల్
కూరుమ భీకరాశుగము ♦ లున్ దళకంబు శతంబు గుప్పుచున్
వైరిభట వ్రజంబుల న ♦ పారముగాఁ దునుమాడె నత్తఱిన్! 261

ఉ॥ రూక్ష పరాక్రమ స్ఫురణ ♦ రోజుచు నాసహా బాజుఖానుఁ డా
తతుకమూర్తియై రిపులఁ ♦ దార్కొని పెక్కురఁ గూల్చఁగా, ఖగా

ధ్యక్షుఁడు వోలెఁ బైఁబడి ప్ర ♦ తాప నృపేంద్రుఁ డనూన సాహసా
పేక్షఁ దదీయ మస్తకము ♦ ప్రేలఁగ నేసెఁ గృపాణ ధారలన్. 262

గీ॥ తనదు సుభటుల నుసికొల్పి ♦ దస్యు తతుల
పైన డీకొల్పి యాప్రతా ♦ ప ప్రభుండు
దుర్గమును శుభ్రముగఁ జేసెఁ ♦ దురక పురువు
పేరు లేకుండఁ దుదముట్ట ♦ నేరి వైచి. 263

మ॥ నలినాప్తుండును బూర్వ పర్వతము పై ♦ నన్ దర్శనం బిచ్చె; నా
యిలు వేల్పున్ గొలిచెన్ బ్రతాప ధరణీ ♦ భృచ్ఛ్రేణియున్! రాజపు
త్రులు సంతోష మెలర్ప నందుకొని రా ♦ దుర్గంబు! నం దన్ని ది
క్కుల సూర్యధ్వజకోటి క్రాలెఁ; జెలఁగెన్ ♦ గోలాహల ధ్వానముల్

క॥ వైరులు తుదముట్టె చనం
గా రాణా సంతసంబు ♦ గడలుకొనఁగ "దే
వేరీ జయంబుఁ దనదే
వేరికిఁ దెలుపు"మని మొక్క ♦ భిల్లుని బనిచెన్. 265

చ॥ మనుజవరేణ్యుఁ డంతట న ♦ మాయిత పర్వత దుర్గసీమకున్
జని తన రాజపుత్ర భట ♦ సంఘముఁ దోడ్కొని లోనదూఁకి క్రొం
తినిగొను వైరులన్ బిలిచి ♦ త్రెళ్లఁగనేసి గ్రహించె దుర్గమున్!
దనరె గరిధ్వజంబులు శ ♦ తంబు సహస్రము దృశ్యమానమై. 266

—॥ ప్రతాపుఁడు కుంభల్ మియరు దుర్గమును జేకొన నాలోచించుట. ॥—

మ॥ తన సామంతుల నందఱన్ బిలిచి చెం ♦ తన్ జేర్చి "యీ దుర్గముల్
గొనుటల్ ముఖ్యము గాదు నాకిపుడు! మా ♦ కుంభక్షమాజాని చే
కొని సిగ్గుంపఁ బవిత్రమై వెలయు నా ♦ కుంభల్ మియర్ దుర్గమున్
గొనుదాఁకన్ గననొల్ల నిద్దురయుఁ గై ♦ కోనొల్ల నాహారమున్." 267

మ॥ అను రాజేంద్రుని మోముఁ గన్గొని సలుం ♦ బ్రాధీశ్వరుం 'డీక్షణం
బున నే పోద'మటంచుఁ గోల్తల దళం ♦ బున్ రేపి సాగించి శై
ల నికాయంబులు లోయలున్ వనులు లీ ♦ లన్ దాఁటి యుత్సాహమున్
గొని ముందేగఁగ నాప్రతాపుఁ డరిగెన్ ♦ గుంభల్ మియర్ చేరఁగన్.

గీ॥ శైలసామ్రాజ్యలక్ష్మి ♦ మస్తకము మాడ్కిఁ
బర్వతముపైన శృంగంబు ♦ వఱలు చుండు!
మూర్ధమున వెల్గు హాటక ♦ మకుటరాజ
మట్లు కుంభల్మియర్ దుర్గ ♦ మలరు చుండు! 269

సీ॥ అచలనితంబంబు ♦ నటులెక్కఁ జో దూఁగ
మునకుండి దుర్గ గో ♦ పురము గోప
నా ప్రతాప నృపేందుఁ ♦ డత్యంత హర్ష గో
మాంచిత గాత్రుఁడై ♦ మస్త మెత్తి
కనుల పండువు గాఁగఁ ♦ గని "వదునాఱేండ్ల
పై నయ్యె నకట! నిన్ ♦ బాసిపోయి;
నీ "మేఘ భవనంబు" ♦ నీ "భవానీదేవి
కోవెల" నీదు స ♦ రోవరంబు

గీ॥ కనులఁ గట్టిన యట్లు నే ♦ గాంచుచుందుఁ;
గలిగిన దోసంగులకు మదిఁ ♦ గలఁగుచుందుఁ;
గాని కాలము నన్నిట్లు ♦ కట్టివైచెఁ;
జూచుచుంటిని! యిపుడు నీ ♦ సూడు దీర్తు" 270

క॥ అని కేల్గవ మొగిడ్చుచు మన
మున నుత్సాహంబు ద్విగుణ ♦ ముగ, బలమును గ
మ్మని హెచ్చరించి దుర్గ
మ్మును డాయన్ దూఁకి శంఖ ♦ మును బూరించెన్. 271

క॥ కల్లోలాబ్ధి తరంగము
వెల్లివిరియు గతిని గవియు ♦ విమత బలము న
బ్బుల్లాఖాన్ మార్కొనెఁ గ్రో
ధోల్లసితుం డగుచు నిజభ ♦ టోత్కర మొసఁగన్. 272

గీ॥ కనులు నిప్పులఁ గురియ ఖ ♦ డ్గంబు మెఱయ
నహిత శౌర్యమ్ము సైన్య మ ♦ ధ్యమునఁ దూఁకు
నా ప్రతాపేశ్వరుని ధాటి ♦ కాగి నిలువ,
నరుల మాటేల! సురలకై ♦ నం దరంబె! 273

మ॥ అవఘూర్ణాఖిల వైరివిక్రమ సలుం ♦ బాగ్రీశ దోఃఖడ్గ సం
భవ దుర్వార దురీశు దావ దహన ♦ జ్వాలా పరివ్యాప్తి ద
స్యువితానాటవి నిల్చె భస్మమయి రా ♦ సుల్ రాసు! లవ్వీరుఁడా
హవభూమిన్ విహరించె నాప్రళయకా ♦ లాభీల రుద్రాకృతిన్. 274

చ॥ ఉదధిని రెండుపార్శ్వముల ♦ నుండి యుదగ్రతరంగముల్ భయా
స్పదముగ రేఁగి తీవ్ర రభ ♦ సమ్మునఁ దాఁకిన వీఁక, శౌర్యసం
పద పోలివోవసీక యిరు ♦ వాగులయోధు లొక్క ట్లొకళ్ళపైఁ
గదియుచు హుంకరించి పయిఁ ♦ గ్రమ్మిరి వీర రసావతారులై. 275

సీ॥ యవన బృహన్నాళి ♦ కాస్త్ర నిర్గత ధూమ
సంఘాతములు మేఘ ♦ సమితిగాఁగ,
రాజపుత్రకుల ని ♦ ర్భర సింహనాదముల్
ఘన ఘనాఘన రణ ♦ ద్గర్జగాఁగ,
భట హస్త తరళ కృ ♦ పాణధారా తళ
త్తళలు సౌదామనీ ♦ తతులుగాఁగ,
శబరనాయక శరా ♦ సన నిస్సర త్తీవ్ర
విశిఖ సంతతి కుంభ ♦ వృష్టిగాఁగ,
గీ॥ సుభయపక్షంబు వీరుల ♦ యొడలఁ దోఁగి
పాఱు రక్తప్రవాహముల్ ♦ పర్వతాగ్ర
గళిత గైరిక శోణ శై ♦ వలినిగాఁగ,
సమరరంగంబు నిబిడ వ ♦ ర్షర్తు వయ్యె! 276

మ॥ తన మాతృస్థలనాఁటి దుర్గమును బొం ♦ దన్ దొందరన్ జెంది ద
స్యునికాయంబును జీల్చ నయ్యమరసిం ♦ హుం డుగ్రుఁడై పైకొనెన్;
దన మాతృస్థలనుండి వచ్చిన యుదా ♦ త్తక్షాత్ర తేజోవిక
త్థనమా వచ్చని నెత్తురుల్ మరఁగి యుం ♦ తర్నాడులం దోఁడఁగన్.
గీ॥ రాజపుత్రుల భయద వీ ♦ ర స్వనములు
వ్యగ్ర గ్రుగ్గ యావనభటా ♦ ర్త స్వనములు
రాజకుమరాళి సింహగ ♦ ర్జా స్వనములు
భూనభోంతరాళమున మా ♦ ర్మ్రోత లీనె! 278

గీ॥ పీన వితత వక్షులును గా ♦ పీన ధరులు
కృష్ణవర్ణు లయఃకల్ప ♦ దృఢ శరీరు
లాలయస్థ శిలా విగ్ర ♦ హముల మాడ్కి
భిల్లులు రణాంగణమున శో ♦ భిల్లి రపుడు. 279

సీ॥ బవరం బుగాది పం ♦ డువునాఁగ జెల రేఁగి
యమరసింహుండు దీ ♦ వ్రముగఁ బెనఁగెఁ;
నతని ప్రతాపాగ్ని ♦ యవన చమూసమూ
హమ్ములు శలభమ్ము ♦ లట్లు సమసెఁ;
దుర్వారవీర్యుఁ డ ♦ బ్దుల్లాచమూపతి
మత్త మాతంగంబు ♦ మాద్రి దాఁకెఁ;
నందఱు వెఱఁగంద ♦ నావీరమణి వాని
శిర మూడ్చె ఘోర ని ♦ స్త్రింశ ధారఁ;
గీ॥ సైన్యపతులును జముప్రులు ♦ శబరవీరు
లందఱును జేరి యొందఱి ♦ మ్రుందఁ జేసి-
రమరసింహుఁ డొక్కఁడ కూల్చె ♦ నందఱి నన,
వాని విక్రమధాటి వి ♦ శ్వమున కెఱుక. 280

క॥ మెడలు తెగి పుడమిఁ బడఁగాఁ
బొడుచుచు మొగలుల యుద్ధ ♦ భూమికి బలిగా
నిడి మోదం బడర బ్రతా
పుఁడు కుంభల్మియరు దుర్గ ♦ ముం గ్గైకొనియెన్. 281

గీ॥ ద్వారములఁ గ్రాలెఁ బచ్చని ♦ తోరణములు;
నలరె దుర్గమంతటను సూ ♦ ర్యధ్వజములు;
వరఁగెఁ గ్రమముగఁ బుణ్యాహ ♦ వాచనములు;
మేఘభవనమ్ములన్ గ్రొత్త ♦ మెఱపు మెఱసె. 282

ఉ॥ పూఁచిన పూలమొక్క లటు ♦ పొంగి భుజంబులు మూఁపుగాఁగ సే
నాచయముల్ తదీశ్వరు ల ♦ నంత ముదంబుధిఁ దేలి; రంత దా
నోఁచిన నోముపంటలగు ♦ నూత్నమనోరథ సంచయంబు లెం
తో చెలరేఁగ రాజమణి ♦ యొప్పుగఁ గాపుర ముండె నయ్యెడన్. 283

మ॥ మును పింగ్లాండుననుండి ఢిల్లి నగరం ♦ బుల్ జేర్పఁ గొన్పోవు వ
స్తు నికాయంబుల రేవుపేడు పిదపన్ ♦ సూరత్పురి మార్గమున్
గొని యీశాన్యపు భాగమం దరుగుచున్ ♦ గుంభల్ మియర్ కోట ప
జ్జను శైలంబుల దాఁటఁ జేయుటయు నా ♦ చారంబుగా సాగెడిన్ 284

సీ॥ నాగలిపై వాదమునుంచి ని ♦ ద్రఁగను చోద
కులను శకటమ్ములను నందుఁ ♦ గల సమస్త
వస్తువుల వృషభములను ♦ బట్టి రాజ
పుత్రులిడిరి కోటను మూల ♦ మూల లందు. 285

క॥ దినదినము గొల్లగొని కో
టను జేర్చిన విలువగల బి ♦ డారమ్ములు వి
ఖ్యన భాగ్య సమృద్ధంబై
తనరెన్ సామగ్రి బలము ♦ ధరణీశునకున్. 286

సీ॥ అన్నిమూలలనుండి ♦ యరుగుదెంచి ప్రతాపుఁ
జేరు వీరుల సంఖ్య ♦ చెప్పరాదు;
దైనందిన ప్రవృ ♦ ద్ధంబుగ సేనాబ
లంబును గోశ బ ♦ లంబు దనరెఁ!
మైత్రి సూత్రారతుల్ ♦ జరపి ప్రతాపుఁడు
శత్రుల సర్వ నా ♦ శన మొనర్చె!
హారావళీసీను ♦ నచిర కాలమున ము
ప్పది రెండు కోటలు ♦ పట్టువడియె;

గీ॥ నాప్రతాపేంద్రు దిగ్విజ ♦ యాంక కథలు
గుహలు లోయలు దేశంబు ♦ గూడ నిండి
బూగటిల్లి పొంగి పొరలుచుఁ ♦ బోయి ఢిల్లి
చేరి సూటిగ నక్బరు ♦ చెవిని మ్రోసె. 287

సీ॥ అంతరంగికులగు సమా ♦ త్యాగ్రణులను
వాహినీపతులను సభా ♦ భవన మందు
నవసర విశేష సభకు గం ♦ డనుచుఁ జేర్చి
తను విషాదంబు తోఁపన ♦ క్బరు విభుఁడు, 288

— అక్బరు సార్వభౌముని విషాదము. —

సీ॥ అకట! దేవేరీ మ ♦ హాయుద్ధమున సైన్య
పటలితో నోడె షా ♦ బాజుఖానుఁ!
డవ్వాల సూర్య మ ♦ హాల్ దుర్గమునఁ గడు
దర్పాఢ్యుఁడు మహాబత్ ♦ ఖానుఁడోడె!
సచల గృహము దుర్గ ♦ మందు వాహినులతోఁ
గడతేఱెను షరీదు ♦ ఖానుఁ డింకఁ!
కుంభల్మియర్ కోట ♦ గురు బలోద్దాముఁ డ
బ్దుల్లాపతి స సైన్య ♦ ముగను బడియె!
గీ॥ నణఁగి వెన్కకుఁ బోయిన ♦ యాప్రతాప
సాగర మహాతరంగంబు ♦ సరభసముగ
నిప్పు డుప్పొంగి యస్మత్పై ♦ కెత్తి వచ్చె;
నింక నెట్లోర్తు! మేవాడ ♦ యెట్లు నిలుచు!" 289
క॥ అని మోము డిల్లపడి పో
యినఁ గని హరివిజయసూరి ♦ "యిస్లాం[illegible]
బును దలఁచుచు నడపఁగ నో
పని రాణా కిప్పుడింత ♦ బలి మెటు లొదవెఁ!" 290
సీ॥ అనిన, నక్బరు విభుం ♦ డతని వీక్షించి "షా
మాసాహియను పూర్వ ♦ మంత్రి యొకఁడు
పరిషియా కడనుండి ♦ వచ్చి దూరపు సీము
కరుగుచున్న ప్రతాపు ♦ నడ్డగించి
కేవల ధర్మ దీ ♦ క్షా వర్తనము మాన్పి
రాజనీతి ప్రకా ♦ రమ్ముఁ గఱపి
గణుతికి మీఱు సై ♦ కము వేయుబంగ్లీ సం
పించినాఁడని మొన్న ♦ వేగు [illegible];
గీ॥ యాత్మదేశంబు విడి సరి ♦ హద్దు దాఁటి
చనఁగ నున్న ప్రతాపుఁడు ♦ మనసు మార్చు

కొని సమస్త బలంబొనర ♦ గూర్చుకొనుచు
నీమహా సంగరారంభ ♦ మిట్లు చేసె." 291

క॥ అన నైన గురువరుం డో
య్యన "భామాసాహి త్యాగ ♦ మతి వంద్యం; బ
య్యనఘుండు పాత్రదానం
బునను గృతార్థతను గాంచి ♦ పుణ్యుం డయ్యెన్. 292

మ॥ పెనుకష్టంబుల మున్గి కాంతి చెడి పి ♦ ప్పిన్ దేలు నాదేశ మా
తను సేవించి సకాలమందు నిరతో ♦ ద్ధారంబు గావించు పా
వన భాగ్యం బది పూర్వజన్మమునఁ గో ♦ ల్పన్ రాని పుణ్యంబు చే
సిన శుద్ధాత్ముల కబ్బుఁ దక్కొరులకున్ ♦ సిద్ధింప దెవ్వట్టునన్. 293

క॥ భామాసాహి బుధేంద్రు బ
హూ మహిత యశో విభూతి ♦ యజరామరమై
భూమియు దివమును నిండు; మ
హామహుఁ డతఁ"డనఁగ, నక్బ ♦ రాత్రిన్ బడుచున్, 294

మ॥ "మనకీర్తి సభాముఖంబునను "భా ♦ మాసాహి పుణ్యాత్ముఁ డుం
డని, శాసించని" దర్ప మేటికి! బ్రతా ♦ పాధీశ్వరున్ గెల్చి యా
యన నోర్చన్ దనకే సధీశ్వరుఁడనం ♦ చన్ బ్రాతునం చాస లుం
డను గొండంతలుగాఁగ; నిప్పు డవి యూ ♦ డెన్ నామనం బేర్చుచున్.

సీ॥ పదునైదు లక్షల ♦ శ్వబలంబు పాదాతి
బలం మేఁబదైదు ల ♦ క్షలును గలిగి,
యుర్వినెల్ల జయింప ♦ నోపు పదాఱు వం
దలమంది వాహినీ ♦ శులను గలిగి,
విశ్వం బదరఁ బది ♦ వేల పిరంగులు
దశసహస్ర ద్విప ♦ శతులు గలిగి,
వరుసలు వరుసలై ♦ పరగు భాండాగార
భవనముల్ నిండ ద్ర ♦ వ్యంబు గలిగి,
గీ॥ రాజరాజుల గెలిచి వి ♦ క్రమము వలచి
భరత ఖండ మేలెడు సార్వ ♦ భౌముఁడ నయి

వనముల్ వంచిరి; మానసింహుఁ డరిమా ♦ న ప్రాణ విధ్వంసన
ధ్వనితాశాంత యశోవిశాలుఁ డపు డ ♦ క్బర్ నేత నీక్షించుచున్, 301

—॥ { మానసింహ ప్రభు వక్బరు సార్వభౌమునకు
మనస్తాపోప శమనంబు చేయఁ బూనుట. } —॥

సీ॥ అరిరాజ మర్దనో ♦ ద్ధురశక్తి గాంధార
సీమ నీసీమగాఁ ♦ జేసినాఁడ!
నడిగి నంతనె వెళ్లి ♦ గడియలో ఢిల్లికిఁ
గాశ్మీరమును దెచ్చి ♦ కలిపి నాఁడ!
మానవుల కసాధ్య ♦ మైన కాబూలు గె
ల్చి భవత్పదంబులు ♦ చేర్చి నాఁడ!
నదు విశాలములు సం ♦ గ విహార దేశముల్
గెలిచి నీకు యశంబు ♦ గొలిపి నాఁడ!

గీ॥ దళులు బలియుట గెలువఁగా ♦ నలవి గాని
దేశముల నెన్నియేని సం ♦ దిటను దెచ్చి
నీకు లోఁబడఁ జేయు ని ♦ ర్నిద్ర శౌర్య
పరుఁడ నేనుండ నీకేల ♦ వసట మనుజ! 302

చ॥ వ్యవధి లపంబులేని కల ♦ హంబుల వెల్లునఁ జిక్కి రాజకీ
యవితత కార్యజాలముల ♦ యందు మునింగి విదేశమందు నుం
డవలసి కొన్నిమాసము లె ♦ డంబు జనించి పరితాపుతోడి యా
హవము నుపేక్ష చేసినటు ♦ లొంటయు నిక్కము! యేమి చేయుదున్! 303

మ॥ అవనిన్ జూడ్కులు వాల్చి నీవడలి దై ♦ న్యం బందినన్ నామనం
బవియున్! నాకుఁ బరితాపసింహునకు బా ♦ ల్యం బాది వైరానిలం
బు విజృంభించుచు నేఁటి కింకను మనం ♦ బున్ గాల్చుఁ! జల్లార లే
దు! వితాసీయుక తాఁకి నొంచి యుడికిఁ ♦ తున్! సుస్థిరుఁ జేతున్ ప్రభూ!

సీ॥ చీమయుఁ జొరని కా ♦ శ్మీర దేశములోని
కొండలన్నియుఁ బిండి ♦ పిండి యయ్యె!
మనకుఁ బరిషియాకు ♦ మధ్య సాందాృటవుల్
పగిలి బీటలువాఱి ♦ బాట లాయెఁగా!

దక్షిణాపథము విం ♦ ధ్యము పాదఘట్టన
గుగుత కోర్వక భూమిఁ ♦ గ్రుంగి పోవు!
సింగ కనుపుగాని ♦ హిమగిరి ప్రాంత రా
జ్యములెల్లఁ దలక్రిందు ♦ లగుచుఁ దిరిగు!

గీ॥ నా ప్రతాపుఁ డెంత! ♦ యాతని బల మెంత!
త్యాగ మెంత! యతని ♦ ధైర్య మెంత!
పోవ నిమ్మటంచు ♦ నే విడిచితిని గాని
కన్నుఁదెఱచిన నెపుడో ♦ కాలి పోఁడె! 305

సీ॥ ఆఫ్రికాఖండంబు ♦ నంతయుఁ దెచ్చి వం
గ మహాంబురాశిని ♦ గలిపి వైతుఁ!
ప్రాలేయ శైలంబు ♦ పాదాహతోఁ బెకలించి
యావరణాచలం ♦ బవల ద్రోతు!
సింధుమ్ముల చెంత ♦ నీలోత్పలంబుగా
సిలాంబురాసి త ♦ కోట్లు సేతు!
నుత్తర కురుభూము ♦ లొక్క తృణంబున గాల్చి
గురుదక్షిణగ నీకు ♦ గుదుగు పంతు!

గీ॥ నాసియాఖండ మెల్ల ♦ నీ యాజ్ఞ నుంతు!
నిట్టిచో నొక్క మేవాడ ♦ యెంత నాకుఁ!
తెలియవే మద్భుజాబలో ♦ దీర్ఘ శక్తి!
తలుపులను మ్రింగువాని క ♦ ప్పళము లెంత! 306

క॥ కావరము పెచ్చు పెఱిఁగిన
మేవాడఁ బ్రతాపసింహు ♦ మ్రింగుటకై నా
జీవితము మీఁదు దీయుఁదు
నే వెలితికి సందు దొరక ♦ నీయకు మొఁడఁదగ! 307

క॥ ఈపని నెరవేర్పనిచో
నా పేరున బిల్వబోకు ♦ "నా విసి యక్బర్
భూపతి యందఱుఁ గనుగొని
యీపగిది నికెంత కాల ♦ మిటు వేగింతుర్" 308

సీ॥ మేవాడ జయము న ♦ ర్థిఁ గ యనేక లక్షలు
సేనల నాహుతి ♦ చేసినాఁడ!
సమర సన్నాహముల్ ♦ జరుపుచో ధనము గో
టులు గోట్లు నట్టిటఁ ♦ గలిపినాఁడ!
నాకొఱకుఁ గ్రొఱు జగంబు ♦ మవ్వెత్తు గొనెడు చ
మూనాయకులను గో ♦ ల్పోయినాఁడ!
సిరుల దేండ్లుగ క్షణం ♦ బేని విడని మాన
సిక దుఃఖపరత స్రా. ♦ క్షిల్లినాఁడ!
గీ॥ బడఁగరాని క ♦ ష్టంబులు పడినవాఁడ!
నడువరాని దు ♦ ష్పథముల నడచినాఁడ
నష్ట యాసించి యాసించి ♦ యాస లుడిగెఁ!
గాల్మ యుడివోయె మిగుల సం ♦ తాప మొదవె! 309

మ॥ ఎవరుం జెప్పినఁగాని నమ్మకము ♦ నాకింతేనియుం లేదు నే
నెవరిం గోరను సాయమున్ సలుప ర ♦ మ్మంచు నాకెవ్వరుం
లవమున్ మేలొనరింప లేరరక కా ♦ లంబెల్ల నందంగ రా
సి వృథాశారతిఁ జెల్లెఁ! జింత యొకఁడే ♦ నిల్చెన్ మదీయాంశమై. 310
గీ॥ 'పిడి చనెదె ప్రతాప! మే ♦ వాడసీమ!
చాలునిఁక మీఁద దవ గతి ♦ స్త్రవ యటంచు
మమగతి ర్మమ'యని చింత ♦ మాని యుంటిఁ!
గూళ పాలుండు నా కొంపఁ ♦ గూల్చె నకట! 311
గీ॥ ఏమిచేయుదు! నా చింత ♦ యిపు డొకింత
యణఁగఁ గలుగఁ బోయిన లేదు! నా ♦ కతని పోడి
పోరు తలమునకలయ్యె' నం ♦ చీ రసమునఁ
బలుక నబ్బూరు రహీమాను ♦ గళము నెత్తి, 312

— అబ్దురహీమాను ప్రతాపసింహునిఁ బ్రశంసించుట. —

మ॥ "ఎదురాడన్ గలవాఁడఁ గా నెపుడు! గా ♦ నీ! విశ్వలోకైక పూ
జ్య సమానార్హ ప్రతాపసింహునెడ నీ ♦ యుక్తుల్ వగన్ బెంచి! నా

యినకులంబు గాలించి చూ ♦ చినఁ బ్రతాపు
నంతటి మహాపురుషుఁ డుండ ♦ డని వచింతు! 319

గీ॥ ఆమహారాజు కీర్తి చం ♦ ద్రాతపమునఁ
జల్లఁగా జీవితమ్ములు ♦ జరపు కొనుచు
మనము సమకాలికుల మౌచు ♦ మనఁ గలిగితి!
మిదియ దేవేంద్ర భోగ మం ♦ చెంచ వలయు! 320

మ॥ ప్రకట శ్రీకర మామహాత్ముని కుమా ♦ రావంబు శ్రీరాము గ
ల్గుకదా యీ! కతఁ డాసనొందుచు వనా ♦ శా సిమ్మగన్ దాఁటి చెం
తకు విచ్చేసిన యానిమేషమె భవ ♦ త్తౌరుష్క సామ్రాజ్య ల
క్ష్మికి నూతేడులు నిండు నక్కనుని ఘో ♦ షింతున్ సిరాఘాటతన్. 321

సీ॥ ప్రతిలేని వైభవ ♦ ప్రాభవంబులు నీవు
నెఱపు నీ హస్తినా ♦ పురము నందు
గాఢాంధకార సం ♦ గతమైన రేయి నాఁటి
రాత్రి నొంటరిగ నా ♦ రాజ పుత్రి
యమునకు సెట్టిన గోని ♦ నాసతి తెలిసిన
క్షణమునఁ బుట్టిన ♦ ఖండ సేన!
విడక నీ విందుండ ♦ వీరానో సాటిపో
వలయునో మోజించు ♦ వలసి యుండు!

గీ॥ శ్రీరమా భర్త సాక్షాత్క ♦ రించి నట్లు
లా ప్రతాపుఁడు కనుపించు ♦ నపుడు నీదు
సేవకుఁడ నేనె నీ సేవ ♦ చేయఁ గలనో!
యవలఁ దొలఁగుదునో తెలి ♦ యంగ రాదు! 322

మ॥ మఱి యేదే నొక కారణంబు మొఱు గం ♦ పం బొంది తూఁగాడి యీ
ధరణీచక్రము సర్వ మొక్కమొగి పా ♦ తాళంబునన్ గ్రుంగి యు
క్కఱినన్ సుంత చలింపఁ బోవను! ప్రతా ♦ పాధీను సత్కీర్తి కె
వ్వ రపాయం బొనరింపఁ జూచినను నో ♦ ర్వన్ బోను ప్రాణంబుతో!

సీ॥ ఒక నృపాలకుఁ జేటు ♦ నొక్క రాష్ట్రంబులో
నొక టంకసాలలో ♦ నుద్భవించి

పరమ శోభన నిత్య ♦ వైవాహిక గృహంబు!
తన్నసతీ కంఠము ♦ క్తా స్రజంబు!
గీ॥ నైన మేవాడ పైకేగు ♦ టనుచితంబు!
రాజపుత్రులఁ దోడర ఘోర ♦ రతము పావ!
మాప్రతాప పురోగము ♦ న్మైన కులము,
దండనకు నర్హమే! మ్రొక్కు ♦ దగును గాక! 328
గీ॥ దైవమును దూరమునుంచి యుం ♦ దాఁక వారి
కాచరించిన కొండంత ♦ యఘమె చాలు!
నింక భూదేవి భరియింప! ♦ దెప్పు డెవరి
కెచట నేగతి పట్టునో ♦ యెవ్వఁ డెఱుఁగు! 329
సీ॥ నాగ్లేండ్లవాని నిం ♦ తఁ గఁ జేసితివి! చను
వులను నేర్పించితి! ♦ బుద్ధిఁ గఱపి!
తున్నతోద్యోగ సం ♦ పన్నుని జేసితి!
కూరిమి వియ్యంబుఁ ♦ గూర్చియుంటి!
నీదేహమే నీది! ♦ యీప్రాణమే నీది!
యీజీవితంబె నీ ♦ దెల్ల యప్పుడు!
నాశరీరమ్ము నం ♦ దలి రక్తమునఁ బ్రతి
బిందు వెల్లపుడు నీ ♦ పేరె పలుకు!
గీ॥ నీదు సేమంబు నెంచి ని ♦ న్నిద్ర యశము
నెంచి నీమొడ గౌరవ ♦ మెంచి నీదు
ప్రభుత కేవేళ మేలెంచి ♦ పలుకు నాదు
ప్రార్థనముఁ ద్రోసిపుచ్చకు" ♦ మనెడు నంత! 330

—॥ అబ్దూరహిమాను మాటలకందఱు హర్షించుట ॥—

సీ॥ "ఈమాట లోక మెం ♦ జేని నొదలఁ దాల్ప
విహితమా"నని హరి ♦ విజయసూరి!
యుద్దిదా! యియ్యవి ♦ యమృత వాక్యమ్ములు
తథ్య మనిమె సూరి ♦ దాస సుకవి!

రాజపుత్రుల తోడ ♦ రణ మొనర్చుట కలు
షమ్ము పొమ్మని ఘరి ♦ స్తామనీషి!
యాప్రతాపుఁడు దేవు ♦ నవతారమే యని
విశ్వసింతు ననియెఁ ♦ బృథ్వీరాజు!

సీ॥ నంద ఱాదెదు మాటల ♦ నాలకించి,
యందు నందును గలయుక్తు ♦ లాదరించి
యాత్మభావంబుఁ గొంత గో ♦ ప్యముగ నుంచి,
చిఱు నగవు వెల్వరించె న ♦ క్బరు విభుండు! 331

—( మానసింహుఁడు యవనసభను తృణీకరించి మాటాడుట. )—

క॥ అందఱును గలయఁగని వగ
చెందిన మదితోడ మాన ♦ సింహుండును "మీ
రందె ఱేటులఁ దఱిమిన నా
కుం దోఁచినయట్లు నడుచు ♦ కొనఁగల వాఁడన్! 332

సీ॥ ప్రతాపుడు భృతి నిచ్చి ♦ యాదరించు
భట్టులవిధానఁ బొగడంగఁ ♦ బాలు పడితి!
కాదు! యాత్మాభిమాన మిం ♦ తైన లేక
యేమి చేయుదు! మీశౌర్య ♦ మిట్టు లుండె! 333

మ॥ ఇదె నేఁగాదసి పట్టు పట్టితిన యే ♦ నిందున్న యీమంత్రులున్
బదునాల్వందలు వాహినీశులు ప్రతా ♦ పక్ష్మాధిపున్ జేరి న
న్నదలింపన్ జనుదెందు! మీరలిటు పై ♦ నేమాదురో చూతు! రు
స్నదశాస్త్రాలము చెంగటన్ నిలువ వీ ♦ మార్జార గర్జార్భటుల్. 334

మ॥ పరు లాడినిని గుఱించి యేల పలుకన్! ♦ ప్రత్యేక శత్రుత్వముల్
పఱులున్ నాకుఁ బ్రతాపసింహునకు! నం ♦ బర్ నేనతో నేగి యు
ద్ధుగశౌర్యాంబుధిఁ దాఁకి యాతని జయిం ♦ తున్! మానసింహేంద్రుఁ డా
క్బరి సాయంబు నపేక్షసేయుటకె దా ♦ ర్ఢ్యాణంబు చూపించెదన్.

క॥ స్థావర జంగమ యుత ధా
త్రీవలయం బెల్ల నదురు ♦ తిరిగి నిలిచినన్

గాపుగానసేర్తు క్షణమున
నీవిశ్వము విస్మయమున ♦ నెదపడు చుండఁ. 331

గీ॥ సేనలు ధనంబు రాష్ట్రంబు ♦ జీవితంబు
నతని గెల్వంగ నర్పింతు" ♦ ననుచు రౌద్ర
ముల్లసిల విజృంభింపఁగా ♦ నెల్లవార
లేమనఁగ లేక నిల్చి! రా ♦ పృథ్వీరాజు, 337

—( పృథ్వీరాజు మానసింహు నధిక్షేపించుట )—

సీ॥ అతిపావనుఁడు ప్రతా ♦ పాధీశు నెవనిగా
విశ్వసించితివో! ద్వా ♦ వింశతి యగు
రాజపుత్రక మహా ♦ రాష్ట్రంబులకు. రాజు
లకు నగ్రగురుఁడు! కా ♦ లంబు చక్క-
జరిగియుండినను నం ♦ దఱు రాజపుత్రు లా
ధన్య సంఘుల మ్రోల ♦ దాసులె కద!
శ్రీసలుంబ్రా కృష్ణ ♦ సింహునిచే మొట్టఁ
బడి తల దిమ్మెక్క ♦ పడియె యుండు!

గీ॥ పాదుసాహి ప్రాపు ♦ పట్టె మిన్నందుదు!
వాడినములు మఱచి ♦ తయ్య! యిప్పు
డేఁక తోఁక దొడిగి ♦ యీఁగ బెబ్బులివైన
పాటి మాట నీక ♦ పాటి కెక్క. 338

సీ॥ సైన్యాధిపతులు ప ♦ జ్జను జేరి "కైలవా
రా సీమ ఫలవృక్ష ♦ రాజి నరులు
నఱికిరి, తిండి చే ♦ కుర"దన్న నవ్వుచు
"వైరులు చెఱుపంగ ♦ వలను పడదు
తిండి చేకొనుట సం ♦ ధిలె లోప; మింక శా
త్రిపుతెల్ల సంవత్స ♦ రముల కొలఁది
పనిచేసి చెడుప నో ♦ పని తిండి జూతు; బ
చ్చిక రుబ్బి రొట్టెలు ♦ చేసి తింద"

గీ॥ మనుచుఁ బందొమ్మిదేండ్లు తో • యమును గడ్డి
దినుచు సతతోపవాస మూ • నిన తపస్వి.
యాతనిదెస వేల్పులు చూపు శౌ • ర్యపరుఁ డున్న!
విశ్వమంతయుఁ ద్రుటిని స్తం • భింపఁ జేయు. 339

గీ॥ దేవ పూజార్థుఁ డతని నిం • దించి నీవు
గురువులకుఁ బంగనామముల్ • గూర్చు టయ్యె;
రేఁగి గ్రుడ్డి పిల్లను వెక్క • రించు టయ్యె;
విడఁగ లేము, పాపాబ్ధిని • మునుఁగ లేము. 340

సీ॥ భాగ్యంబు లెన్ని సం • పాదించి యున్నను,
నెన్నెని భోగంబు • లెసఁగి యున్న,
రవి ప్రకాశించు నీ • రాజ్యమంతయుఁ గొన్న,
జయముపై జయ మొందఁ • జాలియున్న,
విక్రమ సూచక • బిరుదముల్ వేలున్నఁ,
జెల్లుబడియుఁ దద్దఁ • జెలఁగియున్న,
సడి యేమి యని యెవరుఁ • డెదురాడ కున్నను,
ధరయెల్ల మనయాజ్ఞఁ • దాల్చియున్న,
గీ॥ ఫల మొకింతయు లేదు; రాఁ • గల యుగముల
క్షితివిద్రోహులకు వంశ • నాశకులకు
నాత్మ గురుద్రోహకుల కుదా • హరణముగను
నెల్లరును జూడఁగలరు వే • లెత్తి మనల. 341

మ॥ అకటా! కానలఁ బుట్టి యుండె బలితం • బై జాలియే లేని ఘా
తుక సత్త్వంబులు గూడ నాత్మకుల జం • తుచ్ఛేదముల్ మాని వే
[illegible] గుక్షి భరించుచుండు! నిజధ • ర్మోద్వాసముల్ జేసి స్వీ
య కులధ్వంసము చేయుచుంటివి; మను • ష్యత్వంబు చే దయ్యెనే! 342

సీ॥ పాల మున్నీటిలో • పల నెన్నో వస్తులు
ద్భవ మొందె; నొక చంద్ర • దర్శనమున
నుప్పొంగుచుండుఁ బ • యోధి; యట్టులె రాజ
పుత్రి పావన కులాం • భోధి యందు

మనమందఱము జనిం ♦ చినను రాణా కీర్తి
చంద్రికయే తదు ♦ త్సాహకారి;
మేవాడకే గాద యీ ♦ విశ్వమున కెల్ల
నతఁడు పేరుఁడు గురుం ♦ డగుచుఁ బొలిచె;

గీ॥ నట్టి స్వకులదీపకు స్వామి ♦ నాత్మవేత్త
నిరత పాదలఁ దాలిచి ♦ చరణపూజ
సలుపక తృణీకరించు వి ♦ శ్వాసహాంత
యిలను మననేమి! పరలోక ♦ మేగ నేమి! 344

గీ॥ పూల దారసాని మల్లెపూ ♦ పూచు పఱకు
'నేను సాధారణమ్మైన ♦ నేలన' యనెఁ
గన్నెతోట! ప్రతాపుసఁ ♦ గన్న పిదపఁ
దనరె భూదేవి నిజము పు ♦ త్రవతి యగుచు. 345

గీ॥ భరతఖండ మహాలక్ష్మి ♦ 'భాగ్యమమ్మ'
నని ప్రతాపుని యశము కీ ♦ ర్తనము సేయఁ
గాదనఁ జెవి నిలు గట్టి ♦ వచ్చి వినుము
నెత్తిఁ దగునయ్య! వినపాల ♦ విత్త నగుచు! 346

చ॥ యవన మహామహీశ్వరుఁ డు ♦ దార హృదంతరుఁడై యెటెందు నె
ప్పైన రెటు లాడెఁ విని స ♦ హించు నటంచుఁ బ్రతాపదేవుఁ గూ
ర్చి వృథగ నిందలాడెదవు! ♦ చేసిన పాపము చాలుఁ జాలు! నా
చెవులకుఁ జేదు గ్రమ్మెడు; ని ♦ సీ! యని ధిక్కృతిఁ జూచి నిల్వఁగన్!

క॥ వడిఁ ద్రొక్కఁ దొరికు భుజగము
వడువున నంబరు విభుండు ♦ పైదూఁకఁ దొడం
గెడు సడిఁ గనుఁగొని యక్బరు
కడు సమయ స్ఫురణ గలిగి ♦ కార్యజ్ఞుండై, 348

—( అక్బరు సార్వభౌముఁడు శాంత వచనములు పలుకుట. )—

చ॥ "పలుపురు మీరు మీహృదయ ♦ భావములన్ దెలియంగఁగోరి నే
నలిపితి నాతనిన్ గురించి ♦ చర్చ యొకింత! కలంతపట్టు మీ

పలుకుల సారముల్ విశద ♦ భంగి నెఱింగితి! నామనంబునన్
గల తెఱంగంతయుల్ దెలియఁ ♦ గా వినిపించెద; నాలకింపుఁడీ! 349

చ॥ సమరము లొక్కరీతిఁ గొన ♦ సాఁగఁగఁ జేసితి; నిట్లు కొంతకా
లము కడచన్న నొప్పఁడె చ ♦ లంబఱి నాదు ప్రభుత్వమంచు; వి
క్రముగఁ బ్రతాపభూపు నెడఁ ♦ గల్గ దొఁకించుక యీర్ష్య నాకు; గ
య్యములను బొద్దుపుచ్చుట ప్రి ♦ యంబన జెల్లునె! యెట్టి వారికిన్!

గీ॥ ఆ మహానాయకవతంస ♦ మావప్రతాపుఁ
డెన్నగతుల మోజించిన ♦ నన్నుఁబోలు
కోటిమంది రాజులు చేరి ♦ కొలువఁదగిన
సూత్రనిధియను మాట వ ♦ ట్రిల మాట! 351

సీ॥ అరమణీయ దు ♦ ర్వారతేజోమూర్తి
సందర్శనమున నా ♦ నంద మొంద
వలయు నటంచుఁ గొం ♦ డలుఁ గోట్లుగా నాకుఁ
గోర్కులు మదిలోనఁ ♦ గొనలుసాగుఁ!
గాని యిన్నేండ్లుగాఁ ♦ గాలమంతయు నిట్లె
కడచె! నా కట్టిభా ♦ గ్యంబు గలుగ;
దతని దర్శింప నా ♦ కర్హత యున్న దే
యని పలుమాఱు జం ♦ కిడరు చుందు;

గీ. గురువు దైవంబుఁ జూడక ♦ క్రూరబుద్ధి
నామహారాజునకును జే ♦ సైనదాక
నగ్గు గావించి తెగుదునం ♦ చిపుడు పోయి
చేరి సాన్నిధ్యమున నిల్వ ♦ సిగ్గు దోఁచు. 352

గీ॥ ఆమహాభాగు కీర్తి గా ♦ నామృతమునఁ
జిక్కవాఁ డెల్ల నను నింద ♦ చేసి తిలు;
నతి ధవళమైన గూఁతని ♦ యశము వోలె
నాదు దుష్కీర్తి శాశ్వతం ♦ బై దనర్చు! 353

గీ॥ నాదు జీవితశేష మం ♦ తయుఁ బ్రతాపు
సేవఁ గడిపినఁగాని దు ♦ ష్కీర్తి పోవ;

దా ధరాధీశుతోడి వి ◆ రోధమునకు
నీళ్లు విడిచి నే నుఱక శాం ◆ తించువాఁడ 354

ఆ॥ బ్రతికి నన్ని నాళ్లు ◆ బ్రదుకము! రాజ్యతృ
ష్ణకును మేర గలదె! ◆ చాలు! నన్న
దాసితోడఁ దృష్టి ◆ దనరుట మేలంచుఁ
బలికెఁ మానసింహు ◆ వైపు చూచి, 355

గీ॥ వట్టి పాండవ బీడు మే ◆ వాడ సీమ,
పరక పాతికె గాని లా ◆ భంబు గలుగ!
దా మహారాజు దేశంబు ◆ నాక్రఁచే గ్ర
హింప నిమ్మింక; నష్టం బ ◆ దేమి మనకు! 356

క॥ కడచనె నేఁబదియేఁడులు;
ముడుతలువడి తెల్లవడియె ◆ మోమును బొమలున్;
గడిమి చెడె; నొడలు సడలెను;
గడు వృద్ధుఁడ నైతి; శాంతి ◆ గానఁగ నైతిన్. 357

మ॥ సకలప్రాభవ వైభవంబుల మొగల్ ◆ సామ్రాజ్య మేలంగఁ ద
గ్గ కుమారుండు 'సలీము' దేహము చెడం ◆ గాఁ ద్రాఁగుఁబోఁతయ్యో! మా
మక చిత్తంబును బాయదీ నగులు మ ◆ ర్మచ్ఛేదియై! దుష్ట దం
శక సంగంబున బ్రగ్గు మొగ్గ యది పు ◆ ష్పంబై గుబాళించునే! 358

క॥ పదియేండ్ల ప్రాయమాదిగఁ
గదనము కదనం బటన్న ◆ కలతలతో న
ల్వదియేండ్లు కడచిచనె! మన
బ్రదుకులు పోరులనె తెల్ల ◆ వాఱిన వశలా! 359

గీ॥ ఆ ప్రతాపుతో నింక క ◆ య్యంబు వలదు!
వలదు! నలువుర నోళ్ల లోఁ ◆ బడఁగఁ జాలు!
మందఱము జీవితమ్ముల ◆ యందలి తుది
రంగముల శాంతితోడఁ దీ ◆ ర్పంగవిమ్ము"! 360

—( అక్బరు నిర్ణయమును మానసింహుఁడు సమ్మతింపక పోవుట )—

మ॥ అని శాంతంబు నయంబు నచ్చుపడ మా ♦ టాడంగ నా వాక్యముల్
విని యంబర్పతి "నీ వచస్సులు మదిన్ ♦ వేధించు! విశ్వంబు భ
స్మనిశాయంబుగఁ జేయు నాజ్వలనముల్ ♦ జల్లారె! నే డెట్లు పో
యిన నీవింతకు యింత పెత్తు వడెదం ♦ చే నెంచనైతిన్ జమీ! 361

మ॥ ప్రమదోద్యానముఁ బోలు నీ యవన సా ♦ మ్రాజ్యంబునన్ గంటకో
గ్ర మహీజంబును నెవ్వగన్ బెనిచె నీ ♦ రాణా ప్రతాపుండు! త
త్సముదాత్తాద్యమడంప లేనియెడ నీ ♦ దర్పంబు నే నొల్ల! ఖ
డ్గము నేనొల్ల" నటంచు నేల విసరెన్ ♦ గాలాహి నా రోఁజుచున్. 362

గీ॥ పరమ గంభీర మాతని ♦ వదనమందు
వీర తేజో మహాలక్ష్మి ♦ ద్విగుణితశ్రీ
నెలిగెగ! సభయెల్ల మౌనము ♦ ద్రలఁ జెలంగె!
నంత నక్బరు నృపమౌళి ♦ యతనిఁ గాంచి, 363

—॥ అక్బరు సార్వభౌముఁడు మానసింహుని శాంతింపఁ జేయుట. ॥—

క॥ శమనగవ జేగుఱుగొంగ, మన
మున నుడుకఁగనేల! శాంతి ♦ మునుగొని నాచె
ప్పిన మాటలాదరమ్మున
వినుమ నిరువురకు సుఖము ♦ వెనుకఁగఁడగదే! 364

మ॥ మనయుంగ రహిమాను శీలము జగ ♦ న్మాన్యంబు! స్వచ్ఛంద వ
ర్తనుఁ! డేనాఁడు నసత్యగోచనును జెం ♦ దన్ బోనివాఁ! డేను పెం
చినవ్యక్తి! బిత డెల్లవేళలను నా ♦ శ్రేయంబ కాంక్షించు! నీ
తని వచ ♦ శిరసావహింపఁ దగుఁ గా ♦ దా! నాకునున్ నీకునున్. 365

చ॥ సగరుఁడు పృథ్వీరాజ కవి ♦ చందుఁడు! మాన్యతముండు! నీకు సు
స్థిరగరిబంధు వర్గమునఁ ♦ జేరిన వాఁడు! ప్రతాపసింహు సో
దరునకుఁ గూర్మియల్లుఁడు! కృ ♦ తంబెఱుఁగన్ గల పుణ్యమూర్తి స
త్పురుషుఁ డితండు సేర్చి హిత ♦ ముల్ దలఁ దాల్చక యున్న నేమమే!

గీ॥ హరివిజయ సూరియును భువ ♦ నైక గురుఁడు!
సూరదాస మహాకవి ♦ సుగుణ రాశి!

ఆ॥ భువనమెల్లెడ నిండి మా ♦ ఱుబ్బరము కొల్ల
గొట్టఁబడెనను వార్త లె ♦ క్కుడుగఁ బొంగె!
సిగ్గుచెడి మానసింహుండు ♦ శిరము వాల్చె!
నాప్రతాపుఁడు మొలకె న ♦ వ్వులరఁదాల్చె! 377

గీ॥ ధాన్య ధన హేమ వస్తు సం ♦ తతులతోడ
నిత్యలక్ష్మీ నివాస మం ♦ దిరము నగుచుఁ
దొంటిమాడ్కిఁ గుంభల్ మియర్ ♦ దుర్గ మపుడు
మేరుగిరి దుర్గముల కాంతి ♦ మ్రింగి యుమిసె! 378

సీ॥ నెలనెల మూఁడు వా ♦ నలు కురియఁగ సాఁగెఁ!
బదన్నై యవని సార ♦ వంత మయ్యెఁ!
బొలమును దున్ని వి ♦ త్తులు చల్లఁ గృషికుండు!
పైరు లన్నియుఁ బ్రోది ♦ వడయ సాఁగెఁ!
శైలవారా మహా ♦ కాననంబున ఫల
తరువులు తామగ ♦ తంపమయ్యె!
మొలకెత్తు, బీటి నే ♦ లలు గడ్డి పెంపొందె!
గణనకు మీరాలి గో ♦ గణము పెరిగె!

గీ॥ గోపురము లందుఁ బలుకోట ♦ కొమ్మలందు,
నగరముల యందు గ్రామకం ♦ ఠంబు లందు
నచల శృంగంబు లందు, సూ ♦ ర్యధ్వజములు
వందలుగ లేచి పూర్వ వై ♦ భవముఁ జాటె 379

సీ॥ భువనమందెల్లెడఁ ♦ బూలుపూచిన యట్లు
లాప్రతాపుని కీర్తి ♦ యతిశయించె!
దేశ దేశమునుండి ♦ దినదినం బామహీ
విభుని దర్శించి సే ♦ వింప వచ్చు
పుణ్య యాత్రిక బృంద ♦ ముల సంఖ్య గుణింతయు
నంతని గణన సే ♦ యంగ రాదు!
యవనులుగాక హైం ♦ దవులుగాక సమస్త
కులములవారు సే ♦ వలనొనర్చి!

ఆ॥ రొకఁట వింధ్య శైల ♦ మొకఁట థారు టెడారి
యొకఁట హిమనగేంద్ర ♦ మొకఁట జలధి
మధ్యఁగలుగునేల ♦ మనుజ సమ్మర్దమై
కాంచె నిసుక వేయ ♦ రాలకుండ! 380

క॥ తనదేశము నుండియు సిం
హాని కాయుంబట్టి భట స ♦ హస్రంబును శ్రా
వనమూర్తి కృష్ణసింహాఁడు
కొని కుంభల్మియును కోట ♦ కును విచ్చేసెఁ. 381

— స్వాతంత్ర్య దినోత్సవము —

మ॥ స్వవసీయంబు ముహూర్త మేర్పఱచుచుఁ ♦ స్వాతంత్ర్యలక్ష్మీమహో
త్సవముల్ చూడఁగ రండటం చఖిలరా ♦ జన్యాళికిఁ సర్వబాం
ధవ వర్గంబుల కాశ్రితావళికి మి ♦ త్రశ్రేణి కాహ్వాన ప
త్ర వితానంబులు వ్రాసిపంపెను సలుం ♦ బ్రాకృష్ణసిం గయ్యెడఁ. 382

గీ॥ వేనవేల్ పుట్లుధాన్యంబు ♦ దానికిఁ దగు
నన్ని సంబారములు గూర్చి ♦ యచటఁ జేరు
గాజు లొప్పు లుండఁగ గుడా ♦ రంబు లెత్తి
రొక్కొకం డొక్క పురమునా ♦ నొప్పుచుండ! 383

గీ॥ గడియ గడియకు వేలు ల ♦ క్షలుగ వచ్చు
ప్రజల సందడిని హనుమ ♦ ద్ద్వార మలరె
నూఱు తిరుగాళ్ల లెసఁగిన ♦ దారిఁ! గోట
వ్రేలు మోపంగ సందు గ ♦ న్పింపదయ్యె! 384

సీ॥ శుభ వాసరమ్మున ♦ శుభ ముహూర్తమ్మున
సభ్యాజన స్నాన ♦ మాచరించి
పాణేశ్వరీదేవి ♦ ప్రభుమాళి యనురసిం
హాఁడు నూత్నవస్త్రంబు ♦ లొనరఁదాల్చి
సకలకళ్యాణ భూ ♦ షణములు ధరియించి
యువసీసుగులు మంత్రు ♦ లొప్పవగలు

పార్థివు లనుసరిం ♦ పంగ ముత్తైదువుల్
పాటలు పాడుచుం ♦ బజ్జనడువఁ,

గీ॥ కూడుకొని భవానీదేవి ♦ కోవెలకును
వెళ్లి గౌరిని బూజించి ♦ వివిధరత్న
ఘటితహాటకమకుటంబు ♦ గాన్కయిచ్చి
మ్రొక్కియందఱు నాస్థాన ♦ మునకు వచ్చి. 385

సీ॥ వేదిపై దర్భలు ♦ వేసి యాపై రత్న
భర్మాసనంబులు ♦ వఱలు చుండ,
రెంటిపైఁ బాణేశ్వ ♦ రీప్రసాదపు లెల్సి!
గా మారభట్టార ♦ కాత్మజులును
చంద్రభట్టారకు ♦ సత్పుత్రు లెదురుగా
నున్న పీఠములఁ గూ ♦ ర్చుండి! నవల
వెలుఁగు నాసనములఁ ♦ గులవృద్ధులును సూర్యుఁ
డఖిల సామంతులు ♦ నవని పతులు

గీ॥ గుంపులుం గుంపులుగఁ జేరి ♦ కూరుచుండి!
రవ్వల మహోన్నతమగు ది ♦ వ్యాసనమున
నుండె సముదార విక్రమో ♦ ద్దండమూర్తి
భిల్లలోకైకనాథుఁ డా ♦ భీమచాందు! 386

గీ॥ అతుల సువిశాల వేదిక ♦ భ్యంతరమునఁ
బ్రముఖ మగునొక్క దివ్యాస ♦ నమున నుండె
శాంతమూర్తి తేజోరాశి ♦ సత్త్వ ఘనుఁడు
మాన్యతముఁడు భామాసాహి ♦ మంత్రిమౌళి. 387

గీ॥ అందునిందన నాస్థాన ♦ మందు నెందుఁ
దానయై కార్యభారంబుఁ ♦ దలను దాల్చి
సలలితోత్సాహమూర్తియై ♦ మెలఁగె స్వామి
భక్తిపూర్ణాత్మకుఁడు సలుం ♦ బ్రావిభుండు! 388

క॥ కలనాదమ్మున శంఖం
బులు మంగళదివ్యతూర్య ♦ ములు దుందుభులుఁ

జెలరేఁగి మహానందముఁ
గొలిపెన్ బహువిప్ర వేద ♦ ఘోషము చెలఁగన్. 389

గీ॥ బ్రాహ్మణోత్తముల్ రాజదం ♦ పతులచేత
గణపతికిఁ బూజ చేయించి ♦ కరము భక్తి
నఖిల దేవతా వాహనం ♦ బాచరించి
స్వస్తి పుణ్యాహ వాచనో ♦ త్సవము నెఱపి! 390

సీ॥ పాలేశ్వరిని బ్రతా ♦ పవిభు మౌళిని
నవరత్న సింహాస ♦ నమున నిలిపి
వేదమంత్రాశీర్ని ♦ నాదముల్ వెలయంగ
"విపుల రాజ్యరమాభి ♦ వృద్ధి రస్తు!
శ్రీరస్తు వైభవ ♦ శ్రీరస్తనుచుఁ జల్లి
గముల ప్రసూన లా ♦ జాక్షతములు!
వందులు జయ జయ ♦ ధ్వాన పూర్వముగఁ బ్ర
తాపుని కీర్తి సం ♦ దడును బొగడ!

గీ॥ యచల నందిని బోలెఁ బు ♦ ణ్యవతు లైన
బ్రాహ్మణ స్త్రీలు పాటలు ♦ పాడుకొనుచు
రాజ దంపతులకును హా ♦ రతుల నిడిరి
బంగరు హారంగు దీపాల ♦ పళ్లెరముల! 391

గీ॥ ఆప్రతాపు సింహాసన ♦ మవల నొక్క
హేమమయ మనోజ్ఞాసన ♦ మెక్కఁ జేసి
యమరసింహుని యువరా ♦ జ్యంబునకును
బట్టభద్రునిఁ జేసి సం ♦ బరముఁ గనిగి! 392

మ॥ విమలానర్ఘ మనోజ్ఞ భూషణములున్ ♦ వితైన సౌవర్ణ వ
స్త్రములున్ హాటక రత్నపాత్రలు సలుం ♦ బ్రాకృష్ణసింహాది సై
న్య మహానాథులు కానుకలిచ్చుచుఁ బ్రతా ♦ పాధీశు దివ్యాంఘ్రియు
గ్మము సేవించిరి భక్తిపూర్వక నమ ♦ స్కారంబు లర్పించుచున్. 393

మ॥ తన దేశంబుననుండి సేవకుల చే ♦ తన్ గంపలన్ ముంచి యె
య్యన చెప్పించిన ముత్తియంబులు ప్రతా ♦ పాధీశ్వరున్ దాసు నం

దునఁ గూర్చుండఁగఁ జేసి వాని సరిమై ♦ తుల్యూఁచి మేవాడ భూ
జనులం దంతటఁ బంచి పెట్టె శబర ♦ జ్యానాథుఁ డత్యాదృతిన్! 394

క॥ అందఱు హర్షధ్వని మి
న్నందఁగ సింహాసనంబు ♦ నఱుత నిలిచి కే
లుందమ్ములు ముకుళించుచుఁ
గందో యకమోడ్చి మధుర ♦ గళసంపదతో, 395

మ॥ "అనిదం పూర్వపు దేశభక్తి యదివా ♦ ర్యంబైన త్యాగైక వ
ర్తన మత్యాకలులేని విక్రమకళా ♦ ధాటిన్ బ్రసాదించి యీ
మన స్వాతంత్ర్య మహోద్యమంబు జయ స ♦ న్నాన్యంబుగా నుద్ధరిం
చిన సర్వేశ్వరు పాద పద్మములు నే ♦ సేవింతు సద్భక్తితో. 396

క॥ మనలోని యోగ్యతాలవ
మును నెరసి ప్రపంచమునకు ♦ స్ఫుటపఱచిన యీ
వన నృపతి యుక్కరీశుని
కనువు పడెమఁగాక యీయు ♦ రా గోగ్యంబుల్. 397

క॥ కల్లనైన నోరుల జెసఁ బగ
మొలువక యుండెడిని నెల్ల ♦ ఘను నా"కని ని
శ్చల హృదయమ్మున దేవునిఁ
దలఁచి ప్రతాపుఁడను భక్తి ♦ దళము కొనంగన్, 398

—॥ ప్రతాపుఁడు తనవారిని సత్కరించుట ॥—

మ॥ "గురుఁడెల్లప్పుడు నగ్రిపూజ్యుఁడని వా ♦ క్రుచ్చున్ శ్రుతుల్ పెక్కు! లీ
చరణాబ్జంబులు నాకహర్నిశములున్ ♦ సంసేవ్యముల్! వీని నే
మఱువన్ జేయుకు మాచు నీశ్వరుని సం ♦ ప్రార్థింతు! మేవాడ నే
మఱువన్ జాలదు నీమహోప కృతి! భా ♦ మాసాహి మంత్రీశ్వరా! 399

మ॥ నను, నా రాజ్యము, నాప్రజావళి నఖం ♦ డ త్యాగమున్ బెంచి ప్రో
చిన దైవంబవు నీవు! సంతతము నీ ♦ శ్రీపాద సేవా వినూ
తన భాగ్యంబు స్థిరంబు సేయుము! నినున్ ♦ ధ్యాయించి కీర్తించుచున్
మనుఁవార్! గనువాఁడ ధన్యతను భా ♦ మాసాహి మంత్రీశ్వరా! 400

గీ॥ అనుచు ముందున కరిగి య ♦ య్యవని దేవు
చరణ పద్మంబులకు మ్రొక్కి ♦ సరస నున్న
తక్కు గురువుల కెఱింగి వ ♦ స్త్రములు కనక
భూషణము లిచ్చి యడుగులు ♦ పూజ చేసి. 401

చ॥ "ఇరువదియైదు వత్సరము ♦ లెన్నియొ బాధల కోర్చి నాపయిన్
దొరఁగు విపత్ప్రవాహముల ♦ నుగ్గడఁబెట్టుచు దేశసేవలన్
గఱపుచు నుద్ధరించిన జ ♦ గన్నుతకీర్తివి! నిన్ను మిత్రుఁడున్
గురుఁడును నింక దైవమని ♦ కూడ భజించెద నాదు పాలికిన్, 402

సీ॥ గణుతింపరాని భో ♦ గములు గల్గి స్వతంత్ర
నృపుఁడవై కష్టంబు ♦ నెఱుఁగకుండ
నడచు మహానుభా ♦ వుఁడవయ్యు ననుఁగూర్చి
వలచి వలచి కష్ట ♦ ములను నూర్చి
ధనము సైన్య మొసంగు ♦ చును స్వయమ్ముగ యుద్ధ
ములు చేసి నాయిడు ♦ ములను నీదు
నిడుములుగా నెంచి ♦ యింత కాలమునుండి
వరమైత్రి నాయెడఁ ♦ బరపినావు!

గీ॥ గిరి తటములందు భటులను ♦ నెఱపి వేయి
కనుల నాయాలు బిడ్డలఁ ♦ గాచినావు!
సిబడమై నిత్యమై యొప్పు ♦ నీదు కృపకుఁ
బారమే లేదు భిల్ల స ♦ ర్వజ్ఞమూర్తి! 403

క॥ నీయప్పు తీఱునది! బ్ర
హ్మాయువు నేనొందినదైన ♦ నర్థోపకృతిన్
జేయఁగలే! నీమణులును
హేయపు వస్త్రముల నొసఁగి ♦ యీఁగఁగఁ గలనే! 404

క॥ అని శబరలోక నాథున
కును వందన మాచరించు ♦ కొని కౌఁగిటి యం
దున నిలిపి నలుంబాగ్రి కృ
ష్ణుని జేరఁగఁ బోయి పేర్మి ♦ శోభిలు చుండన్, 405

మ॥ "నను వీడన్ జనకెప్పుడున్ మెలఁగుచున్ ♦ నానీడయున్ బోలెఁ గం
టిని ఱెప్పన్ వలెఁ గాచి ధర్మవితతిన్ ♦ నేర్పించి, సంపూర్ణ భ
క్తిని నాతోడిద లోకమంచు నను ర ♦ క్షిం గొల్చు నీ యుత్తమం
బును నే దీర్పఁగఁ జాలఁ బెక్కు భవముల్ ♦ పుత్రుండనై పుట్టినన్ 406

మ॥ కడుదూరంబునఁ ద్రోఁచు నాపదఁ ద్రోలం ♦ గన్ జేయఁగా ముందుకున్
బడి యత్నించెదు! సుంత సౌఖ్యమునయిన్ ♦ స్వారాజ్యమే యబ్బిన
ట్లెసఁదన్ బొంగెదు! నాయభీప్సితము నీ ♦ యిష్టం బటంచుం! దనూ
త్యూఁడవం చెప్పుడు చూడ! దేవుఁడ వటం ♦ చూహింతు నా పాలికిన్.

మ॥ త్వదధీనంబగు సైన్యమున్ సిరి మనో ♦ వాక్కాయ కర్మంబులన్
మదధీనంబులు చేసి యెల్లయపుడున్ ♦ నా శ్రేయమున్ గోరు నీ
సదయాంతఃకరణంబు నెంతని ప్రశం ♦ సన్ జేయు! నీ సాహసం
పద మేవాడకు వజ్రదుర్గము గదా ♦ ర్పన్ గల్గెఁ గీర్త్యున్నతుల్! 408

మ॥ ఇఁక రానుండెడు కాలమందున జనా ♦ ళి దేశ మందైన నా
యక ప్రస్తావము చేర్చి నొక్కడ 'సలుం ♦ బ్రా కృష్ణసింహుం' డనన్
మొకముల్ విప్పఁగ స్వామిభక్తి గొనుకచోఁ ♦ బుణ్యాపమున్ జెందె నా
రికి సాక్షాత్కృతినైన తన ర్చెడిస! దం ♦ డ్రీ! యెంత పుణ్యుండవో!''

మ॥ అని పాదంబుల మ్రోలఁ వ్రాలుచు సమా ♦ త్యాధీశ్వరున్ బూజ చే
సిన నాతండు సమోద బాష్పనయన ♦ శ్రీయుక్త సాష్టాంగ వం
దనమున్ దీరిచి భక్తితో నిలిచె! నా ♦ ధాత్రీశ్వరుం డంతఁ జెం
తనె సూక్తాది సహోదర ప్రతతి సే ♦ నా భర్తలన్ జూచుచున్, 410

మ "తిన నాహారము లేక యుండినను భ ♦ క్తిన్ జెందుచున్ దాంద్రి రీ
తి ననున్ గొల్చుచుఁ ద్యాగమున్ నెఱపుచున్ ♦ దేశంబు సేవించి శో
భన సత్కీర్తి పరంపరల్ నలుదెసల్ ♦ ప్రాకంగ వర్తించి నా"
రనుచున్ వారిని వారి వారిఁ గను నా ♦ హ్లాదంబునన్ జేయుచున్, 411

క॥ విలువగల వస్తువుల భూ
షల నొసఁగుచు నవ్యరీతి ♦ సన్మానములన్
సలుపఁగ భామాసాహియు
నిలిపెను సింహాసనమున ♦ నృపలోక గురున్. 412

—। భామాసాహీ ప్రతాపసింహు నాశీర్వదించుట ।—

సీ॥ బహుళ విద్యుద్దీప ♦ పటల ప్రభాభాసి
యగు రాజమార్గంబు ♦ ననుకరించు
నీ జీవితంబును ♦ నిరతంబు హైందవు
లనుపమంబగు భక్తి ♦ ననుసరింతు!
రనఘ! నీవంటి మ ♦ హానుభావుల లోక
పావన జీవిత ♦ పటల మెపుడు
దేశ చరిత్రమై ♦ తేజరిల్లుచు నుండు!
ధారుణీ జనుల కా ♦ దర్శ మదియు!
గీ॥ నీ చరిత దేశ దేశముల్ ♦ నిండి యుండు!
నీ యఖండ శోభన నామ ♦ ధేయము విను
వార లాపదలకు జంకు ♦ పడక ధైర్య
పర్వతములౌచు శాశ్వత ♦ ప్రభ వహింత్రు! 413

మ నిను దర్శించుచు నీదరిన్ మెలఁగుచున్ ♦ నీతోడ భాషించుచున్
నిను సేవించుచు నీమదిన్ దలఁచుచున్ ♦ నీపూజలన్ జేయుచున్
మనగాఁ గల్గుట మేటిభాగ్యమనుచున్ ♦ మాబోంట్ల మెల్లప్పుడున్
నిను దేవున్ బలెఁ జూచుచున్ గొలుతుమో ♦ నిర్ణిద్ర తేజోనిధీ! 414

సీ॥ కోటికష్టము లైన ♦ గోట మీటఁగ జాలు
వీక్షులఁ బరమ గాం ♦ భీర్య మలర!
నవ శరచ్చంద్రి సౌం ♦ దర్య మందిరమైన
ముఖము శాంతసమగ్ర ♦ భూతి నెఱప!
వ్యాకోచ మల్లికా ♦ ప్రసవ రాజంబట్లు
చిఱునవ్వు పెదవిపై ♦ సిగురులింప!
అందమౌ పుష్టమై ♦ యాజాను దీర్ఘ బా
హార్గళ యుగళంబు ♦ హాసముఁ జెంప!
గీ॥ నాగ్ధి సంవృత మేదినీ ♦ వలయ మెల్ల
వశము చేసికొనన్ జాలు ♦ ప్రభుత దనర!

వెలయు నీవిశ్వమోహన ♦ వీరమూర్తి
విడక మామనసులఁ దాండ ♦ వించుఁగాక! 415

మ॥ అమితోత్సాహము దేశభక్తి రతి నీ ♦ ందెయుండు! నీ మేని ర
క్తమునందుం గల బిందు వొక్కొకఁడు స్వా ♦ తంత్ర్యంబు స్వాతంత్ర్యమం
చు మహాదీక్షను బల్కు! నీకు సము లీ ♦ క్షోణీస్థలిం లేరు! భ
క్తి మహత్త్వంబున నిన్నుఁ గొల్తుఁ గరుణా ♦ దేవి కుమారోత్తమా! 416

సీ॥ రవివంశ కలశ సిం ♦ ధువు రాజరత్నాళిఁ
దరతరంబుగ వెలు ♦ వఱచుఁ గాత!
మేవాడ ఖనిఁబుట్టు ♦ వా వజ్రమొల్ల స్వ
తంత్రతాశాణ దీ ♦ ప్తముగుఁ గాత!
రాజపుత్రాన్వయా ♦ రణిజ తేజము ధర్మ
దీక్షా నాహవవేదిఁ ♦ బెరలుఁ గాత!
పాటేశ్వరిని బోలు ♦ పతిదేవతలకు హైం
దవభూమి పుట్టిని ♦ ల్లవును గాత!

గీ॥ భూజనులు విప్లవమ్ముల ♦ బ్రుంగు నప్పు
డడరు లడఁచి క్రొందలిరుల ♦ నలవరింపు!
నిన్నుఁ బోలు మాధవుఁడు జ ♦ న్మించుఁ గాత!
దన్య గజరాజ సింహ! ప్ర ♦ తాపసింహ"! 417

గీ॥ అనుచు నానంద బాష్పంబు ♦ లతిశయిల్లఁ
జారు నవరత్న సామృత ♦ నారికేళ
ఫలము దోసిటఁ గొనిపోయి ♦ ప్రభువ కిచ్చి
చేతు లెత్తుచు నిట్టు లా ♦ శీర్వదించె. 418

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు॥

ఉపసంహారము.

శా॥ నే నెల్లప్పుడు భావనా బలమునన్ ♦ నీరూప నామ క్రియా
ధ్యానంబున్ గొని తన్మయత్వమున న ♦ న్యాకాంక్ష లేకుండు! నీ
వే నేనైతినో! నేను నీవయితినో! రూ ♦ పింపంగ రాకుండె! ని
త్యానందంబు ఘటించె నీకృతి ప్రతా ♦ పా! విశ్వలోకార్చితా! 1

మ॥ వదియేండ్లయ్యెను నిన్నుఁ గూర్చి పరియిం ♦ పఁ సాఁగి! యిన్నేండ్లు నా
మదిలోనన్ భవదీయ విక్రమ కళా ♦ మాధుర్య సౌభాగ్యముల్
కుదుర్గ నెక్కొని వేలు పాలుకొని మేన్ ♦ గొండంతలౌ కోరికల్
వొదలన్ నిన్ను నుతింప! నీదు చరితం ♦ బున్ వ్రాసి హర్షించితిన్! 2

మ॥ చదలే ఱట్టులు ముజ్జగంబుల భవ ♦ త్స్వచ్ఛంద కీర్తిచ్ఛటల్
వెదచిందన్ గనుఁగొంటి! భారత మహా ♦ ర్వన్ వీడి మున్నూట ము
ప్పది యూఁబేడులు దాఁటె! నీచరితమున్ ♦ వర్ణించు భాగ్యంబు నా
కొదవెన్ నేటికి! నన్నువంటి కృతకృ ♦ త్యుల్ లేరు లోకంబునన్! 3

మ॥ దినరాజున్ బలె నుగ్రకోపనుఁడవై ♦ దిండ్రించి శైలంబు నిం
డిన తౌరుష్కులదాఁకి నీనడపు హా ♦ ల్దీఘాటు యుద్ధాంగణం
బున విఖ్యోన్నతమైన నీదు విభవం ♦ బున్ గొంత నేఁ బంచుకోఁ
గనకున్నన్ నినుగూర్చి యింత యనురా ♦ గం బిట్టు లుప్పొంగునే! 4

చ॥ ఇలఁగల వీరపుంగవుల ♦ నిట్టి బలోన్నతుఁ డిట్టి ధీరుఁడున్
గలుగఁ డటంచుఁ బేర్గనిన ♦ గండఁడ వీ! విక నిల్లువీడి వీ
థులఁ జరియింపలేని కడు ♦ దుర్బలదేహుఁడ! నన్ను నేగతిన్
వలచితొ! నీచరిత్రమును ♦ వర్ణనచేయఁ బ్రతాపభూవరా? 5

మ॥ "వనజాతాప్తుని వంశమేడ! కడు న ♦ ల్పజ్ఞుండ నే నేడ" నం
చన విఖ్యోన్నత సత్కవిప్రవరుఁడౌ ♦ నా కాళిదాసుండు! నీ
వినవంశాభరణంబ! పుత్తముఁడవౌ! ♦ దీ నీచరిత్రంబు వ్రా
యను గించిజ్జుఁడ నాకు యోగ్యతయు భా ♦ గ్యంబంచుఁ జింతించెదన్

గీ॥ భువనశౌర్యాంకమైన నీ ♦ మూర్తిఁ గాంచి
యనుపమంబైన నీకథ ♦ లాలకించి

రసమునను దేలి పొగడని ♦ రసికు లుండ!
రెట్టి నాయకోత్తముఁడ వో ♦ రాణా ప్రతాప! 7

గీ॥ భవదుదార శౌర్యమును భా ♦ వన మొనర్చి
రసమునను జొక్కి గ్రంథంబు ♦ వ్రాయునపుడు
త్వద్వశుండనై యానంద ♦ బాష్పములను
నాణిముత్యాల వలె రాల్తు ♦ ననారతంబు! 8

గీ॥ నామహోదాత్త నాయక ♦ స్వామి వీవు!
భవదనఘ కీర్తిఁ గొనియాడు ♦ కవిని నేను
త్వత్కథామృత రుచిర భా ♦ వ్యంబు తోడ
హృదయ కుసుమంబు నీకు న ♦ ర్పించుకొందు! 9

క॥ ఉత్తమ ధీరోదాత్త నృ
పోత్తముఁడవు! నిన్నుఁ బొగడ ♦ సౌభాగ్యంబున చే
కొత్తుకమి హృదయరస మే
నత్తితి ముత్తెల కొలంది ♦ నీచరితమునన్! 10

క॥ వరలోకోత్తర సుగుణో
త్తర నాయక చక్రవర్తి! ♦ త్వత్కీర్తికళిక
స్థిరమయ్యెఁ గాత ముదా
పూరణములై చంద్రతారగ ♦ కార్కస్థాయిన్. 11

మ॥ కరముం భక్తిని నా రచించిన మహా ♦ గ్రంథంబు నందెందు నీ
చరితం బాంధ్రులు నిత్యముం జదివి నీ ♦ స్వాతంత్ర్యముం దాల్చ వి
స్ఫురణంబుం బముదార విక్రమకళా ♦ పూర్ణత్వముం జేర్చఁగ
ల్గిరయేనిం దనుఁబోలు ధన్యులిలలో ♦ లేరంచు వాక్రించెదన్! 12

ఉ॥ పూలను సౌరభంబు మధు ♦ వుం జెడువృక్షము పోయినంత! శం
పాలతదాని శోభలను ♦ బాయు నిమేషములోన! నీజగ
జ్జాలము లర్చ సేయు పటు ♦ శౌర్య పరాక్రమరాశి వైన నిన్
బోలిన ధీరు కీర్తి పాలి ♦ పోవదు లోకము క్రుంగిపోయినన్!

సీ॥ నీవలెనే సర్వ ♦ నృప చంద్రులు స్వధర్మ
నిరతులై దేశమా ♦ నెదరుగాక!

శ్రీసలుంబ్రా కృష్ణ ♦ సింహుఁ బోల్ స్వామి భ
క్తి పరులు పేరు చెం ♦ దెదరు గాక!
పాటేశ్వరిని బోలి ♦ భారతాంగనలు సా
ధ్వు లటన్న యశము నొం ♦ దుదురు గాక!
యమరసింహుని మాడ్కి ♦ నాంధ్ర యువకులెల్ల
గురు విక్రమమున వె ♦ లుగుదురు గాక!
గీ॥ కమల వనమట్టె భారత ♦ ఖండ మెల్ల
వీర రసఖండమై ధాత్రి ♦ వెలయుఁగాక
యాంధ్రులను పేరు ఖాండ ఖం ♦ డాంతరములఁ
దక్షు లందఱు శిరములఁ ♦ దాల్త్రు గాక! 14

గద్య:— ఇది శ్రీమత్కామేశ్వరీ కరుణా కటాక్ష వీక్షా సమాసాదిత రసవత్కావ్య నిర్మాణ చాతురీ ధురీణ, సుగుణ గణపారీణ, దుర్భాక వంశ దుగ్ధాంభోరాశి రాకా కైరవమిత్ర, శాలంకాయన గోత్ర పవిత్ర, సుజన జనానుగ్రహ పాత్ర, వేంకటరామార్య పుత్ర, కవి సార్వభౌమ – సాక్షాద్వీర ప్రతాపాది–వింశత్యధిక బిరుద విఖ్యాత, సుకవి రాజశేఖర, రాజశేఖర కవి ప్రణీతంబైన రాణాప్రతాప సింహ చరిత్రంబను పద్యకావ్యంబు నందు పంచమాశ్వాసము.



శ్రీ

"కవి సార్వభౌముని" కావ్యములు.



వీరమతి-800 పద్యములు-ఘూర్జర దేశ వీరనారీమణి చరిత్రము వెల 1-0-0

చండప్రపాల చరిత్ర. 750 పద్యములు-భీష్ముని కథ వంటిది. 0-12-0

రాణాప్రతాప చరిత్ర. 2000 పద్యములు-ఉత్తమ పద్య కావ్యము. 3-8-0

సీతాకల్యాణము [నాటకము] 0-8-0

సీతాపహరణము ,, 0-8-0

ప్రభావతీ విజయము ,, 1-0-0

పాలంకు మాహాత్మ్యము [స్వప్న చంపువు] 0-8-0

అవధాన సారము. (రాజశేఖర-వెంకటశేష కవులు) 0-8-0

ఆర్యావర్త వీరనారీమణులు [ఆంగ్లేయ వచనము.] 1-0-0

[illegible] సంవాదము. 0-4-0

ఇప్పుడే వెలువడినది.

పుష్పావతి. 1200 పద్యములు. ఉత్తమ శృంగారము. నిండు హాస్యము కనుపంతయు నవ్వు. దేహమంతయు నవ్వు. దేశమంతయు నవ్వు. చెళ్లపిళ్లవారు తొలిపలుకును శ్రీ విశ్వనాథవారు ఉపోద్ఘాతమును వ్రాసి యిచ్చినది. వెల 2-0-0

అమరసింహ చరిత్ర. 1700 పద్యములు ఉత్తమ వీరరస కావ్యము [అచ్చులో నున్నది.]

గోదానము. 0-4-0

స్వయంవరము. 0-4-0

దుర్భిక్షము. [శ్రీ. వి. సుబ్బన్న శతావధాని.] 0-8-0

వలయువారు:—

శ్రీ. రాజశేఖర శతావధాని,
గంభీర విలాస్, ప్రొద్దుటూరు.